## కాపీలకు

| | |
|---|---|
| సెక్రెటరీ యుస్కోఫీ<br>చందన క్లాత్ మార్కెట్<br>షాపు నం. 58, తాడితోట<br>రాజమండ్రి - 533103 | సెక్రెటరీ యుస్కోఫీ<br>జూబ్లిహిల్స్<br>ఫ్లాట్ నం. 56, రోడ్ నం.8<br>హైదరాబాద్ 500 033 |

## ఇందులో విషయాలు

# ముందుమాట

ఈనాడు, ఈ ఇరవయ్యో శతాబ్దం చివరి దశకంలో వున్నాం! రాకెట్లను మానవుడు రోదసిలోకి పంపి చంద్రుడ్ని దాటి ఇతర గ్రహాలయిన గురువూ శనీ, శుక్రుల కక్ష్యలలోకి ప్రయాణిస్తూన్న తరుణంలో వేదవ్యాస మహర్షిని గురించిన ఈ గ్రంథం ఎందుకు?

## అణుయుగంలో వ్యాసమహర్షి!

ఏనాడో పాతబడిపోయిన మతగ్రంథాలకూ ఈనాటి మానవుడి జీవితానికి సంబంధం ఏమిటి? "సైన్సు" (Science) పెచ్చు పెరిగిపోయిన ఈ అధునాతన అణుయుగంలో కూడా మత గ్రంథాలైన "పురాణాలను" వ్రాసిన వేదవ్యాస మహర్షిని గురించి తెలుసుకోవటం అవసరమా? ఇంకా ఈ మూఢనమ్మకాలైన "మతం" - ధర్మం, శాంతి, యోగం, దైవం పవిత్రతా, ఆధ్యాత్మికసిద్ధులు, దివ్యదృష్టి వంటి విషయాలు కోకొల్లలుగా నిండిన, వ్యాసమహర్షి యొక్క చరిత్రగానీ ఆయన రచనలుగాని, ఆయన విభాగం చేసిన వేదంగానీ, ఆయన వ్రాసిన "బ్రహ్మసూత్రాలు" గాని, "భగవద్గీత " 'విష్ణు' సహస్రనామంవంటి పురాతన సాహిత్యంతో ఇంకా ఈనాటి మానవుడికి అవసరం వున్నదా? అన్న ప్రశ్నలు ఆధునికులం అనుకొనే కొందరి మనస్సులలో ఉదయించవచ్చు! అందుకనే ఈ 'అణు యుగంలో వేదవ్యాస మహర్షి' స్థానంఏమిటో తెలుసుకొందాం ఇక్కడ.

ఇందులో మొదటి ప్రశ్ననే తీసుకుందాం! ఈ రాకెట్లూ అణు బాంబుల యుగంలో అధ్యాత్మిక విషయాల యొక్క స్థానం ఏమిటి?

సోవియట్ రష్యా, మానవనిర్మితమైన మొదటి ఉపగ్రహాన్ని (Sputnik) ప్రయోగించిందని మాత్రమే చాలా మందికి తెలుసుగాని,

రష్యాలో రహస్యంగా జరుగుతున్న ఆధ్యాత్మిక "పరిశోధనల" గురించి వార్తాపత్రికల మీదనే ఆధారపడే మన టీకప్పు "మేధావులకు" తెలియదు!

ఉదాహరణకు రష్యాలో ఎదుటివారి మనస్సులోని ఆలోచనలను చదివే "దివ్యదృష్టి" గల సుశిక్షితులైన "సైంటిస్టు" లున్నారని తెలియని వారెందరో! అలాగే మనస్సుయొక్క ఏకాగ్రతతో పదార్థాన్ని ఆజ్ఞాపించగల, కదల్చగల వ్యక్తులు "నైల్యా మిఖైలోవా" (Nelya Mikhailova) వంటివారున్నారని గాని ---- "స్టాలిన్" కు అంతరంగికుడుగా వుండి, అనేక అత్యద్భుత దివ్యశక్తులను ఆ రష్యన్ నియంతకు నిత్యం చూపెట్టిన వాడు, అతని పరీక్షలకు నిలబడిన "ఉల్ఫ్-మెస్సింగ్" (Wolf Messing) ఇంకా రష్యాలో జీవించి వున్నాడంటేనూ, మనదేశంలోని పెద్ద కమ్యూనిస్టు నాయకులూ, "పార్టీ-మేధావుల"కే తెలియదంటే, ఇక జనసామాన్యంకేమి తెలుస్తుంది?

ఇకపోతే పురాణాలు ఒక్క మతగ్రంథాలే అనే వాదం నిజంకాదని, నా ఇంగ్లీషు గ్రంథం "అణు యుగంలో హిందూమతం" లోనిరూపించాను. రష్యను పరిశోధనల్లో "వెలికోవ్స్కీ" (Velikovsky) చేసిన 'రీసెర్చి' ఫలితాలు చూచినా, వేల సంవత్సరాలనాటి ప్రతిమలూ, రష్యా, మెక్సికో, ఈజిప్టు, 'మెసపొటేమియా'లలో త్రవ్వకాలలో దొరికిన, పురాణాలలో వర్ణించబడిన వినాయకుడి విగ్రహాలవల్లా భూగోళం యొక్క, గత లక్షల సంవత్సరాలనాటి చరిత్ర, పురాణాలు కేవలం కథలకోసం వ్రాసిన "మతగ్రంథాలు" కావనీ, నిరూపించాయి! అందులోనిది -మానవజాతి సహస్రాబ్దాలుగా దాచినది పోగుచేసిన వైజ్ఞానిక రహస్యాల సంపుటి అన్న విషయం ఇంకా అనేక సాక్ష్యాల ఆధారంతో నిరూపించబడింది! పురాణంలోని చరిత్ర, సైన్సూ గురించి, ఈ గ్రంథంలోని అధ్యాయాలలో తెలుసుకోవచ్చు!

ఇకపోతే మహిమలూ, ఆధ్యాత్మిక శక్తులూ, దివ్యశక్తులూ వంటి విషయాలు, మత సంబంధమైన మూఢనమ్మకాలా?- అన్న భావనకు వద్దాము. సామాన్య మానవుడికి అంతుబట్టనివి అనేక విషయాలు

జరిగినప్పుడు ఆశ్చర్యం, విస్మయం కలిగిస్తాయి. అలాంటి అద్భుతాలను ఎన్నిటినో చూచినప్పుడు సామాన్యులు అనగా మేధావులు కాని వారు పాటకజనం (ఇందులో రాజకీయ నాయకులూ పుష్కలంగా వున్నారు) చేసే పనులు రెండు (i) ఒకటి వీటిని విమర్శచేయకుండా గుడ్డిగా పరిశోధన, విమర్శ చేయకుండా "నమ్మకపోవటం" లేదా(ii) అవి అబద్ధం అనే నిశ్చయానికి ముందే రావటం! కాని, ఈ రెండూ కూడా "మూఢవిశ్వాసాలే!"

ఎందుకంటే పరిశోధన, ప్రయోగం, లేక "రీసెర్చి" వల్ల కలిగే ఫలితాలను, నిష్పక్షపాతమైన మనస్సుతో తూకంవేసి నిర్ణయం చేసేవాడే నిజమైన సత్యాన్వేషి! అలాంటివాళ్లు గనకనే సోవియట్ రష్యాలోని సైంటిస్టులు, వాళ్లదేశంలో అధికారంలోవున్న రాజకీయ వేత్తలైన "కమ్యూనిస్టు" పార్టీయొక్క గ్రుడ్డి విశ్వాసాలనుబట్టి, "గుడ్డి ఎద్దుల్లాగ" పోకుండా -- ధైర్యంగా అనేక ఆధ్యాత్మిక విషయాలనబడే వాటినే వైజ్ఞానిక సత్యాలని ఋజువుచేశారు!! వీటిని ఇక్కడ మళ్లీ విశదీకరించటం అసందర్భం! ఎందుకంటే అవి నా "సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధనలు" -- "హిందూమతం - పై సైన్సు పరిశోధన" -- అన్న నా గ్రంథాలవల్ల చూడవచ్చు. దీన్నిబట్టి- "హిందూమతం" అనబడేది "కేవలం మతం" కాదని తేలుతుంది.

ఇంకోమాట! మతానికొక స్థాపకుడుంటాడు! క్రీస్తు, మహమ్మద్, జోరాస్టరులలాగ! అలాటి మతస్థాపకుడెవరితోనూ "హిందూమతం" ప్రారంభం కాలేదు!! అలానే బైబుల్ ఖురాన్‌లవంటి ఏ ఒక్క మతగ్రంథంమీదా హిందూమతం ఆధారపడిలేదు! పైగా "మతం మార్పు" (Conversion) లేనిదల్లా ఒక్క - "హిందూమతమే!"

ఈ లక్షణాలన్నిటినిబట్టి చూస్తే ప్రాచీన వైదిక హిందూమతం అసలు "మతం" కానేకాదని తేలింది!

"సనాతన ధర్మం" -- జాతి, వర్ణ, దేశ, లింగములమీద ఆధారపడినది కాదు! అది వైజ్ఞానిక సూత్రాలపైనా, సత్యంపైనా,

మానవుని బుద్ధికి అందని ప్రత్యేక పరిశోధనతోనే ఏనాడో రష్యాలో బుజువుకాబడిన అనేక ప్రకృతి రహస్య ఆధ్యాత్మిక సూత్రాలమీద ఆధారపడ్డ విజ్ఞానం! - అదే విదేశీయులు పెట్టిన "హిందూ-మతం" అన్న పేరు వెనకదాగివున్న "ప్రాచీన-విజ్ఞానం" (Wisdom)! ఇదే ఇరవయ్యవ శతాబ్దపు పరిశోధనలు తేల్చే నగ్నసత్యం! -- ఇది మధ్యయుగాల మతోన్మాదుల మతం కాదు!

ఇది సైన్సుకు దగ్గరగావున్న -- సైన్సుకు అందని ఒక "అపూర్వ విజ్ఞానం!" దీనిమీద మానవజాతి భవిష్యత్తే ఆధారపడివున్నది!! అందుకని ఈ "నూతన- విజ్ఞానం" (New Knowledge) దృష్ట్యా రష్యాలో జరిగిన - జరుగుతున్న పరిశోధనలవంటి పరిశోధన, మనదేశంలోనూ ఆరంభం కావాలి! ఈ దృష్టితో చూస్తే ఈనాడు సోవియట్ రష్యాలో కనుగొన్న 'నూతన విజ్ఞానం' - బూజుపట్టిన 19 - శతాబ్ది నాస్తికవాదం కాదు!

పందొమ్మిదవ శతాబ్దపు- పాతచింతకాయ వంటి "పదార్థ-వాదమూ"(Materialism) కాదు!

ఎందుకంటే పదార్థంయొక్క రూపమే ఎప్పుడో అణువును భేదించగానే శక్తిగా అదృశ్యమై పోయింది. కనుక ఈ నూతన దృక్కోణంలోంచి 'వేదవ్యాస మహర్షియొక్క చరిత్ర'ని ఆయన అసాధారణ విజ్ఞానరాశి గురించి -- కాదు సర్వతోముఖ సర్వశాస్త్ర సమ్మేళనం (Unity of All Sciences) గురించి - పరిశోధించటానికి తెలుసుకోవటానికి ఇంతకంటె మంచి సరైన కాలం, ఇంకోటిలేదు! గతంలోని మతదృక్కోణం కలిగిన శతాబ్దాలలో అర్థం కావటానికి వీలుగాని శాస్త్రీయసత్యాలను, వ్యాసమహర్షి విజ్ఞానంలోనుంచి మధించి వెలికితీయటానికి ఈ "అణుయుగ-సంధి"యే సరైన కాలం!

అందుకే ఈ గ్రంథం వ్రాయటానికి అవసరం కలిగింది! దీన్ని బుజువు చేసింది కూడా ఈనాటి ప్రజలలో కలుగుతున్న నూతన ఆసక్తి -- మతం లేకుండా శాస్త్రదృక్పథంతో ఆధ్యాత్మిక సత్యాలను

సైన్సు దృష్ట్యా తెలుసుకోవాలన్న -- ప్రజల ఆతృతే!"

"ఇదే నాగ్రంథాన్ని వెలికిలాగింది! ఇది కాలం పిలుపు! కాలం తలుపుతట్టుతున్నది! ఇక సత్యం తలుపు తీయక తప్పదేమో!"

పై మాటలు నేను ఏనాడో - అంటే ఈ గ్రంథం మొదటిసారి అచ్చయిన 1979 నాడే వ్రాశాను!

మాటలు ఈనాడు ఆ అక్షర సత్యాలని నేటి రష్యా చరిత్రే ఋజువు చేసింది. కమ్యూనిజం--నాస్తికవాదమే 1989 లోతుడిచి పెట్టుకుపోయింది! ఇతర కమ్యూనిష్టుదేశాలలో యుగోస్లావియా, తూర్పు జర్మనీల్లో కూడా, ఈ "కమ్యూనిజం" ఒక చీకటిలాపోయింది! నిన్నటి చీకట్లు ఈనాడు "సత్యయుగం" వెలుగుతో పోయినాయి!!

ఫలితంగా రష్యాలో గోర్బచేవ్ సాధించిన - రక్తపాత రహిత అహింసా విప్లవంద్వారా - కమ్యూనిజం అనే భూతం 72 - ఏళ్ళుగా రక్తపుటేరులు పారించి లక్షలాదిమందిని బలిగొన్న పిశాచం - సైబీరియాలో కన్నీటి నదులు కారించిన పాపఫలితం, రష్యాని వదిలిపోయింది! ఒకనాడు నాస్తికవాదం పదార్థవాదం పేరున నడిచిన రాజకీయ బానిసత్వం రష్యాను ఆశ్చర్యంగా తానే వీడిపోయింది!

ఒకనాడు "నోస్ట్రిడేమస్" (Nostradamus) పలికిన 'కాలజ్ఞాన -- భవిష్యత్తు' వాక్కు నిజమైంది.

"నుదుట ఎర్రమచ్చ వాడు వస్తాడు! రష్యాలో బానిసత్వం అంతంచేస్తాడు." -- అని! నూతన ఆర్థిక వ్యవస్థతోపాటు "సామాజిక విప్లవం"- మొదలైంది.

ఇండియాలో 1989 ఇందిర శకం అంతంతో "ముసుగు కమ్యూనిజం" ఐన నకిలీ కాంగ్రెసు (Cong-I) యుగం అంతమౌతుందని నేను ఏనాడో రాసిన "1999- కలియుగాంతం" భవిష్యత్తు నిజమైంది. వ్యాసమహర్షి ఏనాడో రాసిన - "భవిష్యపురాణం"లోని కాలజ్ఞాన భవిష్యత్తు నిజమౌతోంది! ఒక్కొక్కటీ అన్నీ జరుగుతున్నాయి.

ఇంకా జరుగుతాయి! కలియుగాంతం కాబోతోంది!

"ఆకాశంబ్రెరనౌను ఆరుమతములొక్కటౌను"- అంటూ, వీరబ్ర హ్మేంద్రయోగి రాసిన "కాలజ్ఞాన తత్వం" -- జరుగుతోంది!

"యుగసంధి-బుట్టు నిజము"

అన్నమాట 'అంగీరస' (1992-93) నుంచీ ఆరంభం అయింది! 'ఓటర్ల రాజ్యం' రాబోతోంది! రాజకీయ పార్టీలు అంతరించి పోతాయి! అవినీతి పేరు, రాజకీయ పార్టీలపేరు, సారామాట వింటేనే ప్రజలు తిరగబడి తంతారు!!

వ్యాసమహర్షి - "మహాభారతం" అరణ్యపర్వంలో వ్రాసిన "కలియు గాంతం" సత్యం కాబోతున్నది! కళ్లున్న ప్రతివాడూ వార్తా పత్రికలో చూస్తున్న సత్యంగా, -- "వ్యాసవాక్యం" యదార్థం అవుతోంది!

అందుకే "వేదవ్యాసమహర్షి" గురించిన ఈ పుస్తకాన్ని 1979లో వేసిన గ్రంథాన్ని తిరిగి పునర్ముద్రణ చేసే టైము వచ్చింది!

అందుకే అందిస్తున్నాను! తీసుకోండి! చదవండి -- కాదు "అధ్యయనం" (Study, Research) చేయండి! ఇవి, మననం చేయాల్సిన సత్యాలు! నిత్యం మన జీవితంతో ముందుకి వెడుతున్న ప్రతి అడుగుతోనూ కళ్లు తెరిపించే వెలుగు కిరణాలలాంటి ప్రతిమాటా మళ్లీ మళ్లీ మననం చేసుకుంటూ చదవాల్సిన భగవద్గీత -- ఈ వ్యాసుని చరిత్ర!

ఈనాటి ప్రపంచంలో చీకటి అన్నివైపులా ఇంకా అలుముకొని వున్న కలికాలం పాపాలు -- అవినీతి, హింస, సెక్సూ, రాజకీయాలు, సారా, యుద్ధ-రక్తపిపాస -- ఇంకా తొలగిపోని ఈ "యుగసంధి" లో రానున్న సత్యయుగం ఆశాకిరణం - ఈ వ్యాస మహర్షి వెలిగించి యిచ్చిన దివిటీయే!

బ్రహ్మసూత్రాలు, భగవద్గీతా, వేదవిభాగమూ, భారతమూ, "విష్ణు సహస్రనామం" ఇవన్నీ మనకిచ్చిన వేదవ్యాస మహర్షి నిజంగా మన

"జాతిపిత!" గాంధీ కాదు!

గాంధీకి "సత్యాగ్రహం" అనే సత్యయుగపు అస్త్రం యిచ్చిన వ్యాసమహర్షి నిజంగా - "మనజాతి పిత!" ఆయన చరిత్ర మనకి ఆరవ వేదము!

అందుకే అందిస్తున్నాను మళ్లీ ఈనాడు ఈఅణుయుగంలో వేదవ్యాసునిపై గ్రంథం! ఎందుకో ఇప్పుడర్థమౌతుంది! ఇంకా దీనికి అనుబంధంగా చదవాల్సిన నా "1999-కలియుగాంతం" - "మహాభారత కాల నిర్ణయం" అన్న నా గ్రంథాలుచూస్తే అప్పుడు దీని అర్థం బాగా గోచరిస్తుంది.

ఈ 'అంగీరస' సంవత్సర పవిత్ర ఉత్తరాయణ పుణ్యకాలంలో "నారాయణ యజ్ఞం - 1993" సందర్భంగా అందిస్తున్న ఈ -- 'భగవాన్ వేదవ్యాస మహర్షి దివ్య చరిత్ర' (పారాయణ గ్రంథం) మీకు పూజాపుష్పంగా అందిస్తున్నాను. అందుకోండి! - ఈ 'వ్యాసపీఠం' నుంచి వెలువడే' వ్యాస - వ్యాసము' చేసిన ఈ వ్యాస గ్రంథాన్ని.

"హరిః ఓమ్ - వ్యాసో నారాయణో హరిః"

సాయినిలయం
'శ్రీముఖ' -- ఉగాది
24-3-1993

ఇట్లు
Dr. వేదవ్యాస IAS Ph.D

# "అంకితం"

భారతాత్మా! ఇదే, నా పూజాపుష్పం!

హిమాలయ శిఖరాలే నీ సముత్తుంగ ఉన్నత శిరస్సు! కన్యాకుమారియే నీపాదద్వయం. శ్రీలంకయే, నీపాదపీఠము!

యుగయుగాలనాటి వేదఘోషలోని ప్రణవనాదమే నీ హృదయ స్పందన!

గంగా, యమునా, గోదావరీ కృష్ణలవంటి సర్వ నదీ నదములే నీ శరీరంలోని రక్తనాళాలు! నీరక్తంలో ప్రవహించేదే భారతీయ సంస్కృతి. ఓ భారతాత్మా! నీ శరీరమే సనాతన ధర్మం.

నీ మంజుల కలనిస్వనాలతో వెలువడే మాటలే పురాణాలు, వేదాలు బ్రహ్మసూత్రాలూ, భగవద్గీతాది "పుణ్యశ్లోకాలు"! నీవు, సనాతనుడవు! కాలం మారినా నీవు మారవు!

నీవు నేర్పిన నడవడే "ధర్మం". నీ అడుగుజాడలే భారతదేశాన్ని ప్రపంచంలో ఇతరదేశాలకు "గురువు" గా నిలిపినాయి!

ఓ భారతాత్మా! -- నీపేరే వేదవ్యాసుడవు!

-- వ్యాస భగవాన్! వేదమూర్తీ! నీవు ఈ దేశానికి అంతరాత్మవు!! నీకు నాశనంలేదు. నీవు నిత్యుడవు. నీవు చిరంజీవుడవు!

నీవే నారాయణునిరూపంలో, నరుడనే శరీరంతో అవతరించిన సనాతన ఋషివి!

ఇదుగో! అందుకో! ఈ పూజాపుష్పం!

సమర్పిస్తున్నాను -- నీ చరిత్ర నీకే! నాలోనుంచి ఇదంతా వ్రాయించిన 'వ్యాసమహర్షి'కిదే నా 'అంకితం!'

*

1

# ఒక మహత్తర విశ్వానుభూతి!

ఇది ఒక విచిత్ర గాధ! చాలాకాలంక్రిందట జరిగిన బహు ప్రాచీనమైన గాధ! అది ఒక అపూర్వ వ్యక్తి గాధ ! ఆయన వయస్సెంతో ఎవ్వరికీ ఇదమిత్థంగా తెలియదు. బహుశః కొన్నివందల సంవత్సరాలుండవచ్చు. 'వందలా!' అని ఆశ్చర్యపడనక్కరలేదు. ఎందుకంటే అలాంటి వాళ్ళు ఇంకా ఇప్పటికీ హిమాలయ పర్వతాలలోని గుహల్లో...... రెండువందలూ, నూటయాభై సంవత్సరాలవాళ్ళు కూడా.... మనకి తారసపడుతూంటారు. ఈయన కూడా అలాంటివాడే!

ఈయన రూపం కూడా ఎంతో వింతగావుంటుంది! తెల్లగా హిమాలయ పర్వత శిఖరాల్లాగ నెరిసిన తలా, నీరెండలో వెండిలా

తళతళా మెరిసే కనుబొమ్మలూ అంతకంటే తెల్లగా పట్టువలే హిమ శృంగాలపైన తేలే మేఘాల్లాగ పైపైకి పెరిగిన జడలూ! పొడుగాటి మంట కొస లాగ వ్యాపించిన గెడ్డం! ఆయన నుదురు మీది ముడుతలు చూస్తే, పర్వతాలలో ప్రవహించే నది పాయలలాగా, జాళ్ళుగా అల్లుకున్న రేఖల్లాగ, అతిప్రాచీనమైన ఆయన వయస్సును కొట్టవచ్చినట్టుగా ప్రతిబింబిస్తున్నవి!

ఈయనకు అనేక మహిమలూ, శక్తులూ, సిద్ధులూ తపో యోగం వల్ల కోరకుండానే లభించాయని అంటారు! ఎందుకంటే ఆయనను ఎంతోమంది ఒకేసారి, అనేక ప్రదేశాలలో చూశారు. ఎక్కడ పడితే అక్కడ, సిద్ధపురుషులకుమల్లే ప్రత్యక్షం కాగల మనోగమన సిద్ధి ఆయనకున్నదని ప్రతీతి! మంత్రశాస్త్రం, జ్యోతిషం. వైద్యం, యోగశాస్త్రాలలో ఆయన కెంత తెలుసో? ఆయన విజ్ఞానం అగాధం! అపారం! అలాచూస్తే అన్నివిధాలా ఆయనొక అపూర్వ వ్యక్తి! అసాధారణ పురుషుడు! మనిషిగా తన జీవితంలో ఏదైనా అపూర్వమైన విజయాన్ని సాధించాలనీ, ఎప్పుడూ ఎవ్వరూ సాధించలేని పనిచేసే, మానవచరిత్ర లోనే ధృవతారగా నిలిచిపోయే ఒక మహత్తరమైన ఉపకారం మానవులకిచ్చే కార్యక్రమంగా దాన్ని సాధించాలనీ — ఆయనకి ధృఢమైన కోరిక కలిగింది.

## ఒక మహా సంకల్పం!

అంతే! ఆ సంకల్పంతో ఆయన తన గమ్యాన్ని సాధించేందుకు అన్వేషణ ప్రారంభించాడు! నదులూ అరణ్యాలూ, పట్టణాలూ పల్లెలూ, నగరాలూ దాటి నడచిపోతున్నాడు. పర్వతాలన్నీ ఒక్కొక్కటే అధిరోహించి గంగను సమీపించాడు. హిమాలయ పీఠభూమిని చేరి, ఉత్తరదిక్కుగా ప్రయాణం చేయసాగాడు. క్రమక్రమంగా పచ్చని అడవుల్లో ప్రవేశించి చల్లని మంచు కరిగిన నీళ్లతో ప్రవహించే జల పాతాలతో నిండిన అడవులమధ్య పారే పుణ్యనదులలో స్నానంచేస్తూ హిమవత్పర్వత సానువులను ఎక్కి, అలానే, పైపైకి వెళుతున్నాడు.

అలా ఎక్కుతూ పోయి ఎత్తయిన మంచుతో కప్పబడిన పర్వతశిఖరాల మధ్యనవున్న ఒక గుహను సమీపించి, అక్కడ ఆసీనుడయ్యాడు.

ఆ తర్వాత, ఆయన ఆహారాన్ని విసర్జించి, పవిత్ర గంగా ప్రవాహంలో స్నానంచేస్తూ శుచియై ఆ గంగాజలమే త్రాగుతూ శరీరాన్ని మలినరహితంగా, పవిత్రంగా పరిశుద్ధిచేయసాగాడు. క్రమంగా జలం కూడా విసర్జించి ప్రాణాయామంతో తన శ్వాసకూడా బంధించి, యోగ సమాధి నిష్ఠుడయ్యాడు.

ఆ యోగి ఇలా గుహలో, సమాధిలోవుండి తపస్సుచేయటం కేవలం తన స్వార్థంకోసంగాదు. సిద్ధులకోసమూ శక్తులు సంపాదించటంకోసమూ కాదు! మరిదేనికో **అంతటి తీవ్ర తపస్సు?** అంతటి కఠినసాధన ఎందుకు? ఏమి సాధించాలని!

మానవాళికి ఇంతవరకూ ఎవ్వరూ చెయ్యలేని గట్టి మేలు కలిగించే ఒక మహత్తరకార్యక్రమంతోనే ఆయన ఈ సాధనకి ఉపక్రమించాడు. అదేమిటో?

## 'విశ్వాన్వేషణ!'

ఈ జగత్తు ఎలాపుట్టింది? ఈ మానవుణ్ణి సృష్టించిందెవరు? ఈ శరీరనిర్మాణం, మెదడూ, మనస్సూ, గర్భంలోవున్న శిశువుకి కూడా తెలియకుండా ఈ అంతటినీ, ఏశక్తి నిర్మిస్తోంది? పుట్టబోయేపిల్లకోసం ముందుగానే తల్లికి పాలు ఎవరు ఏర్పాటు చేస్తున్నారు? తల్లి కాదుకదా! తల్లి నిమిత్తమాత్రురాలు. తండ్రీ అంతే! వాళ్ళిద్దరినీ పనిముట్లుగా ఉపయోగించి ఏశక్తి, ఈ మానవ శరీరాలను కోటానుకోట్లుగా ఇలా తయారుచేస్తోంది? ఈ సృష్టిచేసే శక్తి ఏమిటి? ఈ కనబడే ప్రపంచాన్నీ అలాగే భూగోళం, సూర్యుడూ, చంద్రుడూ, నదులూ, సముద్రాలూ, కడుపులో పెరిగే పిండాండం ఈఅన్నీ పుట్టించిన శక్తి — విశాల విశ్వంలో ఏర్పడే బ్రహ్మాండం ఈ రెండూ

ఒకటేనా? ఈ రెండింటి వెనుకవుండి నిర్వహించేదీ ఒకే అజ్ఞాత హస్తమేనా? అయితే ఈసృష్టి వెనకాల దాగివున్న అంతరార్థం ఏమిటి? పైకి కనిపించే ప్రకృతి వెనుకనున్న "చైతన్యం అంతటా" -- విశ్వంవెనుక దాగివున్న విశ్వమేధస్సు (Universal Mind) ఎవరు? ఈ విశాల విశ్వాంతరాళంలో వెనుక దాగి ఏదైనా ఒక సంకల్పం వున్నదా? లేక పదార్థమే అన్నీనిర్వహిస్తున్నదా? ఇది కేవలం ఒక పెద్ద "శక్తి" మాత్రమేనా — 'తెలివి' కూడా కలిగివుందా? దీన్ని తెలుసుకొనేదెలాగ?

అంతేకాక, ఈ ప్రపంచంలో అనేకమంది కష్ట నష్టాలు పడు తున్నారు. కొందరు దారిద్ర్యంతోనూ, కొందరు రోగాలతోనూ, మరికొందరు, అవిటితనంతోనూ ఇలా అనేక రకాల బాధలు అను భవిస్తున్నారు. అవికాక ఆశలుపెంచుకొని, గొంతెమ్మకోర్కెలతో జీవితాన్ని విషమయంచేసుకొని, మనిషిని మనిషి మోసంచేస్తూ సోద రుణ్ని సోదరుడే కబళిస్తూ, ఇలా తమ బ్రతుకునే నరకం చేసుకుంటూ ఒకనాటి నందనవనంలాటి ఈ భూమినే ఈనాడు భయంకర నరకంగా, తనబ్రతుకునే చీకటిగా ఎందుకు చేసుకుంటు న్నాడీ నాటి మానవుడు? ఇందులోంచి మానవజాతి బైటపడేదెలాగ?

తను నిర్మించిన దుష్ట ఆలోచనల, స్వార్థాల, అనుమానాల, భయాల చెడు పనుల విషవలయంలో, ఆశల వలలో చిక్కిన ఎలు కలమందలాగ చిక్కి, గిలగిలా కొట్టుకొంటూన్న ఈ మానవ జాతిని అందులోంచి బైటపడవేసే తారకమంత్రం ఏది? సుఖసంతోషాలూ ఆనందంతోపాటు మానవజాతి ఇరుక్కుపోయిన ఈ దానవత్వపు ఊబిలోంచి మళ్ళీ మానవత్వంలోకి -- కాదు దైవత్వంలోకి -- తిరిగి తనను తాను మనిషి, ఉద్ధరించుకోవాలంటే మార్గమేమిటి? అనే, నిగూఢ రహస్యాన్ని ఛేదించాలనీ -- తాను గాఢంగాప్రేమించే ఈ తోటిమనుష్యులకోసం, ఆచంద్రార్కం నిలిచిపోయే ఓ వెలుగుదివ్వెను మానవునిగుండెలలో వెలిగించాలని ఆయన కోరాడు!

అందుకే ముందుగా తానై యీసృష్టివెనుక వున్న మహా రహ

స్యాన్ని ప్రత్యక్షంగా తెలుసుకోవాలనే... ఈ గుహలోని **సాధనంతా!**

అంతేకాని సిద్ధులకోసమో, స్వార్థపూరిత శక్తులకోసమో, ధనం కోసమో, అధికారకోసమో లేక వాటితో జీవితం పాడుచేసుకోవటం కోసమో కాదు! అందుకే ఆయనది ఒక అపూర్వమైన ధ్యేయం. అది ఒక **తిరుగులేని ప్రయాణం!**

అయితే, ఆప్రయాణం పర్యవసానమేమిటి? చివరికి ఏంజరిగింది? ఇది చూడాలంటే మనంకూడా ఆయన అనుభవంలోకే వెళ్ళిచూడాలి! చూద్దాం! రండి!



2

# వ్యాసమహర్షి తపస్సు!

ఆ మహాపురుషుడు అలా క్రమక్రమంగా తన మనస్సును అంతర్ముఖం చేశాడు. బైట అనేక విషయాలపై తిరిగే మనస్సును ఏకాగ్రంచేసి ఒక్క విషయంమీదే అనుసంధించాడు. ఆహారం విసర్జించాడు. చివరికి నీరుకూడా త్రాగడం మానివేశాడు. ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు క్రమంగా బంధింపబడ్డాయి. మనస్సు వశమైంది. ప్రాణం కూడా శరీరంలోని అవయవాల్లోంచి హృదయంలోకి చేరుకుంది.

ఇలాగ మనస్సూ, బుద్ధీ, ఇంద్రియాలూ, అన్నీ ఏకస్థమై మనస్సులో ప్రవేశించాయి. అనేక బైటివిషయాలపై నిలిచి ఆలోంచిచే **మనస్సును, మనస్సుతోనే** బంధించి — మనస్సుతో మనస్సునే ధ్యానించసాగాడు! క్రమేపి ధ్యానమూ, ఆధ్యానంలోంచి ధారణా

దారణలోంచి సమాధి, ఇలా ఒక్కొక్క మెట్టే పైకెక్కింది, ఆయన మనస్సు! మూత పడివున్న అంధకారమైన చీకటి కొట్టులాగ ఇంద్రియాలనే కిటికీలున్న ఈశరీరంలోనే ఎప్పుడూ బంధింపబడివున్న ఆమనస్సు ఒక్కసారిగా ఈ జైల్లోంచి విడుదలైంది! అంటే ఏకస్థమై శరీరంలో 'నేనే — శరీరం' అనే భావనతో వుండే మనస్సు విడివడి విస్తరించి ఒక 'విశ్వాత్మగా' రూపొందింది.

ఒక్కొసారిగా అనిర్వచనీయమైన ఒక 'విశ్వానుభూతి'లోకి ఆయన అంతరాత్మ వ్యాపించింది. గిన్నెలోవున్న నీరు, గిన్నెఅంతా ఆక్రమించుకుని వుండి తిరిగి అదే నీరు ఆవిరియైనప్పుడు ఏవిధంగా ప్రపంచమంతా వ్యాపిస్తుందో అదే విధంగా ఆయనయొక్క అంతఃకరణ కూడా, ఆయన ఆలోచనలూ ఆయన వ్యక్తిత్వమంతటితోసహా శరీరపరిధుల్నిదాటి నీటి ఆవిరి ఎలాగైతే వ్యాపించి సర్వత్రా విస్తరించి జగత్తంతటాకూడా వ్యాపించి "తానే జగత్తు" అనేభావాన్ని పొందింది! శరీరపు పరిధుల్నిదాటి మనస్సు క్రమంగా ఇలా పంచభూతాల్ని అతిక్రమించి ఈ భూగోళంపైన వ్యాపించింది. తర్వాత గ్రహ నక్షత్ర మండలాలన్నిటినీ దాటి, ఈ యావద్విశ్వమూ తానే అయి వ్యాపించ సాగింది. క్రమక్రమంగా 'నేనే శరీరం', 'నేనేమనస్సు' అనే భావాలు ఒక్కటొక్కటే విడిపోయి 'నేనే ఈ ఆకాశం', అనే భావం కలుగసాగింది!

ఇలా 'తానే' — సర్వమూ ఐన అనుభవం కలిగి విశ్వాత్మతో తాను ఐక్యభావాన్ని పొందాడు. విశ్వమంతా తానే ఐనట్టి ఒక అపూర్వ అమృతానుభవాన్ని ఆయన పొందాడు. "ఆయన పొందాడు" అనటం కూడా నిజం కాదేమో! ఎందుకంటే ఆ అమృతానుభవాన్ని "నేను పొందుతున్నాను" అనే స్పృహకూడా ఆయనకు లేదు. అది శరీరంలోవుండి మామూలుగా ఆలోచించే పరిమితమైన మనస్సు కలిగి జీవత్వంలో వున్నప్పుడే, సాధ్యపడుతుంది. అంతేగాని ప్రపంచమంతా వ్యాపించిన మనస్సుకు "తాను" ఒక శరీరంలో ఉన్నట్టుగాని, తాను ఒక వ్యక్తిననిగానీ, ఒక కాలంతో ఒక ప్రదేశంలోనే వున్నాననిగానీ గుర్తు వుండదు.

అంతకుముందు ఈ శరీరంలో వున్న "తాను" ఇప్పుడు సర్వత్రా వ్యాపించి ఆ "తన లోపలే" ఏదో ఎక్కడనో ఒక మూల ఈ "శరీరం" వున్నట్టూ, అంటే శరీరంలో 'ఆత్మ' ఉండటం గాదు-- 'ఆత్మలోనే శరీరం సంచరిస్తున్నట్లుకనిపించే ఒక అపూర్వానుభూతి లోకి ఆయన వెళ్ళాడు! క్రమేపీ, ఆకాశాన్నీ, అనంతమైన విశ్వాన్నీ కాలం యొక్క పరిధినీ, ఒక్కొక్కటే అధిగమించి, కాలంలో వెనక్కి దూసుకుపోసాగింది -- శరవేగంతో వెనక్కి ప్రయాణిస్తున్న ఆయన మనస్సు! ఆయన అంతరాత్మకు, గడచిన "సృష్టి" కథ యావత్తూ తెరపై చలన చిత్రంలాగ, విస్పష్టంగా కనిపించసాగింది.

కనిపించడమంటే కంటికి కనిపించడంకాదు. కనపడుతూన్న వస్తువుతానే అయి చూసే అపూర్వానుభూతితో సాక్షాత్ ద్రష్టగా ప్రత్యక్షంగా, సృష్టిరహస్యాన్ని, సృష్టిక్రమాన్నీ-- అన్నీ ఏకస్థితిలో దర్శించి-సృష్టి రహస్యాన్నే భేదించే స్వానుభవం -- ఒకానొక 'అను భూతి' మెరుపు మెరిసినట్టై, సూర్యరశ్మిలాగ సహస్ర సూర్యుల వెలుగుతో భాసించింది! ఆ వెలుగు తానే అయి చూశాడు! చూసిందే ఆత్మతో దర్శించాడు. దర్శించిందే అనుభవించాడు! అది, సర్వమూ తానే అయివున్న అపూర్వానుభూతి! అంటే ఎలాంటిదో కొంచెం ఇక్కడ గమనిద్దాము.

## 'సృష్టి' -- ఆది!

అది సర్వమూ నిరామయంగా ఏకాకారంగా వున్న పరిస్థితి! అక్కడ ఫలానిది ఉన్నదని చెప్పడానికిగానీ, ఇది లేదు అని చెప్పడానికి గానీ వీలులేని-- నిర్వచించడానికివీలుగాని -- పరిస్థితి!

## 'దీర్ఘ – తమస్సు!' :-

అది చీకటీకాదు, వెలుగూ కాదు! ఎందుకంటే చీకటి వెలుగులు ఒకదాన్ని ఆశ్రయించి ఒకటి వుంటాయి. ఆ రెండూ కూడా పుట్ట

లేదు అప్పటికి! అది పగలూకాదు రాత్రీ కాదు! ఎందుచేతనంటే పగలుకు కారణమైన సూర్యుడుగాని, అతడు అస్తమించితే వచ్చే రాత్రిగాని ఈ రెండూకూడా అప్పటికింకా పుట్టలేదు! అది ఆకాశం కాదు. భూమీకాదు, ఎంచేతనంటే భూమీ, ఆకాశం అప్పటికింకా సృష్టి అవలేదు.

ఫలానావేళ, ఇంత కాలం, అని కూడా చెప్పటానికి వీల్లేదు. ఎందుచేతనంటే కాలం కూడా అప్పటికింకా ఉద్భవించలేదు! పగలూ, రాత్రీ కాని, ఆస్తి -- నాస్తి భేదంలేని చీకటి, వెలుగూకాని, సర్వం నిరామయమై ఏకాకారమైవుంటే, ఒక విచిత్రమైన, అంధకారంలాంటి 'తమస్సు' (చీకటి) గోచరించింది! ఆ తమస్సు, తనలో తాను లీనమై, అనంతంగా జడంగా ఉన్నట్టుగా అనిపిస్తున్నది. దానిలోంచి ఒక్కసారిగా ఒక అపూర్వమైన 'వెలుగు' సూక్ష్మంగా, నక్షత్రంలాగ తళుక్కుమని మెరిసింది! మెరిసిన నెరుసు నిప్పురవ్వలాగ వెలిగింది!! వెలిగిన రవ్వ జ్యోతిలాగ పెద్దదయింది. అది నక్షత్రంలాగా క్రమేపి వృద్ధి కాసాగింది! తర్వాత అది ఒక సూర్యమండలంలాగ వెలిగింది.

## 'సూర్య -- గోళాల ఉత్పత్తి' :-

అలా కళ్లు మిరుమిట్లుగొలిపే సూర్యకాంతిలాంటి తేజస్సుతో హిరణ్మయమైన ఆగోళం సర్వతోముఖంగా వ్యాపించి ఒక అండాకారంగా అనేక కోటియోజనాల కైవారంలో కనుచూపుమేర అంతావ్యాపించి ఆకాశం అంతా నిండిపోయింది. అదే హిరణ్యగర్భం సన్నని రేణువుల్లాగ అందులోనుంచి అంఖ్యాకమైన నిప్పురవ్వలు శరవేగంతో అన్నివైపులా దూసుకువస్తున్నాయి. వెలిగే మంటలోనుంచి వెలికి వచ్చే నిప్పురవ్వల్లాగా అమిత తేజస్వంతమైన ఆ కాంతిగోళంలోంచి కోటానుకోట్ల నక్షత్రాల్లాగ ఆ రవ్వలు, చుట్టూరావున్న అంధకారం లోకి దూసుకుంటూ, పరుగిడిపోయి, ఆకాశంలోకి అన్ని వైపులకీ వ్యాపించసాగాయి. ఎండలో వెలిగే ధూళిరేణువులాగ తేలుతూ దట్టమైన చీకటితోనిండిన ఆ ప్రళయాకాశంలో, ఒక్కొక్కరవ్వ,

ఒక్కొక్క జ్యోతిగా వెలిగింది.

## 'బ్రహ్మ — గోళం!' :-

అది చూస్తూండగానే కనుచూపు ఎంతవరకూ ఆనుతుందో అంత వరకూవ్యాపించి ఒక బ్రహ్మాండమైన బంగారు రంగు కలిగిన, సూర్యరశ్మివంటి అద్భుత తేజోమయమైన 'మండలం'గా వ్యాపించింది. ఈ తేజోమండలం, కేవలం మండలాకారంగా కాకుండా అది ఒక గోళాకారాన్ని ధరించి ఒక హిరణ్యయమైన, 'అండమై' పంచభూతములకూ ఆదియైన సర్వసృష్టికీ మూలకారణమైన ఒక 'బ్రహ్మాండం' గా వ్యాపించి - విస్తరించింది! ఇదే 'హిరణ్యగోళం'! లేక 'హిరణ్యగర్భం'!

ఈ బంగారు రంగుగల హిరణ్మయ కాంతితో వెలుగుతూండే తేజోగోళం — అలా కోట్ల సంవత్సరాలు పెరిగింది! అందంగా, అంతా వ్యాపించింది! అంటేదృష్టిపథం ఎంతవరకూ సరిపడుతుందో అంత వరకూ నిండి — సర్వమూ తానే అయి, వ్యాపించసాగింది.

## 'కాలం' పుట్టుక — "కర్మ" ఏర్పాటు :-

దానిలోంచి మొట్టమొదటిసారిగా ఒక పరిభ్రమణం — తన చుట్టూ తాను తిరిగే ఒకరకమైన స్పందనం — గోచరించింది! ఈ పరిభ్రమణంతో 'కాలం' ఉద్భవించింది!

ఈకాలంతో ఆకాశం, దానితో కర్మ, పంచభూతాలూ ... ఇలా అన్నీ ఒకదానివెంట ఒకటే ఉల్లిపాయలో పొరలు విడివడి నట్టుగా — చల్ల చేస్తూవుంటే కవ్వంప్రక్కనుంచి, వెన్న, మజ్జిగ రెండూ విడివడ్డట్టుగా—క్రమేపి ఒకదాంట్లోంచి ఒకటి మండలాకారంగా విస్తరించినాయి !! చెరువులో రాయివేస్తే అలలు రింగులు రింగులుగా ఎలావస్తాయో అలాగే మధ్య తిరిగే హిరణ్మయాండం

లోంచి, పంచభూతాలూ, ఆకాశం, మనోబుద్ధ్యహం కారాలూ, ఇంకా వాయువూ, సప్తధాతువులూ, ఇలా ఒకటేమిటి, అన్నీకూడా ఏర్పడ్డాయి!

వీటి ఏర్పాటుతో క్రమేపి ఆ అండము విభక్తమై, కమలాఫలపు పండు తొనలు ఒలిచినట్టుగా ఒక్కొక్క భాగం వేర్వేరుగా విడివడి, అందులోనుంచి ఒకే మంటలోంచివచ్చే నిప్పురవ్వలలాగ అనేక కోట్ల సూర్యులు సన్నటి రవ్వలలా వెలుగుతూ చీకట్లో దూసుకుపోవటం ఆయన ప్రత్యక్షంగా దర్శించాడు!

అవి రవ్వలుకావు, దుమ్ము రేణువులలాగ తేలుతున్న అనేకకోట్ల సూర్యగోళాలు! అందులో ప్రతివొక్కటీ సన్నటి నక్షత్రంలాగ రివ్వున తిరుగుతూ అనంతాకాశంలో నాట్యం చేస్తున్నది. తిరుగుతున్న ఆ నక్షత్రంలోంచి అలలు అలలుగా తేజస్సు చుట్టురా అన్ని వైపులా విరజిమ్ముతున్నది. అది విష్ణుచక్రంలా తిరిగే భ్రమణవేగానికి అన్నివై పులకీ ఆ తేజస్సు రింగులుగా విడివడి, దూరంగా వ్యాపించసాగింది!

## 'గ్రహాల — 'సృష్టి'! :-

ఒక చెరువులో రాయివేస్తే దానిచుట్టూవచ్చే అలలలా, రింగులు రింగులుగా వలయాలు ఏర్పడి, ఆ పదార్థం తోనే, క్రమేణా, ఒకటీ రెండు, మూడు — ఇలా తొమ్మిది గ్రహాలూ ఏర్పడి మండలా కారంగా ప్రతి సూర్యునిచుట్టూ నాట్యంచేస్తున్నాయి— **అణువులో పరిభ్రమించే పరమాణువుల్లాగ!**

ఇదివొక అనంతమైనగాథ, అద్భుత వైవిధ్యం! పెక్కు శాస్త్రాల లోని విజ్ఞానమంతా ముద్దకట్టి అనుభవంగా మారి ఏకాకారం ధరించి. ప్రత్యక్షమై, దృశ్యంలాగ నడుస్తూన్న **జగన్నాటకం!** ఇది పరి పూర్ణ మైన పురాతనమైన, జగత్తుకి మూలమైన, నిత్య సత్యం యొక్క ప్రత్యక్ష సాక్షాత్కారం! **ఆత్మానుభూతి!!** ఒకగుండ్రని సున్నాలాగ అనాద్యంతమై మొదలూ చివరా లేకుండా వృత్తంగా నిత్యం పరి

భ్రమించే మహత్తర "కాలస్వరూపం"! అ వృత్తమే —"కాలచక్రం" లేక రాశి చక్రం!

## 'సృష్టి' ప్రళయాలు! :-

అందులోంచే సృష్టి!... సముద్రజలంలోంచి పైకిలేచే పర్వతాలూ, నదులూ, అరణ్యాలూ, జలచరాలూ, జంతువులూ, పక్షులు, మానవులు, యోగులూ, దేవతా స్వరూపాల సృష్టి ! అనంతమైన వైవిధ్యం అది! అపూర్వమైన కళాఖండం వంటి విశ్వరచనా నైపుణి! దాని అందం అపారం. దాని అర్ధం అగాధం. అణువులనుండి సూర్యగోళాలవరకూ, క్రమబద్ధంగా లయ తప్పకుండా రాసకేళిలాగ వలయాకారంలో నిత్యం జరిగే జగత్తుల నాట్యం! "సృష్టి" — "స్థితి"— "ప్రళయం" ! అనే ఈ మూడడుగులతో పరతత్వం — చేసే "నృత్యం" ! కాలపురుషుని ఆనంద తాండవం!! అదే విశ్వరూపుడి రాసకేళి. విశ్వలీల !

## దృశ్యమే తానైన — 'సమాధి' స్థితి! :-

ఆ మహ త్తరమైన సమాధి స్థితిలో ఆయన దర్శించిన ఈ సర్వతోముఖానుభూతిని వర్ణించడానికి మాటలుచాలవు. ఎందుకంటే మాటలు పరిమితం, కాని చూచిన అనుభవం అపరిమితం! అగాధం! అనేక అర్థాలతో బహుముఖంగా ఒక్కసారే అనుభవంలోకివచ్చే "అతి మానస" అనుభూతి! మనస్సు కంటె పైనవుండే, బుద్ధికి పై అంతస్థులోని "ఆత్మానుభూతి" అది ! చూస్తున్న దృశ్యమే తానై — దృశ్యమూ, చూడటం, తానూ, అన్న ఈ మూడూ కలిసిపోయి — ఏకాకారమైన 'ఆత్మ సమాధి.'

క్రమక్రమంగా మానవదృష్టిలో లక్షల సంవత్సరాల క్రితం జరిగిపోయిన చరిత్ర యావత్తూ, ఇలా మనస్సనే తెరమీద, చలనచిత్రంలా పునరావృత్తమైంది. క్రమంగా పల్లెలూ, పట్టణాలూ, నగరాలు,

అంతటా వ్యాపించటం — రాజులు ఏర్పడటం, రాజ్యాలు, వాటితో పాటు రాజకీయాలు — మానవ సమాజంలో, అంతటా అల్లుకోవడం పసిపిల్లవాడిలాగ అమాయకమైన మనస్సుతో అమృత హృదయంతో మానవజాతి ఏకకుటుంబంగా జీవించిన అనాటి **"సత్యయుగం"** ... ఇలా అంతాకూడా ఆ మహర్షి అంతర్దృష్టికి ప్రత్యక్షంగా గోచరించింది!

## మానవ చరిత్ర! :-

అమలమైన అంతఃకరణతో ఒకనాడు ఆనందంగా జీవించిన మానవ జాతి, క్రమక్రమంగా అధఃపతనమౌతూ స్వార్థంతో, అసూయలతో, కపటంతో, అన్యోన్య ద్వేషాలతో, యుద్ధాలతో ఒకరినొకరు హింసించుకుంటూ ఒకరినొకరు బాధించుకుంటూ, ఈభూగోళాన్నే నరకంగా మార్చివేసిన ఘోరమైన యీనాటి స్థితికి కారణం, ఈ **కాలంలోని మానవుల ధర్మ విచ్ఛిత్తి వల్లనే!** మంచితనం మనిషిలో నశించటమే, భూమిలో ధర్మం నశించటమంటేఅనీ, అవగతం కాసాగింది, ఇదంతా దర్శించే ఆయనకు.

ఏనాడైతే, భూమిమీద మానవునిలో **'మంచి'** అనేది లేకుండా పోయిందో ఆనాడే జీవితంలో సుఖశాంతులనేవి ఈ ప్రపంచంనుంచి నిష్క్రమించాయి ! ధర్మమే అన్నిటికీ మూలం అన్న సత్యాన్ని నిరూపించే భయంకరగాథ! మానవ జాతి ఇన్నేళ్ళుగా అనుభవిస్తున్న కన్నీటిబాధ! ఇదే చరిత్రనేర్పే **గుణపాఠం** ! ఇదే **"పురాణం"** !

అందులో మళ్లీ అడుగడుగునా చీకటిలోని నక్షత్రాల్లాగ, అజ్ఞానంతోనిండిన, మానవసమాజంలో మంచినీ, ప్రేమనూ, సత్యాన్ని, ధర్మాన్నీ వెలిగించే దీపకళికల్లాగ అక్కడక్కడా జన్మించే అవతారపురుషులూ, మహర్షులు, అహింసా మూర్తులు అవతరించడం! ఈ సత్యాన్ని గ్రహించి మానవజాతిని తిరిగి వెలుగుబాటలో నడిపించటానికి ప్రయత్నించే దివ్యపురుషుల గాథలు!

ఇలా అన్నీ క్రమంగా ఆ మహత్తర సమాధిలో అంతా ఒక దివ్య చరిత్రగా ఆయన దర్శించారు. ఇది విశ్వంగాధ! యావత్ సృష్టి కథ!

## సృష్టి-ప్రళయం!

ఇలాగ ఒక "సృష్టి"నుంచీ ఒక "ప్రళయం" దాకా జరిగే కథ యావత్తూ ఒక చక్రంగా తిరుగుతుంది. దానినే "కల్పం" అంటారు. తరువాత వచ్చేది "ప్రళయం"! భూకంపాలూ, అగ్నిపర్వతాలు, అపార జననష్టం కలిగించే వాతావరణపు మార్పులూ, భూగోళం తిరిగే పరిధి లోనే గల్లంతు! గ్రహాలు ఒకదాన్నొకటి ఢీకొని, భగ్గున మండిపోతూ అనంత అగ్నిజ్వాలల్లాగ వెలుగుతూ సూర్యగోళంలోకి పోయి అందులో పడి లయమైపోవడంతో ఇలా ఈ కన్పిస్తున్నదంతా ఎక్కడినుంచి వచ్చిందో తిరిగి అందులోకే లయమై పోవడం ....... తిరిగి మ సృష్టి! మళ్ళీ ప్రళయం!!

## 'మహాప్రళయం'!

ఇలా అనంతంగా కాలచక్రంలో పరిభ్రమించే "సృష్టి" వసంతం "ప్రళయం" వేసవీ - వానాకాలంలోని పచ్చని వరిపొలాల్లాగా సృష్టి భూమ్మీద కలకల్లాడుతూ వ్యాపిస్తోంది! మళ్ళీ శిశిర కాలంలో ఆకులు రాలినట్టుగా జనం రాలిపోయే ప్రళయం .... ఇలాగ ఒకదాని తర్వాత ఒకటి, ఋతువుల్లాగ అనేక రకాల సృష్టులు, అనేక "కల్పాల" గాధలు, వేర్వేరు ప్రళయాలలోని వైవిధ్యం ఇలానే చక్రాకారంగా తిరుగుతూం టుంది! ఈ కథ యావత్తూ అతి విపులంగా, స్పష్టంగా, ప్రత్యక్షంగా దర్శించాడు ఆయన- ప్రళయాలకు చివర వచ్చే 'మహాప్రళయం' కూడా!

ప్రళయాలలో బైటి భూగోళం నశించి మళ్ళీ సృష్టి అవుతోంది - "మహాప్రళయం"లో పంచభూతాలు, అణువులూ, పరమాణువులూ

కూడా నశించిపోయి అంతా శుద్ధ --- ఆకాశతత్త్వంలోకి లయించి పోయింది! ఆ 'ఆకాశం'- బ్రహ్మ మనస్సులో లయించిపోయి, అది 'మహత్తు'- అనబడే భగవత్ వస్తువుగా లయమైపోయి చివరికి బ్రహ్మ దేవుడుకూడా నారాయణునిలోకి లయించి, ఆయన 'యోగసమాధి'లో అంతర్ముఖుడై ఆత్మారాముడుగా నిలిచిపోతాడు! అప్పుడు ఏకవస్తువు - "ఏకో విష్ణుర్మహద్భూతం" అన్నది మిగులుతుంది! దీనిని కూడా వ్యాసమహర్షి భారతంలో

"యః పురా ప్రళయే ప్రాప్తే
నష్టే స్థావర జంగమే-ఏకస్తిష్ఠతి విశ్వాత్మా"

అని వర్ణించాడు. ఇలాంటి బ్రహ్మకల్పాలు 36 వర్ణించాడు.

## 'పురాణ'- ఋషి! :-

తాను దర్శించిన ఈ "సృష్టి" రహస్యాన్ని మానవజాతికి అందించే అమరవాణిని ఆచంద్రార్కంగా మనకు వదలి, కాలంలో నడచిపో-యిన ఆయన అడుగుజాడలే మానవజాతి గుండెలమీద ముద్రించాడు. శాశ్వతంగా ! ఆయనే వ్యాసమహర్షి!!!

ఆయన అపూర్వ యోగసమాధిలో దర్శించిన, ఈ మహానుభూతిని తిరిగి ఎలాగ మానవాళికి మళ్ళీ అందించాడో, అదంతా, వేరే కథ! అది, వచ్చే అధ్యాయంలో గమనిద్దాం.



3

# వేదవ్యాస మహర్షి ఆశ్రమం

వేదవ్యాస మహర్షి, తనకి కలిగిన విశ్వానుభూతినీ ఆత్మ సాక్షాత్కార రూపమై తపస్సులో తనకు గోచరించిన విశ్వ రహస్యమునూ— అది తనకు ఏవిధంగా కలిగిందో, అదంతాకూడా తాను మహాభారతం ఆదిపర్వంలో* వివరంగా వర్ణించాడు.

---

చూ॥ "పుణ్యే హిమవతః పాదే పూజ్యే గిరి గుహాలయే
విశోధ్య దేహం ధర్మాత్మా...."
(హిమాలయములోని తపస్సు వర్ణన)
మహదండ మభూదేకం ప్రజానాం బీజమవ్యయం"
(తపస్సులోని దివ్యదృశ్యం)
త్రయస్త్రిశత్సహస్రాణి త్రయస్త్రింశచ్ఛతాని చ
త్రయస్త్రింశతి వర్షాణి సృష్టిస్సంక్షేప లక్షణం".

— (ఆదిపర్వం)

**'సృష్టి' — చరిత్ర :-** అంతేకాకుండా చక్రాకారంగా తిరిగే కాలంలో సృష్టి ప్రళయం, సృష్టి ప్రళయం, ఇలాగ ఒకదానివెంట ఇంకొకటి రాత్రివెంట పగలువలె నిత్యం తిరుగుతూవుంటాయని ఆ అనంత కాల చక్రంయొక్క గతిని లెక్కించే పరిభ్రమణంలో యుగాలు, కల్పాలు, మన్వంతరాల సంఖ్యా, అన్నీ గుణించే సృష్టికి సంక్షేప లక్షణమైన ఆ రహస్య గణితమూ కూడా ఆయన భారతంలోనే వివరించాడు.

అలా జరిగే కాలచక్ర గతిలో తిరిగి పునరావృత్తమయ్యే "నిత్య చరిత్ర" (Universal History) ను "ఇతిహాసం" గా మహాభారతం రూపంలో పంచమ వేదంగా మానవాళికి అందించాడు.

ఇలాగ మనకిచ్చిన "ఇతిహాస" రూపమైన భారతంలో తనకి ముందు జరిగిన చరిత్రను, తనకు సమకాలమైన 'వర్తమాన' చరిత్రనూ మాత్రమేకాకుండా రాగల, రానున్న, "భవిష్యత్తు"ను పురాణ రూపంలో రచించి "భవిష్యపురాణం" గా మనకు అందించాడు.

వర్తమాన చరిత్ర గురించి వర్ణించినపుడు ఆయన వర్ణించిన తన సమకాలికులైన ఋషులూ, రాజులూ, తనసమకాలీన దేశకాల పరిస్థితులూ, అన్నీకూడా ఈనాటికీ వ్యాసమహర్షి రచనలలో అక్కడా అక్కడా విస్తరించివున్న విషయాలను పరిశోధనగా సేకరిస్తే —వ్యాస మహర్షి చారిత్రక జీవితం గురించి అనేక ఆసక్తికర విషయాలను -- మనం తెలుసుకోవచ్చు.

:ందులో అతిముఖ్యమైనది, వ్యాసుని రచనలలో వచ్చే వ్యాసుని పాత్ర! అది  శ్చర్యకరమైన విషయం!! ఎందుకంటే సామాన్యంగా ఏ రచయితా తన రచనలలో తానే పాత్రధారిగా రాడు! కాని వ్యాసమహర్షి రచించినది కల్పనాకథ కాదుగదా! అది యదార్థచరిత! చరిత్రలోని వ్యక్తిగా వ్యాసమహర్షిని మనకి తెలిపే అంశం ఒకటి ఇక్కడ స్పష్టంగా పరిశీలిద్దాం. అదేమిటంటే 'వ్యాసుని ఆశ్రమం ఎక్కడ వుండేది?' అన్న అంశం.

వేదవ్యాస మహర్షి పేరు విననివారుండరు. భారతం తెలియని

వారూ ఉండరు. అయినప్పటికీ వ్యాసమహర్షి ఆశ్రమము, లేదా ఆయన తపస్సు చేసినచోటు గురించిగాని ప్రశ్నించండి, ఎవరినయినా! సరైనసమాధానం చెప్పగలవారు బహుశః వెయ్యికి ఒక్కరుకూడా వుండరు!

ఇది చాలా ఆశ్చర్యం! ఎందుకంటే అనేకమంది విద్వాంసులనూ, పండితులనూ ఈ ప్రశ్న అడగటమూ, వాళ్ళూ అసలా విషయం గురించే తాము విచారణ చెయ్యలేదని అంటూ చెప్పటమూ ఎన్నోసార్లు చూస్తాము! ఈ తెలియనివాళ్ళు అందరూ, కేవలం పామరులు అనుకునేరు! కాదు! మహాభారతంమీద "రీసెర్చి" (Research) చేసిన "డాక్టరేట్లూ" వ్యాసునిగురించీ, ఆయన కవితాశక్తి గురించీ ఇంకా ఇంకా ఇలాంటి విషయాల్లో పాండిత్య ప్రకర్షతో వ్యాసాలు వ్రాసినవాళ్ళలోనే చాలామందికి వ్యాసుని నివాసస్థలం గురించి తెలియదంటే ఆశ్చర్యంగాలేదూ?

అవును! మహాభారత కర్త, బ్రహ్మసూత్ర నిర్మాత, వేదవిభక్త, సాక్షాదవతారమూర్తిగా "జాతీయకవి" (National Poet) గానూ, మన దేశ సంస్కృతికే మూలపురుషుడు -- ఇంకా 'హిందూమతం' అంటూవొకటి ఈనాడిలా వుండటానికి కారకుడూ, ఈనాడు "హిందూ మతాన్ని" సజీవంగావుంచిన గీతా, భాగవతం విష్ణుసహస్ర నామాలవంటి మహా "మంత్ర-కావ్యస్రష్ట"* అనీ ఇలా ఎన్నోచెపుతాం ఆయన గురించి! కాని ఆయన నివాసస్థలం గురించి పరిశోధన మాత్రం చెయ్యం! జరిగిందికూడా చాలా తక్కువే? అందులోనూ జన సామాన్యానికి అందింది అసలే శూన్యం! అందుకే ఈ అంశంగురించి కూడా ఇక్కడ పరిశీలిద్దాం!

అనేకులు వేదవ్యాసుని నివాసస్థలములుగా పేర్కొనే స్థలాలు ఇవి :- (a) **"వ్యాసస్థలము"** (b) **'వ్యాసవనం'** (c) **"వ్యాసస్థలి"** (ఇది కురుక్షేత్రంలోవుంది) (d) **వ్యాసాశ్రమం.** (ఇది హిమాలయాలలోది) (e) **వ్యాసకాశి** (f) **వ్యాసఘాట్** (తెహరీ (Tehri) మార్గంలో "గరుడచాహీ" వద్ద) (g) **"మాణా"** అనే గ్రామంలోని **వ్యాసాశ్రమం** (4 మైళ్ళు) (i)హర్యానాలోని 'బిలాస్ పూర్' వద్దనున్న వ్యాసాశ్రమం.

(j) 'మచ్చోదరీఘాట్' అంటే ఆగ్రా, మధురా మధ్య వ్యాసుని జన్మస్థలంగా చెప్పబడుతున్న స్థలం. వ్యాసుని భార్యపేరు "వటిక" అనీ, కుమారుడు శ్రీశుకుడు అనీ ఇతడు తల్లిగర్భంలో 12 – మాసాలు ఉన్నాడట! ఆయన బృహస్పతికి శిష్యుడుగానూ విదేహ జనకునికి బ్రహ్మవిద్యలో శిష్యుడుగానూ, బ్రహ్మవిద్యనేర్చి శ్రీశుకుడుగానూ చివరికి మోక్షంపొందాడు! ఇదికూడా వ్యాసుని ఆశ్రమం ప్రాంతంలోనే! పైచెప్పిన స్థలాలు ఒకటొకటే వివరంగా పరిశీలిద్దాం.

(1) **వ్యాసాశ్రమము :-** దేవప్రయాగ నుంచి తెహరీ (Tehri) వేళ్ళేదారిలో "లక్ష్మణ్ ఝూలా" నుంచి "గరుడ చక్కీ" వున్న దిక్కుగా నాలుగు– మైళ్ళ దూరంలో 'వ్యాసఘట్టం" ఉన్నది. అక్కడ గోపాల్‌జీ లేక, కృష్ణమందిరం, ఒక ధర్మశాల కూడా గంగ వొడ్డున ఈ వ్యాసాశ్రమందగ్గరే వున్నాయి.

(2) **శమ్యాప్రాస తీర్థం :-** కేశవప్రయాగవద్ద ఉన్న సరస్వతీ సంగమంవద్ద, సరస్వతీనది ఒడ్డున ఈ **శమ్యాప్రాస** తీర్థం వున్నది! ఇదే వేదవ్యాసుని ఆశ్రమ స్థలము, అంటారు. కొందరు".

**'మాణా** అనేగ్రామంలో **"వ్యాస గుహ"** అనే పేరుతో నేటికి ఒక గుహ ఉన్నది. ఆ గుహలో కూర్చునే వ్యాసమహర్షి తన 18-పురాణములు రచించాడని ఈనాటికీ ప్రసిద్ధిచెందిన గుహలు ఇవి! "గణేశ గుహ" కూడా ఒకటి ఉన్నది. ఈ "మాణా" గ్రామము, ఈవైపు భారతదేశపు సరిహద్దు గ్రామాలలో చిట్టచివరి గ్రామము. ఇక్కడనుండి "బదరీనాథ్" దిక్కుగా వెళ్లి ఒక వంతెనదాటిపోవచ్చు. ఇది బదరీనాథ్‌కు రెండున్నర మైళ్ళ దూరంలో వుంది.

(3) **"వ్యాసాలయం" :-** "బిలాస్‌పూర్" అన్న గ్రామంలో **"వ్యాసపూర్"** యీనాటికీ ఉన్నది. ఇక్కడ "వ్యాసమహర్షి దేవాలయం కూడా ఒకటి ఉన్నది.

(4) మధురవద్ద 'కృష్ణ గంగా' సరస్సుదగ్గర మధుర జిల్లాలో **"మాంట్"** అనే గ్రామం సమీపంలోనేవున్న **'ఛాందేరి'** అనేగ్రామం

వ్యాసుని జన్మస్థలం అనీ మధురలోనేవున్న 'కృష్ణగంగా' అనే తీర్థం **వ్యాసుడు తపస్సుచేసిన స్థలమని** ప్రఖ్యాత పరిశోధకులు పండిట్ బాలకుంద చతుర్వేదిగారి అభిప్రాయం.

(5) ఆగ్రా దగ్గిర "రునుకథా" కు కొంచెం దూరంలో **మచ్ఛోదరీ ఘాట్** అనే ప్రదేశం వున్నది ఇక్కడనే యమునా తీరంలో వ్యాసుని మందిరంకూడా వున్నది. ఇదే మత్స్యగంధి అయిన సత్యవతికి వ్యాసుడు జన్మించినచోటు అని, అక్కడి ప్రజలు ఈనాటికి చెబుతారు !

(6) **వ్యాస వనం :-** మహాభారతం అరణ్య పర్వంలో (81-వ అధ్యాయములో) కురుక్షేత్ర సమీపంలోనే "వ్యాసవనం" ఉన్నట్లుగా వర్ణింపబడి ఉన్నది. ఇదే విషయం నారద పురాణంలోనూ, వామన పురాణంలోకూడా చెప్పబడివున్నది.

(7) **వ్యాసస్థలి :-** ఇదికూడా పై "వ్యాస వనం" లాగే కురుక్షేత్ర సమీపంలోనే వున్నది. ఇక్కడ వ్యాసమహర్షి కుమారుడు శ్రీశుకుని నిర్యాణం(మోక్షం) జరిగింది ! ఆ తర్వాత పుత్రశోకంతో వ్యాసమహర్షి దేహత్యాగ ప్రయత్నం చేశాడని కూడా చెబుతారు. ఈవిషయం మహాభారతంలో, నారద, వామన పురాణాలలోకూడా ఉన్నది.

(8) **వ్యాసాశ్రమం :-** పురాణాలలోని వర్ణనలను బట్టి చూస్తే ఇది బదరీ వెళ్ళే దోవలో "అలక నందా" సరస్వతీ నదుల సంగమ స్థానం వద్దనున్న "శమ్యాప్రాస" తీర్థానికి సమీపంలో ఉన్నది, వ్యాసుడిక్కడ ఈ ఆశ్రమంలో వుంటూండగానే సుమంతుడు, వైశంపాయనుడూ, పైలుడు, జైమినీ, మొదలుగాగల ఋషులు ఆయనకి శిష్యులుగా చేరి వేదశాస్త్రాలలో శిక్షణ పొందారనీ, వ్యాసమహర్షి వేదప్రచారం ఇక్కడనుంచే ప్రారంభం అయిందనీ తెలుస్తోంది ! శివపురాణంలోని ఉత్తరఖండంలోని 44-వ అధ్యాయంచేయడంవల్లకూడ తెలుస్తున్నదీ విషయం.

(9) **వ్యాసకాశీ :-** ఇది గంగకు అవతలఒడ్డున కాశీకి ఎదురుగా వున్న "రామ్‌నగర్" ప్రక్కనే ఉన్నది. ఇక్కడి ఆలయంలో విశ్వనాథునితో బాటు వ్యాసుడుకూడా స్వయంగా శివలింగ స్వరూపంలో ప్రతిష్ఠించబడి ఉన్నాడు. కాశీఖండంలో వ్యాసుడు విశ్వనాథుని ఆజ్ఞచే కాశీని విడిచి వ్యాసకాశీకి వెళ్లినట్టు ఉన్నది.

(10) **కృష్ణగంగా తీర్థం :-** ఇది కృష్ణద్వైపాయనుని స్థానమని **"వరాహ–పురాణం"** (175) మనకి తెలుపుతోంది. ఇది మధుర వద్దనున్న "సోమతీర్థం" * "వైకుంఠతీర్థం" మధ్యనవున్నది. ఇక్కడే వ్యాసమహర్షి చాతుర్మాస్యవ్రతం నడిపినట్లు తెలుస్తున్నది. ఇక్కడి "సోమతీర్థం" వద్దనే వ్యాసభగవానుడు **ఈశాన రుద్రుడి ఉపాసన** చేసినట్లున్నది.

ఇదే ప్రదేశంలో **'సావర్ణి మనువు'** కూడా రుద్రానుగ్రహంపొంది, సర్వశ్రేష్ఠమైన "మను"త్వాన్ని పొంది తన సంహితను రచించినాడు! ఈ పుస్తకంలో చంద్రచూడుడైన శివుని వర్ణన 92- వేల దగ్గరనుంచి 2,80,000 శ్లోకాల వరకూ వున్నది.

ఇది **"వామనోత్తర పురాణం"** అనే పేరుతో వ్యాసశిష్యుడైన వైశంపాయన ఋషి లిపిబద్ధంచేశాడు. ఈ విషయం కూర్మపురాణంలో (25-31-48) కూడా వివరంగా ఉన్నది.

(11) **శివపురాణంలో** "ఉమాసంహితలో" అవిముక్తతీర్థం వర్ణనవుంది. ఇక్కడ వ్యాసమహర్షి **మధురలోని** "అవిముక్తతీర్థం" దగ్గరవున్న మధ్యమేశ్వరుని ఆరాధిస్తూ 12 సంవత్సరాలు తీవ్రంగా తపస్సు చేసినట్టూ, చివరికి ఇక్కడే శివసాక్షాత్కారాన్నీ, ఆయన

---

* సోమ వైకుంఠయోర్మధ్యే యోవిష్ణు గంగేతి కథ్యతే

తత్రా తప్యత్తపో వ్యాసో మధురాయాం స్థితోఽమలః"

—వరాహ పురాణం-175

వరాన్నీ పొందినట్టూ శివపురాణంలో ఉమాసంహిత 44-వ అధ్యాయం మనకి తెలుపుతోంది.

12. **బదరీ-నారాయణం :-** "...బాదరాయణ" --అన్న పేరుకూడా వ్యాసమహర్షికి వున్నది. ఇది ఆయన నివాసస్థలాన్ని తెలుపుతుందని "బదరీ+నారాయణ" కలిసి "బాదరాయణ" శబ్దం అయిందనీ కొన్ని గ్రంథాలలో వున్నది. కాని, ఇది విచారణీయం.

పై విషయాలవల్ల తేలేదేమిటంటే వ్యాసుని నివాసం ఎక్కువ భాగం "ఉత్తరఖండం" లోనే హరిద్వారంనుంచి బదరీనాథ్ వెళ్ళే మధ్యలోనే వున్నట్టుగా తెలుస్తున్నది. భారతం శాంతి పర్వం-3, 4 వ అధ్యాయాలు ఈ విషయాన్ని వివరంగా తెలుపుతున్నాయి. ఇతర పురాణాల్లో వ్యాసమహర్షి జననమూ ఆయన జీవించినదీ కూడా యమునాతీరంలోనే, అని స్పష్టంగా వ్రాయబడివుంది. బహుశా శ్రీకృష్ణుడు జీవించివున్నంతవరకూ వ్యాసుడు యమునాతీర ప్రాంతములోని తన ఆశ్రమములోనే నివశిస్తూవుండి భారతంలో వర్ణించినట్టు తన తల్లికీ ఇతరులకీ అప్పుడప్పుడు దర్శనమిస్తూ ఎక్కువకాలం గడిపినట్టు తెలుస్తున్నది.

మహాభారతం సంగ్రామం తర్వాత, అంటే కృష్ణుని నిర్యాణం జరిగాక, అర్జునుడు వ్యాసాశ్రమంలో వ్యాసునివద్దకు వెళ్ళి దుఃఖించినట్లున్నది. దీన్నిబట్టి చూచినాకూడా వ్యాసుడు మధురసమీపంలో వుండటాన్నే నిరూపిస్తున్నది. తరువాత వ్యాసమహర్షి బంధువుల వినాశనం అయినతరువాత - అంటే పాండవుల స్వర్గారోహణ తర్వాత హిమాలయాలకు తపస్సుకు వెళ్ళి అక్కడ "అలకనంద --- సరస్వతీ నదుల" సంగమ సమీపంలోనే వ్యాస భగవానుడు తపస్సుచేసినట్టు ఆదిపర్వంలో వర్ణించిన విధంగా సృష్టిరహస్యాన్నీ, కాలచక్రగతినీ భూత భవిష్యద్వర్తమానాలనూ, గడచిన కల్పాల కథనూకూడా సాంతంగా దర్శించి, —— ఆచూచింది చూచినట్టుగా తన 18 - పురాణాల రూపంలో వ్రాశారనీ ధృవపడుతున్నది.

ఈ మహాభారతరచనా ప్రారంభం పరీక్షిత్తు పట్టాభిషేకమైన కలి

యుగం మొదటి సంవత్సరంలో ప్రారంభమై మూడు సంవత్సరాల్లో పూర్తయిందని తెలుస్తున్నది.

పై దివ్యస్థలాలను సర్వులకూ తెలిసేవిధంగా, హిందువులు పుణ్యస్థలాలుగా ప్రకటించి అక్కడ వ్యాసపూర్ణిమనాడూ, ఇతర పుణ్యతిథులూ (గీతాజయంతి, భారత జయంతి ఇత్యాది) పండుగలుగా జరిపి, ఆనాడు అక్కడ, స్నాన, జప, దానతర్పణాలను చేసి తరించే మార్గం ఏర్పాటుచేయాలిసిన కర్తవ్యం మనజాతికి విధి. ఇది జరిగేలాగ చూడటం, మన పీఠాధిపతులూ యతీశ్వరులూ, జియ్యరు స్వాముల కర్తవ్యంకూడా — ఆ మహర్షిపట్ల!



4

# వ్యాసుని జననము

ఒకప్పుడు, తపోనిధియైన పరాశరముని, తీర్థయాత్రలు సేవిస్తూ యమునానదీ తీరానికి విచ్చేశాడు. ఆ సమయంలో పడవ నడిపే పల్లెవాడు భోజనం చేస్తున్నాడు. మధ్యాహ్నసమయం అవడంమూలాన పరాశరమహర్షి నదివొద్దకి రాగానే వీలుకాక, తన కుమార్తెయైన "మత్స్యగంధిని" పిలిచి పరాశరమహర్షిని యమునానదిని దాటించమని ఆదేశించాడు.

అప్పుడు "సత్యవతి" ఒక నావను తీసుకొని, పరాశరమహర్షిని అందులో కూర్చోబెట్టుకుని యమునానదిని దాటించడం ప్రారంభించింది. నావ నదీమధ్యం సమీపించింది. అందమైన సత్యవతి కన్నులూ, ఆమె సౌందర్యమూ ఆమెలోని దివ్య లక్షణాలూ చూసి, పరాశరమహర్షి సమ్మోహితుడైనాడు. క్షణకాలం ఆమె ముఖ లక్షణాలను సాముద్రికలక్షణాలను గమనించి ఆశ్చర్యపడి దివ్యదృష్టితో చూచాడు. మెరుపులా, ఆమె ఒక మహాపురుషునికో, లేక ఒక మహాప్రవక్తకో, తల్లి కాబోతున్నదన్న సంగతి గ్రహించాడు! ఆమెమీద ఆయనకి

అమితమైన అనురాగం దైవ ప్రేరణగా పుట్టుకొనివచ్చింది. అప్పుడు పరాశరమహర్షి ఆమెమీద కోరిక కలిగినవాడై, పడవ నడుపుతున్న మత్స్యగంధి చెయ్యి పట్టుకొన్నాడు.

ఈ విధంగా తపోధనుడైన పరాశరమహర్షి, తనమీది కోరికతో చెయ్యి పట్టుకోవడంచూచి నిషాదుడి కుమార్తె అయిన "మత్స్యగంధి" చాలా ఆశ్చర్యచకితురాలైంది. భయభ్రాంతురాలై ఆమె ఇలా అన్నది. "ఓ తపోధనా, తమరు మహర్షులలో శ్రేష్ఠులు! ఇంద్రియాలను జయించి బహుకాలం తపస్సుచేసినవారు. మనస్సునూ ఇంద్రియాలనూ తపస్సుతో జయించిన మీరు, ఈ విధంగా సామాన్య మనుష్యులవలే కామానికి లొంగిపోవడం యుక్తమైన పనికాదు. ఈ సృష్టిలో మానవుడిగా జన్మించడమే చాలా దుర్లభం. దుర్లభమైన మనుష్యజన్మ, లభించడమేకాక తమరు సత్కులంలో -- అందులోనూ బ్రాహ్మణ వంశంలో -- జన్మించారు. అంతేకాదు తమరు వేదవేదాంగ పారంగతులు. సర్వధర్మాలూ ఎరిగినవారు. బహుతపస్సు చేసిన మునీశ్వరులు. ఇట్టి మీరు కామవశులై, కేవలం సామాన్యులలాగ ప్రవర్తించడం ఏమీ యుక్తంకాదు. క్షణికమైన ఈ శరీర సుఖంకోసం శాశ్వతమైన మీధర్మాన్నీ, మీ తపస్సునూ పాడుచేసుకోవడం చాలా విచారకరం" అంటూ ఎంతగానో నచ్చచెప్పిచూసింది.!

అంతేగాకుండా ఆమె, ఇంకా ఇలా అన్నది. "మహానుభావా! నేను కులంలోనూ, వృత్తిలోనూ, జన్మలోనూకూడా తమకి అన్నివిధాలా తక్కువదాన్ని, తమరు నాలో ఏమి ఆకర్షణ చూశారో నాకు తెలియడంలేదు. ఇంతేగాదు, నాకు పుట్టుకతోనే, శరీరంలోంచి ఒక దుర్గంధం -- చేపలవాసన, వస్తూ వుంటుంది. ఆ వాసన, చాలాదూరంవరకూ వ్యాపించి దుర్భరంగా ఉండటం మూలాన, నన్ను "మత్స్యగంధి" అంటారు! ఇటువంటి మత్స్యములవాసన వచ్చే నా శరీరంలో మీకేవిధమైన సుఖం కలుగుతుందో నాకర్థం కావడంలేదు" అని ఆశ్చర్యపోయింది.

అప్పుడు తపోధనుడైన పరాశరుడు ఆమె శరీరంలోంచి వచ్చే మత్స్యగంధం పోయేట్టుగా, అప్పుడే ఆశీర్వదించాడు. తక్షణమేఒక కమ్మని కస్తూరి తావీ, పచ్చకర్పూరాల ఘుమఘుమా, ఆ చుట్టుపక్కల పరిసరప్రాంతమంతా కూడా వ్యాపించసాగింది. ఈ సుగంధం ఆమె శరీరంలోంచి వెలువడి అంతకుపూర్వం వున్న చేపలవాసన మటుమాయమైంది! మాయమవటమే కాకుండా, ఈ సుగంధం కొన్ని మైళ్ళదూరం దాకా అంటే, ఒక యోజనందాకా వ్యాపించింది! ఆమె యోజనగంధిగా మారింది! తక్షణంలో జరిగిన ఈ అద్భుతమైన దివ్యచర్యకి ఆమె చకితురాలై తన వెడల్పాటి నేత్రాలతో ఆశ్చర్యంగా ఆయనవంకే చూస్తూ నిలబడింది! అప్పుడు ఆమె శరీరంలోవున్న మత్స్యగంధం నివారణయింది. కనక పూర్వం వలెనే ఆమెయందు సమ్మోహితుడై మళ్ళీ ఆమెను సమీపించాడు.

అప్పుడామె, "మహర్షీ ! మీరు ఈవిధంగా నాయందు కామాతురులై సామాన్య మానవుడిలాగా తమధర్మాన్ని మరవద్దు ! క్షణికమైన ఈ ఉద్రేకాన్ని నిగ్రహించి ధైర్యం వహించండి. కొద్దికాలంలోనే మీరు మీ ఆత్మజయాన్ని తిరిగి పొందగలుగుతారు." అంటూ హితవచనాలతో ఉపదేశం చేసింది. ఇటువంటి హితవాక్కులూ ధర్మయుక్తమైనవీ మత్స్యగంధి నోటినుంచి విని పరాశరమహర్షి, చాలాసంతోషించారు. సంతోషించి, ఈ విధంగా అన్నారు.

"నీ శరీరంలోంచి ఈరోజు నుంచీ ఈ మత్స్యగంధం శాశ్వతంగా నివారణైపోయింది. నేను కేవలం నీశరీరం మీది వ్యామోహంతోనే ఇలా నీయందు కోరిక కలిగి ప్రవర్తించడంలేదు! ఇలా, ఒక దైవయోగంవల్ల నా మనస్సు, నీయందాకర్షితమౌతోంది. పూర్వం ఎప్పుడూ నా మనస్సిలా కామవశంకాలేదు. నేను ఇంద్రియాలను జయించి కామాన్ని నిర్మూలించి, చిరకాలం తపస్సుచేసిన ఋషిని! శరీరవాంఛ ఎలా నిగ్రహించాలో యోగినైన నాకు తెలుసు. ఇంతే కాక, ఇంకోవిశేషంకూడా వున్నది. పూర్వం మహర్షుల భవిష్యద్వచ

నాల్ప్రకారం విష్ణుదేవునియొక్క 17-వ అవతారం "వ్యాసమహర్షి" గా నాకు పుత్రరూపంలో అవతరించవలసివున్నది. అటువంటి మహాపురుషుడికి నీవు తల్లివయ్యే సూచనలు, లక్షణాలూ, నీయందు స్పష్టంగా నాకు కనబడుతున్నాయి" అన్నారు. దానికి 'యోజనగంధి' అయిన సత్యవతి ఇలా అన్నది. ఓ మహామునీ! అలాఅయితే తమ అభీష్టం నెరవేర్చడానికి నాకు ఏవిధమైన అభ్యంతరమూ లేదు. కాని మీత్రోవన మీరు వెళ్లిపోయింతర్వాత కన్యనైన నాకు గర్భంవస్తే, నాగతేమికాను? నా తల్లిదండ్రులూ, బంధువులూ, నన్ను దూషించి, నన్ను పతితురాలని విడచి పెట్టేస్తారుగదా! అప్పుడు సమాజం దృష్టిలో నేను తల ఎత్తుకొని తిరగడం ఎలాగ? అన్నది.

ఆమె సందేహాన్ని గుర్తించిన పరాశరుడు "ఓ సత్యవతీ నీవు ఈ విధమైన చింతపడనక్కరలేదు. నీ కడుపున పుట్టేవాడు సామన్య మనుష్యుడు అనుకోవద్దు! కారణజన్ముడైన ఒక మహానుభావుడు -- వేద పురాణాల వ్యాఖ్యానకర్తా, రానున్న యుగంలో మానవజాతికి జ్ఞానభిక్ష పెట్టేవాడైన విష్ణుదేవుని అవతారం, మహర్షిరూపంలో నీయందు ఉద్భవించబోతున్నది! అంతేకాదు! నా తపస్సును ఖర్చుపెట్టి, నా తపశ్శక్తివల్ల నీకో వరం కూడా ఇస్తున్నాను. నీవు గర్భం ధరించినప్పటికీ -- యథాపూర్వంగా, నీ కన్యాత్వం చెడకుండా నిలిచివుంటుంది. నీవు కుమారుని కన్న తర్వాతకూడా నీ కన్యాత్వం నీకు తిరిగిలభ్యమయి పూర్వం లాగానే నిన్ను నీవాళ్లు, నీ తల్లిదండ్రులూ నిందించడం, దూషించడం, అనేది జరగదు" అని వరం ఇచ్చాడు. అప్పుడు ఆమాటలకు సత్యవతి సంతోషించింది. కమ్మని తావి గలిగిన పునుగు కస్తూరి వాసనలెన్నో దిక్కులు వ్యాపించగా ఘుమఘుమలాడుతూ అసామాన సౌందర్యంతో ఆమె నీలమైన ఆ యమునానదీ జలాలమధ్య ఇంకా ఎంతో అందంగా కనిపించింది. తనకి దగ్గరగా సమీపించిన పరాశర మహర్షితో ఆమె సిగ్గుగా ఇలా అన్నది. 'మహర్షీ! నదిఒడ్డున చాలామంది జనం చూస్తున్నారు. ఇందరిలో అందరూ చూస్తుండగా

పశువుల్లాగ సంగమించడం నాకు చాలా సిగ్గుగా ఉంటుంది, అని."

అప్పటికప్పుడే నావ, యమునాదికి మధ్యవున్న ఒక ద్వీపానికి చేరుకుంది. అప్పుడు ఆ లంకలో పరాశరుడు తన తపశ్శక్తితో సూర్యరశ్మిని ఆచ్ఛాదించి, ఒక దట్టమైన పొగమంచును సృష్టించాడు. ఆ పొగమంచు గాఢమైన చీకటిలాగా ఆ లంక కనిపించకుండా అంధకారం ఆవరించింది. అప్పుడు ఆలంకలో సత్యవతీ-పరాశరుల సంయోగం జరిగింది. వెంటనే ఆమెకు సద్యోగర్భంవల్ల కారణజన్ముడైన శ్రీవ్యాసమహర్షి ఉద్భవించడం జరిగింది.

సద్యోగర్భం ప్రకారం అంటే-- పూర్వం ఆంజనేయుడూ, దత్తాత్రేయులవారూ ఏ విధంగా జన్మించారో అదే విధంగా అప్పటికప్పుడే దత్తాత్రేయుడూ, హనుమంతుడూ జన్మించినట్టుగానే వ్యాసమహర్షి కూడా 'సద్యోజాతుడై' తక్షణమే తల్లి గర్భంవీడి జననం పొందాడు! పుట్టిన ఆ వ్యాసమహర్షి, మన్మధుని వంటి సౌందర్యంగలిగి విశాలమైన నేత్రాలతో మహాపురుషునికుండే దివ్య లక్షణాలతో తేజరిల్లుతూ తల్లికి నమస్కరించాడు!

అసాధారణుడైన తనకుమారుని చూచి, సత్యవతీదేవి ఆనందంతో పొంగిపోయింది. వ్యాసమహర్షి "అమ్మా! అధైర్యం పడవద్దు. నేను తపస్సుకు వెడుతున్నాను. నీకు ఏ విధమైన కష్టంగానీ, అవసరంగానీ కలిగినపుడు నన్ను స్మరించు! తక్షణం నీముందు వచ్చి వ్రాలుతాను" అని చెప్పి, ఆయన తల్లి ఆశీస్సులను తీసుకొని తపస్సుకని బైలుదేరి వెళ్ళిపోయాడు.

"కృష్ణ" అని పేరుగల నల్లని నీళ్ళుగల యమునాదిలో వున్న ద్వీపంలో జన్మించాడు. కాబట్టి -- "కృష్ణాద్వీపంలో జన్మించడంవల్లా-- వ్యాసమహర్షికి "కృష్ణద్వైపాయను" డనే పేరూ, సత్యవతీదేవి కడుపున పుట్టడంమూలాన ఆయన "సాత్యవతేయుడు" అనీ పరాశరసుతుడు గనక "పారాశరి" అనీ పేర్లున్నాయి. ఆయనను "బాదరాయణుడు"

అనికూడా అంటారు.

ఇలాగ సత్యవతీ పరాశరుల సంయోగం అయింతరువాత పరాశర మహర్షి వెంటనే యమునానదిని దాటి అవతలవొడ్డుకు వెళ్ళాడు. పూర్వంవలెనే ఆయన యధాప్రకారం వైరాగ్యం తపస్సూ మళ్ళీ తన మనస్సును ఆవేశించగా క్షణికమైన ఈ సంసార బంధాన్ని త్యజించి, యమునలోస్నానంచేసి దీర్ఘకాలం గాయిత్రీజప అనుష్ఠానాలతో పరిశుద్ధుడై, మళ్ళీ తన తపోవనానికి వెళ్ళిపోయాడు!

సామాన్య మానవులకు కామవాసన కలిగిన సంబంధం గనక వచ్చినట్టయితే అది విడువలేని శాశ్వత బంధంగా వారిని కోరికల్లో బంధించివేస్తుంది. కాని పరాశరమహర్షికి కలిగినటువంటి ఆకర్షణ, మేనకా విశ్వామిత్రులకు కలిగిన ఆకర్షణ వంటిదికాదు! కేవలం దైవప్రేరణ!

ఎంచేతనంటే, ఆయన కామ వాసనలను జయించినవాడు. మహర్షిసత్తముడు, ఆయనకోసారి సాక్షాత్తు విష్ణుదేవుడు ఆయన తపస్సులో సాక్షాత్కరించి "నీకడుపున వ్యాసమహర్షిగా జన్మిస్తాను" అని చాలా కాలంక్రిందనే చెప్పినందువల్ల --- ఆ దైవసంకల్పంవల్లనే -- వ్యాసమహర్షి అలా జన్మించవలసివచ్చింది.

ఈ కారణంచేతనే, దైవయోగంవల్ల పరాశరమహర్షి మనస్సు సత్యవతియందు లగ్నమైంది. అదికూడా, చేపలవాని కుమార్తెఅయిన మత్స్యగంధితో! ఇది మీనరాశిలో జరుగుతున్న అఖండమైన ఒక గ్రహసంయోగానికి -- "మీన --కన్య" లకు చిహ్నంగా -- రూపం ధరించినది! మీనరాశి, జ్యోతిశాస్త్రం ప్రకారం "జలరాశి." అలాగే వ్యాసమహర్షి కూడా జలమధ్యంలో వున్న లంకలోనే జన్మించాడు ! మీనరాశి ఆకారం చేపలాగ-- అంటే, పడవలాగ--వుంటుంది. గనక పడవలోనే గర్భం ధరించింది. అది కన్యారాశివల్ల కన్య కడుపున జన్మించటం జ్యోతిశ్శాస్త్ర విహితమైన దైవనిర్ణయం.

ఈ విధంగా, ఒక శకకర్త, పురాణకర్త; మహర్షి సత్తముడూ, భూత భవిష్యద్వర్తమానాలు తెలుసుకోగల అతీంద్రియజ్ఞానీ విష్ణ్వంశ సంభూతుడైన వ్యాసమహర్షి -- సత్యవతీ గర్భాన జన్మించినట్టి ఈ వృత్తాంతం "దేవీ భాగవతం" లో స్పష్టంగా చెప్పబడివున్నది. అందులో కొన్ని శ్లోకాలు ఈవిధంగా ఉన్నాయి.

"ద్వీపేన్యస్త స్తయా బాలః
తస్మాత్, ద్వైపాయనో అభవత్"

అంటే ద్వీపంలో జన్మించి ఆ ద్వీపంలోనే ఉంఛబడిన బాలకుడుగాబట్టి "ద్వైపాయను" డనే పేరు, వ్యాసమహర్షికి వచ్చింది, అని ఇంకా దేవీభాగవతంలో ఇలా, :

"ఏకదా తీర్థయాత్రాయాం వ్రజన్ పారాశరో మునిః
అజగామ మహాతేజా కాళింద్యాస్తట ముత్తమం ||
నిషాదమాహ ధర్మాత్మా కుర్వంతం భోజనం తదా"
ప్రాపయస్వ పరం పారం కాళింద్యా ఉడుపేన మామ్||

అంటే ఒకప్పుడు తీర్థయాత్రలు చేస్తున్న మహాతేజస్వంతుడైన పరాశరమహర్షి కాళిందీనదిని సమీపించాడు. అక్కడవున్న నిషాదుడు. ధర్మాత్ముడైనవాడు పడవ నడుపుకొనేవాడు భోజనంచేస్తున్నాడు. ఆ సమయంలో నదిని దాటించమని పరాశరుడు కోరాడు.

"వ్రజన్ సూర్య సుతా తోయే
భావిత్వాత్ దైవ యోగతః.....
.... కామార్తస్తు, మునిర్జాతః
దృష్ట్వా తాంచారు లోచనాం"

అందమైన ఆ సత్యవతిని చూసి, ఆమెయందు ఆకర్షితుడైనాడు మహర్షి, దైవయోగంవల్ల! ఆ తర్వాత ఆమె

"సుషువే యమునా ద్వీపే పుత్రం కామ మివాపరం

సాపి సత్యవతీ జాతః సద్యోగర్భవతీ సతీ
జాత మాత్రస్తు తేజస్వీ తామువాచ స, మాతరం"

ఈ విధంగా సత్యవతీ గర్భమందు మన్మధుని మించిన అందంగల్గిన వ్యాసమహర్షి జన్మించాడు. సద్యోగర్భంలో అవతరించిన వ్యాసమహర్షి, పుట్టినవెంటనే మహాతేజస్వి అయి, నిలిచి ఆమెకు నమస్కరించి, తన తపస్సుకు నిష్క్రమించాడు-- అని దేవీభాగవతంలోని, పై శ్లోకాలవల్ల తెలుస్తున్నది.

పై గాథలో దైవికమైన అంతరార్థం ఒకటివున్నదని కూడా చాల మందికి తెలియదు. ఎందుకంటే పురాణాలన్నీ కేవలం కథలకోసం రాసినవికావు! కథల రూపంలో నిగూఢ ఆధ్యాత్మిక రహస్యాలూ, శాస్త్రీయ సత్యాలూ అంతరార్థంగా అందించబడి వుంటాయి. ఈ విషయం "మహాభారత రహస్యార్థము" గురించీ, భగవద్గీతయొక్క నిగూఢ రహస్యం తెలిపేచోట విశదం చెయ్యబడింది. ఇక్కడ, మనకి కావలిసింది వ్యాసమహర్షి జననం గురించిన పైకథలోని చిత్రమైన అంతరార్థం ఏమిటి - అన్న విషయం ఒక్కటే!

అందులో మొదటిది, పరాశురుడంతటి మహాయోగి, ఋషి-- అంతేగాదు గత ద్వాపరయుగం కాక, అంతకుపూర్వం "మహాయుగంలో" వచ్చిన 'ద్వాపరం' లోని వ్యాసుడూ జితేంద్రియుడూ ఐనవాడు సత్యవతితో సంగమానికి అంత తొందర ఎందుకు పడ్డాడు? కామం ఆపుకోలేకనా? మరి అలా అయితే ఆయనకూ సామాన్య సంసారికీ, పాటకజనానికీ తేడా ఏమిటి? ఆయన భగవత్సాక్షాత్కారం కూడా పొందినవాడు. విష్ణుదేవుడు సాక్షాత్తూ తానై దర్శనమిచ్చి -- ఈయనకు పుత్రుడై "వ్యాసావతారం" గా జన్మిస్తానని చెప్పినవ్యక్తి! ఆయనకు భవిష్యత్తు తెలుసు! ఎందుకు తెలియదు -- ఈయనకుమారుడైన వ్యాసుడే భవిష్యత్తును సినిమాలాగచూసి రాబోయేదంతా "భవిష్యపురాణం" గా వ్రాశాడు. అలాంటప్పుడు సత్యవతితో సంగమించటానికి అంత తొందపడటానికింకో మహత్తరకారణం

ఏదైనా వుండివుండాలి! కనీసం నదిలోనడుస్తున్ననావ ఒడ్డుకు చేరేదాకా కూడా ఆగలేదు! సామాన్య మానవుడు సంసారసౌఖ్యానికి కావలసిన సౌకర్యాలు అమర్చుకునేదాక వేచివుంటాడే! కనుక, పడవ ఒడ్డుదాటేదాకా ఆగని ఏదో మహత్తరకారణం వుండివుండాలి.

జ్యోతిషంలో "నిషేకాధ్యాయం" అనే దానిలో గర్భాధాన ముహుర్తంలో ఏయే గ్రహస్థితులు ఎలావుంటే జన్మించేవాడు ఏయే లక్షణాలతోపుట్టుతాడో తెలిపివున్నది. కనక ఆ సమయంలో ఆకాశంలో ఒకానొక మహత్తరమైన గ్రహస్థితి జరిగింది! అదిమళ్ళీకొన్ని వేలసంవత్సరాలకి కాని యుగాలకి గాని తిరిగి సంభవించనంత అపూర్వ గ్రహస్థితి అది. అది దాటిపోతే మళ్లీ, లోకానికి ఒక అవతారమూర్తి జన్మించే తరుణం చేయి జారిపోతుంది. అందుకే పరాశరుడు తొందరపడ్డాడు. సత్యవతిలోని సాముద్రిక లక్షణాలూ, కాబోయే మహరాణి గుణాలు అవతారమూర్తికి తల్లికాబోయే దివ్యచిహ్నాలూ చూచాడు.

ఆమె "మీనరాశి"లో జన్మించింది కన్యాలగ్నములో అది రహస్య సంకేతంగా కవి ఆమెను "మత్స్యగంధి" గా చేపల కన్యగా చూపించాడు. ఇక్కడ "చేప" అంటే "మీనరాశి" అని అర్థం! అంతేగాదు, ఈ సత్యవతి చేపకడుపున జన్మించిందట! ఆ చేపకి పుట్టినది గనకనే చేపరాశి (మీనం) సూచింపబడింది.

ఆకాశంలో మీనరాశి స్వరూపం "అన్యోన్య -- అభిముఖంగావున్న రెండుచేపలు" అని వర్ణించారు జ్యోతిశ్శాస్త్రంలో. అందుకని ఈ కథలో చేపకడుపును భేదించినప్పుడు ఇద్దరు పిల్లలు -- సత్యవతితోబాటు 'మత్స్యరాజు' కూడా జన్మించాడు.

ఇంకోచిత్రం! రాశిచక్రంలో - మీనరాశికి ఎదురుగుండా (7-వ రాశిలో) 'కన్యారాశి' వుంటుంది. ఈ కన్యారాశి లగ్నంగా వ్యాసుడు జన్మించి యావజ్జీవం బ్రహ్మచారి(కన్య)గా జీవించాడు. ఈ "కన్య" రాశియొక్క స్వరూపం వరాహమిహిరాచార్యుడు "సవస్య- దహనా, ప్లవగాచ కన్యా" -- "అంటే సస్యములను తీసుకుని, ఒకనావను నడుపుతున్న కన్య" -- అని వర్ణించాడు.

కనుక యోజనగంధి పడవ నడుపుతూవుంటే వర్ణించినది, కన్యారాశి ఆకాశంలో ఉదయించటానికే సూచింపబడింది. మీనరాశిలో జన్మించిన సత్యవతి "చేప -- కన్య" గా చూపించబడింది కవితా చమత్కృతితో! దీనిని బట్టి వ్యాసమహర్షి జాతకంకూడా గుణించవచ్చు! అలాంటి మహోతరుణం గనకే, ఆసమయం మించిపోతే, ప్రపంచానికి వ్యాసుడు జన్మించే సమయం మరిలేదు. అందుకే అంత తొందరపడినాడు పరాశరమహర్షి! కామంతో కాదు.

ఇది, శాలివాహనుడి జననసమయంలోకూడా ఇలాగే జరిగిన ఒక సన్నివేశాన్ని గుర్తుకుతెస్తుంది!

శాలివాహనుని తండ్రి గొప్పజ్యోతిశ్శాస్త్రవేత్త! ఆయన రానున్న కాలంలో ఒక గొప్ప "శక--కర్త" జన్మించే మహత్తర గ్రహస్థితులు రావటంచూసి తనభార్యతో గర్భాధాన (నిషేక) ముహూర్తం నిర్ణయించుకుంటాడు. కాని ఆ ముందురోజు గ్రామాంతరం పనిమీద వెళ్ళి తిరిగివస్తూవుండగ గోదావరి పొంగి వరదలై పారుతోంది. రెండురోజులకుగాని నదిదాటటం సాధ్యంకాదు.. ఒడ్డునకూర్చుని దుఃఖిస్తూండగా ఒక కుమ్మరివాడు చూచి, కారణం అడుగుతాడు. పరిస్థితిచెప్పి బ్రాహ్మణుడు ప్రపంచానికోగొప్ప శకకర్తపుట్టే సమయం తెలిసివుండీ తరుణం చేజారిపోతూవున్నదని విలపిస్తాడు. దానికి కుమ్మరి -- అనుజ్ఞ అయితే తన ఈడువచ్చిన కుమార్తెను ఆనాటిరాత్రే వివాహం చేసుకుంటే ఆతరుణంలో మహానుభావుడు జన్మించవచ్చు నంటాడు. దానికతడు అంగీకరించి ఒకేఒక రాత్రి ఆమెతో సంసార జీవితం నడపటంవల్ల ఆమెకు మహాసామ్రాట్టు, శకకర్తఅయి, నూరు అశ్వమేధములు చేసిన "శాలివాహన---చక్రవర్తి" జన్మించినట్లు చరిత్ర తెలుపుతోంది.

ఇక, వ్యాసునియొక్క జన్మకాల వివరణం 'వ్యాసపూర్ణిమ' అని తెలుస్తుంది! ఈ వ్యాసపూర్ణిమ వివరణము ఏమిటో వేరే గమనిద్దాము.



5

# వ్యాస పూర్ణిమ

ఇప్పుడు వ్యాసుడు జన్మించినటువంటి సమయం గురించి పరిశీలిద్దాం. అనాదికాలంనుంచీ 'ఆషాఢశుద్ధ పౌర్ణమి'ని 'వ్యాసపూర్ణిమ'గా పరిగణించడం పరిపాటి. ఆ రోజునే "గురుపూజ" అనే మహోత్సవం దేశమంతటా చేయడం పరిపాటి. ఆషాఢశుద్ధపౌర్ణమినే "గురుపూర్ణిమ" అని కూడా అంటారు. దానినే "వ్యాసపౌర్ణమి" అని అంటారు. ఇలాగ మానవ చరిత్రలోనే అపూర్వమైన ఆధ్యాత్మికమైన పర్వదినంగా నిలచిపోయిన తిథి, వ్యాస జన్మమయిన రోజే అవడంలో ఆశ్చర్యమేముంది?

ఈ ఆషాఢ పౌర్ణమి గురించి ఒక చక్కటి కథవున్నది. వారణాశిలో ఒక బ్రాహ్మణ బాలకుడు వుండేవాడు. ఆత్రేయసగోత్రుడైన ఆ బాలకుడి పేరు "వేదనిధి". అతని భార్య "వేదవతి". ఇద్దరూ చాలా బీదవాళ్ళు. వారు తపస్సంపన్నులూ, భక్తి జ్ఞానములు కలిగిన పుణ్యదంపతులైనప్పటికీ చాలాకాలం వారికి సంతానంలేక బాధపడుతూ వుండేవారు. అనేక వ్రతాలూ, పుణ్యకర్మలూ చేశారు. ఏదైనప్పటికీ

వారికి ఏమి లాభంలేకపోయింది. సంతానం కలుగలేదు. ఇలాగ ఆలోచిస్తూ వుండగానే చాలాకాలం గడిచిపోయింది. ఒకరోజు వేదనిధి ఒక చిత్రమైన వార్త విన్నాడు. ఏమనంటే ప్రతీరోజూ మధ్యాహ్న సమయంలో వ్యాసమహర్షి రహస్యంగా గంగానదికి వస్తారు.

ఇది వినగానే వేదనిధి హృదయం ఆనందంతో గంతులు వేసింది. స్వయంగా వ్యాసమహర్షియే నిజంగా గంగాస్నానానికి వస్తారా! ఆ సమయంలో ఆయన దర్శనం చేసుకొని ఆయన ద్వారా అదృష్ట సిద్ధిని పొందాలని ఆలోచించాడు. అతను జాగ్రత్తగా గంగాతీరానికి చేరుకున్నాడు. సరిగ్గా మధ్యాహ్నకాలం అయింది. అతను వెయ్యికళ్ళతో కనిపెట్టుకుని చూస్తున్నాడు. చాలాసేపు అలాగే చూచాడు. చివరికో భిక్షుక రూపంలో దండం ధరించిన ఒక వ్యక్తి స్నానానికి వచ్చాడు. వేదనిధి ఆయన పాదాలపైన పడి, కాళ్ళుపట్టుకున్నాడు. ఆయన వేదనిధిని కసరికొట్టి చీదరించుకున్నాడు ఇలా ఎన్నివిధాల ఆయన చీదరించుకొన్నప్పటికీ వేదనిధి మాత్రం ఆయన పాదాలు పట్టుకున్న పట్టును మాత్రం విడువలేదు. ఇలా కొంతసేపు గడచినతర్వాత వేదనిధి అన్నాడు. "మహానుభావా తమరు సాక్షాత్తూ వ్యాసమహర్షులు! ఈసంగతి నాకు తెలుసు! అందుచేతనే మిమ్మల్ని నేను శరణు పొందాను! ఈ మాట వినగానే ఆభిక్షుక రూపంలో వున్న వ్యక్తి, గంగానది ఒడ్డున బెదురుగా, అటూ ఇటూ చూశాడు ఎవరైనా చూస్తున్నారేమోనని! లేదని నిర్ధారించుకున్న వెంటనే అతన్ని చేరదీసి "నా రహస్యం ఇక్కడ, ఎవరికి బైటికి తెలియకూడదు. జాగ్రత్త! తెలిసిందా? నీకేంకావాలో కోరుకో! వెంటనే ఇచ్చి వెడతాను" అన్నాడు. వేదనిధి, "ప్రభూ రేపు నా తండ్రిగారి పితృకార్యము -- శ్రాద్ధము వున్నది దయచేసి మీరు బ్రాహ్మణార్థం భోజనానికి మా యింటికి దయచేయువలసింది. ఇదే నా కోరిక" అన్నాడు. వ్యాసమహర్షి సరేనని అంగీకరించి వెళ్ళిపోయారు.

వేదనిధి ఎంతో సంతోషంతో తన ఇంటికి వెళ్ళి, భార్యతో జరిగిన

ఈ వృత్తాంతమంతా చెప్పాడు. అతని భార్య మహానందంతో పరవళ్ళు త్రొక్కుతూ, ఉదయాన్నే లేచి, శుచిగా, మడిగా అన్నివంటకాలూ సిద్ధంచేసింది. వారు అతి పేదవాళ్ళయినప్పటికీ, ఏదో విధంగా ఆ రోజు తమకున్న విభవాన్నంతా ఖర్చుపెట్టి, అనేక భక్ష్యభోజ్యా లతో భోజనం తయారుచేశారు. ఇలాగ కొంత సేపయ్యేసరికి నిన్నటి భిక్షుకరూపంలోవున్న దివ్యపురుషుడు మళ్ళీవచ్చాడు. వచ్చి ఆయన స్నానంచేసి, కాళ్ళూ చేతులూ కడుక్కుని ఆచమనంచేసి పూజదగ్గరవున్న పుష్పములూ, తులసితో సాలగ్రామాన్ని పూజించాడు. అక్కడ ఉన్న సాలగ్రామాన్ని చూడగానే వ్యాసమహర్షి సాష్టాంగ నమస్కారంచేసి కాస్సేపు ధ్యానించారు. అర్ఘ్యపాద్యాది విధులతో పూజించాడు వేదనిధి ఆయనను. ఆయన వేదనిధి సత్కారం స్వీకరించి "సాలగ్రామ దర్శనంవల్ల చాలా పునీతుణ్ణయ్యాను" అంటూ ఆసనంమీద కూర్చున్నారు. అప్పుడు వేదనిధి శ్రాద్ధవిధులన్నీ నిర్వర్తించి తర్వాత ఆయన ఆశీర్వాదం తీసుకున్నాడు. ఆ తర్వాత ఆయనకోరికలు కోరుకోమన్నారు. వేదనిధి తనకు పుత్రులు లేని విషయాన్ని ప్రస్తావించాడు. వ్యాసమహర్షి "పదిమంది కొడుకులు నీకు కలుగుతారు, చాలా తేజోవంతులూ, ఐశ్వర్యవంతులూ, అదృ ష్టవంతులూ అయినటువంటివారు. అంతేకాకుండా నీవు జీవితంలో ఏలోటు లేకుండా సకల ఐశ్వర్యాలతో సుఖపడి, ఈ జీవితం పూర్తి అయింతర్వాత నీకు విష్ణులోక ప్రాప్తికలుగుతుంది." అని ఆశీర్వదించి ఇక బైల్దేరి వెళ్ళిపోతున్నారు. కాని వేదనిధి కడసారిగా ఇంకోసారి ప్రార్థించాడు "ప్రభూ! మళ్ళీ తమ దర్శనం ఎప్పుడు చేసుకొంటాను? తమను ఎప్పుడు ఎలా చూడగలను" అని. దానికి వ్యాసమహర్షి ఇలా అన్నారు.

"శృణు విప్ర రతేచ్ఛాచేత్, దర్శనార్థం తదాత్వయా

పూజనీయో విశేషేణ, కథావాచయితా స్వయం" అని.

అంటే దాని అర్థం ఏమిటంటే! "బ్రాహ్మణోత్తమా! నీవు నన్ను దర్శించాలని చాలా కుతూహలంగా ఉన్నావు కనుక విను! నువ్వు ఎప్పుడైనాసరే నన్ను చూడాలంటే పురాణకథలనూ, వేదగాధలయొక్క రహస్యాలనూ, వ్యాఖ్యానం చేస్తూ ఇతిహాసాల గూఢార్థాలు ఎవరైతే ఉపదేశిస్తూ వుంటారో అతడే నా యొక్క నిజస్వరూపం. అని తెలుసుకొని, పురాణ కథకుడైన అతడిని సాక్షాత్తూ వ్యాసమహర్షి మూర్తిగా భావించి పూజించవలసింది. ఎందుకంటే, నేనే ఈ పౌరాణికులందరిలోనూ వుంటాను " అన్నారు.

ఈ శ్లోకానికి అంతరార్థంవున్నది అది ఏమిటంటే:-

... ... ప్రాచీనగాధలూ, గత కల్పాలలో జరిగిన చరిత్ర, ఆ సృష్టికి పూర్వం అనేక సృష్టుల్లో జరిగిన విశ్వం యొక్క పూర్వ వృత్తాంతం, ఇలాంటివన్నీ పురాణాల్లో గూఢంగా, నిహితంచేయబడి వున్నాయి. ఎవరు వీటిని మానవజాతికి అంతరార్థాలతో బోధించి చెప్పాలన్నా, లేదా వాళ్ళకి వాళ్ళు అర్థంచేసుకోవాలన్నా, దానికి తప్పక, వ్యాసమహర్షి "అనుగ్రహం" అవశ్యం అవసరం! వ్యాసాంశ లేనిదే ఈ పురాణగాధల్ని ఎవ్వరూకూడా విప్పిచెప్పలేరు. అంచేత 'వ్యాసపూజను' ఆషాఢశుద్ధ పౌర్ణమినాడు చేసి, పౌరాణికుణ్ణి గౌరవించి, పూజించి ధూప దీప నైవేద్యాలతో, ఆయనని వ్యాస స్వరూపునిగా భావించి పూజిస్తారు. ఇదే "గురుపూజ" గురుపూర్ణిమనాడు -- అంటే ఆషాఢ పూర్ణిమనాడు, మహోత్సవంగా, ఇప్పటికీ జరుగుతూ వస్తున్నది.

అప్పుడు మళ్ళీ వేదనిధి వ్యాసమహర్షిని ఇలా ప్రశ్నించాడు. "మహాత్మా ! తమను నేను ఏ విధంగా పూజించాలి? ఏయే రోజుల్లో, ఏయేవిధంగా పూజించాలో అంతా దయచేసి వివరంగా చెప్పండి" అని. "కదా సంపూజనీయశ్చ కస్మిన్ మాసే దినే కదా, కేన కేన ప్రకారేణ వదస్వ మమాగ్రతః" --అని అంటే దానికి వ్యాసమహర్షి ఇలా చెప్తారు :-

"మమ జన్మదినే సమ్యక్ పూజనీయః ప్రయత్నతః ఆషాఢ శ్శుక్ల పక్షేతు పూర్ణిమాయాం గురౌతథా, పూజనీయో విశేషేణ, వస్త్రాభరణ ధేనుభిః దక్షిణాభిః సుపుష్పాభి మత్స్యరూపం ప్రపూజయేత్ ఏవం కృతే త్వయా విప్ర! మత్స్యరూపస్య దర్శనం. భవిష్యతి నసందేహో మయైవోక్తం ద్విజోత్తమ"

అంటే, అర్థం ఏమిటంటే "ఓ భూసురోత్తమా! నేను జన్మించినటువంటి ఈ పుణ్యతిథి రోజున, ఈ పూజను శ్రద్ధాభక్తులతో చేయాలి. అది ఆషాఢ శుద్ధ పౌర్ణమినాడు గురువారంతో కలిసి వచ్చినప్పుడు, వస్త్రం, ఆభరణం, ధేను దానంతో, దక్షిణతో పరిపూర్ణమైనటువంటి అర్ఘ్యపాద్యాలతో నా రూపాన్ని పూజించి, నన్ను ధ్యానించవలసింది. ఆషాఢ శుద్ధ పూర్ణిమనాడు ఎవరైతే ఈవిధంగా పూజిస్తారో ధ్యానిస్తారో, వారికి నాప్రత్యక్షం, అంటే నా స్వరూప సాక్షాత్కారం, కలుగుతుంది. ఇందులో ఏమీ సందేహం లేదు." అని వ్యాసమహర్షి పైన చెప్పినటువంటి వాక్యాలే పురాణశ్లోకాల్లోనూ ఉన్నాయి. అవే ఈనాటికీ, ప్రమాణం.

ఇప్పటికీ ఎవరైనా ఆధ్యాత్మిక రహస్యాలు, పరమ గురువులయొక్క జీవితం గురించి తెలుసుకోవాలన్నా వాళ్ళ సాక్షాత్కారం పొందాలంటేనూ, దానికి ఈ ఆషాఢ శుద్ధపౌర్ణమి చాలా ముఖ్యమైనరోజుగా ఉన్నది. బౌద్ధులకు "వైశాఖ పూర్ణిమ" ఎటువంటిదో ఈ ఆషాఢ పూర్ణిమ, "వ్యాసపూర్ణిమగా" లేక "గురుపూర్ణిమ" గా సర్వులకు కూడా అతి ముఖ్యమైన తిథిగా నిలిచిపోయింది! ఇదే వ్యాసమహర్షి యొక్క జన్మతిథి. ఇదే 'గురుపూజా మహోత్సవం రోజు'. ఎందుకంటే లోకములకు గురువైన వ్యాసమహర్షిని పూజించే రోజు! ఇతరులు కూడా వ్యాసమహర్షిని తమగురువుగా భావించి, పూజించాల్సినటువంటి పుణ్యతిథి -- ఆషాఢశుద్ధ పౌర్ణమి.

ఈ కథ విన్నతర్వాత వైశంపాయన మహర్షి, ఈ కథచెప్పి

నటువంటి నారదుణ్ణే తనగురువుగా భావించి ఆయననే వ్యాసునిగా భావించి పూజించారు. ఈ పూజ మూలాన వ్యాసానుగ్రహం, వ్యాస స్వరూపదర్శనం కూడా ఆయనకు సంభవించింది. సంభవించడమే కాకుండా తనకి ఈ కథచెప్పిన గురువుని, పౌరాణికుడుగా -- వ్యాసస్వరూపుడుగా భావించి ఆయన ఈ విధంగా అంటూ, ప్రణామం చేశారు!

"వైశంపాయన తస్మాత్వం వ్యాసపూజాంకురుష్వ తం కథా వాచయితారం చ, వ్యాసరూపం నతోస్మ్యహమ్" --అంటే "పై కథ చెప్పినటువంటివారిని వ్యాసరూపంగా భావించి నమస్కారం చేయవలసింది" అని భావం !

అందులోనూ "నన్ను(నారదుణ్ణి) వ్యాసగురువుగా భావించి, వ్యాస పూజను నాకే సమర్పించ వలసింది" ని నారదుడి దగ్గర నుంచి వైశంపాయనుడు ఈపై కథనువిని, వ్యాసపూజను ఆయనకే సమర్పించి, ఆయనద్వారా గురువు అనుగ్రహాన్నీ కూడా పొందాడు. ఈ కథను నారదుడు వైశంపాయునుడికి చెప్పినట్టుగా బ్రహ్మాండ పురాణం లోనూ, "స్వధర్మ సింధు" అనే గ్రంథంలోనూ వివరంగా చెప్పబడింది. 'నిర్ణయసింధువు' లో కూడా వ్యాసపూర్ణిమయొక్కవిశేషత్వం గురించి చెప్పబడివున్నది. అందులో గురుపూర్ణిమామహిమ, వ్యాసపూజాఫలితం అన్నీ విశేషంగా చెప్పబడివున్నాయి.

_ బట్టి వ్యాసుడియొక్క జన్మ, ఆషాఢశుద్ధ పౌర్ణమి గురువారంనాడు అని మనకి స్పష్టంగా తెలుస్తోంది.



6

# వ్యాసమహర్షి కాలము

ఈనాడు ఆధునికులమనుకునే ఇంగ్లీషు చదువు చదివినవాళ్లు కొందరు తెల్లదొరలఫక్కీలో మనపురాణాలనీ వేదాలనీ కూడా అనుమానించటం ఒక 'ఫ్యాషను' (fashion) అయింది! 'ఫ్యాషను' అనడం ఎందుకంటే వీరి పరిశోధన అనుమానాలు వెలిబుచ్చుటంవరకే గనక!

'వ్యాసమహర్షి అనే వ్యక్తి, నిజంగా చారిత్రకంగావుండి వున్నాడా? లేక శతాబ్దాలతరబడి సంకలనంచేయబడిన రచనలకు ఒకవ్యక్తి పేరు, కల్పించి పెట్టారా? అని ప్రశ్నించడమేతప్ప -- పరిశోధించడంచేతకాని మిథ్యామేధావులువీరు! ఇలాంటివారి రచనలు చదివి బుర్రలుపాడుచేసుకునే మనలోని అమాయకులైన యువతీ యువకులకు మనసంస్కృతిపైన, పురాణాలపైన, వేదాలపైనా, లేనిపోని సందేహాలు కల్పించడంతప్ప వాటిని పరిష్కరించడం చేతకాని ఈనాటి

విద్యాలయాలూ, ప్రొఫెసర్లు పాఠ్యగ్రంధాలు కోకొల్లలు! అలాంటివారి ఉపయోగార్థం కొన్నిముఖ్యమైన పరిశోధనాఫలితాలను ఈఅధ్యాయంలో మీకు పరిచయంచేస్తాను!

అందులో మొదటిది 'వ్యాసమహర్షి చారిత్రక వ్యక్తియేనా? ఆయన నిజంగా ఒక చారిత్రక పురుషుడైతే -- "వ్యాసమహర్షి ఫలానా కాలంలో జీవించాడని," తెలిపే సాక్ష్యాలు ఏమైనా వున్నాయా? ఆయన సమాకాలికులెవరైనా చారిత్రకంగా నిలబడే, సాక్ష్యాధారాలు లభించేవ్యక్తులా? అలాగైతే వ్యాసమహర్షి జీవించిన కాలం ఇదమిద్ధమని తేల్చడానికి పనికివచ్చే సైన్సుపరమైన సాక్ష్యాలు (Scientific evidence)ఏమన్నావున్నాయా?' -- అన్న ఈప్రశ్నలకు ముఖ్యమైన పరిశోధనకు పనికివచ్చే మైలురాళ్ళు సూచించడం మాత్రమే ఒక అధ్యాయంలో వ్రాయటానికి వీలయ్యేపని!

## శ్రీఅరవిందుల -- పరిశోధన:-

'వ్యాసమహర్షి ఒక నిర్దుష్టమైనవ్యక్తి' -- అని మహాభారతములోని శైలీ కవిత్వమూ, భాష, కావ్యవస్తువులను నిశితంగా పరిశీలించిన శ్రీఅరవిందయోగి తన మహోన్నతమైన పరిశోధనాగ్రంథం **"Vyasa and Valmiki"** అన్నదానిలో వ్యాసమహర్షి శైలికివున్న ప్రత్యేకతను నిరూపించారు! వ్యాసుని కవిత్వంలో పాత్రపోషణ కావ్యశిల్పమూ, ఆయనచేసిన పదప్రయోగాలలోని సాహిత్య విశేషాలూ, వైదికప్రయోగాలవంటి సాక్ష్యాధారాలపై ఆధారపడి శ్రీఅరవిందుడు చేసిన పరిశీలనకూ నిశితమైన నిర్ణయానికి విదేశీభాషాశాస్త్రజ్ఞులు కూడా ముక్కున వేలువేసుకున్నారు! ఇంతేకాదు, వ్యాసమహర్షిశైలికీ, వాల్మీకిమహర్షి శైలికీవున్న భేదము - మహాకవి కాళిదాసు కవితారీతికి భేదము వ్యాసవాల్మీకులకుమధ్య కవిత్వంలో కనిపించే తేడాలవంటి ఎన్నో విశేషాలను శ్రీఅరవిందుడు సవిమర్శగా నిరూపించాడు! అయితే వ్యాసమహర్షియొక్క ఉనికి - ఆయన చారిత్రకంగా

వున్నాడా? అనటానికి ఈ బాషా - సాహిత్యపరమైన పరోక్ష ఆధారమేనా?-మరింకేమీలేదా? అని నాకు ఆశ్చర్యంకలిగి కనీసం మూడు -- దశాబ్దాలపాటు నేనుచేపట్టిన పరిశోధనలఫలితాల్ని ఇక్కడ మీముందు వుంచుతాను! ఈ పరిశోధన ఆరుశాఖలలో ముఖ్యంగా ప్రసరించివున్నది! మొదటివి:

(I) చారిత్రకమైన ఆధారాలు :-

అంటే 'శాసనాలు' ఇతర సమకాలిక శిల్పాలలోనివీ తామ్రశాసనా లలోని సాక్ష్యాధారాలవంటివి! ఇలాంటి సాక్ష్యాధారాలలో ముఖ్యమైనవి చారిత్రక శాసనాలు! మహాభారతకాలంపై నేను డాక్టరేట్ పొందిన, పరిశోధనాగ్రంధంలో ఈ క్రింది శాసనాలు, చారిత్రక ఆధారం నిరూపించటానికి లభించినవి!

(a) **జనమేజయ దానశాసనాలు:** కర్నాటకలోని 'తీర్ధహళ్లి' వద్ద లభించిన తామ్ర(రాగిరేకు) శాసనంలో పాండవులమనుమడూ 'పరీక్షిత్తు'కుమారుడూ ఐన జనమేజయుడు 'సర్పయాగ' సమయంలో చేసిన 'దానశాసనం' ఒకటి లభించింది! ఇది కర్ణాటకలో పనిచేసిన బ్రిటిష్ అధికారి "లూయీస్ రైస్" (Lewis Rice) అన్నవాడు తాను రెవిన్యూపనుల తనిఖీనిమిత్తం గుర్రంమీద గ్రామగ్రామాలకూ తిరిగితే దొరికిన శాసనాలన్నీ సేకరించి 'మైసూరు -- శాసనాలు'("Mysore Inscriptions") అన్న పేరున ప్రచురించాడు! అందులో 'షిమోగా' జిల్లా 'తీర్ధహళ్ళి' అనే గ్రామం సమీపంలో వున్నచోట దొరికిన ఒక తామ్రశాసనం పరీక్షిత్తు కుమారుడైన "జనమేజయుడు" - ఇచ్చినట్లుగా తెలుపబడివున్నది!

ఇది తెలిసిన నేను ఆసక్తిగా మైసూరుకు హుటాహుటిగా ప్రయాణమైవెళ్లి అక్కడి 'ఆర్కియాలజీ డైరక్టరు'ను(Director of Archeology) కలుసుకొని 'షిమోగా' జిల్లానుండి ప్రత్యేకంగా ఈ "జనమేజయదానశాసనాన్ని" తెప్పించి -- పరిశీలించడానికి

I.A.S అధికారి ప్రభుత్వం నాకుగల పలుకుబడిని యావత్తూ అధికారయంత్రాంగంలో, ఉపయోగించుకుంటేనేగాని దీన్ని ఫోటోతియ్యటం వీలుకాలేదు!

## (b) జనమేజయ తీర్థహళ్లిదానశాసనం :

రీష్ అధికారి లూయిస్‌రైస్‌కు 'తీర్థహళ్ళి'లో లభించిన జనమేజయదానశాసనం సంస్కృత భాషలోవున్నది! అంతేగాక ఈ శాసనం కలియుగం ప్రారంభమైన - 89 వ సంవత్సరానికి సరియైన 'ప్లవంగ' నామ సంవత్సరంలో జనమేజయుడు చేసిన "సర్పయాగం" సందర్భంగా ఇచ్చినదిగా ఇందులోని వివరాలు తెలుపుతున్నాయి! ఇంకా కొన్ని ఆసక్తికరమైన విషయాలుకూడా ఇందులో బైటపడ్డాయి!

జనమేజయుడు సర్పయాగం చేసినపుడు జరిగిన 'పూర్ణాహుతి' సమయంలో పాల్గొన్న కొందరు ఋత్విజులైన వేదపండితులకు భూమిని అగ్రహారములుగా(ఈనాంగా) ఇచ్చిన దానశాసనపట్టం ఇది! ఇందులోని చాలా వివరాలూ, రెవిన్యూ దాఖలాలూ, వదిలివేస్తే ఈ శాసనం కలియుగం -89వ సంవత్సరానికి సరియైన ప్లవంగనామ సంవత్సరంలో అమావాస్యనాడు సోమవారంనాడు ఇవ్వబడిన దానశాసనమని తెలుపబడింది!

దీని సంస్కృత మహాభారతంలోని -- కలియుగం 3102 B.C. కు సరియైన ప్రమాధినామ సంవత్సరంనుండీగ్రహముల గణితంతో సరిచూస్తే ఏర్పడే తిథివార నక్షత్రాలను లెక్కించగా కలిశకం 89వ సంవత్సరం సరిగ్గా "ప్లవంగ" కే సరిపోతున్నది !!! కాబట్టి ఈ శాసనం 3102 B.C. నుంచీ 89 - సంవత్సరాల తరువాత అనగా 3013 B.C. న వ్రాయబడిన శాసనమని తెలుస్తున్నది! పాండవుల కుమారుడైన అభిమన్యుని పుత్రుడు పరీక్షిత్తు. ఈతడు తన 60వ ఏట ముసలివాడైన శమీక మహర్షి ఆశ్రమంలో శాపానికిగురై

తక్షకుడనే సర్పంవల్ల మరణించినట్లు భాగవతంలోనూ, భారతంలోనూ తెలుపబడింది! తండ్రి మరణానికి కారణమైన ఆ సర్పముల వినాశనం కోసం "సర్పయాగము"ను కుమారుడైన 'జనమేజయుడు' చేశాడని భారతంలో అంశాన్ని ఈ శాసనం ధృవపరుస్తోంది.!

జయాభ్యుదయశకం 89వ సం||లోది అయిన ప్లవంగనామ సం||ర సోమవారం అమావాస్యనాడు ఇచ్చిన దానశాసనంగా "ఇండియన్ ఏంటిక్వరి" (Indian Antiquary) 333.... 334 లో ఇది లభిస్తుంది.

అంతేకాక, ఈ దానశాసనంలో ఇవ్వబడిన గ్రహస్థితినిబట్టి గణితంచేయగా అది వ్యాసమహర్షి రచించిన సంస్కృత మహాభారత గ్రంథంలోని -- 'భీష్మపర్వంలో' వర్ణించిన యుద్ధకాల గ్రహస్థితుల గణితంతో ఇది, సరిగ్గా సరిపోతున్నది! దీన్నిబట్టి జనమేజయుడు నిజంగా చారిత్రకవ్యక్తే అనీ, ఆయన పూర్వీకులైన పాండవులు కూడా యదార్థంగా జీవించివుండేవారని బ్రిటీష్ చారిత్రకులకు సహితం ప్రమాణికమైన స్థాయిలో ఋజువౌవుతున్నది! ఇదేకాక, ఇంకా ఇతరశాసనాలు కూడా లభించినవి!

(C) **బెగూర్ తామ్రశాసనం :-** పై పేరుగల రెండవ - జనమేజయుని దానశాసనం వ్యాఘ్రపాద గోత్రజుడూ, హస్తినాపురచక్రవర్తి సోమవంశీయులైన పాండవుల మనుమడైన పరీక్షిత్తుకుమారుడు 'జనమేజయుడు' తన దక్షిణ దిగ్విజయయాత్ర సందర్భంగా -- ఉత్తరాయణంలో చైత్రమాస కృష్ణపక్షం వ్యతీపాతయోగం "సర్పయాగం" "పూర్ణాహుతి" సమయంలో ఇచ్చిన దానం గురించిన వివరాలశాసనము ఇది!

(d) **మూడవ-జనమేజయదానశాసనం :-**

ఇదేసమయంలో ఇవ్వబడిన ఇంకొక తామ్రశాసనం కూడా కర్నాటకలో లభించింది! అది చైత్రబహుళ సోమవారం భరణీ నక్షత్రం

మేషసంక్రమణం వ్యతీపాత పుణ్యకాలంలో దానంగా, ఇవ్వబడినది! ఇది, 'సోరాబ్ తామ్రశాసనం' 'పుష్పగడ్డె' అగ్రహారంలోని బ్రాహ్మణుల పేరిట యిచ్చిందిగా లభించినది! ఇదికూడా 1901 లో ఇండియన్ ఏంటిక్వేరీలో ఉల్లేఖించబడింది!

(e) నాలుగవ -- జనమేజయదానశాసనం :-

ఇది, కర్ణాటకలోని 'తడినాళ్ళ ' అనె అగ్రహారం గ్రామం "బనవాసి" బ్రాహ్మణులకు వైశాఖ బహుళ విదియ విశాఖానక్షత్రం సోమవారంలో "సర్పయాగ" ప్రారంభంలో ఇవ్వబడిన శాసనందని తెలుస్తుంది!

(f)యుధిష్ఠిర దానశాసనం:-

జనమేజయ దానశాసనాలే కాక పరీక్షిత్తు తండ్రి -- 'ధర్మరాజు స్వయంగా ఇచ్చిన దానశాసనంకూడా బ్రిటిష్ చారిత్రకులకు మరొకటి లభించింది!'

ఇది బ్రిటిష్ రెవిన్యూ అధికారి 'బుఖానన్'- (Buchanan)కు ఉత్తర కర్ణాటకలోని 'మధుకేశ్వర' ఆలయంలో లభించింది! ఇది పాండవాగ్రజుడైన యుధిష్ఠిరునిచే యుధిష్ఠిరశకం 16-వ సంవత్సరంలో ఇవ్వబడినట్లు దీనివివరాలు తెలుపుతున్నవి! ఈ శాసనం జైన క్షేత్రమైన 'శ్రావణ - బెళగోళా'నికి రెవిన్యూ అధికారిగా - వెళ్ళినపుడు 'బుఖానన్‌కు' అక్కడి జైనులు ఈ శాసనంయొక్క నకలు ప్రతిని కాపీతీసి ఇచ్చినట్లు ఆయన రిపోర్టులో రాశారు!

ఇంకా బాలగామివద్ద మైసూరు సమీపంలోనూకూడా ఇలాటి యుధిష్ఠిర దానశాసనాలు మూడు లభించినట్లుగా 'బుఖానన్' తన ప్రభుత్వ నివేదికలో తెలియచేశాడు! ఈ శాసనాలలోని వివరాలను సవిమర్శగా నా పరిశోధనా గ్రంథం "మహాభారత - కాలనిర్ణయం" (పేజీ 158 - 165)లో నిరూపించాను!

---

Note: * చూ- "మహాభారత - కాలనిర్ణయం" (అధ్యాయం 17 పేజీ 158 - 165)

దీనివల్ల మనకి, పాండవులు చారిత్రక వ్యక్తులని నిరూపించే శాసనాధారాలు నిర్దుష్టమైన చారిత్రక సాక్ష్యాధారాలు లభిస్తున్నాయని తెలుస్తుంది!

## II జ్యోతిషగణితాధారములు :-

పైన చెప్పిన శాసనాల ఆధారంను బలపరిచే ఖగోళ గ్రహస్థితిని వర్ణించే శ్లోకాలు సంస్కృత మహాభారతంలో, భాగవతంలో మనకి లభిస్తున్నాయి! ఈ ఖగోళ గణితం ఆధారంగా సైన్సుపరంగా లెక్కించిన తేదీలు- పైనచెప్పిన శాసనాలలోని తేదీలతో - ఖచ్చితంగా సరిపోవడంవల్ల, మనపురాణాలు కట్టుకధలనే బ్రిటిష్ చారిత్రకుల కువిమర్శ మోసం అని తేలడమేకాక వారు ఇన్నాళ్లూ నిజమైన శాస్త్రాధారాలు చరిత్రలో తెలిసివుండే త్రొక్కిపెట్టి, మన భారతచరిత్రకు ఇలా ద్రోహం చేశారని కూడా తెలుస్తుంది!

ఇంకా ఇలాటి జ్యోతిషపరమైన ఆధారాల్లో ముఖ్యమైనవి, (i)శ్రీకృష్ణుని నిర్యాణం, (ii)మహాభారత యుద్ధకాలం, (iii) పాండవుల జననం తెలిపే తిధి, వార, నక్షత్రాలు, (iv) మహాభారత యుద్ధప్రారంభాన్ని వర్ణించే తిధి, వార, నక్షత్రముల వివరాలు నిరూపిస్తున్నాయి! అందులో ముఖ్యమైనవి కొన్ని:

(1) శ్రీకృష్ణుడు శ్రావణబహుళ అష్టమినాడు రోహిణీ నక్షత్రంలో బుధవారం అర్ధరాత్రి మధురలోని జైలులో వృషభలగ్నంలో జన్మించాడనీ, - ఆయన సరిగ్గా - 125 సంవత్సరముల 7 - మాసాలు జీవించి ప్రమాధినామసంవత్సర చైత్రశుద్ధ పాడ్యమీ శుక్రవారంకు సరియైన 18-2-3102 B.C నాడు అర్ధరాత్రి - 2 గంటల - 35 నిమిషములకు కన్నుమూసారనీ, - ఆయన మరణించిన రోజునే సరిగ్గా అదేటైముకు “కలియుగం” ప్రవేశించిందనీ భాగవతం, భారతం, హరివంశం, విష్ణుపురాణంవంటి గ్రంధాలలోని * జ్యోతిషవిశేషాలు నిరూపిస్తున్నాయి.

III ఉపనిషత్ -- సాక్ష్యాధారము :-

ఛాందోగ్యోపనిషత్తులోని ఒక మంత్రాన్నిబట్టి శ్రీకృష్ణుడు ఉపనిషత్తుల కాలమునకు ముందువాడనీ ఆయనకు యజ్ఞరహస్యం బోధించినవాడు 'ఘోరాంగీరసుడు' అనే ఋషి,. దేవకీ పుత్రుడైన శ్రీకృష్ణునికిదాన్ని బోధించాడనీ - ఇందులోని మంత్రం తెలుపుతున్నది!

IV భగవద్గీతలోని సాక్ష్యాధారాలు :-

అలానే భగవద్గీతలోని శ్రీకృష్ణుని వాక్యాలనుబట్టి -

"మునీనామప్యహం వ్యాసః"

"మునులలోనేను వ్యాసుడిని" అని చెప్పడంవల్ల వీరిద్దరూ సమకాలికులని సాహిత్యపరమైన ఈ సాక్ష్యంవల్లకూడా నిరూపితమౌతోంది! భగవద్గీతలోనే ఇంకొక చోట

"బ్రహ్మసూత్ర పదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితం"

అనగా భగవద్గీతలో 'బ్రహ్మసూత్రాలలోని భగవద్గీతని హేతువాదం చేత ఇది నిర్ణయింపబడింది' అని భగవద్గీతలో శ్రీకృష్ణుడే స్వయంగా అంగీకరించడంవల్ల -- వ్యాసమహర్షి బ్రహ్మసూత్రాల్ని రచించడం శ్రీకృష్ణుడు భగవద్గీతను ఉపదేశించకముందే జరిగిందనికూడా తెలుస్తోంది!

v వ్యాస పూర్ణిమ:-

వ్యాసమహర్షి జననం ఆషాడమాసంలో శుక్లపక్షంలో పూర్ణిమనాడు జరిగిందని, ఆ పవిత్రమైన పర్వదినం ఈనాటికీ "వ్యాసపూర్ణిమ"గా (గురుపూర్ణిమగా) భారతదేశమంతటా జరుపుకుంటున్నారని కూడా మనకి తెలుసు!

## VI సైన్సు పరిశోధన తెలిపే సాక్ష్యాలు :-

అన్నిటికన్నా ముఖ్యమైన సాక్ష్యాధారాలు సైన్సుపరమైనవి ఇతర పరిశోధకులు తెలుపనివి మరికొన్ని ఆశ్చర్యకరమైన విషయాలు మీముందు వుంచుతాను!

(a) **కలియుగాదిలో -- ప్రళయాలు:-** ఇందులో మొదటిది శ్రీకృష్ణుని నిర్యాణం జరిగినపుడు జరిగిన గ్రహస్థితిలో అన్నిగ్రహాలు మేషరాశియందు కలిసినపుడు ప్రపంచమంతా ప్రళయం వంటిది సంభవించిందని, తెలిపేసైన్సుపరమైన సాక్ష్యాలు కొన్ని ఇక్కడ పరిచయం చేస్తాను మొదటిసారిగా!

(b) **పర్వాతాలే నడచుట!** ఇందులో 'కలియుగ ప్రారంభం'లో ఒక పెద్ద భూకంపంవంటిది జరిగి పర్వతాలే కదిలిపోయినాయని, భూమియావత్తు చలించిపోయిందనీ గ్రహగతులన్నీ తారుమారుకాగా పర్వతాలు, సముద్రములు, హిమాలయపర్వతాలు, ఆల్ఫ్సు పర్వతాలు అన్నీకూడా పునాదులతో సహా కదిలించబడ్డాయనీ -- ఇప్పుడు మనం ఆశ్చర్యపడేంత స్థాయిలో ఈ కలియుగ ప్రళయం జరిగిందని నిరూపించేసైన్సు సాక్ష్యాలు కొన్ని ఈ క్రింద మీముందుంచుతాను.

(i) మహాభారతం మౌసలపర్వంలోనూ శ్రీమద్భాగవతం 11, 12 స్కందాలలోనూ మహాభారతయుద్ధం జరిగిన 36 - వ సంవత్సరంలోనే ద్వాపరయుగాంతమై కలియుగప్రారంభం అయి, ఆ "యుగసంధి" లో భూకంపాలవంటి ప్రళయోత్పాతాలతో శ్రీకృష్ణుని ద్వారకానగరం సముద్రంలో మునిగిపోయిందని తెలుపుతున్నవి!

ఇంతకాలం శ్రీకృష్ణుని ద్వారక సముద్రంలో మునిగిపోయిందంటే అదేదో కవిత్వవర్ణన లాంటిదని వేళాకోళంగా దాన్ని విమర్శించినవారే గాని దానివెనుక ఎంత భయంకరమైన చారిత్రక సత్యమున్నదో

గమనించినవారే లేరు.!! ఇలాంటి వింతలు సైన్సుపరిశోధనవల్ల ఒక్కొక్కటే ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి! ఇవన్నీ కలిసి ఒకచోట సమన్వయంచేసిగనుక చూస్తే అనేకసైన్సులు కనుగొన్న అపూర్వ సాక్ష్యాధారాలవల్ల ఈ 'కలియుగ ప్రారంభానికి' 3000 B.C ప్రాంతంలో ఎంతటి భయంకరమైన మార్పులూ ప్రళయాలూ ఈ భూమ్మీద జరిగాయోచూస్తే సైన్సు దృక్కోణం నుంచి 'కలియుగ ప్రారంభం బుజువౌతున్నది! దీనివల్ల మహాభారతకాలము, క్రీ.పూ.మూడవ సహస్రాబ్దానికి 3000 B.C.ముందే జరిగినట్లు ఇలా సైన్సుపరమైన నిర్దుష్టమైన సాక్ష్యాల బుజువు లభించింది!

అంతేకాదు, ఈ ప్రళయం జరిగినపుడు ద్వారకానగరం సముద్రంలో మునిగిపోయిందని వ్యాసమహర్షి భాగవతంలో వర్ణించిన వర్ణన, కావ్యాలలోని వర్ణనవంటి ఊహాకల్పితంకాదని -- ద్వారక నిజంగానే మునిగిపోయిందని తెలిపే చారిత్రక త్రవ్వకాలైన పురావస్తు పరిశోధన సాక్ష్యాలుకూడా మీ ముందుంచుతాను!

## VII. మునిగిపోయిన ద్వారక

ఇటీవలనే సుమారు పదిసంవత్సరాల క్రితం గుజరాత్‌వద్ద అరేబియా సముద్రంలో నీటి అడుగున మునిగివున్న ద్వారాకానగరాన్ని యాదృచ్ఛికంగా కనుగొనటం తటస్థించింది! క్షణాలమీద ఈ వింతవార్త పత్రికలద్వారా కార్చిచ్చులా వ్యాపించింది! ఫలితంగా సముద్రంలో మునిగిపోయిన ద్వారక అవశేషాలు అరేబియా సముద్రం అడుగున వున్నట్లు రుజువైంది! దీనివల్ల మహాభారతంలో కలియుగ ప్రారంభంలో జరిగిన 'ప్రళయం' లో ద్వారక మునిగి పోయిందన్న వర్ణన సత్యమని ప్రత్యక్షమైన సైన్సు ఆధారాలతో సహా బైటపడింది!

ఆతర్వాత ద్వారక పీఠాధిపతి శంకరాచార్యులవారి పట్టుదలతో ఒక సముద్రపరిశోధనా ప్రాజెక్టు చేపట్టబడింది! దీనికై కర్ణాటకకు చెందిన శ్రీ. S.R.రావు (మాజీ డైరక్టరు- ఆర్కియాలజీ డిపార్టుమెంట్)

ఆధ్వర్యంలో సముద్ర గర్భ పరిశోధన చేపట్టబడింది! ఆశ్చర్యంగా ఈ పరిశోధనలో సముద్రంలో మునిగిపోయిన ద్వారకానగరం కోటగోడలు, ఆగడ్తలు, పెద్ద పెద్ద నౌకల అవశేషాలు ఐదువేల సంవత్సరాలనాటి ఓడ లంగర్లూ, నీటమునిగిన కట్టడాలూ, విగ్రహాలు, ఆభరణాలు ఒక్కటొక్కటే త్రవ్వి తీయటంకూడా జరిగింది!

## అడుగున - 'మరోద్వారక':-

సముద్రంలో మునిగిపోయిన ద్వారకానగరపు పునాదులలో త్రవ్వగా కొన్నివందల అడుగులలోతున 'ఇంకొక - ద్వారకానగరం' నిర్మితమై వున్నట్లు బయటపడి సైన్సుప్రపంచాన్నేగాక సామాన్యంగా నిద్రపోతూ వుండే హిందువుల్నికూడా ఆశ్చర్యంలో ముంచెత్తింది! అకస్మాత్తుగా రాజకీయనాయకుల దగ్గర్నుంచి పత్రిగా విలేఖరులవరకూ ఒక్కసారిగా ప్రాచీన భారతీయ సంస్కృతిమీద భక్తిప్రపత్తులు ముంచుకొచ్చినట్టు ఆవిర్భవించడం కూడా జరిగింది.

"ఇదంతు నగరం సర్వం సముద్రః ప్లావయిష్యతి'

-- మౌస. 7-10)

కాని ఇందులోని ఈవింతకు అర్థం ఏమిటో తెలుసుకున్నవారు బహుకొద్దిమంది!

విష్ణుపురాణంలో ద్వారకానగరాన్ని శ్రీకృష్ణుడు నిర్మాణంచేసే ముందు సముద్రంలో ద్వీపంగా "కుశస్థలి" అనే నగరాన్ని రైవతుడనే రాజు పాలించినట్లు అనేక శతాబ్దాలక్రిందట నిర్మించిన నగరం నీట మునిగిపోగా ఆయనతరువాత శ్రీకృష్ణుడు సముద్రుని వరంవల్లా ఇంద్రుని సహాయంతోనూ సముద్రగర్భంలోవున్న భూమిని ఆక్రమించి దానిపై తన "ద్వారకానగరం" నిర్మించినట్లూ తెలుస్తున్నది! ఇప్పుడు సముద్రగర్భ -- పరిశోధనలో బయటబడ్డ ద్వారకానగరాల అవశేషాలు

ఈ పురాణగాధ చారిత్రకంగా సత్యమని ఋజువుచేసినాయి! ఇది, 'కలియుగాది' లో జరిగిన భూకంపంలో మునిగిపోయిన ద్వారకా నగరంయొక్క గాధ!!!

## 'కలియుగాది'లో జరిగిన ప్రళయం--సైన్సు సాక్ష్యాలు :-

ఫ్లింట్ అనే భూగర్భ శాస్త్రజ్ఞుడు చేసిన పరిశోధనలలో అట్లాంటిక్ మహాసముద్రం అడుగునవున్న నేల అకస్మాత్తుగా కొన్నివందల అడుగులు పైకిలేచిందనీ దీనవల్ల సముద్రమట్టంలో మార్పులు గతంలో జరిగినాయనీ "ఫ్లింట్" (Flint) కనుగొన్నాడు.

## అట్లాంటిక్ మహాసముద్రంలో భూమిలేచుట :-

Flint – Glacial Geology. "Late – pleistocene Mountain Uplift occured in the Himalayan Region and in the Alps, and large – Scale rifting took place in Eastern Africa. (p 523)"

ఈ భూమి · ధృవాలలోని మార్పువల్ల సముద్రగర్భంలో ఒక పెద్ద పర్వతపంక్తివంటిది ఏర్పడిందని కనుగొనడమేగాక ఈ ప్రళయం భూకంపాలతో మొదలైందనీకూడా సైన్సుపరిశోధన సాక్ష్యాలలో ఋజువైంది!

## 'ఆల్ప్స్' -- పర్వతాలు నడచుట :-

'కలియుగం' - ప్రారంభించే (3102 -3162 B.C.)లోని 'యుగ సంధి--ప్రళయం' లో భూమ్మీద జరిగిన భయంకరమైన మార్పుల్ని సైన్సు ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్నది! భూమి ధృవాలు (Poles) గల్లంతుపడటం, భూమియొక్క పరిభ్రమణమే మారిపోడంతోపాటు భూమిపై చెలరేగిన 'భూకంపాలూ' 'అగ్నిపర్వతాలు' ప్రపంచ దేశాల

పటాన్నే (World Map) మార్చివేశాయి!!!

'ఆల్ప్స్' (Alps) పర్వతాలు అకస్మాత్తుగా ముందుకునడిచి - కొన్ని వందలమైళ్ళ పొడుగూ వేల అడుగుల మందమూ పదులమైళ్ళు ఎత్తూ, తీవ్రంగా కంపించి పర్వతాలు ముందుకి కదిలాయి!!! ఈ పర్వతపంక్తి యొక్క కదలిక - అటు ఆఫ్రికాఖండంవైపునుంచీ ప్రస్తుత యూరప్‌వైపుకు నెట్టుకువచ్చింది! ఇప్పటి స్విట్జర్లాండులోని 'ఆల్ప్స్' శిఖరాలు సుమారు వందమైళ్ళదూరంవరకూ ఎగువకు అలా తోసుకొనిపోయాయి -- ఇప్పుడు ఇటలీవుండే ప్రాంతంలో ఈ శిఖరాలు మనువుండేవనీ ప్రఖ్యాత భూగర్భశాస్త్ర పరిశోధనచేసిన ప్రొఫెసర్ డాలీ (Daly) మహాశయుడు "మన -- కదులుతున్న భుమి" (Our Mobile Earth) అన్న తన సైన్సు-పరిశోధనాగ్రంథంలో ఈక్రింది వాక్యాలలో వర్ణించాడు!

"During the building of the Alps gigantic slabs of rocks, thousands of feet thick, hundreds of miles long and tens of miles wide, were thrust and then over...."

"The Direction of the relative Over-thrusting movement was from Africa towards the main mass of Europe on the North. The visible rocks of the Northern Alps of the Switzerland have thus been shoved northward, distances of the order of 100 - miles! In essence, the **Alps used to be on the present site of the Northern Italy**"

**Prof|| Daly "Our Mobile Earth" (p. 228 –229)**

పైన చెప్పింది, ఎక్కడో ఓచోటజరిగిన ఒక స్థానిక భూకంపంగాని, పర్వతాల కదలిక కాని కాదనీ -- అది భూమి అంతటినీ కదిలించివేసిన మొత్తం భూగోళిక ప్రళయం ('యుగసంధి'లో వచ్చే ప్రళయం) వంటిదనీ తెలిపే ఈక్రింది సాక్ష్యాధారాలు చూస్తే అవి, ఎటువంటివారినైనా కళ్ళుతెరిపిస్తాయి!

ప్రఖ్యాత భూగర్భశాస్త్రజ్ఞుడు ఎఫ్.కె.మేథర్ (F.K. Mather) మహాశయుడూ ఇంకా గామో(Gamow) వ్రాసిన "భూమియొక్క జీవితచరిత్ర" ( Biography of the Earth")* అన్న సైన్సుపరిశోధనా సమీక్షాగ్రంథంలో ఈప్రళయాన్ని కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు. ఇందులో ఆల్ప్స్ పర్వతాలు నూరుమైళ్ళు ఉత్తరంగా కదిలాయనీ, "మోంటేనా" (Montana) పర్వతశిఖరం చదరపు భూమిమీదనుంచి నడిచి వేరే పర్వతచరియపై కెక్కి- దానిపైకూర్చుందనీ తెలిపాడు. అంతేకాక, ఇప్పటి "రాకీ పర్వతాలు" (Rockies) 'నేషనల్ పార్క్‌లోని' మంచుశిఖరాలూ కూడా అనేక మైళ్ళు తోసుకుపోయాయి!!! స్కాట్లెండ్‌లోని పర్వతాలు ఎక్కడికో నెట్టివేయబడ్డాయి! నార్వేలోని "పర్వతాల - పంక్తి" మొత్తం పైకినెట్టబడింది! ఇలాగ కొన్నికోట్ల టన్నుల శిలలూ పర్వత శిఖరాలూ, కొండలపైనుంచి త్రోయబడి క్రిందిలోయలలోకి చొచ్చుకొనిపోయి కొండలపైకి ఎదురు ప్రయాణం చేసేలా అంత ఉవ్వెత్తుగా కదిలాయంటే -- ఇది భూమిలోంచి ఏర్పడ్డ మామూలు 'భూకంపం' -- కాదు! భూగోళం యావత్తూ మెలికలు తిరిగిపోయిన దెబ్బ!!! భూమి యొక్క 'భ్రమణమూ'(Rotation) "పరిభ్రమణమూ"(Revolution) రెండూకూడా పూర్తిగా గల్లంతుపడితేనేగాని ఇంత గందరగోళం పర్వతాల ప్రళయం జరగటం సాధ్యంకాదు, అంటూ, ఇలాగ వ్రాశాడు.

"'The Alps were showed a hundred miles to the north chief mountain in Montana Gavelled across the plains and climbed the slope of another mountain and scrambled on top of it. All of the Glacier National park in Montana and all the Rocky Mountain area upto the Yellowhead pass in Alberta

---

* F.M. Mather - Reviewing G. Gamows "**Biography of the Earth**" in "*Science*",(Jan - 16-1942)

moved for many miles! The mountains of Western Scotland shifted from its place. The entire length of the Norwegian mountains showed a similar overthrust!

What could have caused these mountains to travel across valleys and uphill with their masses of granite weighing billions of tons? No force acting from inside the earth, pulling inward or pushing, could have created these overthrusts. Only twisting of Earth could have procuced them. It could hardly have occured, if the rotation and the revolution of our planet had never been disturbed.*

'పర్వతాలు కదిలివెళ్ళడం' అంటే అది నిశ్చయంగా ప్రళయంలో భాగమే! భూమ్మీద జరిగిన ప్రళయానికి అంతం కాదిది అసలు, ఆరంభమే!

"ఎత్తైన పర్వత శిఖరాలపైన సముద్రంలో ఈదే చేపల అస్థి పంజరాలూ, సముద్రగర్భంలో బ్రతికే శంఖములు, అల్చిప్పలు -- ఎవరెస్ట్ శిఖరంపైన ప్రవహించిన నీలిసముద్రాల జాళ్లూ, చేపలు పీతలూ ఒకనాడు సముద్రగర్భ అడుగునవుండిన "ఎవరెస్ట్" శిఖరాన్ని అనేక జలచరాలు నీటిలో పైనుంచి క్రిందకు చూసేవల్లా, -- అకస్మాత్తుగా సముద్రపు అడుగు పైకిలేచి ఇప్పటి "ఎవరెస్టు" శిఖరాలై నిలిచింది!

ఈ కథంతా కోట్ల సంవత్సరాలనాడు జరిగిందని ఊహించుకునే సైంటిస్టులంతా ఉలిక్కిపడ్డారు! -- ఇదంతా కేవలం అయిదువేల సంవత్సరాలక్రితం జరిగిన ప్రళయంలోని గల్లంతులో కొంతభాగమేనని

* "Earth in Upheaval" by I. Velikovsky. Ch.VI "Mountains and Rifts" (P.71)

తేలినప్పుడు!!! ఇప్పటి కాశ్మీరు కొన్నిచోట్ల అయిదువేల అడుగుల ఎత్తుదాకా లేచింది. -- ఇవన్నీ మానవ చారిత్రకాలంలోనే ఇటీవలే జరిగినాయని ఋజువైంది!"

"Scientists of the nineteenth century were dismayed to find that, as high as they climbed, the rocks of the massifs yielded skeletons of marine animals, fish that swim in the ocean, and shells of molluscs! This was incidence that the Himalayas had risen from below north the sea. At some time in the past, azure waters of the Ocean streamed over the Mount Everest, carrying fish, crabs, and molluscs, and marine animals looked down to where now we look up and; where man, after many unsuccessful efforts has until now succeeded only once in putting his feet. Until recently it was assumed that the Himalayas rose from the bottom of the sea to the present height, tens or perhaps hundreds of millions of years ago.*

ప్రఖ్యాత సైన్సు పరిశోధకుడు T.T. పేటర్సన్ (T.T. Paterson) హార్వర్డ్ యూనివర్సిటీలో జరిపిన పరిశోధనలో హిమాలయశిఖరాలు పైకి లేచింది మన చరిత్రకాలంలోనే అని ఋజువుచేశాడు.

"Prof. R. Daly of Harward University found that 3500 years ago, all over the world, the level of the Ocean waters suddenly dropped."

"Modern research confirms that many of the Alpine glaciers are less than 4000 years old."

---

* T.T. Paterson:- "Studies on the Ice Age in India, and Associated Human Cultures."

భూమికి తాకిన ఉల్కలను గురించి మహాభారతంలో వ్యాసుడు వర్ణిస్తూ 'ద్వాపరయుగం' అంతమై కలియుగం ప్రారంభం కానున్న 'యుగసంధి' లో భూమ్మీద ఉల్కలు మహాభయంకరంగా వచ్చి పడ్డాయని భీష్మపర్వంలోని ఈక్రింది శ్లోకంలో తెలిపాడు!

"ఉల్కాపాతాశ్చ బహవో మహాభయ నిదర్శకాః"
--భీష్మపర్వం.

అమెరికాలోని "ఆరిజోనా"(Arizona) రాష్ట్రంలో ఈ 'ఉల్క', (Meteorite) పడిన గండి దాదాపు 415 మైళ్ళ వ్యాసంతో నేటికీ కనిపిస్తున్నదాన్ని గురించి పరిశోధించి వెలికోవ్‌స్కీ అంటాడు :

"భూగర్భశాస్త్ర పరిశోధనలలో ప్రచురించబడిన పరిశోధకుల అభిప్రాయం ప్రకారం ఈ ఉల్క 4000 సంవత్సరాల క్రితం పడివుంటుంది." -- అని.

"According to the published openion of Geological Authorities the asteriod must have fallen about –4000 years ago."

–**"The Earth in Upheaval"** by I. Velikovsky. (p. 239)

'రష్యన్ పరిశోధన':– రష్యన్ పరిశోధకుడు, విద్వాంసుడు అయిన ఇమ్మాన్యువల్ వెలికోవ్‌స్కీ(I. Velikovsky) 30 సంవత్సరాలుగా ప్రపంచంలో అనేక మతగ్రంథాలపై చేసిన పరిశోధనాఫలితంగా -- ఈ భూమిమీద సుమారు 3000 B.C ప్రాంతంలో బయట గ్రహాలు భూమిని ఢీకొనేంత దగ్గరగా వచ్చినందువల్ల, పెద్ద ఎత్తున భూకంపాలూ 'జలప్రళయాలూ' జరిగినాయని ఋజువుచేసే అనేక సైన్సు ఆధారాలను కనుగొన్నాడు. ఇందులో అన్నిటికంటే ముఖ్యమైంది భూమియొక్క అయస్కాంతశక్తి, ఉత్తరధృవం దక్షిణానికీ -- దక్షిణధృవం ఉత్తరానికీ మారటం అకస్మాత్తుగా జరిగిందనీ దీనివల్ల ఈప్రళయం జరిగిందనీ, తెలిపే ఇంకా అనేక సైన్సు

ఆధారాలనుకూడా 'వెలికోవ్‌స్కీ' 'భూమిపై ప్రళయాలు' (The Earth in UpheavMl) అన్న తన గ్రంథంలో కళ్ళకు కట్టినట్లు వర్ణించాడు.

ఇప్పటికి, అయిదువేల సంవత్సరాలక్రితం మన భూమ్మీద జరిగిన ఈ గల్లంతు -- పర్వతాలనూ, సముద్రాలనూ కుదిపివేసిన పై ప్రళయం, క్రీస్తుకు పూర్వం 3000 సంవత్సరాల ప్రాంతంలో జరిగిందని ఋజువుచేసే సైన్సుపరిశోధనా గ్రంథాలను దాదాపు 250 కిపైన ఒకచోట సంగ్రహంగా సమీక్షచేసిన రష్యన్‌పరిశోధకుడు వెలికోవ్స్కీ వ్రాసిన "సంక్షోభంలో భూగోళం" (Earth in Upheaval) చదువుతుంటే ఒకగొప్ప డిటెక్టివ్ నవలకు మించిన సస్పెన్సూ -- ఉలిక్కిపాటూ కలిగించే భయంకర సత్యమనీ ఏమాత్రం బుద్ధిచైతన్యంవున్న మేధావికైనా అనిపించక మానదు! అయితే ఇలాంటి గ్రంథాలు ఎంతమంది మన తెలుగువారు చదువుతున్నారు? అలాంటివారి మనస్సులో ఒక చిన్న "భూకంపం" లాంటిది కలిగిస్తుందనే ఈ అధ్యాయంలో ఆధునికసైన్సు పరిశోధనల సారాన్ని, అతి సంగ్రహంగానైనా మీ ముందుంచాను! అందులో కొన్ని దిఙ్మాత్రంగా సూచించి వదిలివేశాను.

## కలియుగారంభం ముందు భారతయుద్ధం :-

మహాభారతంలో 'ద్వాపరయుగం' అంతమై 'కలియుగం' ఆరంభించిన 'యుగసంధి' నాటి ప్రళయం సైన్సుదృష్ట్యా, అనేక పరిశోధనలవల్లా ఋజువౌతున్నది! ఇలాంటి ప్రళయంయొక్క ఒక అతిచిన్న జ్ఞాపికయే మానవజాతి గుర్తుంచుకునే స్మృతిచిహ్నంగా ఈనాటికీ సముద్రగర్భంలో మునిగిపోయిన ద్వారకానగరం రూపంలో నిదర్శనంగా మనకీనాటికీ కనబడుతోంది!

మన భారతదేశ చరిత్రయొక్క వీరగాథయే "మహాభారతం". ఈభారతయుద్ధం జరిగిన అనతికాలం తరువాతనే శ్రీకృష్ణుడూ, పాండవవీరులూ చరిత్రనుంచి సెలవుతీసుకొని తెరవెనుకకు వెళ్ళిపో

యిన ఈమైలురాయివంటి సంఘటన జరిగినప్పటినుంచీ, మనదేశపు సాంఘిక, రాజకీయ జీవితంలో ఒక 'నూతన శకం' ప్రారంభమైంది! దీనినే మన సామాన్యుల పరిభాషలో చెప్పాలంటే 'ఆధునిక--యుగం' అనవచ్చు! ఇదే నేటి చారిత్రక కాలానికి -- ప్రారంభ బిందువు!

ఈ ఆధునిక చారిత్రకయుగాన్నే పూర్వీకులు "కలియుగారంభం" అన్న పేరుతో పిలిచారు! ఈ కలియుగారంభంనుంచే ఈనాటి భారతదేశచరిత్ర అంతా నేటివరకూ పంచాంగాలలోకూడా లెక్కించబడుతున్నది! అనేక త్రవ్వకాలలో దొరికిన శాసనాలూ, దానపత్రాలూ, ప్రాచీనరచనలూ, అనేక రాజుల వంశవృక్షాలూ -- అన్నీకూడా ఈ 'కలియుగారంభం' అనే మైలురాయినుంచే లెక్కించబడుతున్నాయి! ఇదే మహాభారత యుద్ధకాలానికి వున్న చారిత్రక ప్రాముఖ్యత!

మన ఆధ్యాత్మిక, సాంఘిక చరిత్రలో మొదటిమెట్టు వేదవిభాగం కనుకనే ప్రతిహిందువుడూ దీన్ని గుర్తించి నిత్యం మననం చేసుకోవాలనే ప్రతీ వేదపండితుడూ, బ్రాహ్మణుడూ నిత్యం తాను నిర్వహించే 'సంధ్యావందనం' లోని 'మహాసంకల్పం' కలియుగారంభంనుంచీ ఈనాటివరకూ గడచిన సంవత్సరాన్నీ, మాసం, తిథి, వార నక్షత్రాలను చెప్పుకొనడం -- ఈనాటికీ ఇలా వాటిని గుర్తించటంలోగల అంతరార్థం ఇదే! ఇంతేగాక, ప్రతీపండుగ, శుభకార్యమూ అంటే బారసాలనుంచీ సాంవత్సరీక శ్రాద్ధంవరకూ జరిగే అనేక హిందూ ధర్మశాస్త్ర కర్మకాండలలోకూడా ఈ 'సంకల్పం' లేకుండా ఏపనీ జరగదు! "కలియుగే ప్రథమపాదే" -- అనకుండా ఏ సంకల్పం నడవదు!

ఈ అతిముఖ్యమైన 'భారతజాతి ఆత్మకథ' (Autobiography of India)వంటి దేశచరిత్రలో బ్రిటీషు చరిత్రకారులూ, ఇతర విదేశీయులు తమకున్న బైబిలు దురభిమానంతో, మతపరమైన పాక్షిక దృష్టి(Religious Partiality)తో కేవలం అంచనాల మీదా, ఊహాగానాల మీద ఆధాపడి చేసిన చారిత్రక కాలనిర్ణయాలను సైన్సు సాక్ష్యాధారాల

[Scientific evidence] ఆధారంగా జల్లెడపట్టి నిజాన్ని వడపోసి -- రానున్న మనజాతి బాలబాలికులకు సరైన చరిత్రను అందించటం అవసరం మాత్రమే కాదు -- మన తరంవారి కర్తవ్యం కూడా! ఈ పనికి సంస్కృతభాషతో పరిచయం వుండటం ఒక్కటే సరిపోదు! ఆధునిక సైన్సు అయిన ఖగోళశాస్త్రం (Astronomy) తోపాటు అనేక ముఖ్యఘట్టాలనూ, కథా గమనంలోని మైలురాళ్లవంటి సంఘటనలనూ ఏరుకొని వాటినన్నింటినీ కలిసి సమన్వయం చేయాలి!

మహాభారతంలోని గ్రహస్థితుల వర్ణన అకస్మాత్తుగా 'భీష్మ-పర్వం' వంటి యుద్ధపర్వాలలోనే కనిపిస్తోందికాబట్టి -- ఆనాటికి భారతీయులకు ఇంకా జ్యోతిషాన్ని గ్రీకుదొరలనుంచి ఎరువు తెచ్చుకునేకాలం ఆసన్నం కాలేదు. కాబట్టి -- ఈ ఒక్క యుద్ధపర్వాలలో మాత్రమే కనిపించే "భారతయుద్ధకాల గ్రహస్థితులు ఇతరులెవరో తరువాత కల్పించివ్రాసిన ప్రక్షిప్తాలనీ, ఈనాటి విదేశీమానస పుత్రులైన మన చరిత్రకారులు వ్రాసిన -- తప్పుడువాదాన్ని విస్తృతంగా బయటపెట్టాల్సి వచ్చింది!

ఆదిపర్వంలోని శ్లోకాల సాక్ష్యాధారంతో చూస్తే, మహాభారత యుద్ధం ద్వాపరయుగం అంతమై కలియుగం ప్రారంభమయ్యే మధ్య కాలంలో యుగసంధిలో జరిగిందని ఒక స్థూలమైన మైలురాయివంటి సాక్ష్యాధారం మనకు లభిస్తున్నది! ఇక రెండవమెట్టు -- భీమ దుర్యోధనుల గదాయుద్ధంనాటికి కలియుగం ఇంకా ప్రారంభించలేదనీ -- "అనతికాలంలోనే ఆరంభించబోతున్న కలియుగం" -- అన్న శ్రీకృష్ణునిమాటలవల్ల అప్పటికి ఇంకా కలియుగం ఆనాటికి, ప్రారంభం కాలేదని తెలుస్తున్నది!

యుద్ధం పరిపూర్తి అయింతర్వాత పుత్రశోకంతో గాంధారి శ్రీకృష్ణునికి ఇచ్చిన శాపంవల్ల భారతయుద్ధం జరిగిన 36- సంవత్సరాల తర్వాత కృష్ణనిర్యాణం జరిగిందన్న ఒక కాలవివరం లభిస్తున్నది! ఆ

తరువాతదైన మౌసలపర్వంలో యాదవుల వినాశనాన్ని సూచించే అసాధారణ గ్రహస్థితులను గమనించిన శ్రీకృష్ణుడు బలరామునితో భారతయుద్ధం జరిగి, 36 వ సంవత్సరం ఆసన్నమైనదనీ, ఈసారి కనిపించే గ్రహగతులనూ, దుర్నిమిత్తాలనూబట్టి చూడగా త్వరలోనే తమ (యాదవుల) వినాశమూ, తమ ఇద్దరి నిర్యాణ కాలమూ కూడా ఆసన్నమైందని చెప్పిన మాటలనుబట్టి గాంధారీశాప శ్లోకం ప్రక్షిప్తం కాదని నిర్ధారణ ఔతున్నది. దీనివల్ల భారతయుద్ధం జరిగిన 36 -- సంవత్సరాలకు కృష్ణనిర్యాణం జరిగిందన్న విషయం ధృవపడుతున్నది!

శ్రీమద్భాగవతంలోని 12 వ స్కందంలోనూ, విష్ణుపురాణం మహాభారతంలో అనేకచోట్ల లభించే పాండవుల జీవితఘట్టాలను వర్ణించే కాలవివరాలను కూడికచేయగా శ్రీకృష్ణుడు 125 -- సంవత్సరాల 7 -- మాసాలు పైచిలుకు కాలం జీవించాడని నిర్ధారణ అవుతున్నది! అంతేగాక శ్రీకృష్ణుడు మరణించిన రోజునే కలియుగం ఆరంభమయిందనీ అన్నిపురాణాలూ ఏకకంఠంతో చెప్పడంవల్ల మహాభారతయుద్ధం జరిగిన 36- సంవత్సరాలకు కలియుగప్రారంభం జరిగిందని తెలుస్తున్నది!

ఖగోళ గణితం ఆధారంగా శ్రీకృష్ణనిర్యాణ కాలానికి ఏర్పడిన గ్రహస్థితులను పరిశీలించగా ప్రమాధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారం అర్ధరాత్రి సుమారు 2 గంటల 30 నిముషాలకాలంలో కలియుగం ఆరంభబిందువు ఏర్పడుతున్నదని విదేశీ సైంటిస్టులైన బెయిలీ(Baily) లాకైలీ(La-Caille) వంటివారి లెక్కలు నిర్ధారణ చేస్తున్నాయి!

## ఇతర సాక్ష్యాధారాలు:

మహాభారతకాలం ఒక్క గ్రహగణితంమీదే ఆధారపడి నిర్ణయం చేయడం అంతక్షేమకరం కాకపోవచ్చునన్న ప్రత్యేక జాగ్రత్తకోసం

ఇతర సాక్ష్యాధారాలనుకూడా సరిపోల్చి విశ్లేషణ చేయవలసివచ్చింది. ఇందులో సప్తర్షుల చలనం ఆధారంగా చేయబడిన గణితంప్రకారం లెక్కించి వేరువేరు రాజుల కాలాలకు సప్తర్షులు ఏయే రాసుల్లో వున్నారో, ఏనక్షత్రాలలో సంచారంచేస్తున్నారో అధ్యాయం చివర చూపడింది!

## సప్తర్షి - చలనం:-

సప్తర్షులు ధర్మరాజు పరిపాలనలో మఖానక్షత్రంలో వున్నట్లు మహా భారతంలోనూ ఇతరపురాణాలలోనూ అనేకసార్లు వర్ణించబడింది! తరువాత ఖగోళ గణిత, శాస్త్రజ్ఞులైన వరాహమిహిరాచార్యుడు, ఆర్యభట్టుల జ్యోతిష్యగ్రంధాలలోని 'కాలనిర్ణయం' తో ఇంతకుపూర్వం మనకు లభించిన మహాభారతకాలం తాలూకు తేది, 18 - 2 - 3102 B.C. న ఆరంభించిన కలియుగ ప్రారంభానికి 36 - సంవత్సరాలకు పూర్వం అనగా సెప్టెంబరు 3138 B.C. లో జరిగిందని శాస్త్రీయ గణితం ఆధారంగా ధృవపడింది!

## ఆర్యభట్టు ఖగోళ పరిశోధన :-

ఆర్యభట్టు ప్రాచీన జ్యోతిష్కులలో ఖచ్చితమైన శాస్త్రీయదృక్పథం గలవాడు. ఆయన కలియుగం ఎప్పుడు ప్రారంభమైంది అన్న అంశంపై "ఆర్యభట్టీయం" లోని కొన్ని అంశాలు మనకు సాక్ష్యాధారాలుయిచ్చాడు. అవి పరిశీలిద్దాం!

తన గ్రంథం "ఆర్యభట్టీయం" ను తన 23వ ఏట కలియుగం ప్రారంభించి 3,600 సంవత్సరములు పూర్తి అయ్యాయని చెబుతూ ఆనాటి తనకాలానికి కలియుగప్రారంభంనుంచీ వున్న గ్రహస్థితుల్ని ఈయన వర్ణించాడు. దీన్నిబట్టి ఆర్యభట్టు ఇచ్చిన కాలానికి వున్న గ్రహస్థితిని గుణిస్తే ఈక్రింది ఆసక్తికరమైన విశేషాలు తెలుస్తున్నాయి.

తనకాలంలో అంటే ఆదివారం 21, మార్చి 499 A.D. కి సరిగ్గా కలికాలంలో ప్రారంభంనుంచీ 3,600 సంవత్సరాలు పూర్తి అయ్యాయని ఈక్రింది శ్లోకంలో తెలిపాడు.

"షష్ట్యబ్దానాం, షష్టిర్యద వ్యతీతా కలేశ్చ యుగపాదాః
త్రి అధిక విశంతి రబ్దా స్తద్దేహామమ జన్మనో అతీతా...."
-- ఆర్యభట్టీయం (111...10)

అంటే కలియుగం 3,600 సంవత్సరానికి అయనాంశలు శూన్యంగా వున్నాయనీ తెలుపుతున్నరోజుకి ఈక్రింది గ్రహస్థితి ఇచ్చాడు.

శూన్యఅయనాంశ తేదీ -- 499 A.D.

| ఆర్యభట్టునాటికి కలి-3600సం\|\|లకువున్న గ్రహస్థితి | | |
|---|---|---|
| రవి | 0°-0′-0″ | మేషం |
| చంద్రుడు | 280°-48′ | మకరం |
| కుజుడు | 7°-12′ | మేషం |
| బుధుడు | 186°-0′-0″ | తుల |
| గురువు | 187°-12″ | తుల |
| శుక్రుడు | 356°-24″ | మీనం |
| శని | 49°-12′ | వృషభం |

పై గ్రహస్థితి ఏర్పడిన నాటికి మార్చి 21, ఆదివారం 499 A.D సంవత్సరానికి 3,600 సంవత్సరములు కలియుగంలో పూర్తయినాయని తెలిపాడు. సరిగ్గా ఆరోజుకి కలియుగప్రారంభంనుంచీ జరిగిన రోజులు లెక్కపెట్టి అవి వివరించాడు.

అలానే ఆర్యభట్టు వ్రాసిన జ్యోతిషగ్రంథమైన "ఆర్యభట్టీయం" కు వ్యాఖ్యవ్రాసిన 'సూర్యదేవుడు' తనకాలమైన శకకాలం 1113 తో సమానమైన మాఘబహుళ తదియా, సోమవారంనాటికి కలియుగ ప్రాగంభంనుంచీ, 15, 68, 004 రోజులు గడిచాయని

తెలియజేశాడు. అంటే 1191 A.D ఫిబ్రవరినాటికి కలియుగం ప్రారంభించి "పదిహేనులక్షల అరవైఎనిమిదివేల నాలుగురోజులు" - గడిచాయన్నమాట. ఈ జ్యోతిషం ఆధారంగా గ్రహస్థితులనుబట్టి లెక్కవేయగా కలియుగం 18, ఫిబ్రవరి 3102 B.Cకి సరిపోతున్నది. ఇలానే ఆర్యభట్టీయానికి వ్యాఖ్యవ్రాసిన "ఎల్లాయాచార్యుడు" గోవిందస్వామి వ్రాసిన వ్యాఖ్యానం, భాస్కరాచార్యుల 'మహాభాస్కరీయం' పైన చేసిన వ్యాఖ్యానంలో ఇవ్వబడిన కాలమూకూడా దీనితో సరిగ్గా సరిపోతున్నది.

ఇంతేగాక ఈసూర్యదేవుడు గొప్పజ్యోతిష్కుడు, ఖగోళవేత్త అని తెలుస్తున్నది. ఇతడు 'ఆర్యభట్టీయం' పై వ్యాఖ్యానం వ్రాయడమేగాక వరాహమిహిరాచార్యుల "మహాగ్రంధీయము" పైన వ్యాఖ్యానం, మంజులాచార్యులు వ్రాసిన 'లఘుమానస' గ్రంథంపై అలానే నృశింహపతి వ్రాసిన 'జాతకపద్ధతి'పై వ్యాఖ్యానం, భాస్కరాచార్యుల మహాభాస్కరీయం పైన గోవిందాచార్యులుకు వివరణ వ్రాసినట్లు కూడా తెలుస్తున్నది.

ఈతడు తిరుచునాపల్లి జిల్లా, తంజావూరుకు దగ్గరగావున్న 'గంగయ్యకొండ చోళపురం' అనే గ్రామానికి చెందిన వాడనీ, విధృవగోత్ర బ్రాహ్మణుడనీ చారిత్రకంగా ఋజువు అవుతున్నది. దీన్ని బట్టి ఖగోళ శాస్త్రంలో నిష్ణాతులైన జ్యోతిష్కుల శాస్త్రాధారంవల్ల కూడా కలియుగారంభంమహాభారతంలో వర్ణించిన గ్రస్థితులలో వెనుక అధ్యాయాల్లో గుణించిన కలియుగ ప్రారంభశకం లెక్క సరిగ్గా రోజులతోసహా సరిపోతున్నది.

## మహాభారతకాలం -- వ్యాసుని కాలనిర్ణయం :-

శ్రీకృష్ణుడు వ్యాసుని సమకాలికుడని తెలుస్తున్నది!

## శ్రీకృష్ణనిర్యాణం -- కలియుగప్రారంభం :-

మౌసలపర్వం, స్త్రీపర్వంలో గాంధారి ఇచ్చిన శాపం -- ఈ

దినివల్ల మనకి, పాండవులు చారిత్రక వ్యక్తులని నిరూపించు రెండుసందర్భాలలో యివ్వబడిన ఈ క్రింది శ్లోకాల ఆధారంగా భారతయుద్ధం ముగిసిన 36 - వ సంవత్సరములో శ్రీకృష్ణనిర్యాణం జరిగిందని రూఢి అవుతున్నది.

"షట్త్రింశే త్వథఅతో వర్షే వృష్ణీనామనయో మహాన్
అన్యోన్యం ముసలైస్తైస్తు, నిజఘ్నుః కాలచోదితాః"

మౌసల (2-12)

గాంధారిశాపం:-

"యస్మాత్ పరస్పర్ ఘ్నంతో జ్ఞాతయః కురుపాండవాః
ఉపేక్షితాస్తే గోవింద తున్మాత్ జ్ఞాతీన్ వధిష్యసి
త్వమప్యవస్థితే వర్షే షట్త్రింశే మధుసూదన
........నిధనం సమవాహ్యసి"

--స్త్రీ పర్వం(43-43)

"షట్త్రింశే త్వథ సంప్రాప్తే వర్షే కౌరవనందన
దదర్శ విపరీతాని నిమిత్తాని యుధిష్ఠిరా"

--మౌసల(2-2)

పైశ్లోకాల ఆధారంగా భారతయుద్ధం పరిసమాప్తి సమయంలో గాంధారి శ్రీకృష్ణుని వినాశాన్ని 36 - వ సంవత్సరంలో జరుగగలదని శపించిందని తెలిపే స్త్రీపర్వంలోనే ప్రమాణశ్లోకము, ఆ తరువాత మౌసలపర్వంలో యాదవులకు భారతయుద్ధానంతరం, 36 - వ సంవత్సరం రాగానే -- దుర్నిమిత్తాలు కనిపించినవని ఆశ్లోకం తెలుపుతున్నది! అలానే ధర్మరాజుకు కూడా విపరీత దుర్నిమిత్తాలు యుద్ధం ముగిసిన తరువాత 36 - వ సంవత్సరంలో గోచరించాయని తెలిపే శ్లోకమూ, పై మూడు శ్లోకాలవల్లా ఏకవాక్యతగా శ్రీకృష్ణుని

నిర్యాణం మహాభారతయుద్ధం ముగిసిన 36 - వ సం
జరిగిందని తెలుసున్నది!

అయితే పై శ్లోకాలలో చెప్పబడిన 36 - వ సంవత్సరం ఎక్కడనుండి లెఖ్ఖ పెట్టాలి? అన్న ప్రశ్న ఉదయిస్తుంది! ఇది గ్రహం నడతలను గణితం చేయడం ఎలాగో, జ్యోతిశాస్త్ర సిద్ధాంతపరమైన (Astronomical Science) సైన్సు క్రమశిక్షణ తెలిసినవారికి కష్టంకాదు. కాని మనచరిత్ర పరిశోధకులు, సంస్కృత సాహిత్యపరిశోధకులు ఎక్కువభాగం ఇలాంటి పరిజ్ఞానం లేనివారే! వీళ్ళకు కేవలం సంవత్సరాలను లెక్కించుకోవటం - అనగా కూడికలు, తీసివేతలూ తప్ప అంతకంటే ఇంక ఏమీ రానివారికి -- తెలియాలంటే ఏమిటి దారి? ఎన్ని సంవత్సరాల క్రితం శ్రీకృష్ణనిర్యాణం జరిగిందయ్యా? అంటే--

భాగవతంలో చివరిదైన "ద్వాదశస్కందములో" శ్రీశుకయోగీంద్రుడు పరీక్షిత్తుకు జరగబోయే భవిష్యత్తు, రాగల రాజులు, వారిపరిపాలనా కాలము వివరాలతోసహా స్పష్టంగా వర్ణించాడు! అంతేకాదు, రాజులపేర్లు, వారి పరిపాలనా కాలాన్నీ సంవత్సరాలతో సహా ఇచ్చాడు.

కలియుగప్రారంభం శ్రీకృష్ణనిర్యాణంతో జరిగింది గనుక, శ్రీకృష్ణుడు, మహమ్మద్‌ఘోరీ మనదేశాన్ని దండయాత్ర చేసిన 1193 A.D. నుంచి 42 95 సంవత్సరాల వెనుక అనగా 3102 B.Cలో నిర్యాణం చెందాడనీ, ఆరోజే కలియుగం ప్రారంభకాలమనీ తెలుస్తున్నది. ఇది ఎవరికైనా తెలిసే మొద్దు లెక్కలలో జరిగే కూడికలూ, తీసివేతల వ్యవహారం!

## కలియుగప్రారంభంనాటి -- గ్రహస్థితులు :-

శ్రీమద్భాగవతం "సరిగ్గా ఏరోజైతే శ్రీకృష్ణనిర్యాణం జరిగిందో ఆరోజే కలియుగం ప్రారంభమైందనీ" చెప్పడంవల్ల, కృష్ణనిర్యాణం ప్రమాధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమికి సరియైన 18-2-3102

B.C.నాడు జరిగిందని అదేరోజు కలియుగం కూడా ఆరంభమైనట్లు తెలుస్తున్నది!

ఆ లెక్క ఇప్పటి కాలెండర్ లెక్కలతో సరిపోతున్నది. కలియుగ ప్రారంభానికి అన్నిగ్రహాలు మేషరాశిలో ప్రారంభస్థానంలో చేరి వున్నాయని శ్రీధరవ్యాఖ్యలో, భారత, భాగవతపురాణాలలో కలియుగ ప్రారంభగణితం గురించి చెప్పినపుడు పేర్కొన్నారు. అందులో వ్యాఖ్యానకారుడు-

"సర్వగ్రహయోగే హి యుగం"

అని పేర్కొన్నాడు. అనగా సూర్యచంద్రు, కుజ,, బుధ, శుక్ర, గురు, శనులు ఏకరాశిగతం అయినపుడే యుగం ప్రారంభిస్తుందని తెలుస్తున్నది! ఖగోళగణితం ఆధారంగా వెనక్కి లెక్కవేస్తే కలియుగప్రారంభానికి ఏర్పడే గ్రహస్థితి -- ఇలా అన్ని గ్రహాలూ మేషరాశిలో చేరటంవల్ల ఏర్పడుతున్నదా? అన్న ప్రశ్న ఉదయించవచ్చు! దీనికి విదేశీ ఖగోళశాస్త్రజ్ఞులైన లాకైలీ, మైయర్, బెంట్లీ, విలియంబైలీ, అనే ఆధునిక సైన్సుపరిశోధకులు గణితంచేశారు.!

## కలియుగారంభము :-

18-2-3102 B.C.న 2గంటల 27ని||ల 30 సెకన్లకు అర్ధరాత్రి (ఉజ్జయినీ కాలమానంప్రకారం)

## కలియుగ ప్రారంభం దినం ఆటైముకున్నగ్రహస్థితి: -

| వరుస సం | గ్రహము | గ్రహస్ఫుటము (సిద్ధాత శిరోమణి ప్రకారం) | గ్రహస్ఫుటము (ఆర్యసిద్ధాంతం ప్రకారం) | గ్రహస్ఫుటము (పరాశర సిద్ధాంతం ప్రకారం) |
|---|---|---|---|---|
| 1. | సూర్యుడు | 0° 0′ 0″ (మేషం ప్రథమబిందువు) | 0 ° 0′ 0″ | 0° 0′ 0″ |
| 2. | చంద్రుడు | 0° 0′ 0″ | 0° 0′ 0″ | 0° 0′ 48″ |
| 3. | కుజుడు | 29° 3′ 50″ (మీనరాశి చివర బిందువు) | 0 ° 0′ 0″ | 29° 14′ 28″ |

| | | | | |
|---|---|---|---|---|
| 4. | బృహస్పతి (గురుడు) | 29° 27′ 36″ | 27° 7′ 120″ | 27° 2′ 53 |
| 5. | శని | 27° 46′ 34″ | 0 ° 0′ 0″ | 28° 57′ 22″ (మీనరాశి చివర) |
| 6. | బుధుడు | 27° 24′ 29″ | 21 ° 26′ 36″ | 21° 17′ 17″ |
| 7. | శుక్రుడు | 28° 42′ 14 0″ | 27° 7′ 12″ | 26° 58′ 34″ |

పైగ్రహస్ఫుటములో గ్రహాలన్నీ మేషప్రారంభ బిందువునందు సరాసరి గమనం ప్రకారం 2 రోజుల 6 గంటల 28 నిమిషాల 39 సెకనకు సరిగ్గా గణితం చేయబడింది!

దీనినిబట్టి చూడగా వ్యాసమహర్షి చారిత్రకమైన వ్యక్తి అని ఆయన క్రీస్తుపూర్వ 32 శతాబ్దాలకు పూర్వంవాడని తేలుతున్నది! అంతేగాక ఈయన శ్రీకృష్ణునికి సమకాలికుడని అంటే శ్రీకృష్ణ నిర్యాణం అయిన తరువాత కూడా జీవించివున్నాడని -- శ్రీకృష్ణుని జననం 19- జూలై, 3228 B.C.నాడు జరిగిందని, అంతకుపూర్వమే వ్యాసమహర్షి జననం జరిగివుండాలని గ్రహించవచ్చు! అయితే వ్యాసమహర్షి కనీసం 200సంవత్సరములకు పైబడ్డ వయస్సు కలవాడనీ, పై లెక్కలను బట్టి తేలుతుంది కదా -- ఇది నమ్మకమైన విషయమేనా? అని సందేహం ఈనాటి అర్థాయుష్కులైన మనలో చాలామందికి కలగడం సహజమే! కొద్దిగా కొన్ని శతాబ్దాల వెనక్కి వెళ్ళితే 200 ఏళ్ళు పైన జీవించినవాళ్ళు కోకొల్లలు! ఇంకా మీకు నమ్మకం కలగాలంటే ఇటీవల రష్యాలో జనాభాలెక్కలలో ఇప్పటికీ 195 ఏళ్ళు పైనవాళ్లు 200 ఏళ్ళవారు ఏంతమందివున్నారో తెలిపే ఆశ్చర్యకరమైన సాక్ష్యం మీముందుంచుతాను!

ఇండియన్ ఎక్స్‌ప్రెస్(Indian Express) ప్రఖ్యాతమైన దినపత్రిక! దీంట్లోని వార్తలు మీరందరూ నమ్ముతారు! ఈ సంచికలోని సంపాదకీయం 21-12-1980న వ్రాసిన ఈక్రింది వాక్యాలు మనకు

కళ్ళు తెరిపించాలి!

సంపాదకీయంలో వాక్యాలు ఈక్రింద చూపిస్తున్నాను!

According to one Report, Published in these columns as for back as 1968, there were then between 3000,000 and 4000,00 people in the world who were centanarians, and about 1000,000 of these were infact in India. The report states that a man called Seyyed, Abou, Taleb Mousani "who lives in the far forest of Marodasht, Iran was then said to be 195 years old. He was also stated during the long course of his life to have married 26 women! Given his age, this is believable, except that his youngset wife is said to be 107 years old! If Mr. Mousani is still alive he will be 207 years old! and his wife would be 119!! Good Luck and may happy returns, to then both! Not everyone is like Hasanbin Penghuler Yusuff, who according to the peng star in January 1972 had begotten his first child at the age of 137! This way according to his identity Card."

–"Methuselah and Others" from
Tho Editorial, standard
(Indian Express 21-12-1980)



7

# వ్యాసుని జ్ఞానసముద్రం -- I

పౌర్ణమి వచ్చినప్పుడల్లా సముద్రం పాలవంటి తెల్లటి నురగతో పొంగి పొర్లిపోతుంది! అలానే ఒక మహానుభావుని జననంతో జ్ఞానం అనే వారిధి పొంగుతుంది. పొంగి తన తెల్లసి విజ్ఞానపు అలలతో జ్ఞానతరంగాల్ని ఎత్తివచ్చి, ఈ విశాలవిశ్వమంతా నింపేస్తుంది.

చంద్రుడు సముద్రాన్ని సృష్టించడు! దాన్ని పొంగిస్తాడు అంతే! అలాగే వ్యాసుడుకూడా వేదాన్ని సృష్టించలేదు. అందులోని విజ్ఞానసాగరాన్ని జగత్తంతా పొంగించాడు అంతే! సరిగ్గా అలానే జరిగింది. ప్రపంచంలో వ్యాసమహర్షి అవతరించటంతో! అపారమైన జ్ఞాన సముద్రం, ఎన్నో యుగయుగాలనాటి విజ్ఞానం ఒక్కసారిగా వ్యాపితం చేయబడింది. వేదాలలోనూ ఉపనిషత్తులలో పురాణాలలో నిండిన విజ్ఞానమంతా సముద్రంలా, పాలకడలిలా పొంగి విశ్వమంతా

వ్యాపించింది చంద్రోదయంలో లాగే!

అయితే పొంగిన ఈ "జ్ఞానసముద్రం" ఏమిటి? అంటే వ్యాసుని అవతారంతో ప్రపంచమంతా పొంగిన వేదవిజ్ఞానం ఏమిటి? అన్న అనేక ప్రశ్నలుకూడా ఉదయిస్తాయి సహజంగానే. ఆజ్ఞానసముద్రం ఎటువంటిదో దానిలో ఎన్నిశాస్త్రాలూ సైన్సులూ ఇమిడివున్నాయో, అన్నిటినీ వ్యాసమహర్షి మనకోసం ఎలాగ పరిరక్షించి ఇచ్చాడో అదంతా యిక్కడే తెలుసుకుందాం! ఇందులో మొదటిది 'వేదవిజ్ఞానం. ఈ వేదవిజ్ఞానం అంటే ఏమిటో ఈ యువతరంవారికి దాదాపు ఏమీ తెలియదు! అదేమిటో ముందు చూద్దాం!

## వేదంకంటె ప్రాచీనం :

మనలో చాలామంది వేదం అన్ని శాస్త్రాలకూ అన్ని ఇతిహాసాలకూ మొదటిదని, అనుకుంటారు. ఇది నిజంకాదు! ఇలాఅంటే ఆశ్చర్యంగా వుంటుందికదూ! అవును. దీనికో కారణం వున్నది. ఇప్పుడు 'మనం చదువుకునేవాటిలోకల్లా ప్రాచీనమైనవి నాలుగు వేదాలుగదా! నిజమే! కాని ఇవి నాలుగూ వేదవ్యాస మహర్షి వేదాలను విభజించియిచ్చిన కాలంనాటివే! అంతకంటే ముందునుంచీ ప్రపంచంలో ఈ కనపడే, సృష్టి -- జరిగిన కాలంకంటే పురాతనమైన ఒక ప్రాచీనమైన - విశ్వచరిత్ర(Universal History) వుండేది, అని వేదాలను విభాగించిన వ్యాసమహర్షియే ఒప్పుకున్నాడు "మత్స్యపురాణం" లో!

## యుగాల - గతచరిత్ర :-

ఈ "విశ్వచరిత్ర" అంటే, కేవలం ఈనాడు 'హిష్టరీ' (History) గా మనం చదువుకునే కొద్దిపాటికాలం - రెండువేలో, నాలుగువేలో-- సంవత్సరాల రాజుల అవినీతికథల లిష్టుగాదు. "చరిత్ర" అంటే, మానవజాతి ప్రాచీన చరిత్ర "మనువు" ఎలాగ మానవజాతి

అంతా గడచిన ప్రళయంలో మునిగి పోయి, నశించిన సమయంలో సర్వవిజ్ఞానాన్ని నశించకుండా దాచి, తిరిగి ఈక్రొత్త మానవజాతి వచ్చింతర్వాత దాన్ని అందరికీ యిచ్చి దేన్ని చదివిస్తాడో -- ఆచరిత్ర అన్నమాట!

ఇది పురాతనం అయినదీ, వేదకంటే ప్రాచీనమైందీ అని, దీన్నిగురించి వ్యాసుడెందుకు వ్రాశాడో ఇప్పుడర్థమౌతుంది. ఇది పురాతనం అయినది కనుక "పురాణం" అనిపేరు! ఈరోజు మనం చదువుకునే అష్టాదశ (పద్దెనిమిది) పురాణాలూ, దేనిలోంచి పుట్టాయో; వ్యాసుని తండ్రి అయిన పరాశరుడు ఆదివిష్ణుపురాణాన్ని దేన్ని అనుసరించి వ్రాశాడో అంతకన్న ముందుగా ప్రతి "ద్వాపరయుగం" లోనూ గతించిన వ్యాసులు (వీరు 27 --మంది) ఏ "ఆదిపురాణం" ను ఆధారంగా 'విశ్వచరిత్ర' ను, తయారుచేశారో అది వేదంకన్న ప్రాచీనం! ఇదే, వ్యాసుని జ్ఞాన సముద్రం, అంటే!

అందుకే అన్నాను, వ్యాసుడు జ్ఞానసముద్రాన్ని పొంగించాడని, చంద్రునిలాగ! సృష్టించలేదు - అదే "ఆదిపురాణం."

ఐతే దీనిలోని విషయం ఏమిటి? దీన్ని నశించిపోకుండా మనకు ప్రళయాలను దాటి రక్షించి మనకి అందించే పరమగురువులు ఎవరు? ఈ సిద్ధులపని ఏమిటి అంటే, కొన్ని రహస్యాలు యిక్కడ చెప్పక తప్పదు.

## ప్రాచీన రహస్య విజ్ఞానమే "పురాణం" :

ఈ భూమ్మీద మానవజాతి పుట్టి, కొన్ని కోట్లసంవత్సరాలయింది. అనాదిగా మానవుడు సంపాదించిన విజ్ఞానమంతా యుద్ధాల వల్లా, జలప్రళయాలవల్లా, భూకంపాల దుండగుల ఘాతుక చర్యలవల్లా ఎన్నో గ్రంథాలూ భాండాగారాలూ తగులబడిపోయినప్పటికీ, అందులోని అతి ముఖ్యమైన రహస్యవిజ్ఞానం ప్రపంచంలో ఏదోఒకమూల దాచబడి రక్షింపబడుతూనే వున్నది. అలా రక్షించబట్టే మళ్ళీ ఈ ప్రళయాల

అనంతరం మానవుడు జంతుదశలోకి జారిపోకుండా రక్షిస్తున్నది కూడా ఈవిజ్ఞానమే!

ఈ వేదశాస్త్రేతిహాసాలు అనేక కల్పాంతరాలనుంచీ వస్తూన్నవే. అయినా, అనాదులే ఐనా ప్రతి మహాయుగంలోనూ, కలియుగంలో కొంతభాగం గతించేసరికి, అన్నీ తిరిగి అంతర్హితమై పోతున్నాయి! మళ్ళీ అవసరమైనపుడు, తిరిగి మహర్షులవల్ల అవి ప్రచారములోనికి వస్తున్నవి.

శ్లో. యుగాంతే న్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః |
లేభిరే తపసాపూర్వం అనుజ్ఞాతాః స్వయంభువా |
వేదవిద్వేద భగవాన్ వేదాంగాని బృహస్పతిః|
భార్గవో నీతిశాస్త్రంతు జగాద జగతోహితం |
గాంధర్వో నారదో వేద, భరద్వాజో ధనుర్గ్రహం |
దేవర్షిచరితం గార్గ్యః కృష్ణాత్రేయశ్చికిత్సకం |
న్యాయశాస్త్రాణ్యనేకాని తైస్తైర్వ్యక్తాని వాదిభిః ||
(భారత శాంతిపర్వం 210. అధ్యా||

తా. "యుగాంతములో, అంతర్హితమయిన, వేదశాస్త్ర ఇతిహాసాదులను, అనేకులుమహర్షులు, తపస్సుచేసి బ్రహ్మ అనుగ్రహంతో సంపాదించారు. వీటిలో, వేదవేత్తయగు బృహస్పతి వేదాంగములనూ, శుక్రాచార్యుడు నీతిశాస్త్రమునూ, నారదమహర్షి గాంధర్వ వేదమునూ, భరద్వాజమహర్షి ధనుర్వేదమునూ, దేవర్షుల చరిత్రను గార్గ్యుడను మహర్షి, వైద్యశాస్త్రము కృష్ణ ఆత్రేయుడున్ను, తర్కశాస్త్రములు, మొదలగు వాటిని ఇంకా అనేకులు, లోకహితంకోసం చెప్పారు."

అయితే, ఇలా రహస్యంగా విజ్ఞానాన్ని రక్షించడం మనం అనుకున్నట్లు, అచ్చుపుస్తకాల రూపంలోనూ లైబ్రరీ (Library)ల రూపంలోనూ సాహిత్యగ్రంథాల రూపంలో ఉన్నదికాదు. ఇది కేవలం కొన్నివేల సంవత్సరాలకే సరిపోతుంది.

కాని కోట్ల, సంవత్సరాలలో భూగోళంలో జరిగే కొలదీ మార్పులూ, దేశాల ఆకారాలలో కలిగే మార్పులూ, నదులూ భూఖండాలూ, పర్వతాలు, వాతావరణంలో మార్పులూ ఇలాంటి మార్పులలో దేశాలకి దేశాలే సముద్రంలో మునిగి పోయి మటుమాయం అయిన ప్రళయాలు భూమ్మీద ఎన్నో గతించిపోయాయి.

ఇలాంటివెన్నో యీనాటి సైన్సుకూడా గుర్తించింది. ఇలా 50,000 సంవత్సరాలక్రితం "అట్లాంటిస్" (Atlantis) అనే ఒక పెద్ద భూఖండం మునిగిపోయినట్లు ప్లాటో (Plato) వ్రాసింది యదార్థమని "వెలికోవిస్కీ" (Velikovsky)వంటి యీనాటి సోవియట్ రష్యాలోని వైజ్ఞానిక పరిశోధకులు కూడా తేల్చారు! ఇలాంటి మహా ప్రళయాల్లో దేశాలకిదేశాలే మారిపోయి భౌగోళిక మార్పులలో వేలాది, లక్షలాది జీవులు నశిస్తాయి. అలాటి "ప్రళయాల" నుంచి నశించకుండా విచిత్రంగా రక్షింపబడిన ఈ రహస్య విజ్ఞానాన్ని జాగ్రత్తగా మనకి అందించే మహావ్యక్తులు కొందరున్నారు. వీరే పరమగురువులు -- లేక సిద్ధ మునిమండలి!

వీళ్ళు మనలాంటి సామాన్య "మానవులు" కారు. అనేక జన్మలు తపస్సుచేసి 'సిద్ధి' ఏనాడో సంపాదించినవారు. మన పురాణాలలో "సిద్ధపురుషులు" లేక "చిరంజీవులు" అని చెప్పబడే వ్యక్తులు వీళ్ళే ! వీరు అనంతమైన ఈ రహస్యవిజ్ఞానాన్ని మనస్సుతోనే 'ధారణ' చేసి పుస్తకాలూ, రాగిరేకులూ వంటివెన్నో నాశనం అయినా కాలిపోకుండా తామే అదృశ్యంఅయి జరిగిన ప్రళయాల గాథను చూచి, యధాతథంగా వ్రాసిన రహస్య చరిత్ర --ఇంకా యిప్పటికీ హిమాలయ గుహలలో దాచివుంచారు !! దీన్ని చూసిన పాశ్చాత్యులు కూడా* చాలామంది మనకాలంలోనే వున్నారు.

రష్యనుయోగి "గుర్జేఫ్" (Gurdjieff); రష్యన్‌యోగినీ సిద్ధురాలు ఐన "బ్లావెట్స్కీ" (Blavatsky) యింకా ప్రపంచ భవిష్యత్తును దర్శించి ముందే వ్రాసిన "కీరో" (Cheiro) వంటి వారు చాలమంది చూచిన

కాబట్టి ఇలాంటి ఆది గ్రంథం, (The Old Book) ఈ విశ్వచరిత్రని అంతా తెలిపేది వొకటి -- యీనాటి మన "వేదాలు" పుట్టక ముందునించే వున్నదని తేలుతున్నది. దీనికి "పురాణం" అని పేరు. (మనం ఎరుగున్న 18 పురాణాలు కావు) ఇదే మానవ విజ్ఞానానికి "ఆదిమగ్రంథం", పురాతన "విశ్వచరిత్ర". దీన్ని ప్రాచీన ఋషులందరూకూడా ఎరుగుదురు. అంటే వేదాలలోని మంత్రాలలో వర్ణించిన "దీర్ఘతమసుడు" "నారాయణుడు" అత్రి, అంగీరసుడూ వంటి వైదికఋషులూ-పురాణాలు వ్రాసిన వ్యాసమహర్షి తండ్రియైన పరాశరుడూ, కూడా యిలాంటి ఆది 'పురాణాన్ని' స్వయంగా ఎరుగున్నట్టూ అది వేదాలకన్న ప్రాచీనమైందనీ ఇతర పురాణాలు కూడా సాక్ష్యమిస్తున్నాయనీ, మనలో చాలామందికి తెలియదు.

ఇది నూరుకోట్లశ్లోక సంఖ్యకలది. దీనితర్వాతనే వేదాలు ఉత్పత్తి అయినాయి. ఈవిషయం "మత్స్యపురాణం"లో యిలా వున్నది.

శ్లో|| "పురాణం" సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతం
నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరం
అనంతరం చ వక్త్రేభ్యో వేదాస్తస్య వినిర్గతాః --
మత్స్యపురాణం

కాని వేదవ్యాస మహర్షి ఈ నాలుగువేదాలూ తాను విభజించక ముందు ఒకే వేదంగా ఉండివుండటమే గాకుండా ఈ వేదాన్ని సంహిత కంటే అతిప్రాచీనమైన "పురాణ" ఒక్కటే గ్రంధంగా వుండేదంటూ నొక్కి 'పురాణ మేకమేవాసీత్' అంటూ నారదపురాణంలో మళ్ళీ ఇలా వివరించారు:

---

సాక్ష్యం వున్నది. గ్రంథవిస్తర భీతిచే వివరాలు వొదిలి వేస్తున్నాను ఇవి నా గ్రంథం "మనదేశం-- మనసంస్కృతి" (USECFI) చూడవచ్చు. దీన్ని గురించిన వివరాలు, "మహామునుల యోగమండలి" "పరమగురువుగా వ్యాసమహర్షి" -- అన్న తర్వాతి అధ్యాయాలలో ఇవ్వబడింది.

పురాణ మేకమేవా సీత్, సర్వకల్పేషు మానద
చతుర్వర్గస్య బీజం చ, శతకోటి ప్రవిస్తరం"
-- నారద. 1. 92-22

చాలామంది పండితులు ఈనాడు వేదంకంటే ప్రాచీనమైన ఒక 'పురాణం' వుండేదంటే కూడా విశ్వసించలేరు! అందుకని వారు పైశ్లోకాన్ని ఎవరో చేర్చిన -- 'ప్రక్షిప్త' శ్లోకంకింద భావించవచ్చు! కాని వ్యాసమహర్షి ఇదే మాటను అనేకచోట్ల మళ్ళీమళ్ళీ నొక్కిచెప్పారు ఇతర పురాణాలలో సంహితం కూడా!

ఉదాహరణకు ఆయన 'స్కాంద పురాణం'లో ఒక్కటే ప్రాచీనమైన పురాణం వుండేదని "ఏక మేవ పురాహ్యాసీత్" అని నొక్కిచెప్పిన ఈక్రింది శ్లోకం గమనార్హము :

ఏకమేవ పురాహ్యాసీత్, బ్రహ్మాండం శతకోటి ధా
తతో అష్టాదశధా కృత్వా వేదవ్యాసో యుగేయుగే
స్కాందం (72-8)

అని, తానేగాదు. ఇలా ప్రతి మహాయుగంలోనూ వచ్చిన వేదవ్యాసులందరూ ఈశాశ్వతమైన 'పురాణాన్నే' తపస్సులో దర్శించి పద్దెనిమిదిగా విభాగించి వ్రాశారని తెలిపేందుకు -- 'వేదవ్యాసో యుగే యుగే' అన్నారు నిస్సందేహంగా!! పైశ్లోకంలో 'బ్రహ్మాండం' అంటే ఇప్పటి బ్రహాండ పురాణం కాదని నిస్సందేహంగా చెప్పవచ్చు! ఒక బ్రహ్మాండమైన పురాణం ఏకైకమైనది అనగా ఈ యావత్ బ్రహ్మాండవిషయాలను తెలిపేది అని అర్థమని శ్లోకంలోని తర్వాత పాదంలో 'తతో అష్టాదశధా కృత్వా' (దానినే పద్దెనిమిది పురాణాలుగా విభజించి) అనటంవల్ల ఈ బ్రహ్మాండ పురాణమంటే ఈనాటి పద్దెనిమిది పురాణాలకీ ప్రాచీన మాతృక అని అర్థం. ఇదే నారద పురాణంలో కూడా ఇలా తిరిగి వివరించారు:

"బ్రహ్మాండం యచ్చతుర్లక్షం పురాణం యేన
పఠ్యతే తదేతస్య గదితమథా అష్టాదశధా పృథక్"

ఇదే "ఆది పురాణము" -- లేక ఆద్యమైన 'పురాణ సంహిత'గా ఆకాశంలో శబ్దస్వరూపంగా నిత్యమైనదీ, అది సాక్షాత్ బ్రహ్మనుంచి పుట్టినది -- అని వ్యాసమహర్షి స్పష్టంగా మత్స్య, వాయు, పద్మ మార్కండేయ భవిష్యపురాణాలలో అన్నింటిలోనూ వివరించాడు, ఒకే శ్లోకం ద్వారా! *

## వేదము ఒక్కటే :

ప్రాచీన కాలమైన ఆదికాలంలో వేదాలు యీనాటికిమల్లే కాకుండా "వేదము" ఒక్కటిగానే వుండేదని తెలుస్తున్నది. ఇలాంటి "ఆది మవేదాన్ని" ఛందోబద్ధం చేసి సామాన్య ప్రజలందరి ఉపయోగార్థం మంత్రాలుగా అంగీరసుడనే ముని, చేశాడు. అందుకే దీనిని "ఆంగిరస" మనే పేరుతో పిలిచేవాడు. దీనికే "సంగ్రహ ఛాందసము" లేక "అధర్వము" అనికూడా నామాంతరములున్నాయి. ఇది చాలామంది వేదపండితులుగూడా ఎరుగరు.

## వేదవిభాగము - వేదవ్యాసుడు :-

మిగిలినదంతా కలిసి, ఏకంగా "వేదం" అని అవిభక్తంగానే

* "పురాణం సర్వశాస్త్రాణాం ప్రథమం బ్రహ్మణాస్మృతం.

నిత్యం శబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరం,

అనంతరంచ వక్త్రేభ్యోవేదాస్తస్య వినిర్గతాః"

అని బ్రహ్మ (161-27): పద్మ (సృష్టిఖం. 1-45): మత్స్య(53,3) వాయు (1-44) : మార్కండేయ (45-20) పురాణాలు అంగీకరించాయి.

వుండిపోయింది. వ్యాసమహర్షి యీ వేదాన్నే అధ్యయనం చేశాడు. ఈయన, తన అధ్యయనం పూర్తికాగానే ఒక్కసారిగా, ఏకాకారంలో వున్న వేదాన్ని ఆమూలాగ్రం పరిశీలించాడు సమగ్ర దృష్టితో, అప్పుడాయనకేమి కనిపించిదంటే వేదంలోని మంత్రభాగాలూ, ఋక్కులూ అన్నీ కలిసిపోయి చిందరవందరగా ఒక క్రమం ప్రకారం లేవని! కొన్నికొన్ని ఒక్కొక్క ఋషిదగ్గర పడివున్నాయి! వేరే దేశంలో కొన్నిప్రాంతాలలో కొన్నిఋక్కులు ప్రచారంలో వున్నాయి. మరికొన్ని దేశంలో అంతటా వ్యాపించి ఉన్నాయి. ఇంకొన్ని అసలే మూలబడి బహుళ ప్రచారంలో లేవు, ఖిలమైపోయే దశలో వున్నాయి. వీటినే 'ఖిల' మన్నారు!

ఈ అసందర్భాన్ని వేదవ్యాసుడు వెంటనే గుర్తించాడు. వెంటనేగనుక సత్వరంగా యీ మంత్రాలనూ, ఋక్కులనూ ఒక్కచోట చేర్చి పోగుచేసి క్రమబద్ధంచేసి వాటి అర్థాన్నిబట్టి, వాటి ఉపయోగాన్నిబట్టి, తీరుగా అమర్చకపోతే, అవి ఒక అడవిలాగ గడిబిడగా అల్లుకు పోయివుండటమేగాక ఇంకొన్నాళ్ళకు వేదంలో కొన్నిభాగాలు అసలే నామరూపాలు లేకుండా, ప్రచారంలోంచి నశించిపోతాయి -- ప్రజలు వాటిని విస్మరించడం ద్వారా ఏర్పడే ఈ భయంకర పరిస్థితిని చక్కజేయాలంటే యీ వేదాన్ని అంతా క్రమబద్ధంగా అమర్చి ఒక తీరూతెన్నూ వుండేలా విభజించాలి.

ఇది వేదాలకు అర్థం తెలిసినవాళ్లు తప్ప, ఇతరులు చేయలేరు. ఇంతేగాదు. ఆ మంత్రాలలో వర్ణించబడ్డ విషయాలను దివ్య దృష్టితోగాని, ప్రత్యక్షానుభూతితోగాని అర్థం చేసుకున్నవాడైతేగాని వాటి ఉపయోగాలను తెలుసుకోలేడు. ఇది సామాన్యుడైన కవి, సాహితీపరుడూ, చేయలేడు కేవలం యోగి మాత్రమే అయిన వ్యక్తివల్ల అయ్యేపనికూడాకాదు. అనేక శాస్త్రాలలో అనుభవంతో కూడిన పరిచయంవుండి "వేదార్థమును" యోగశాస్త్రాభ్యాసంతో రంగరించి, ఆ సమ్యగ్దృష్టితో వేదార్థాన్ని గ్రహించి--తద్వారా వాటి

ఉపయోగాన్నిబట్టి ఏమంత్రాలు గానం చేయడానికి పనికివస్తాయో వాటిని "సామములు" గానూ, ఏ భాగాలు యాజ్ఞిక కర్మలయిన క్రతు యజ్ఞ విధులలో ఉపయోగిస్తాయో, వాటిని "యజుస్సులు" గానూ ఏమంత్రాలు ఋక్‌భాగాలో, అందులో ఏవి దైవిక మంత్రాలో అన్నదాన్నిబట్టి "ఋక్కులు" గానూ విడదీశాడు వ్యాసమహర్షి! ఇలా ఏర్పడినాయి, సామవేదం, యజుర్వేదం, (యజుస్ + వేదం), ఋగ్వేద(ఋక్+ వేదము)మూనూ!

ఈవిధంగా వేదానికి ప్రస్తుతరూపం ఏర్పాటు అయింది. ఇదే చతుర్వేద విభాగం. ఇది చేసిన చతుర్ముఖుడే వ్యాసబ్రహ్మ. ఇలా వేదవిద్యలు శాఖోపశాఖలుగా విస్తారంచెయ్యబడి, వ్యాప్తిచెందినాయి. ఈ వ్యాప్తిచెందటాన్నే "వ్యసించడం" అంటారు. వేదములను వ్యసనము చేసినందువల్లనే, కృష్ణద్వైపాయన మునికి "వేదవ్యాసు" డనే పేరు కలిగింది. ఇది, ద్వాపర యుగాంతానికి జరిగిన విషయం.

ఇప్పుడు మళ్లీ "కలియుగం" అంతం కాబోతున్న కాలంలో మళ్ళీ ఇదే పరిస్థితి వెలిసింది! ఈనాడు మళ్ళీ యీ వేదాలను అభ్యసించేవాళ్లు కరువై దేశంలో కొన్నికొన్ని శాఖలు అసలు చదివేవాళ్ళే లేరు. ఆ కారణంగా ఈనాటి వేదపండితులు 1966 లో తిరుపతిలో "వేద రక్షణ సభ"లో శ్రీజగద్గురు కంచికామకోటిస్వామి వారి ఆధ్వర్యంలో అందరం సమావేశమైనప్పుడీ ఘోరవిపత్తు కళ్ళకు కట్టినట్టుగా బైటపడింది. కొన్నికొన్ని వేదశాఖలలో కొల్లలుగా దాన్ని అధ్యయనం చేసేవాళ్లున్నారు. ఉదాహరణకు యజుశ్శాఖీయులు దేశంలో బహుళంగా వున్నారు. ఇక సామవేదం అధ్యయనం చేయగలవాళ్లూ "ఋక్‌శాఖీయులూ" అతి తక్కువగా వున్నారు.

కొన్నికొన్ని శాఖలలో ఎక్కడో ఒక[illegible]

[illegible]

[illegible] సత్వరమ మనం మేలుకుని అలనాడు వ్యాసమహర్షి తన శిష్యులకు వేర్వేరు శాఖలు యిచ్చి,

వారిచేత అధ్యయనం చేయించినట్టుగానే -- మళ్ళీ ఈనాడుకూడా అన్నిశాఖల వారినీ అలాగే సక్రమంగా ఏర్పాటు చెయ్యకపోతే, వేదంలో చాలాభాగం లుప్తమై ఖిలమై పోతుంది! ఇది యీనాడు దేశం గుర్తించినట్టు కనపడదు.

## వ్యాస శిష్యులద్వారా విద్యలప్రచారం :-

ఇలాగ వ్యాసమహర్షి, సూతుడు ఉపదేశించి, వారిచేత అనేవానికి పురాణాలూ, యితర శిష్యులకు యితర భాగాలూ చదివించి, వాటివాటి ఉపయోగంలో వారికి శిక్షణనిచ్చి వాటిని దేశంలో ప్రచారం చేయించి ఆయాభాగాలు సాంప్రదాయ రూపంలో శాశ్వతంగా పాతుకుపోయి నిల్చిపోయేలాగ చేశాడు.

ఏ యే శిష్యుడు ఏయే విషయాల్లో శిక్షణపొందాడో, అన్న విషయం వేరేచోట వివరంగా గమనిద్దాం.



# 8

# వ్యాసుని జ్ఞాన సముద్రం--II

వ్యాసమహర్షియొక్క జ్ఞానసముద్రమంతా ఇలా పురాణరూపంలో 18 పాయలుగా పారిందని గమనించాము. ఇప్పుడు "పురాణం" అంటే కేవలం కట్టుకథలనే ఇంగ్లీషు దొరల ఆక్షేపణ ఎంత అబద్ధమో అసంబద్ధమోకూడా గమనిద్దాం. పరిశోధనాదృష్టితో చూస్తే, ఈ పురాణాలలో ఎన్నెన్ని వైజ్ఞానిక విషయాలున్నాయో పరిశీలించి, వ్యాసగ్రంధితమైన కొన్ని అతిముఖ్యమైన రచనల్ని ఇక్కడ సమీక్షిద్దాము.

## ఆది-పురాణం :-

"పురాణం" అంటే ఇక్కడ 18 పురాణాలుగా వ్యాసమహర్షీ పరాశరమహర్షిచేత వ్రాయబడిన పురాణాలుకావు! ఈ పురాణాలన్నింటికీ 'మాతృక' లేక మూలగ్రంథం ఒకటే ఉండేది. వేదాలకన్నా ప్రాచీన

"పురాణం" ఇది! అందులో అన్నివిషయాలూ కూలంకషంగా అంటే విశ్వం పుట్టుకనుండీ అణువువరకూ గల యావత్ విజ్ఞానం, చరిత్ర, యోగశాస్త్రమూ అంతా -- సంక్షేపించబడిన ఆదిగ్రంథాన్నే "పురాణ -- సంహిత" అంటున్నాము.

ఈ "పురాణ -- సంహిత" వేదాలకంటే ముందుకాలానికి సంబంధించినది. వేదాలకంటే* ప్రాచీనతమమైన ఇలాంటి పురాణ సంహిత ఒకటి, వుందని కూడా చాలామంది వేదపండితులకే తెలియదంటే, ఇక చరిత్రవ్రాసే ప్రొఫెసర్లకూ, ఇంగ్లీషు చరిత్రను వేదయుగం ("Vedic Age") పురాణ యుగం (Epic Age) అన్న గోడలతో విభజించి రాసిన విదేశీయుడి చిలక పలుకులు చదువుకుని, దాంతోనే డిగ్రీలు సంపాదించుకున్న చరిత్రకారులకేం తెలుస్తుంది?

ఈ పురాణ సంహిత గురించి శ్రీ'హాజ్రా' (R. C Hazra) మహాశయుడు తన "విష్ణుపురాణం" గ్రంథానికి వ్రాసిన తొలిపలుకులో ఈ విధంగా నిరూపించారు:

"అసలు వేదాలకంటేకూడా ప్రాచీనమైన ఇలాంటి "పురాణం" ఒకటి, సంహితగా వుండేదని ఒక ప్రాచీనమైన ప్రమాణంకూడా వున్నది." అంటూ దానిలోని విషయాల వివరాలుకూడా ఆయన సూచించారు. ఇంతేగాదు, రష్యనుదేశపు మహాయోగినీ సిద్ధురాలూ అయిన "బ్లావెట్స్కీ" సతి (Madame Blavatsky) తాను వ్రాసిన "ప్రాచీన రహస్య విద్య" (Secret Doctrine) అన్న గ్రంథంలో, అనాదిగా హిమాలయ పర్వతాలలో ఆశ్రమాలలో నివసించే సిద్ధ-పురుష

* ఈ పురాణ -- సంహిత ఎన్నివేల యుగాలు, లేక సహస్రాబ్దాల నాటిదో ఊహకతీతం! దీనిలోని విషయమంతా నాగ్రంథం (Wisdom of the Gods) అన్నదానిలోనూ, (Hinduism in the Space Age) లోనూ చూడవచ్చు. (Publication of. USCEFI,)

లవద్దనున్న అతిప్రాచీనమైన "ఆదిమ విజ్ఞానం" గ్రంథాన్నిచూసి, ఆమె ఈ విధంగా వ్రాసింది.* "ఆల్టిన్-టోగా" శిఖరాల సమీపాన, ఏ తెల్లవాడూ ఇంతవరకూ అడుగుపెట్టని ప్రదేశంలో, ఒక చిన్న కుగ్రామం వుంది. లోతైన లోయలో దాగి! అసలది ఒక గ్రామాల కూటమి అనాలి. ఆశ్రమం అనేకంటే! - అందులో అతిసామాన్యంగా కనిపించే దేవళం! అందులో ఒక ముసలియోగి లేక "లామా" -- దాన్ని కనిపెట్టుకుని వుంటాడు. అక్కడి ప్రజలు ఏమిచెబుతారంటే, ఆ గుడి అడుగునవున్న పాతాళ గుహ క్రింది అరలలో, అపూర్వమూ, అమూల్యమూ అయిన ప్రాచీన గ్రంథాలెన్ని వున్నాయంటే, అవి ఈనాటి బ్రిటీషు మ్యూజియంలోకూడా పట్టనన్ని గ్రంథాలు -- రహస్యంగా ఆ గుడిక్రింద నిక్షిప్తమై వున్నాయి, ఆ యోగి రక్షణలో"

--"ది సీక్రెట్ డాక్ట్రిన్" (P. XXIV)

ఇంతేకాక, హిమాలయాలలో అనేక సంవత్సరాలు బ్రహ్మజ్ఞానం కోసం యోగులూ, సిద్ధులతో జీవితం గడిపిన రష్యన్ యోగినియైన ఈ "బ్లావెట్స్కీ" - అతిప్రాచీనమైన ఆదిమ "పురాణం" వంటి ప్రాచీన గ్రంథంయొక్క ఉనికిని కూడా, తాను ప్రత్యక్షంగా కనుగొన్నట్టు, ఆమె వ్రాసిన ఈ "సీక్రెట్ డాక్ట్రిన్" (గుప్తవిజ్ఞానం)

---

* Along the ridge of Altyn-Toga, whose soil **no European foot** has ever trodden so far, there exists a certain hamlet, lost in a deep gorge. It is a small cluster of houses rather than a Monastery, with a poor-looking temple in it, with one old Lama, a hermit, lying nearby, watching it! Pilgrims say that the subterranean galleries and halls under it contain a collection of books, the number of which according to the accounts given, is too large to find room even in the British Museum.' - **H.P. Blavatsky**
(The Secret Doctrine)

అన్న పుస్తకంలోనే, యీ క్రింది వాక్యాలు మనలో కొందరికి కనువిప్పు :

"అతిప్రాచీనమైన ఈ ఆదిమగ్రంథం" ప్రపంచంలోని అన్ని మతాలకూ మూలాధారమైంది. దానినుంచి ఆధారంగా తీసుకునే "కియు--టీ" అన్న మతగ్రంథాలు వ్రాయబడినవి. అంతేగాదు, దీనినుంచి "యూదుల" (Jews) మూల గ్రంథాలయిన "సెఫిరాజె నౌటా", "సెఫర్ ఫెజిరా" అన్న గ్రంథాలుకూడా వ్రాయబడినాయి! హీబ్రూ జాతిలోని "కబాలా" శాస్త్రపండితులు -- ఈరెండూ ప్రాచీన బైబిలులోని "అబ్రహాము" ప్రవక్త వ్రాసినదని చెప్పే మూలగ్రంథమూ -- అంటే ఈనాటి బైబిలుకు ఆధారం "పెంటాట్యూక్" --మొదలైనవన్నీ కూడా తయారైంది ఈ "ఆదిమ" పురాణం (పురాతన) గ్రంథంనుంచే!"*

"The very old Book" is the original work from which the many volumes of Kia-Ti were compiled. Not only this later and the Siphrah Dzenioura but even the Sepher Fezirah !! The work attributed by the Hebrew Kabalists to their patriarch Abraham, the book of "Schi - King" Chinas, primitive Bible. The sacred volumes of the Egyptian Thoth - Hermes, the Puranas in India, and the Chaldean "Book of Numbers" and the penatateuch itself, are all derived from that One, small, parent volume.

The old book, having described Cosmic Evolution and indeed the origin of everything on earth, including physical man, after giving the true history of the First, down to the Fifth (our) Race, goes no further. It stops short at the beginning of the Kali Yuga just 4989 years ago at, the death of Krishna, the bright "Sun" the once living hero and reformer.

ఈ అతిప్రాచీనాతి ప్రాచీనమైన పురాణము, యీ కనిపించే విశ్వంయొక్క పుట్టుక, లేక సృష్టి, దాని పరిణామం గురించి తెలపటమేగాక యినాడు భూమ్యాదిసర్వగ్రహ సముదాయం - అంటే మానవుడూ, చెట్లూ, వివిధ మానవజాతుల చరిత్రంతా యథాతథంగా, జరిగింది జరిగినట్టువర్ణించి, అంతటితో సమాప్తం అవుతుంది. ఇది సరిగ్గా ఎక్కడదాకా వచ్చి ఆగిపోతుందంటే ఈ "కలియుగం" శకం 4989 వ సంవత్సరంవరకూ (1889) B.C. -- అంటే ఒకనాడు భూమ్మీద జీవించిన మహాశూరుడూ జ్ఞానీ అయిన శ్రీకృష్ణుడు మరణించి కలి -- ప్రారంభమైన దగ్గర వరకూ వర్ణించింది ఈ "ఆదిమ పురాణం" -- అంటుంది. బ్లావెట్స్కీ అనే రష్యను యోగిని!*

ఈజాతియొక్క మహత్తర విజ్ఞానం, వేలాది సంవత్సరాలుగా సిద్ధపురుషులూ, మహాత్ములూ -- మానవజాతికి పరమగురువులూ (Masters) ఐన ఆదిపురుషుల రక్షణలో గుప్తపరచిన విజ్ఞానం గురించి, అంతావ్రాసి, చివరికామె తన గ్రంథంలో, ఇంకా ఇలా అన్నది:

"రానున్న ఇరవయ్యవ శతాబ్దంలో, బహుశః నాకంటె, ఈ మహత్తర కార్యానికి బాగా తగివున్న వ్యక్తిని అన్నివిధాలా అర్హుడయిన ఉత్తమశిష్యుడిని మానవ జాతికి, కడసారిగా అనంత విజ్ఞానపు గనివంటి గుప్తవిద్యయొక్క ఉనికిని ఋజువుచేసే నిమిత్తం, ప్రత్యక్ష ఆధారాలు

---

* In Century the Twentieth, some disciple more informed and far better fitted, may be sent by the Masters of Wisdom to give final and irrefutable proofs that there exists, a Science, called Gupta Vidya: and that, like the once mysterious sources of the Nile, the source of all Religions and philosophies now known to the World, has been for many ages forgotten and lost to men, but is at last found" (The Secret Doctrine P XXX)

చూపేందుకు, పంపిస్తారు."

"ఏదైతే అనాదిగా మానవజాతిలోని అన్ని మతాల వెనుకా, అనేక వేదాంతశాఖల అడుగునా, ప్రపంచానికి తెలిసిన అన్ని సిద్ధాంతాలకీ మూలంగా, ప్రవహించే జీవన స్రవంతివంటి ఆ గుప్తవిద్య, రహస్యవిజ్ఞానం, ఒకనాడు మానవజాతి అందరూ ఏకోదరులవలే పొందిన సొత్తు -- తర్వాత వేరుపడి పోగొట్టుకున్నది -- మళ్లీ ఈనాడు దొరికిందని ఋజువవుతుంది."

మరో విషయం కూడా గమనించదగ్గది. ప్రపంచఖ్యాతిపొందిన జ్యోతిష్కుడూ బ్రిటీషువాడైన "కౌంట్ లూయీ హ్యామన్" లేక "కీరో" కూడా (Count Louis Hamon or Cheiro) తాను ప్రపంచంలోని "అతి రహస్య విజ్ఞానం" గురించి చేసిన అన్వేషణలో హిమాలయాలలోని సిద్ధపురుషులవద్ద, అతి గుప్తంగా దాచబడిన "ఆదిమ విజ్ఞాన గ్రంథం" ఒకటి మానస సరోవరం దగ్గిర చూచాననీ, అది మానవ చర్మంతో చేసిన పేజీలమీద కాలం చెరపలేని ఒక రంగు సిరాతో -- వ్రాయబడివున్నదనీ, అందులోని, అనేక విషయాలకీ జ్యోతిషానికి సంబంధించిన పుటలను తాను చూచాననీ-- ప్రపంచాన్ని ఉర్రూ తలూగించే తన జోస్యం ఆ "బ్రాహ్మణులు" తనకు ప్రసాదించిన విజ్ఞానంలోనిదేననీ వ్రాశాడు - ఆయన "ఆత్మకథ"లో!

ఇటువంటి అతిప్రాచీనమైనదీ మానవజాతికందరకూ మొదటి విజ్ఞాన భిక్షపెట్టిన - "ఆదిపురాణం" గురించి, ఇంకా కొన్ని అంశాలు మాత్రం మనకీనాడు తెలుస్తున్నాయి. అవి యేవంటే:

1. యీ భూమ్మీద మొదట మానవజాతి ఎలా సృష్టి అయిందన్న రహస్యగాథను యీ ఆదిగ్రంథం తెలుపుతుంది. అది యీ నాటికీ "సైన్సు"కు లొంగని గడ్డుసమస్యే! యీనాటి శాస్త్రజ్ఞులు కనీ వినీ ఎరుగని అతి ప్రాచీన చరిత్ర అంతా కూడా యథాతథంగా వర్ణించబడివుంది ఈ "ఆదిమ పురాణం"లో.

2. యీ భూమ్మీద జరిగిన, ప్రళయం గురించి - ఒకటి గాదు ఇలాగ "భూమి చరిత్ర" లో చాలాసార్లు "ప్రళయాలు" జరిగాయి -- అందులో భూమియొక్క ధృవాలు(poles) దేశాలవిభాగాలే ఎలా పూర్తిగా మారిపోయాయో అదంతా ఆశ్చర్యంగా కళ్ళకు కట్టినట్టు వర్ణించబడివుంది! ఈగాధ సంక్షిప్తంగా ఒక టిబెట్టుయోగి "లామా" లోబ్సాంగ్ రాంపా(Lobsang Rampa) వ్రాసిన గ్రంథంలో వర్ణించాడు. అది ఈనాడు మనమందరం కూడా చదవచ్చు "Doctor From Lhasa" -- అన్న ఆయన గ్రంథంలో !

ఇందులో టిబెట్టుదేశం సముద్రతీరంగా వుండివున్నవాటి పరిశోధనలతో ఈవిషయాన్ని ధృవపరచి, ఒకనాడు (లక్షల సంవత్సరాల క్రితం) వింధ్యకు ఉత్తరంగా, హిమాలయాలకు దక్షిణంగా , సముద్రంగా వుండేదని కనుగొని, దీనికి "టెథిస్ సముద్రం" (Tethys Sea) అని పేరు పెట్టారు. ఆనాడు వింధ్య పైకిలేవటం, అది సూర్యునికి అడ్డం వస్తే అగస్త్యుడు దానిని అణచటంవంటి గాథలు కూడా యీ కాలంనాటివేనేమో అనిపిస్తుంది. సైన్సు కూడా వింధ్య హిమాలయంకన్న ప్రాచీనమని ఇటీవలనే కనుగొన్నది.

3. భూమి తిరుగుడులో, లక్షలాది సంవత్సరాలలో తప్ప, కనపడని మార్పులూ, 'ధృవం' (pole) లోని చలనం తద్వార భూఖండాల ఉనికిలోనూ, అక్షాంశ రేఖాంశాల్లోనూ భూమ్మీద కలిగిన చలనాలనూ (Changes in Earth 's Axis ) కళ్ళకు కట్టినట్టు వర్ణిస్తుందీ "పురాణం."

ఉదాహరణకు సంస్కృత భాగవత పురాణంలో ధృవునితో విష్ణుమూర్తి "నీవు 26,000 సంవత్సరాల తర్వాత -- ధృవపదాన్ని చేరుకుని ధృవత్వాన్ని అధిష్టిస్తావు" అని వరమిచ్చినట్టు వుంది! యీనాటి "సైన్సు" కూడా ప్రతి 26 -- వేల సంవత్సరాలకీ, యింకొక కొత్త నక్షత్రం ఈ ధృవక్షితి (Polar axis) లోకి వస్తుందని ఖగోళ గణితంలో ఇటీవలే కనుకొన్న వైజ్ఞానిక సత్యం! ఇదే సరిగ్గా

ఆనాటి భాగవత "పురాణం" ధ్రువచరిత్రలో వుండటం, ఒక నిదర్శనం!

4. వేదకాలంలోని ఋషులు, ఈ సృష్టిలో, ప్రపంచం పుట్టుక ఎలాజరిగింది? అన్న ప్రశ్నకి సమాధానంకోసం ఎలాగ పరిశోధనలు చేశారో, అలానే కలియుగం ఆదిలో "వేదవ్యాస మహర్షి" కూడా ఆలోచించినట్టుగా మహాభారతం ఆదిపర్వంమొదట్లోని "సృష్టిక్రమం" గురించి తెలిపేభాగం వర్ణించి చెపుతోంది. కోటాను కోట్ల సంవత్సరాలక్రితం జరిగిన ఈ విశ్వం ఉత్పత్తి, దానికిముందు రోదసిలోని గాఢాంధకారం-- ఆ అంతరిక్షంలోని ఆ కటిక చీకటిని చీల్చుకుంటూ, సూర్యుడూ గ్రహాలు పుట్టడం, భూమి సూర్యుడినించి విడివడి, గట్టిపడటం, నదీ సాగరములు ఉత్పత్తి, ఓషధులూ -- ఆ తర్వాత మూడు యుగాల అనంతరం, జంతు జీవరాసుల పుట్టుకా, ఇదంతా కూడా వ్యాసమహర్షి హిమాలయ పర్వతాలలోని అడవుల మధ్యనున్న ఒక గుహలో యోగసమాధిని పొంది, అందులో దర్శించినట్టుగా భారతంలో ఆయనే వ్రాశాడు అందులో ప్రపంచజననం వృద్ధి, ప్రళయాల చరిత్ర (అంటే జరిగిందీ, జరుగుతున్నదీ, ఇంకా జరుగుచున్నదీ కూడా) వర్ణించినదానితో సరిపోతున్నాయి. ఇదే ఆయన పొందిన అపూర్వ విశ్వానుభూతి !

5. ఇలా యోగసమాధిలో దర్శించిన ఒక "సృష్టి చక్రము" -- అంటే సూర్యుడూ గ్రహాలు భూమీ పుట్టిపెరిగి తయారై దానిమీద జంతువుల పెరుగుదల, మానవ చరిత్ర, రాజులూ రాజ్యాల ఇతిహాసం, వ్యాసమహర్షి కాలానికి జరుగనున్న చరిత్రతో సహా, చివరికి "కల్పాంతా"నికి మళ్ళీ యీ గ్రహాలన్నీ తిరిగి; సూర్యుడిలో ప్రవేశించి లయించిపోయే -- 'మహాప్రళయం' దాకా కూడా ఇలా నిత్యం తిరిగే "చక్రం"(కాలం) అంతా యీ పురాణ సంహితలోని ప్రధానాంశం!! అందులోని రాజులు, యుద్ధాలూ, రాజకీయాలూ అదంతాకూడా ఈ కాలపురుషుని మహానాటకంలో ఒక భాగమే అన్నమాట! అది, "మానవ" అంకం.

6. పై కాలచక్రంలో అధ్యాయాల వంటివి "యుగాలు." ఈ యుగాలలో ఇటీవల ఆరంభమైన 'ఆధునిక' యుగమే "కలియుగం." అది జరిగినట్టుగా ఈపురాణాలలో యిచ్చిన తేది 18-2-3102 B.C నాటి గ్రహస్థితులు లెక్కిస్తే, అది యీనాటి సైన్సులెక్కలతో సరిపోవడంచూసి, పాశ్చాత్యులే ఆశ్చర్యపోయారు.

7. దీన్నిబట్టిచూస్తే యీ "పురాణం" లోని కథావస్తువూ తర్వాత స్వయంగా చూసి వ్యాసమహర్షి సమాధిలో దర్శించి ఋజువుచేసిన యీ "సృష్టిచిత్రం" గాథా, మన విశ్వం కథేననీ---ఊహాకల్పనగాని, గ్రీకు, రోమన్ వంటి, ఇతరదేశాల కావ్యాలలోని కథలవంటి కల్పనా కథ కాదు. ఇది విజ్ఞానిక -- (Scientific) అనికూడా ఋజువవుతున్నదన్నమాట.

8. ఈ సృష్టి ప్రళయాల మధ్యకాలం చరిత్రలోని "భవిష్యత్తు" ను పైవిధంగా చూసి వ్రాయబడిందే "భవిష్యపురాణం" అనికూడా, తేలుతోంది. ఇది అనేకమంది మునులు "నాడీజ్యోతిష" గ్రంథాలలో వ్రాసినట్టుగా -- యథార్థ భవిష్యత్తును దివ్యదృష్టి (Clairvoyance) తో, చూచి వ్రాసిందే.

9. బ్రహ్మాండంలో జరిగే చరిత్రని -- అంటే 'విశ్వం యొక్క ఆత్మకథ'ను సినీమాలోలాగ దర్శిస్తే!, అందులో మధ్య "మానవచరిత్ర" అన్న "అంకం" కూడా అలాటిదే! అంతకుముందు దశలో ప్రకృతి అంతా జలమయం అయివున్నది, ఆదియుగం; ఆ తర్వాత వృక్షజాతులు, జంతువులూ, తర్వాత వెన్నెముకగల జాతులు పక్షులూ మానవులూ, ఇలా ఒక నాటకంలోని అంకాలలాగ ఒకదాని తర్వాత ఒకటి రావడం, స్వయంగాచూచిన "సృష్టి" చరిత్రే -- ఈ ఆదిపురాణంలోని కథా వస్తువు! ఇదంతా "గత చరిత్ర".

10. ఇక, "వర్తమాన చరిత్ర" -- అంటే, వ్యాసమహర్షి మళ్ళీ యీ ప్రాచీన విజ్ఞానమంతా నశించి పోకుండా, మానవజాతి ఉపయోగార్థం

పద్దెనిమిది పురాణాలుగా విడివిడిగా వ్రాసిన కాలము! అదే కలియుగం మొదలయ్యే సంధికాలం! అదే విషయం పరాశరమహర్షి వ్రాసిన 'విష్ణుపురాణం'లో -- అంటే వ్యాసుడు 18 -పురాణాలలో విడివిడిగా విషయానుసారం పద్దెనిమిది కల్పాలలోని చరిత్రంతా వ్రాసినదే -- పద్దెనిమిది అంకాలూ ఒకే గ్రంథంగా కలిసివున్న ఒకే గ్రంథంగా "విష్ణుపురాణం" ను వ్రాసిన కాలంకూడా ఆ ద్వాపరయుగం, అంతమై "కలియుగం" ప్రారంభమయ్యే గడప, లేక యుగసంధి కాలమే !

కాబట్టి, పురాణాలు కల్పిత కథా వస్తువులు కాదు. ఇవి ఊహాకల్పనలాగ "కావ్యం" గా వ్రాసినవి కాదు! ఈ యుగాలంటే చారిత్రక శకాలని తెలిపేందుకు ఆ టైముకివుండే గ్రహస్థితులిచ్చారు. అటువంటికాలము శ్రీకృష్ణ నిర్యాణం, లేక "కలియుగప్రారంభం" అని -- చెప్పబడే 18-2-3102 B. C. నాటి మైలురాయి! దీనితో అటు ముందరిరాజుల చరిత్రా, ఇటు కలిలోని చారిత్రకకాలంలోని విభాగాలూ, రెంటినీ సరిగ్గా విభజించుకుని చారిత్రక కాలాలు తెలుసుకునేందుకు కావలసిన లెక్కలు "భవిష్య పురాణం" లో ప్రతిరాజు పరిపాలనా వివరాలతో విపులంగా ఇచ్చారు. ఇది వివరంగా 'వ్యాసమహర్షి కాలం' అన్న అధ్యాయంలో వివరించాను.

## పురాణాలలో విశ్వచరిత్ర :-

ఈ ప్రపంచం ఏ విధంగా సృష్టి అయిందో; అందులోని గ్రహగోళాల పుట్టుక, భూమి ఉద్భవము ఈ భూమ్మీద ఖండాలూ, ఆయాదేశాలలోని ప్రజలూ, ప్రపంచంలోని వివిధపర్వతశ్రేణులూ, నదులూ, పుణ్యక్షేత్రాలు; లక్షలాది సంవత్సరాలుగా జరిగిపోయిన మానవ చరిత్రా, అందులో నామరూపాలులేకుండా కాలంలో కలిసిపోయింది పోగా, చరిత్రలో ఇంకా నిలిచివున్న రాజులు, అవతార పురుషులూ యుగధర్మప్రవక్తల వంటి చారిత్రక వ్యక్తులయొక్క ఇతిహాసం, మానవజాతికి వారిచ్చే సందేశమూ ఇలా ఈ విధంగా,

సమీకరించబడిన "విజ్ఞాన సారం" --అంటే చరిత్రవలన మనకితెలిసే గుణపాఠం (Lessons of History) వంటి శాస్త్ర విషయమెంతో ఈ పురాణలలోవున్న కథావస్తువు!

అంతేగాక, ఇది చరిత్ర మధించగా వచ్చినసారం. ఈనాడు మానవుడు చదివినేర్చుకోవలసిన నిత్యజీవితావసరాలైన మహాసత్యాలూ, వాటిని అనుష్ఠించడంవల్ల మానవుడికీ, మానవ సమాజానికీ ఏ విధంగా మేలు చేకూరుతుంది, అన్న విషయంకూడా మన ఈ పురాణాలలోని కథా వస్తువే.

ఈ సారాంశాన్ని విడిచిపెట్టి, పురాణాలను కేవలం 'మత -- గ్రంథాలుగా' చిత్రించి అనువదించటంవల్లనే ప్రజలలో ఆ సంస్కృత మూలగ్రంథాలయొక్క నిజస్వరూపంపోయి, వాటిలోని అసలైన విజ్ఞానమంతా అడుగున పడిపోవడం కూడా ఎలా జరిగిందో స్థూలంగా మనకందరికీ తెలుసు! తెలుగులోకి, పురాణాలూ వేదశాస్త్రాల వంటి మహాసాహిత్యాన్ని సరిగ్గా అనువదించకుండా---ఆయా కవులు స్వంతపోకడలు పోయి-- కల్పనలుచేస్తూ; శతాబ్దాల తరబడి ఈతీరున ఇలాగే జరగడంవల్ల ప్రజల్లో చివరికీ నాడు, ఈ పురాణాలయొక్క ముఖ్యసందేశం ఏమిటో కూడా ఎవరికీ అసలే తెలియకుండా పోయింది! అందుకే పురాణాలు కేవలం "మతగ్రంథాలు" కావని ఈనాడు నేను ఇంతగా నొక్కి చెప్పవలసివస్తున్నది.

ఎందుకంటే, పురాణాలు, మానవజాతియొక్క చరిత్ర! మానవసంస్కృతి యీ భూమ్మీద ఏ విధంగా పరిణామంచెందిందో, కోట్లాది సంవత్సరాలుగా జరిగినవిషయాలూ, అతి ప్రాచీన భౌగోళిక, ఖగోళ విషయాలు, -- ఇన్ని విషయాలు ప్రపంచంలో ఇక మరేసాహిత్యంలోనూ దొరకని శాస్త్ర విషయాలు ఎన్నో మనకీనాడు ఈ పురాణాలవల్లనే లభిస్తున్నాయి. ఇవి గనుక నశించిపోతే, శాశ్వతంగా, ఈ ప్రాచీనాతి ప్రాచీనమైన మన భూగోళచరిత్రా, దానితో పాటువచ్చిన అంతులేని

విజ్ఞానమంతాకూడా నశించిపోగలదు.

ఈ కారణంచేతనే భారతీయులమైన మనం, ఈనాడు మన పురాణాలను సరిగ్గా అర్థంచేసుకోవటం మన అవసరం! ఇది మనవిధి అయివున్నది.-



9

# వ్యాసుని - విచిత్ర రచనా విధానం

వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించిన చిత్ర విచిత్రమైన రచనా పద్ధతిని గురించి ఈ అధ్యాయంలో పరిశీలిద్దాము.

వ్యాసమహర్షి రచనావిధానం ఎంతచిత్రమైనదో తెలియాలంటే కేవలం మన మామూలు అనుభవంతో భారత భాగవతాలు చదివితే చాలదు. అలా ఈనాడు చాలమంది తెలుగు భారతాన్ని చదివి దానిమీద ఎన్నో సాహిత్య విమర్శలు కూడా చేస్తూ ఎవరికితోచినట్లు వారి స్వంత అభిప్రాయాలను వ్యక్తంచేయడంకూడా జరుగుతూంది. ఇలా చదివితే ఈ గ్రంథ రచన చేసిన అద్భుతవైఖరి ఏ మాత్రమూ అంతుపట్టదు.

## మామూలు రచయిత కాదు:

దీనికి కారణం వ్యాసుడు మామూలు రచయిత కాదు! కేవలం

తెలివితేటలూ పాండిత్యమూ వున్న సామాన్య రచయితకాదు. ఆయన ఒక మహాయోగి. కేవలం ఈనాటి, యోగసాధకులవంటి యోగిమాత్రమే కాదు; ఆయన పరిపూర్ణ సిద్ధుడు! కాదు, సిద్ధపురుషులందరూ కలిసిపనిచేస్తున్న పరమగురుమండలి కాయన పీఠాధిపతి! ఒక పరమ గురువు!ఆ తక్కిన ఋషి మండలానికి గురుమూర్తి వ్యాసుడు.

## 'పరమ -- గురువం'టే? :

అసలీ -- "పరమగురువంటే" ప్రత్యేకార్థం వున్నది! 'సిద్ధ -- యోగం' లో దీనికి సాంకేతిక రహస్య మైన అర్థం వున్నది. అదేమిటో తెలియాలంటే మన కాలంలో ఈ "పరమ -- గురువు"లను హిమాలయాల్లో దర్శించిన రష్యను సిద్ధురాలు అనుభవాలు తెలియాలి. అవేమిటో చూద్దాం :

అమెరికాలో ఒక గదిలో కాగితాలు గుట్టలు గుట్టలుగా పడివున్నాయి. వాటిముందు "బ్లావెట్స్కీ" కూర్చుని వుంటుంది. ఆమెకు తన పరమగురువు విధించిన పని విచిత్రమైనది! తన గురుదేవుడు ఎక్కడో కొన్ని మైళ్ళదూరంలోని టిబెట్టు మంచుకొండలపై తన ఆశ్రమంలో ధ్యానంలో కూర్చుని వున్నారు. తాను ఇక్కడ అమెరికాలో తనగదిలో కూర్చుని శిష్యురాలిగా క్షణకాలం తన గురుదేవుని మూర్తిని భక్తితో ధ్యానించి తనను తాను మరచిపోయింది. ఆమెకు ఏదో అనిర్వచనీయమైన నిద్రమత్తువంటి మైకం ఆవేశించి, తానెక్కడవుందో తెలియని స్థితిలోవుంది. కలం మాత్రం కాగితంమీద శరవేగంతో రాస్తూ పోతోంది! పేజీలపైన పేజీలు దొర్లిపోతున్నాయి. ఆనందంగా తనలోతాను కూనిరాగాలు తీసుకుంటూ "బ్లావెట్స్కీ" రాసుకుపోయింది. ప్రవాహంలాగా రచన సాగిపోతూంది!

సాయంత్రానికి తన టేబులుమీద కుప్పగా పేరుకుపోయిన ఆ కాగితాలను కట్టకట్టి చూస్తే తానే ఆశ్చర్యపోయింది. అందులో

విశేషాలేమీ ఆమెకు అంతుపట్టేవికావు! అందులో భౌతిక శాస్త్రం, రసాయన శాస్త్రం, ప్రపంచంలోని అన్ని మతాలు వేదాలు, ఒకటేమిటి అనేకంవున్నాయి.

అంతేగాక అనేక దేశాలలోని మారుమూల లైబ్రరీలలో పుస్తకాలలోని వాక్యాలు -- ఒక్కమాటా పొల్లుపోకుండా, పేజీ నంబర్లతో సహా ఉదహరింపబడటం చూసి ఆమెతో సహచరుడుగా జీవిస్తున్న యోగమిత్రుడు అల్కాట్ (Olcott) దొర ఇహ ఉండబట్టలేక అడిగేడు. "యీ గ్రంథాలన్నీ ఎప్పుడు చదివేవు" అన్నివిషయాల మీద అంతులేని పాండిత్యంమాట అలావుంచి - అందులోని వాక్యాలతో సహా ఉదహరించడం ఎలా సాధ్యపడిందీ అంటూ!

దానికామె ఒక చిరునవ్వు నవ్వేసి ఎదురుగా గోడమీద నిత్యం తన పూజలందుకొంటున్న తన గురుదేవుని చిత్రంవైపు సైగ చేసింది. ఒక్కసారిగా అల్కాట్ దొర నిర్ఘాంతపోయాడు. గభగభా వచ్చి ఆ టేబులుమీదున్న కాగితాలు తిరగవేశాడు. ఆశ్చర్యం తన కళ్లను తానే నమ్మలేకపోయాడు. ఒక్కొక్క విషయానికి ఒక్కొక్కశైలి, ఒకోశైలికొక్కొక్క దస్తూరి ఇదంతా ఏ ఒక్కరూ చెప్పిందిగాని, వ్రాసిందిగాని కాదు. అసలది బ్లావట్స్కీ వ్రాతకాదు, రచనా కాదు. ఆమె చదువు అంతంత మాత్రమే.

క్షణంలో అంతా గ్రహించాడు "అల్కాట్" దొర! టిబెట్టు దేశంలో ధ్యానంలో కూర్చునివున్న పరమగురువులు ఆమె శరీరాన్ని తమ పనిముట్టుగా వాడుకొని "శక్తిపాతం" ద్వారా యోగశక్తితో ఆమె మెదడులోకి - ఆలోచనలు, కరెంటు ప్రవహింపచేసినట్లు వాక్యాలు, పంక్తులు, విషయాలు ధారాపాతంగా ధారపొయ్యటమేకాకుండా ఆమెశరీరాన్ని ఆవేశించి తమ తమ విజ్ఞాన సముద్రాన్ని ఆమె కలం ద్వారా జలపాతంలాగ వెడలగ్రక్కారు. ఫలితంగా విజ్ఞాన సముద్రంలాంటి మహత్తర గ్రంథం అదే "సీక్రెట్ డాక్ట్రిన్" (Secret Doctrine) పుస్తకం రూపుదాల్చింది -- "పరమగురువుల" --

డిక్టేషన్‌తో!

ఈఅద్భుత లీలద్వారా పరమగురువుల ఉనికినీ వారి నిర్విరామ కార్యక్రమంలో ఒకేసారి అనేకశరీరాల ద్వారా అనేక చోట్ల వేర్వేరు ఆధ్యాత్మిక కార్యక్రమాలను ఎలాగ నిర్వహిస్తారో - "ఈ బ్లావెట్స్కీ" గ్రంధరచన జరిగిన తీరునుబట్టి తెలుస్తుంది. వారి విచిత్ర గ్రంధరచనా పద్ధతికూడా తెలుస్తుంది పై అనుభవాలద్వారా.

1897 లో కలియుగంలోని ఆఖరి శతాబ్దం ఆరంభం అవుతోందని ఇలాగే "సీక్రెట్ డాక్ట్రిన్" గ్రంధంవ్రాసి ఆతర్వాత కూడా యీ సిద్ధగురుమండలి సరిగ్గా ఇదే విచిత్ర - రచనావిధానం ద్వారా ఇంకొక పాశ్చాత్య మహిళ "ఏలిస్ బైయిలీ" (Alice Bailey) యొక్క శరీరాన్ని ఉపయోగించి- ఆధ్యాత్మికోపదేశంలో "ఏడు కిరణాలు" (Seven Rays of Initiation) అన్న గ్రంధం కూడా వ్రాశారు, బ్లావట్స్కీ గతించిన అర్ధశతాబ్దం తరువాత!!

కనుక పరమ గురువులు పనిచేసేమార్గంలో శిష్యుని మనస్సుద్వారా అతని శరీరము, మెదడూ, అతని అవయవాలనుకూడా పనిముట్లుగా వినియోగిస్తూ తాము ఈవిశ్వంలో నడిపించే కార్యక్రమాన్ని వారిద్వారా నిర్వహిస్తారు.

అలా చెయ్యటం సాధ్యమా? అని సందేహం కలగవచ్చు. ఎందు కంటే మనం ఒకే శరీరంలో ఉండగలంకదా! ఈ ఒక్కశరీంరంలోనే మన మెదడులో నడిచే ఆలోచనలను ఆపలేముగదా. మన శరీరమే ఒక్కొక్కమాటు మనం చెప్పినట్లు వినకుండా ఎదురు తిరుగుతుంది. అనేకసార్లు మన శరీరానికి లొంగిపోయి, బద్ధకం, నీరసం, కామం, ఆవేశం వంటివెన్నో ఏడిపిస్తాయి. ఈ మన ఒక్క శరీరాన్ని సరిగ్గా నిర్వహించాలంటేనే ఇంత కష్టంకదా? అలాంటిది ఇతరుల శరీరాల నెలా పనిముట్లుగా చేసుకుంటారు తమ సంకల్పశక్తికి అని ఆశ్చర్యం కూడా కలుగుతుంది.

దీనికి సమాధానం కొన్ని యోగరహస్యాలు 'యోగ సిద్ధులు' కలిగే విధానం తేలిస్తేగాని తెలియదు. యోగి తన శరీరాన్ని నిత్యమూ, అంటి పెట్టుకొని వుండడు. కన్నంలో నివసించే ఎలుకలాగా సాధారణ మానవుడి శరీరంలో జీవుడు జైలులో పెట్టబడిన ఖైదీలా జీవిస్తాడు. అతడు కర్మకు బద్ధుడు. ఎందుకంటే తాను నిన్న చేసినవి గతమాసం గతసంవత్సరంలో చేసిన అప్పులు యీ నెలజీతాన్ని ఎలా కబళించివేసి అతని సంపాదనను అతని చేతికిరాకుండా ఎలా హరించి వేస్తాయో, అలాగే మనంచేసే పనులు, వాటి సంకల్పశక్తి, పనులుగా కావటానికి కావలసిన పుణ్యాబలమూ, ఏకాగ్రతా, ఓపికా, అంతా ఇందులో చాలాభాగం మన గతకర్మను ఎదుర్కోడంతోనే సరిపోతుంది. ఆ పరిస్థితులు నిన్నటి కర్మకు ఫలితమే! అందుకే సిద్ధగురువులు ముందుగా వారి గత కర్మను నశింపచేసికొని, ఆప్రారబ్ధంయొక్క తీవ్రత వారి స్వంతజీవితాన్ని పీడించకుండా శుభ్రం చేసుకొన్ని పవిత్రమైన మనస్సు, శరీర, అవయువాలు కలిగివుండి, అప్పుడు వాటితో పనిచేస్తారుకనుక, వారు సంకల్పించిన పని, వెంటనే జరగడానికెటువంటి ఆటంకాలులేకుండా జరిగిపోతుంది. గత కర్మయేగదా మన సంకల్పాలకు అడ్డుపడేది.

ఈ గతకర్మను తగ్గించుకోవడానికి -- రెండే రెండు మార్గాలు! ఒకటి ఆకర్మను అనుభవిస్తూ తొలగించడం. ఇది మనమంతా చేసేపని. కాని ఇందులో ఒక కర్మ అనుభవిస్తూనే ఇంకోకర్మ మళ్లీ చేయడం తప్పని సరిగా జరుగుతూవుంటుంది. అందుచేత దీంట్లో తేలేదెప్పటికి! ఇకపోతే రెండవ పద్ధతి -- ఇది సిద్ధగురువులు ఉపయోగించే పద్ధతి! ఇది వారి శిష్యులకు అతిత్వరలో వారి చెడు కర్మను నివారణచేసి ఆధ్యాత్మికంగా వారిని తమకు దగ్గరవానినిగా చేయడానికి వినియోగించే 'అనుగ్రహ' విధానం! ఇది చాలా త్వరగా పనిచేస్తుంది!

మనిషిచేసే పనిమీద మనకివుండే ఆసక్తికి కారణం అందులోని

స్వార్థమే కదా! అందుకని అది తీసివేస్తే చెడు కర్మ నశిస్తుంది!! స్వార్థం అంటే డబ్బూ, వస్తువుల లాభమేకాదు, గౌరవం, గర్వం, నలుగురిలోను పలుకుబడి! లేదా ఆధ్యాత్మిక సిద్ధులేవో కలుగుతాయన్న ఆశ. అలా కలిగితే అందరూ మనలను దేవుడిలాగా లేక దేవుడిగా పూజించాలనే రహస్య కోరిక! -- ఇలాంటి వెన్నో కడుపులో అణగివుండి యీనాడు సాధువుల్లా, సన్యాసుల్లా, అమ్మవార్లు, అయ్యవార్లువుండి "ఆధ్యాత్మిక" పని చేస్తున్నామనుకునే వారిలోని స్వార్థంకూడా మళ్ళీ చెడుకర్మనే సంపాదించిపెడుతుంది. శిష్యుడి దక్షిణకోసం ఆశపడ్డా, అతడి సేవలు మనకు వుండాలని ఆశపడ్డా, వేలమంది శిష్యులు మనల్ని కొలవాలన్న దురాశకలిగినా, ప్రపంచం మన తెలివిని, ఉపన్యాసశక్తిని వాగ్ధోరణినీ, పుస్తకాలు రచించిన మేటి పాండిత్యాన్నీ చూచి ముగ్ధులుకావాలని మనసు మెచ్చుకోవాలని ఆశపడటంకూడా స్వార్థమే!!! ఇవన్నీ ఈ నిస్వార్థకార్యానికి శత్రువులే! ఇలాంటి అనేక రకాల స్వార్థాలనుంచి మనస్సు వదిలించుకుంటేగాని నిత్యజీవితంలో చెడుకర్మని తప్పించుకోవడం సాధ్యంకాదు! కాబట్టి ఈ పరమ గురువులు శిష్యుడినుంచి మొదటగా యాచించే "గురుదక్షిణ", ఈ స్వార్థం!మనయందు మనకుండే సదభిప్రాయం, అభిమానం, అన్నీవదిలేసి కనుక పనిచేయడం జరిగితే చెడుకర్మనివారణవడం రోజులమీద, వారాల్లో జరుగుతుంది.

ఇది ఒక నిగూఢమయిన సాధనా రహస్యం! మామూలు యోగులకు అంతుబట్టని పరమగురువుల మార్గంలోని ఆచరణ రహస్యం. అందుకని శిష్యుడి శరీరాన్ని మనస్సును స్వంత అభిప్రాయాలను ఒక్కట్కొక్కటే నిర్మూలించడానికి యీ పరమగురువులు పెట్టేపద్ధతి సాన-- చెక్కకి చేసే "చిత్రిక" పట్టేటు వంటి మెరుగుపద్ధతి -- పనిచేసే ఫలితం చేసేవాడిది కాదు అన్న నిస్వార్థసేవా సూత్రం! అన్ని కోర్కెలకుగూడు ఆశలకు పుట్ట శరీరమే కనుక దానినే పనిముట్టుగా తీసుకుంటారు పరమగురువులు. అలాంటివాడే

వ్యాసమహర్షి! తన పురాణాలను ప్రపంచంలోకి ప్రచురించడం ఈ పద్ధతితో, సంజయునిద్వారా బహిర్గతంచేయడం జరిగింది.

హిమాలయ పర్వతలోయలలోని రమణీయమయిన చెట్లు, పూలు, పండ్లు ఆకులతో కన్నులపండువుగా ఎదిగిన ఆశ్రమంలో నెమళ్ళూ, జింకలు, కుందేలు పిల్లలు నిర్భయంగా ఆడుకుంటూ ఋషుల తపస్సులో మెత్తని దూదిపింజలాగా స్పర్శకి సుఖం కలిగించే ఆధ్యాత్మిక వాతావరణంలో జీవించే స్థలంలో విశాలమయిన మఱ్ఱిచెట్లుక్రింద ఆశీనుడై, మిలమిలా మెరిసే నీలపు మణులవంటి సెలయేళ్ల అలలు శబ్దంచేస్తూ రాళ్ళను అభిషేకం చేస్తున్నట్లు దొర్లిపోయే ఆ నదీతీరంలో పచ్చని ఆకులలోనుంచి సూర్యుడు పసుపు, నీలి రంగులై పింజలగొడుగు పట్టినట్లుగా పడే ఆ క్రీనీడలు జలతారుక్రింద సుఖంగా ఆశీనులైన మహామునుల సదస్సులో వారికి ఎదుటగా కూర్చునివున్న సూతుని శరీరాన్ని తన పనిముట్టుగా చేసుకొని యావత్పురాణాలూ అతనిద్వారా చెప్పి, అతనిద్వారా తన పురాణ -- సంహితనంతా బహిర్గతం చేసాడు పరమగురువైన వ్యాసమహర్షి.

అలానే సంజయుడి శరీరాన్నికూడా వ్యాసుడు పనిముట్టుగాచేసుకుని దూరాన తన ఆశ్రమంలో ధ్యానంలో నిమగ్నుడైవుండి, తన మనస్సులోనే తాను ఏదో గొణుక్కుంటున్నట్టుగా ఉచ్ఛరిస్తున్న మాటలు, ఆలోచనలూ, శ్లోకాలూ, దూరాన జరిగే యుద్ధంలోని దృశ్యాలు, అతడికి ప్రసారంచేస్తూ అతడిద్వారా ఎక్కడో జరుగుతున్న మహాభారత యుద్ధంలోని సంఘటనలు గుడ్డివాడైనా ధృతరాష్ట్రునికి తెలియజేస్తూ వారిద్దరి సంభాషణనీ మళ్లీ తాను ఇటు దివ్యదృష్టితో సేకరించి అక్కడి సూతుని మనస్సుద్వారా మహాభారతాన్ని ముఖస్థంగా చెప్పించి తద్వారా తన పనిని పరమగురువుగా లోకహితార్థం నిర్వహించాడు వ్యాసమహర్షి!

ఇది ఎలావుంటుందో మనం ఊహిస్తేనే తెలుస్తుంది. దూరాన

ఎక్కడో యుద్ధం జరుగుతోంది! చైనాసేనలు భారత సేనలపై బాంబులు కురిపిస్తున్నాయి. టిబెట్టు సరిహద్దులో యుద్ధం ముమ్మరంగా సాగిపోతోంది. అదంతా చెట్టుకిందా గుట్టలకిందా నక్కిన సైనికులు రేడియోప్రసారాలు చెవులకి పెట్టుకొని మైకుద్వారా ఎప్పటి వివరాల్ని అప్పుడు ఢిల్లీలోని తమ పై అధికార్లకు చేరవేస్తున్నారు. ఇంకోపక్క టెలివిజనులో వేలాది సెట్టులలో కనిపించే యుద్ధాన్ని ఎవరింట్లోవాళ్ళు చూస్తున్నారు. సమాచారశాఖ ఆఫీసులో ఒకవ్యక్తి కూర్చుని ఈటెలివిజనులోని బొమ్మలలోదీ,అటు రేడియో ప్రసారాలలో వచ్చిన రహస్యగూఢచారి సమాచారమూ, అటు అధికార్లు ప్రభుత్వంతో చేసే సమాలోచనలోని నిర్ణయాలనూ, అన్నీకలిపి క్రోడీకరించి వ్రాసిన "న్యూసు"గా వార్తాప్రతికలో మర్నాడు మనందరమూ చదువుతున్నాం గదా? ఇందులో టెలివిజన్ వంటివాడు సంజయుడు! సూతుడు ప్రతికలవార్తలు క్రోడికరించేపనిముట్టు! వ్యాసుడు మనసుతో వార్తల్ని పంపగా కాగితంమీద అచ్చులో మనకందించేవాడుగణపతి. ఈ సమాచారం ఏకీకరణంచేసి కథగా రూపొందించినవాడే ఈ వ్యాసుడు. ఇందులో ఎవరుచేసిన పాత్ర ఎంతో ఏమిటో అందులో తనపాత్ర ఏమిటో స్పష్టంగా తెలిపేలాగా జరిగేయుద్ధాన్ని వ్యాసుడు రాసాడు, వార్తలుగా. అందుకే తను వ్రాసిందానిలో తానే పాత్రధారిగా వస్తాడు. అందరూ ఈ నిర్వహణలో వారివారి పాత్రలు పనిముట్లవలె నిర్వహిస్తారు. వార్తాపత్రిక సిబ్బందిలాగే, ఇది వారి స్వంత పనికాదు. అదివాళ్ళకు ప్రయోజనం, లాభంలేనిపని, నిస్వార్థసేవగా గురు దక్షిణగా చేశారు! తద్వారా వాళ్ళ కర్మకరిగి నివారణ అయి వాళ్ళు తరించి తమగురువులో భాగంగాలీనమై ఆయన మనస్సు ఇంద్రియాలు శరీరంగా పనిముట్టుగా మిగిలిపోతారు - వారి ఆత్మలు ఎప్పుడో వ్యాసునితో లీనమై పోగా ఎప్పుడో ముక్తిపొందిన జీవన్ముక్తులుగా! ఇదే, పరమగురువులు పనిచేసే విధానం ఇదే వారిచ్చే సాధనా మార్గం. అదే వ్యాసమహర్షి శిష్యుల ద్వారా మహర్షి మండలిద్వారా చేసిన సాధన ఆధ్యాత్మిక ప్రక్రియ ఇదే వ్యాసమహర్షి మహాభారత

రచనచేసిన విచిత్రవిధానం!

సరిగ్గా అదేవిధానంతో పరమగురువులలో అగ్రగణ్యుడైన వేదవ్యా సమహర్షి ఏవిధంగా తన దివ్యదృష్టితో చూసి, కురుక్షేత్రంలో అక్కడ జరుగుతున్న మహాభారత సంగ్రామాన్ని తానిక్కడ ఆశ్రమంలోనే కూర్చుని యోగసమాధిలో దర్శిస్తూ ఆ పనికి అంతరాయం లేకుండానే ఎదురుగా కూర్చొని శరవేగంతో వ్రాస్తున్న గణపతికి ధారాపాతంగా కవిత్వపటిమ చెడకుండా శ్లోకాలు పుంఖానుపుంఖాలుగా వర్షిస్తూ అదే సమయంలో ఇంకో ప్రక్క ధృతరాష్ట్రునికి తోడుగా సంజయుడిని కూర్చోబెట్టి, దివ్యదృష్టిని ప్రసాదించిన ఆ సంజయునికే జరిగే యావత్తు యుద్ధమూ ఒక వంక చూపెడుతూనే, అతని నోటినుండి వెలువడే మాటలు, శ్లోకాలు, వర్ణనల్లోనే, సంజయుని పాత్రగాజేసి తానువ్రాసే 'భగవద్గీత' లోనే అతని శరీరాన్ని ఉపయోగించి ఆశువుగా రచనచెయ్యటం జరిగిందన్న రహస్యం ఎందరికి అంతుపట్టుతుంది? 'ప్లావెట్స్' ద్వారా పరమగురువులు తమ గ్రంథాలను వ్రాయించట మేకాక షిరిడీ సాయినాధుడు కూడా తన భక్తుడు హేమాద్‌పంతు బాబాచరిత్రను వ్రాయలేని స్థితిలో 'నీ చెప్పులు విడువు' అందులోకి నేను ప్రవేశించి నీ పని నేనే చేస్తాను" అని తానే ఆగ్రంథం ఎలాపూర్తిచేసారో కూడా తెలుస్తుంది. ఇది పరమగురువులతో సన్నిహిత సంబంధం వుండి వారికి సర్వస్వశరణాగతిచేసి తన మనస్సులోని ఆలోచనలు వదలివేసి తన మనస్సుతోపాటు శరీరాన్నికూడా ఒక పనిముట్టుగా సమర్పించిన భక్తులకే ఇలాంటి ఆశ్చర్యకరమైన 'గ్రంథరచన' అర్థం అవుతుందిగాని మరొకరికి ఎలాగ తెలుస్తుంది! తెలియటానికి కావలసిన అనుభవం ఎక్కడిది వారికి? తెలియటానికి కావలసిన గురు అనుగ్రహం ప్రసాదించటంతోనే సాధ్యం. అట్టివారు ధన్యులు.

అలాగే ఒకప్పుడు శ్రీరమణమహర్షివారి భక్తులూ శిష్యులూ అయిన 'కావ్యకంఠ వశిష్ఠగణపతి ముని'కి ఇదే, జరిగింది. తెల్లవారేలోగా

తాను దీక్షగా పెట్టుకున్న 'ఉమాసహస్రం' పూర్తికావల్సిన గడువు అర్ధరాత్రి అయింది. ఎక్కువ వ్యవధిలేదు. ఆయనవెళ్లి మౌనంగా రమణ మహర్షి ముందు మోకరిల్లారు! తన దీనస్థితిని మనస్సులోనే వారికి నివేదించుకుంటూ శ్రీరమణులు ఒక్కసారి నవ్వి ధ్యానస్థితులయినారు. కావ్యకంఠుల కలం శరవేగంతో ముందుకుపోతుంది. ఒంటిమీద స్పృహలేకుండా! అలా ఎంతసేపయిందో ఎవరికీ తెలియదు. తెల్లవారవస్తూవుంటే రమణ మహర్షి కళ్ళుతెరిచి 'మీరు శ్లోకాలన్నీ సరిగ్గా వ్రాసుకున్నారా?' అని ప్రశ్నించారు. కావ్యకంఠులు త్రుళ్లిపడి చకితులయ్యారు. అంతకుముందు తాను వ్రాసుకుపోతున్న శ్లోకాలన్నీ ఆశువుగా భగవానే చెప్పినవని (పెదవి కదల్పకుండా) తెలిపి, ఎట్టకేలకు ఆ సరిగానే వ్రాసుకున్నాని సమాధానం యిచ్చారు కావ్యకంఠులు.

అప్పుడు భగవాన్ నవ్వి -- "పైన ఫలానా నంబరు, శ్లోకంలో ఈ పదం తప్పువ్రాసుకున్నారు దిద్దండి!" అని సరిచూపి తప్పులు దిద్దినప్పుడు తన ఆశ్చర్యానికి అంతులేదు అట్టిది, అద్భుత మహిమగల పరమగురువు పనిచేసే తీరు.

ఇవన్నీ మనస్సులో పెట్టుకొని గనక మనం యోచించితే ఇప్పుడర్థమవుతుంది -- ఇన్ని పురాణాలు యింతమంది మునులను వక్తలుగా పెట్టి, వారిద్వారా ఒక్కసారి తానే రచయితగా వుండి, వ్యాసమహర్షి ఎలాగవ్రాశారో, శుకయోగిద్వారా భాగవతం అలానే సూతునిద్వారా భారతం, శతానీకుని ద్వారా భవిష్యపురాణం, వైశంపాయునిద్వారా సకల పురాణ కావ్యసంపదా -- ఇటు, తన ఆశ్రమంలోంచి తాను కదలకుండానే వ్యాసమహర్షి మానవజాతికి ఎలాగ పురాణాలలోని పాత్రలయిన కుంతికి ధర్మజునికి తదితరులకూ మళ్లీతాను తలచినప్పుడు ఆ తల్లికీ దర్శనమిస్తూ తాను వ్రాసే పురాణంలో తానే పాత్రగా గ్రంధకర్తగా, వక్తగా ఎలానిర్వహించాడో!

ఇదే పరమ గురువుగా వ్యాసులవారు ప్రదర్శించిన దివ్యలీల! ఇది

జరిగిన విధానం ఇప్పుడీ జ్ఞానంతో మళ్లీ ఆ పురాణాలు చదివితే మనకి ప్రతీ అంశం మెరుపులా తెలుస్తుంది! ఈ రహస్యం తెలిస్తేకాని తెలియదు భారతంలో ఒకే శ్లోకంతో అన్ని పర్వాలూ, ఎందుకారంభం అవుతాయని! అందుకే వ్యాసుడు ప్రతి అధ్యాయంలోనూ మొదటి ప్రార్థన 'పరమగురుమండలి'కి గురువైన నారాయణ ఋషికే ఆ శ్లోకంతోనే చెయ్యటంలోని రహస్య ప్రయోజనం!

పరమగురువులందరి మనస్సులూ వారిశరీరాలూ వారిమండలికి గురువైన నారాయణ ఋషికి పనిముట్లు! ఇందరు ఋషులూ వారి శరీరాలుగానే పనిచేశారు. తర్వాత వ్యాసమహర్షి కలియుగం ఆదిలో సర్వశాస్త్ర పరిరక్షణకోసం నిర్వహించిన 'మహోయజ్ఞం'లో సమిధలవంటి వారే ఈ పరమ ఋషులు దానికి హోమకుండంలాంటివాడు వ్యాసమహర్షి! ఇందులో వెలిగిన జ్ఞానాగ్నియే వేద విజ్ఞానం. అందుకే వ్యాసమహర్షి ప్రతీ అధ్యాయంలోనూ మొదటగాచేసే ప్రార్థన పరమగురువుల మండలికి ఆది గురువైన నారాయణ ఋషిని స్తోత్రం ఒక్కటే చేయడంలోని రహస్యార్థము.

ఈ ప్రార్థనకొక రహస్య ప్రయోజనంకూడా ఉంది. పరమగురువులందరి మనస్సులూ, వారి శరీరాలూ తమ గురుమండలికి ఆది గురువైన నారాయణ మహర్షికి పనిముట్లు!!! అంటే వారిశరీరాలద్వారా నారాయణ ఋషి పనిచేస్తాడు! ఇంతమంది ఋషులూ, వారి మనస్సులూ, వారి మనస్సులోంచి వచ్చేమాటలు, చేతలు, అన్నీకూడా నారాయణ ఋషి సంకల్పానికి పనిముట్లు! వారు మనస్సును గురువునకు అర్పించి స్వంత సంకల్పం లేకుండా పూర్తి శరణాగతిచేసి వ్యక్తిగా తాను గురువులో లయించిపోతాడు. గురు సంకల్పమే శిష్యుడి శరీరంద్వారా ఏకవ్యక్తిగా పనిచేస్తుంది. ఈ విధానాన్నే మళ్లీ భూమిమీద పునరుద్ధరించాడు వ్యాసమహర్షి! ద్వాపర యుగంచివర కలియుగం ప్రారంభంలోని 'యుగసంధి' కాలంలో జరిగిన మహాఋషుల సదస్సుద్వారా, ఇలాగ 8,800 మహర్షులు 12 సంవత్సరములపాటు

ఒక్కచోటచేరి వారిలోని తపశ్శక్తిని ధారపోసి అందరి మనస్సులూ, అందరిలోని వేదవిజ్ఞానము అందరి ఋషుల పరిశ్రమనూ ఏకాగ్రతతో ఒక్కటిగాచేసి ధారపోశారు - మహాయజ్ఞంలో పూర్ణాహుతి సమయంలో ధారపోసిన ఆజ్యధారలాగ! ఈ మహాయజ్ఞంలో సమిధలవంటివారే పరమ ఋషులు!! హోమగుండంలాంటి వాడే వ్యాసమహర్షి!! అందులో వెలిగిన జ్ఞానాగ్నియే వేద విజ్ఞానం.

ఎందుకంటే హోమగుండంలో మండే సమిధలు వేరైనా, వాటిలోని అగ్ని ఒక్కటే! సమిధలన్నింటినీ కలిపే జ్వాల ఒక్కటిగా వెలిగినట్లు, ఈ మహర్షుల శరీరాలు బైటకి చూడటానికి వేరు వేరుగా ఉన్నా వారి మనస్సులన్నీ ఏకస్థమయి వారి జ్ఞానం అంతా కలిపి ఒకే మనస్సుద్వారా ఒకటే జ్వాలగా వెలుగొందింది! ఈ ఆధ్యాత్మిక జ్యోతియే మహర్షుల జ్ఞానాగ్ని! అదే ఈనాటికీ లోకాలను వెలిగించే వెలుగుబాట!

ఈ చీకటి కాలమైన కలియుగం వస్తుందని ముందుగానే గ్రహించి వ్యాసుడు వెలిగించిన అఖండదీపమే ఈ 'మహర్షుల సదస్సు' దాని వెలుగులోని సన్నని నెరుసులే ఈనాడు మనకి మార్గదర్శకాలుగా నిలిచివున్న వేదాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ, భగవద్గీతా, బ్రహ్మ సూత్రాలూ, యోగశాస్త్రంవంటి ప్రాచీన విజ్ఞానం అంతా! వాటిని రచించినదీ 'విచిత్ర - రచనావిధానం' ఒక యోగప్రక్రియ! దివ్య -- లీల! అది తెలుసుకోవాలి! తెలుసుకుంటే తరిస్తాము మనంకూడా!!



10

# సృష్టి పరిపాలనలో పరమగురువులు!

ఈ అధ్యాయములో వ్యాసమహర్షి పాత్రను ఒక విచిత్రమైన కోణంనుంచి పరిశీలిద్దాము. అదేమిటంటే 'పరమ గురువుగా' యీ భూమ్మీద వ్యాసమహర్షి నిర్వహించిన పాత్ర. అది ప్రపంచ ఆధ్యాత్మిక కార్యక్రమములోని మానవజాతి పరిణామానికి సంబందించినది. అంటే పైలోకాల్లో జరిగే 'దైవనిర్ణయం' ప్రకారము యీ భూమ్మీద జరగవలసిన దానిని పరమగురువుగా ఎలా నిర్వహిస్తాడు అన్న విషయము.

## ఎవరీ పరమగురువులు?

ఈ విషయము అర్థం చేసుకోవాలంటే యీనాటికి సైన్సునీ,

ప్రాచీన ఋషుల యోగశాస్త్రాన్ని కూడా కలిపి అర్థం చేసుకోవాలి. అప్పుడే యీ పరమ గురువులు మానవ పరిణామములో నిర్వహించే పాత్ర ఏమిటో తెలుస్తుంది. అసలీ 'మానవ పరిణామం' అంటే ఏమిటి? ఇది తెలియాలంటే యీ జగత్తుయొక్క పరిణామం గురించి తెలియాలి. అప్పడే యీ జగత్తులో మానవుడుకుడా ఎలా పెరుగుతున్నాడో తెలుస్తుంది.

## ఈ జగత్తుయొక్క పరిణామం:

ఈ ప్రపంచములో ప్రతి అణువూ 'పరిణామం' చెందుతోందని యీనాటి "సైన్సు (Science) చెబుతోంది. 'రసాయన,' 'భౌతిక' శాస్త్రాలద్వారా! యీ ప్రపంచములో సప్తలోకాలున్నాయని వేదాలు చెబుతున్నాయి. "సైన్సు"కూడా ఏమి చెబుతోందంటే పదార్థంలో భౌతిక పదార్థంకూడ ఏడు కక్ష్యలలో పరిణామం పొందుతోందని! అంటే రాళ్ళు ఖనిజాలూ, బాగా అట్టడుగుదశలో వున్నాయి - దానిపై దశలో ద్రవరూపములో, అంటే నీళ్ళరూపములోవున్న సృష్టి, 'అణుసృష్టి' ఇంకా ఆపైన 'తరంగాల' రూపము ( Current Magnetism) తో నున్న 'శక్తి' దానిపైన తెలివితేటలూ, మనస్సూ, ఆపైన ఒక విశ్వచైతన్యమైన "తెలివి"(Universal Intelligence) ఇలా ఒక్కొక్కటే వున్నాయి. ఈ విశ్వంలోవున్న ప్రతిదీ ఇలాగ అడుగునుంచి పైదాకా చూస్తే ఒక క్రమములో వున్నాయి. నిచ్చెనలోని మెట్లలాగ ఇది పదార్థముయొక్క పరిణామం:

## గ్రహాలు - ఖనిజాలు

ఇలాగ, యావత్‌సృష్టి, అరలుగా అమర్చబడివున్నది. అంటే గ్రహాలు, ఖనిజాలు, జీవులూ అన్నీ ఇలా అంతస్తులు క్రింద తీర్చిదిద్దబడి వున్నాయి. ఈ వస్తువులన్నీ కలసి మళ్ళీ మన శరీరముగా ఏర్పడుతుంది. బైటవున్న ఖనిజాల వలన ఎముకలు ద్రవరూపము

రక్తము, బైటవున్న 'కరెంటు'(Electricity) వల్ల "ప్రాణం," కదలికా, 'ఆకాశం' (Space) వల్ల మనస్సూ, ఆలోచనలూ ఏర్పడుతున్నాయి. అంటే ప్రపంచములో "పదార్థం" ఉనికిలో ఎన్ని పొరలున్నాయో అవన్నీ కలిసి, మనిషిగా తయారౌతున్నాడు. దేనితో మనిషి తయారవుతున్నాడో ఆ మనిషిలో అన్ని పొరలూ వున్నాయి. ఆలోచించే మనస్సు దగ్గరనుంచి ప్రపంచములో తయారైన 'ఆలోచించని' ఎముకలూ, జడ పదార్థమూ, అన్నీ పైనుండి, అంటే పరబ్రహ్మనుండి "శక్తి"గా క్రిందకు దిగేటప్పుడు ఆ నిచ్చెనలో 'మెట్లుగా' అన్నీ అవసరమే! ఈ జగత్తులోని పదార్థం ఇలాంటి మెట్లు మెట్లుగా గ్రహాలుగా అవతరించి, మనుష్యులుగా అవతరించి, ఇది క్రిందకి దిగివచ్చి శక్తి (Energy) ని పదార్థముగా (Matter) అంచెలుగా క్రిందకి అవతరణము జరిగే మెట్లే, "పదార్థ పరిణామం" (Evolution of Matter)లోని దశలు.

అంటే ఈ జగత్తును సృష్టించిన 'శక్తి' లేక విశ్వచైతన్యము, పైనుంచి క్రిందకు దిగేటప్పుడూ తానే ఈ ప్రపంచములోని అనేక వస్తువుల రూపాన్ని ధరించి మెట్లుమెట్లుగా ఈ జీవరాసుల శరీరములో దిగటము జరిగింది. ఆ తర్వాత నిర్జీవముగా కనపడేరాళ్ళు, ఖనిజాలు, ధాతువుల రూపము ధరించిన ఈ జగత్పదార్థం ప్రాణులుగా పెరిగి శరీరాలను నిర్మించుకున్నది. ఇలాగ తను నిర్మించుకొన్న శరీరాలలోనే తాను ప్రాణముగా ప్రవేశించి మనస్సుగా ఆలోచనలను రేపి, ఆత్మగా ఈ అంతటినీ అర్థము చేసుకోటానికి ప్రయత్నిస్తున్నది కూడా ఈ జగత్తుయొక్క పరిణామమే.

పదార్థమే ప్రాణంతో 'కదలితే' చెట్లుగా రూపొందుతున్నాయి! ఆ పదార్థమే మనస్సుతో కలిసి జంతువులుగా ఏర్పడుతున్నది. అలానే 'ఆలోచించే - పదార్థమే' మానవుడుగా ఏర్పడి తనను తాను తెలుసుకొన్న పదార్థమే మానవునికన్న పై మెట్టుగా వున్నది. ఇది ఒక నిచ్చెన. ఈ నిచ్చెనలో మెట్లుమెట్లుగా ప్రాణులూ, చెట్లు, జంతువులు, మానవులుగా ఏర్పడి ఉన్నాయి. ఇది జగత్పరిణామము.

ఇలా ఏర్పడిన సృష్టిక్రమములో అటు జడపదార్థానికి - ఇటు ఆలోచించే 'మనస్సుకూ' మధ్యలో కొంత ఖాళీ వున్నది. పరిణామంలో కొంత 'ఎడం' పదార్థానికి మనస్సుకి ఉన్నదన్నమాట. ఈ జగత్తులో ఒకగ్రహానికి రెండో గ్రహానికి మధ్యన సంభంధము (Connection) వుంటుంది. ఇవన్నీ ఒక ప్రాణం గలిగిన యంత్రం లాంటివి (Organism) యీ "ప్రాణికేంద్రమే" సూర్యునికి అధిపతియై సూర్యుని లోపల వుండే "సిద్ధపురుషుడు" అతడే సూర్యాంతర్వర్తి.

యీ సిద్ధపురుషులుకూడా వ్యక్తులేనని చెప్పాను. ఎందుకంటే వారికికూడా "ప్రాణం" వుంటుంది, "ఆత్మ" వుంటుంది; మనస్సు వుంటుంది. అయితే వారి "మనస్సు" మనమనస్సుకంటే, వారి ప్రాణం మన ప్రాణం కంటే కొన్ని కోట్లరెట్ల ఎక్కువ శక్తి (Power) కలిగి వుంటాయి. అలాగే, వాళ్ళ శరీరములో ఉద్భవమౌతున్న శక్తి "కరెంటు" లాగ వారి ఆధీనములో తిరిగే గ్రహాలకు, శక్తినిచ్చి "ప్రాణాన్నిచ్చి" ఆ గ్రహాలను నడిపిస్తోంది! ఈ గ్రహాలుకూడా జీవించే వున్నాయి. గ్రహంలోనిది నిర్జీవమైన పదార్థము (Matter) కాదు, మనమనుకున్నట్లుగా కాకుండా వీటికి ప్రాణము వుంది. వీటికి "ఆయువు" వుంటుంది. నిర్జీవమైన గ్రహము ఇంకొక గ్రహాన్ని ఢీకొని, వంద సంవత్సరాలలో నాశనమై పోతుంది ఇదే గ్రహాల ప్రళయం!

అలా కదలిక గలిగి తన చుట్టూ తాను తిరిగే "పరిభ్రమణం" (spinning) కలిగి వున్నవే - "జీవించి వున్న గ్రహాలు! అలా కాక నిర్జీవమైన వాటికి ఒక్క "భ్రమణం" (Revolution) అంటే సూర్యుని చుట్టూ తిరగటము మాత్రమే వుంటుంది. తనచుట్టూ తాను తిరగదు. చంద్రునికి దాదాపు పరిభ్రమణము లేదు. అలా నిర్జీవమైన గ్రహము మీదవున్న ప్రాణకోటి నశించిపోతుంది. అలా కొన్ని సృష్టులు నశింపు అయ్యాక ఆ గ్రహము "మహాప్రళయం"లో పూర్తిగా నశించి పోతుంది. అలాంటివి మన సూర్యుని చుట్టూ కొన్ని తిరుగుతున్నాయి. ఇప్పటికీ పూర్వపు తమ ప్రళయాలకి గుర్తుగా!

ఇవే "ఆస్టరాయిడ్స్" (Asteroids) లేక "గ్రహశకలాలు" అవి బ్రద్దలై ఏనాడో ముక్కలక్రింద పగిలి, ఆ తునకలే ఆకాశములో ఇంకా తేలుతున్నాయి! చంద్రుడు దాదాపు నిర్జీవమై వున్నాడన్నాము. ఈ చంద్రుడు భూమికి దూడలాంటివాడు. భూమినుండి వచ్చే "శక్తిని" తీసుకొని ఆ శక్తితో తనచుట్టూ తాను తిరగడము ప్రారంభిస్తే అలా కొంత కాలానికి చంద్రగోళం పెరిగి భూగోళమంత అవుతుంది అక్కడి ఉష్ణమూ (Temperature) దానివల్ల పెరుగుతుంది. వాతావరణము కూడా మారుతుంది. దాంతో ఈ భూమి వేగము తగ్గిపోయి, భూమి ఆయుఃప్రమాణం అయిపోయి, ఇక్కడేమో ప్రళయము వస్తుంది. అక్కడ "సృష్టి" ప్రారంభమవుతుంది. ఇక్కడ ప్రళయము!! ఇలా ఒక గ్రహము యొక్క పరిణామము మరొక గ్రహముయొక్క నిర్మాణము రెండూకూడా చేస్తుంటారు - ఈ "లోకపాలకవర్గం" ఈ ప్రళయము సంభవించినప్పుడు ఇక్కడి జీవుల్ని అక్కడికి మారుస్తుంటారు. ఇదీ వారిపని.

ఈ "లోకపాలకవర్గం"లోని పరమ గురువుల సంకల్పంవల్లనే యీ గ్రహాలు ప్రతి యుగానికీ వేగం మార్చి తదనుగుణముగా తిరుగుతుంటాయి. ఎప్పుడు కావాలంటే అప్పుడు వాళ్ళు తమ సంకల్పబలముతో ఒక గ్రహాన్ని పేల్చివేయగల్గుతారు. జీవించియున్న గ్రహాలలో మధ్య 'అగ్ని' (Lava) వుంటుంది. అది లేకపోతే ఒక సీసం ముద్దలాగ చల్లబడి 'నిర్జీవం' అయిపోగానే, ఆ గ్రహము మీదవున్న గ్రహాధిపతియైన "సిద్ధపురుషుడు" తన సంకల్పముతో దాన్ని పేల్చివేస్తాడు మన భూమికి ఇతర గ్రహాలనుండి వచ్చే 'శక్తి' ఉత్తర ధృవంనుండి దిగి ప్రవేశించి అది దక్షిణ ధృవం ద్వారా బయటకు వస్తుంది. ఆ శక్తినే వ్యతిరేకముగా 'కనెక్షన్'(connection) చేస్తే దానితోనే భూమి పేలిపోతుంది - కరెంటులో "ఫ్యూజు" పోయి 'Short - circuit' అయినట్లుగా.

ఇలాగ ఈ "లోకపాలకవర్గం" యీ సృష్టి నడవడం కోసము

మరో గోళము నుండి భూగోళానికి, భూగోళాన్నుండి మానవజాతికీ, మానవజాతిలో ఎవరి శరీరాలైతే రెడీగా, పవిత్రముగా వుంటాయో వారి శరీరాల్లో నుంచీ యీ భగవచ్ఛక్తిని "కరెంటు"లా ప్రవహించేందుకు దారులేర్పరుస్తుంటారు. ఆకుతీస్తే లోపల యీనెలు ఎలా వుంటాయో, అలాగే మానవజాతిలో కూడా అందరూ మానవులే అయినప్పటికి, "యీనెల్లాంటి" వ్యక్తులు కొందరుంటారు. వీళ్ళే "సాధకులు"* ఈ సాధకులు శరీరానికి ఒక గొప్ప ప్రయోజనము. ఒక రాగితీగ కరెంటు తీగగా ఒక light వెలిగించడానికి ఎలా ఉపయోగపడుతుందో అలానే వీరు మానవజాతి కళ్యాణానికి శరీరాలతో ఉపయోగపడ్తారు. వీరి 'శరీరాల' ద్వారా లోకపాలకులు యీ మానవజాతి బ్రతకడానికి నిలవడానికి, వృద్ధి కావడానికి కావలసిన "ఆధ్యాత్మిక శక్తి' 'ప్రసారము చేస్తారు!

ఇటువంటి సాధకులు తమ స్వంత ఆలోచనలు లేనివారై వుండాలి. లేకపోతే యీ శక్తి ప్రసారానికి వారి స్వంత ఆలోచనలు అడ్డు పడి ప్రసారము అంతరాయం ( Communication gap) ఏర్పడుతుంది. ఆలోచనలను స్తంభింపచేసిన వీరి మనస్సునుండి ఆ సిద్ధపురుషులు ప్రసారము చేసే శక్తి ఒక వల (network) క్రింద వెలువడుతుంది. అప్పుడు అటువంటి వ్యక్తిద్వారా ఇతరులకు రోగాలు తగ్గించవచ్చు. ఎంతటి జ్ఞానాన్నైనా కలిగించవచ్చు. కాని సాధకుడిది కాదాశక్తి, ఆ శక్తిని గురువులు అతని శరీరాన్ని పనిముట్టుగా చేసుకుని ప్రసరింపచేస్తారు.

విశ్వములో యీ లోకపాలకవర్గంపని ఎలాంటిదంటే - శరీరంలో గుండె, ఎలాగైతే రక్తనాళాల ద్వారా, రక్తాన్ని అన్ని అవయవాలకి సరఫరా చేస్తోందో, అలాగే సాధకులు తమ శరీరాల ద్వారా

---

* ఇక్కడ "సాధకులు" 'శిష్యులూ' భక్తులూ అనే మాటలకు ప్రత్యేకమైన అర్థము వున్నది! మామూలు మాటలతో అందరూ వాడే సాధకులనిగాదు అర్థం : సిద్ధుల - యోగపరిభాషలో అర్థం చేసుకోవాలి?

ఈ ప్రాణశక్తిని, ఆధ్యాత్మిక శక్తినీ ధారబోసి, పంపుచేసి తద్వార లోకకల్యాణం నిత్యము చేస్తువుంటారు. అలా వాళ్ళిచ్చే శక్తిని ప్రసారము చెయ్యటము ద్వారానే సాధకుడు తరిస్తాడు! శరీరంలోంచి ప్రసారమయ్యేది "శక్తి" గనక, దానివల్ల సాధ్యము కానిదంటూ ఏమీలేదు.

ఇది లోకపాలకవర్గం యొక్క కార్యము. ఇక పరమగురు మండలి ఈ లోకపాలకవర్గములో ఒక శాఖ. పూర్వయుగాలలో మనుషులు సిద్ధపురుషులూ, దిక్పాలకులు, సాధ్యులు మొదలైన దేవతాంశకల వ్యక్తులు కలిగిన ఒక 'పరిపాలకవర్గమే' ఈ లోకపాలకవర్గం. సరిగ్గా చెప్పాలంటే మన శరీరాన్ని జీవించి ఉండేలాగ చేయడానికి మన శరీరములోని అవయవాలు ఎలా పనిచేస్తున్నాయో - సరిగ్గా అలా పనిచేసేవారే ఈ ప్రపంచ పరిపాలనను నడిపించే "లోకపాలకవర్గము" మన మనస్సు మనము చేసే ప్రతి పనిని మనలోపలనుంచే ఎలాగ నిగ్రహించి "కంట్రోల్" (control) చేస్తున్నదో అలాగ మానవజాతిని నడిపించేవారు ఈ "పరమగురు మండలి"!

అంటే ఈ జగత్తులో పనిచేసే "అవయవాల" వంటివారు లోక పాలకవర్గము అయితే, యీ జగత్తును నడిపే అంతఃకరణ, లేక "మనస్సు" వంటి వారు పరమ గురువులు, యీ పరమగురు మండలికి గురుస్థానమే "వ్యాసపీఠం". పరమగురు మండలికి అధ్యక్షుడైన వ్యాసుని శరీరములోంచి అంతర్యామియైన నారాయణ ఋషి పనిచేస్తాడు. యీ రహస్య విధానము అంతా మహామునుల యోగ మండలి" లోనూ ఇంకా ఇతర చోట్లా వివరించబడింది.

యీ పరమ గురువులు పదార్థముపైన పరిపూర్ణ సిద్ధిని సాధించిన వారు. దూరమూ, కాలమూ వీరికి అడ్డు రాలేవు. అంతెందుకు? పదార్థమే వీరి శరీరాలను అడ్డలేదు. ఉదాహరణకు ఒక పర్వతములోంచి యీ పక్కనుంచి ఆపక్కకు నడిచి పోగలరు - పొగమంచులోంచి మనము నడచినట్టు సినిమా తెరపైన బొమ్మలలోని యుద్ధాలు, బాంబులు,

మనల్ని అపకారము చేయలేనట్లుగానే, యీ బయట ప్రపంచములోని ఆయుధాలు, అస్త్రాలు యీ పరమ గురువులను ఏమీ చేయలేవు. ఎందుకంటే యీ ప్రపంచము అంతా పదార్థముతో తయారైవున్నది గదా. ఈ విషయము 'సైన్సు' కూడా ఒప్పుకుంటున్నది. అణువుల మధ్యగల సందులలో నుంచి పరమ గురువుల శరీరాలు తేలికగా దూసుకొని పోగలవు - గాలి దుమారంలోని ధూళిరేణువులలోనుంచి మనం నడచివెళ్ళినట్టుగా. అందువల్లనే యీ పరమ గురువులు ఒకేసారి అనేకచోట్ల ఏకకాలములో దర్శనము ఇవ్వగలుగుతారు ఈ రహస్యము తెలిస్తే వ్యాసమహర్షి జీవితములోని అద్భుత సన్నివేశాలెన్నో అర్థమవుతాయి.

ఇందులో అనేక నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యాలూ, దేవరహస్యాలూ, ఇమిడివున్నాయి. ఇవి, చాలామందికి తెలియని రహస్యాలు అవటంవల్ల ఈ విషయాలను గురించి కొంత పరిచయము లేకపోతే వ్యాసమహర్షి విషయాలు అర్థం చేసుకోవడం సాధ్యపడదు. ఉదాహరణకు వ్యాసమహర్షి తాను ఒకవంక ఇటు తన ఆశ్రమములో శిష్యులకు వేదాధ్యయనం నేర్పిస్తూనే, ఇంకొకవంక అకస్మాత్తుగా కొన్ని వందలమైళ్ళ దూరంలో ఎక్కడో జరుగుతున్న విపత్కర పరిస్థితిలో ఎవరినో రక్షించి ఆదుకోడానికి క్షణకాలంలో అక్కడ వారిముందర సాక్షాత్కరించడం, అలాగే మరోసారి అశ్వద్ధామ తాను ప్రయోగించిన అస్త్రాలు నిరుపయోగమైపోగా ఆధ్యాత్మిక శక్తులపైనే నమ్మకము నశించి నిరుత్సాహపడిన సమయములో వ్యాసమహర్షి అక్కడ దర్శనమిచ్చి, అప్పుడు అలా జరగటానికిగల ప్రత్యేక కారణాలను తెలియపరచడం వంటివి ఎన్నో సన్నివేశాలు - భారతము ఇటు నుంచి అటు వెతికితే - లెక్కలేనన్ని కనిపిస్తాయి.

ఇలాంటిదే ఇంకో ఆశ్చర్యకరమైన విశేషం కూడా వ్యాసమహర్షి జీవితము చూస్తే మనకి కనపడుతుంది. అదేమిటంటే ఎక్కడా వ్యాసమహర్షియొక్కనిర్యాణము ఎలా జరిగిందో చెప్పబడలేదు. శ్రీకృ

ష్ణుడు అవతారమూర్తియని తెలిపి, ఆయన నిర్యాణము ఎలా జరిగిందో వర్ణించబడ్డది. జీవించి ఉండగానే ముక్తుడైన శుకయోగి పరీక్షిత్తునకు భాగవతమంతా ఉపదేశించి, చివరికి నిర్యాణము పొందిన విధానమూ, భీష్ముని స్వచ్ఛంద మరణమూలాంటి సన్నివేశాలెన్నో వర్ణించి వుండగా వ్యాసమహర్షి నిర్యాణము ఎక్కడా ఎందుకు వర్ణించబడలేదు? వ్యాసమహర్షి గ్రంధ కర్తగనుక ఆయన నిర్యాణము ఆయన గ్రంధాలలో ఎలావుంటుంది అనుకోవచ్చు. కాని ఈనాటి భారత భాగవతాలలో అనేక విషయాలు వ్యాసుని శిష్యులు ఆ పురాణాలను అధ్యయనం చేసి, జనమేజయుని సర్పయాగ సమయములోనూ, అలాగే సూతుడు శౌనకాది మహర్షులతో నైమిశార్యణంలోనూ చెప్పిన మాటలలోనైనా వ్యాసుని నిర్యాణము గురించి ఎలా జరిగిందో తెలపలేదు. వ్యాసుని జననము చెప్పినట్టుగా దీనికో నిగూఢమైన కారణము ఉన్నది. ఎందుకంటే వ్యాసుడు చిరంజీవి.

ఇది అశ్వత్థామ బ్రహ్మాస్త్రం ఉపసంహరించుకోలేని సన్నివేశములో * వర్ణించబడింది. అటు వ్యాసుడు, ఇటు అశ్వత్థామా కలియుగాంతం వరకు ఎలాగ "చిరంజీవులు" గా ప్రచ్ఛన్న వేషాలతో భూమ్మీద సంచరిస్తూ ఉంటారో అన్నవిషయం, వీరిలో వ్యాసుడు అశ్వత్థామా, కాక ఇంకా మార్కండేయుని వంటి కొంతమంది "చిరంజీవులు" కూడా ఉన్నారా? వారి గురించిన యోగరహస్యాలూ సిద్ధపురుషుల మార్గము గురించిన అనేక ఆధ్యాత్మిక రహస్యాలు ఏమీ తెలియని, సామాన్య ప్రజానికానికి ఇది అంతుపట్టదు. అందుకే వచ్చేఅధ్యాయంలో అసాధారణ మైన ఈ ఆధ్యాత్మిక దృక్కోణము నుంచి వ్యాసమహర్షి పాత్రను పరిశీలిద్దాం.



* "శాపంతో చిరంజీవులు" అన్న అధ్యాయం చూడు

# 11

# వేదధర్మ సముద్ధరణ హిందూమతరక్షణ

## వేదము-భగవాముని విజ్ఞానమయ 'శరీరం

బ్రహ్మదేవుని నాలుగు ముఖములనుండి ఉద్భవించిన "ఓంకారమే" 'శబ్దబ్రహ్మ' యగు ప్రణవము! ఒకే ప్రణవమునుండి బహిర్ముఖమైన విజ్ఞానము ఒక సర్కిల్ వలే, వృత్తమునుండి ఉద్భవించినది చతుర్ముఖము అనబడే ఇటుక (ఇష్టకము=ఇటుక) (Brick) గా ఏర్పడి ఇటు "జ్యామెట్రీ" (Geometry) అనబడే వేదశాస్త్రమైన 'శుల్బము' నకూ, అటు ఖగోళశాస్త్రమనబడే జ్యోతిషమునకూ, ఆ తరువాత సర్వ వేదవిజ్ఞానమునకు ఆధారమైన ప్రథమమైన విజ్ఞాన స్వరూపమై ఇప్పుడు

మనం చదువుకునే వేదములు, వేదాంగములు, బ్రాహ్మణములు, శిక్ష, వ్యాకరణ, జ్యోతిష, ఆయుర్వేద, యోగశాస్త్రములు, ఇతిహాస పురాణములుగా ఏర్పడి బ్రహ్మనుండి ఉద్భవించాయని వేదవ్యాసమహర్షి దర్శించాడు తన తపస్సుతో!.

'అది విజ్ఞాన మాతృక! దీనిని బ్రహ్మదేవుడు తాను తపస్సుతో సృష్టించిన బ్రహ్మమానసపుత్రులైన మరీచ్యాది మహర్షులకు మొదటగా ఉపదేశించాడు! ఆ మహర్షులనుంచే తర్వాత దేవతలూ, ఆ దేవతలనుండి మనువులూ, వారినుండి ఇతర ఋషులూ, తరువాత వారినుండి రాజఋషులూ, ఇట్లా క్రమంగా మానవజాతికి ఈ శాస్త్రం సర్వం ఉపదేశించపబడినది. అదే కాలాంతరంలో సనాతన- "ధర్మం"గా ప్రచారమును పొంది, నిత్యానుష్టానం వలన అనుదిన జీవితంలో సేవించే "ఆచారం" సనాతన- "ధర్మం" -- గా (ఆచరించాల్సింది -- ఆచారం) అనుభవంలో ఇది ప్రత్యక్షఫలితం యిస్తూ సుఖము, శాంతి, దీర్ఘాయువూ ప్రసాదించేదిగా ప్రవర్ధిల్లింది!!

ఇది ఆచరణలో నశించినప్పుడే, ఈ "ధర్మ" ఫలితాలైన - సుఖమూ, ఆనందమూ, ఆహారసమృద్ధీ వంటివి నశించి - వాటిస్థానే దుఃఖము, ఆకలీ, కరువూ, స్వార్థమూ, కొట్లాటలూ అనే 'అధర్మం' పుట్టుకొస్తుంది! ఆ అధర్మస్వరూపమే "కలి"! ఈ "కలి" సర్వత్రా వ్యాపించే కాలమే "కలియుగం"!!

## కలియుగంలో పాపాలు - 'ధర్మస్థాపన':-

ఈ అధర్మరూపమైన "కలి"ని నిగ్రహించాలంటే, ఈ అధర్మానికి వ్యతిరేకంగా ధర్మాన్ని సాధనగా అనుష్టానంచేయాలి. అంటే అనుభవంలో ప్రత్యక్షంగా 'ప్రాక్టీసు'(Practice) చేయాలి! ఇందుకే వేదార్థమును తెలుపుటకై వేదవ్యాస మహాముని ధర్మస్థాపనకు మార్గమును తెలిపే 'వేదవిభాగము' చేసి మానవజాతికి అందించినాడు.

# వేదధర్మమే - హిందూమత సముద్ధరణము

శ్రీ వేదవ్యాస మహర్షి చేపట్టిన "బ్రాహ్మ-ధర్మ" సముద్ధరణ - కార్యక్రమంలో ముఖ్యమైన ఘట్టం బ్రహ్మసూత్రములను రచించుట! అయితే, ఈ "బ్రాహ్మధర్మం" సముద్ధరణ ఎందుకు? వేదములకు వ్యాఖ్యానములే "బ్రాహ్మణములు" వీని నియమములను నిత్యం జీవించాలి! అప్పుడే "ధర్మం" -- జీవించివుంటుంది (పుస్తకాల్లో కాదు). ఈ బ్రాహ్మణములను పఠిస్తూ పవిత్రంగా జీవించే జీవిత విధానమే బ్రాహ్మణధర్మం. అసలీ బ్రాహ్మ-ధర్మాన్ని మనం ఎందుకు సముద్ధరించాలి? అని ప్రశ్నిస్తే -- ఈనాడు ఇంగ్లీషులో 'హిందూమతం' అని వర్ణింపబడే భారతీయసంస్కృతికీ, యుగయుగాలుగా వస్తున్న ధర్మబుద్ధికీ ఆధ్యాత్మిక చింతనకూ మూలం ఈ 'బ్రాహ్మణధర్మమే'. ఈ బ్రాహ్మణ ధర్మాన్ని స్థాపించి, అట్టి ధర్మస్థాపనకు అత్యవసర మైన"ఆధ్యాత్మిక జీవ"నాన్నీ అందుకు ఆలంబనమైన మౌలిక ధర్మ సూత్రాలని తెలియచేసినవే వేదాలు!!

కాబట్టి ధర్మస్థాపనకు అత్యవసరమైన మొదటి మెట్టు ఆధ్యాత్మిక జీవనం. ఆ ఆధ్యాత్మిక జీవితానికి ఆధారమైనదే హిందూమతం! ఆ హిందూమతానికి మూలమైన విజ్ఞానాన్నంతా ఇచ్చినదే వేదము! కాబట్టి వేదము యొక్క అర్థం తెలియనిదే "హిందూమతాన్ని సముద్ధరించడం" అన్నది సాధ్యంకాని పని. కాబట్టి హిందూర్మసంస్థాపనకు ముందుమెట్టు వేద ధర్మాన్ని సముద్ధరించడం! శ్రీ వేదవ్యాసులు చేపట్టిన ఈ "హిందూధర్మ సముద్ధరణ" నేటి రాజకీయ పార్టీలు లేక సాంఘిక కార్యకర్తలు చేసే నినాదాలవంటిదేకధా అది ఒక పటిష్టమైన "ప్లాను" (Plan) ప్రకారం చేపట్టబడిన చదరంగం వంటి వ్యూహం! ఒక బృహత్తర నిర్మాణ కార్యం! మాటలతో జరిగేది కాదు! అదేమిటో తెలుసుకుందాం!

వేదవ్యాసమహర్షి కలియుగప్రారంభంలో 'నాలుగువేదాలనూ విభా

గించడం' మహత్తర దైవికమైన కార్యము!

## ఋగ్వేదంతో మొదలు

వేదంలోని కఠినమైన శబ్దాలకు వేదార్థం చెప్పాలంటే ఈనాటి పండితుల సంస్కృత పాండిత్యం చాలదు. వేదకాలం నాటి సంస్కృతశబ్దములు, పదాలూ కనీసం పదివేల సంవత్సరముల క్రితం ప్రయోగంలో వుండే ప్రాచీన వేదభాషకు సంబంధించినవి. ఈ కఠినమైన శబ్దాలకు అర్థాన్ని "నిరుక్తం" అనే పేరిట పూర్వం భాస్కరాచార్యులవారు కొన్నివేల సంవత్సరముల క్రింద వ్రాశారు - "సమ్నాయము", అన్న పేరుతో ఈ భాస్కరుని "నిరుక్తం" పైన, భట్ట భాస్కరులు, గుహదేవుడూ, భవస్వామి చుర అనే వారు వ్యాఖ్యానాలు కూడా వ్రాశారు. అలానే 'తైత్తిరీయ సంహిత' మీద మాధవభట్టూ, స్కందస్వామి, వెంకటమాధవులు, ఆనందతీర్థులూ వ్యాఖ్యలు వ్రాశారు. ఋగ్వేదంపైన మాధవులు, భారతీస్వామి, గుణవిష్ణువూ అనేవారు వ్రాయగా, హలాయుధం మహీధరులు శుక్లయజుర్వేదంపై వ్యాఖ్య రచించారు. శుక్ల యజుర్వేదానికి "మహీధర వ్యాఖ్య" కూడా లభిస్తున్నది. కాని అధర్వణ వేదంపైన మాత్రం ఎవ్వరూ ఏ వ్యాఖ్యానమూ వ్రాయలేదు.

## వేదములో -- 'జ్ఞానకాండ', 'కర్మకాండ'లు

వేదములు విశ్వమంతా వ్యాపించివున్న మహాభూతాత్మునకు శ్వాసలు! అనగా ప్రపంచమంతటా నిండివున్న భగవంతుడిని యోగులు తమ తపశ్శక్తిచేత ఎలా తెలుసుకుంటున్నారో అలాంటి భగవత్తత్త్వము ఊపిరివలే బాహ్యంలో బహిర్గతమైనప్పుడు వేదములోని మహా సత్యాలుగా మహర్షులకు దర్శనమిచ్చింది! అదే దైవత్వము మళ్లీ

నిశ్వాసములుగా లోపలివైపుకు అంతర్ముఖమై నివృత్తి చెందినప్పుడు తపస్సులో ధ్యానసమాధిలో మునులకు అనుభూతి నిచ్చుచున్న దైవశక్తి కూడా ఇదే! కాబట్టి భగవంతుని తెలిపే 'జ్ఞానకాండయే' మంత్ర కాండమైన వేదము! వేదము ఉపదేశించే జ్ఞానమును యదార్థంగా అనుభవంలోనికి తెచ్చుకొనుటకు కొంత ప్రయత్నం చేయవలెను.

## దైవసాక్షాత్కారానికి చేసే - ప్రయత్నమే 'వేదంలోని కర్మకాండ'

ఈ ప్రయత్నమే 'కర్మకాండ'! బాహ్యాజీవితమును పవిత్రము చేసుకొనుటకు పనికివచ్చే (1) యజ్ఞము (2) దానము (3) తపస్సు (4) అధ్యయనము లేక (వేదమంత్రముల పారాయణ) (5) యోగాభ్యాసము (6) స్వార్థమును విడిచిపెట్టుట (వైరాగ్యము), అనే ఈ ఆరు మెట్లూ భగవదనుభూతిని చేరే మార్గంలో సాధనకు సోపానాలు.

వేదంలోని మూలసిద్ధాంతములు, మహర్షులు ప్రతిపాదించినవి కావు! వారు తపస్సులో భగవంతునినుండి వినిన మంత్ర శబ్దములే - వేదమంత్రములు! ఈ మంత్రాలను, తాము కనిపెట్టితిమని ఈనాటి సైంటిస్టులవలే ఆ ఋషులు విర్రవీగలేదు! అవి ప్రపంచములో శాశ్వతమైన సత్యములు గనుక ఎవరు వాటిని దర్శించినా సత్యము ఒక్కగానే కనబడుతుంది! కాబట్టి తాము ఆ సత్యమును కనిపెట్టలేదనీ, కేవలం దర్శించితిమని తెలుపుటచేత మహర్షులు "మంత్రద్రష్టలనీ" పేర్కొనబడినారు. అందుకని, ఏ మహర్షి తాను దర్శించిన వేదమంత్రములకు తాను గ్రంధకర్తనని వ్రాసుకోలేదు.

## మంత్ర భాగము - 'వేద సంహితలు'

ఇలా మహర్షులు నిస్వార్థులై తాము దర్శించిన మంత్రములను, మానవజాతికి అనేకమంది హితం కోసమై, జగత్తులోకి వదిలివేసిన,

సజీవమైన, మంత్ర చైతన్యసహితమైన 'కరెంట్'వంటి శబ్దజాలమే "వేదసంహిత" అనే మంత్రభాగము! దీనిని 'అపౌరుషేయము' అనగా ఏమనిషి దీనిని రచించినదికాదనీ, అలా భగవంతుని శబ్దమయమైన ఆకారంగా ఉన్నదానినే "శబ్ద -- బ్రహ్మము" అనీ, తమకు ధ్యానంలో అది వినిపించినదనీ విన్నదికాబట్టి 'శృతి' అనీ, అంతటి విజ్ఞానమునకూ ముఖ్యమై తెలియదగిన 'మూలవిజ్ఞానము' కాబట్టి 'వేదము' అనీ పేరు పెట్టిరి.

ఈ ఏకాకారముగావున్న హిమాలయపర్వతంవంటి మహా 'వేదరాసి' నంతటినీ 'భరద్వాజ' ఋషికి ఇంద్రుడు చూపి పరిహసించాడు. రాబోయే కలియుగంలో మానవులు ఏ ఒక్కరూ ఇంత వేదాన్ని చదివి పూర్తిగా జ్ఞాపకము ఉంచుకొనలేరుగనుక -- నారాయణుని అవతారమైన వ్యాసమహర్షి ఈ 'కలియుగ ప్రారంభము' నకు ముందే వేదములను విభజించి నాలుగు వేదములుగా చేసి మానవజాతికి అందించాడు. అవే--

(1) ఋగ్వేదము

(2) యజుర్వేదము

(3) సామ వేదము

(4) అధర్వణ వేదము

అనే నాలుగు వేదములూ!ఇందులోని ఏ ఒక్క వేదవిభాగమునైనా అర్థం చేసుకోవాలంటే కనీసం నాలుగు సైన్సులు అయినా చదివిన పరిణతి (Elementary standard) వున్నవారికే అది సాధ్యపడుతుంది! ఇంతటి విజ్ఞానంతో ఈ వేదమంత్రాలను గూర్చి పరిశోధిస్తే కాని వీటి అర్థం బోధపడని కారణంవలననే -- సౌలభ్యానికై ప్రతీ వేదమునకూ ఒక వేదాంగమును కూడా వ్యాసమహర్షి అందించినాడు.

(1) ఋగ్వేదమునకు -- ఆయుర్వేదము
(2) యజుర్వేదమునకు -- ధనుర్వేదము
(3) సామవేదమునకు -- గాంధర్వవేదము
(అనగా స్వరశాస్త్ర, మంత్రశాస్త్రములను
గూర్చి తెలిపే శాస్త్రం
సంగీతశాస్త్ర యోగశాస్త్రములకు
మూలభూతమైన 'స్పందనలను'(Vibra
tions) గూర్చి తెలిపే శాస్త్రం).
(4) అధర్వణవేదమునకు-- అర్థవేదము (అనగా మనిషికి
కావలసిన నాలుగు పురుషార్థములు) సంపాదించి
పెట్టగల. 'సైన్సు' అని పిలువబడే ఈనాటి
భౌతికవిజ్ఞానము అన్ని వేదములలోకి ఇది
తక్కువ అంతస్థులో వున్నది గనుక మానవుని
స్వార్థపూరిత అవసరాలను తీర్చగలదు.
ని కాబట్టియే అర్థవేదము అని పిలువబడింది.

ఇలాగ విద్యారణ్యస్వామి వ్యాఖ్యానించిన మంత్రభాగమైన వేదసంహితలోని 'వేదవిభాగములు' వివరములు ఈక్రింది వివరించబడినవి.

## వేదవిభాగములు:

వేదసాహిత్యము - నాలుగు విధములుగా ఏర్పడివున్నది అవి :

(1) వేదసంహితలు
(2) బ్రాహ్మణములు
(3) అరణ్యాకములు
(4) ఉపనిషత్తులు.

## 1. వేద సంహితలు:

వేదంలోని మంత్రభాగములనే 'వేద సంహితలు' అన్నారు. ప్రతీ

మంత్రమునకూ దేవత, ఋషి, ఛంధస్సూ -- ఈ మంత్రములను ఉచ్ఛరించు ఉదాత్త అనుదాత్త స్వరితములనే స్వర ఉచ్ఛారణా విధానము కలిగివున్నవి.

ప్రతీ వేద విభాగంలోనూ తిరిగి, "మండలములు", "ప్రపాఠక ములు", "సూక్తములు", "అధ్యాయములు"గా వేదసంహిత విభాగం ఏర్పడివున్నది.

## 2. బ్రాహ్మణములు:

నాలుగు వేదములకునూ వేదఋషులు చేసిన అర్థవివరణయే ఈ బ్రాహ్మణములు!

ఇవి సంహితలవలే మంత్రస్వరూపముగా కాక, గద్యరూపంలో వున్నాయి. వీటి వివరములు ఈక్రింద విడిగా తెలుపబడినది.

## 3. అరణ్యాకములు :

చాలామంది అజ్ఞానులు ఇవి అరణ్యములో చెప్పబడినందున అర ణ్యకములనే తప్పుడర్థాన్ని వ్రాసినారు! ఇది సరికాదు అరణ్యములో గిరిజనులూ వున్నారు, మృగాలూ వున్నాయి! కేవలం ఆ లక్షణము చేతనే 'అరణ్యకములు' అంటే సరిపోదు అసలు అర్థం వేరే వున్నది.

'అరణి' అనగా రావి, పలాశసమిధలతో మధించి యజ్ఞారంభాన్ని చేయటానికి అవసరమైన అగ్నిని పుట్టించే ప్రాచీన ఋషుల యజ్ఞపరికరం! అని అర్థము. అరణి నుండియే యజ్ఞమూ, వేదములూ పుట్టినవి. కనుక -- 'అరణి మధనము' వలె ప్రాచీన ఋషులు చేసిన "బ్రాహ్మజిజ్ఞాస" అనే మధస్వరూపమైన తపస్సుతో పుట్టినవే అరణ్యాకములు వీటి స్వరూపము బ్రాహ్మణములకూ, ఉపనిషత్తులకు మధ్యరూపంలో వుండును.

## ఉపనిషత్తులు :

ఈ ఉపనిషత్తులు ముఖ్యముగా 108. ఇవి నాలుగు వేదములకూ సంబంధించినవి. ఇందులో 'దశోపనిషత్తులు' ప్రాముఖ్యమైనవి.

| | | | |
|---|---|---|---|
| 1. | ఈశావాశ్యోపనిషత్తు | 2. | కఠోపనిషత్తు |
| 3. | కేనోపనిషత్తు | 4. | ముండకోపనిషత్తు |
| 5. | మాండూక్యోపనిషత్తు | 6. | ఛాందోగ్యోపనిషత్తు |
| 7. | బృహదారణ్యకోపనిషత్తు | 8. | శ్వేతాశ్వతరోపనిషత్తు |
| 9. | ప్రశ్నోపనిషత్తు | 10. | మహానారాయణోపనిషత్తు |

ఈ "దశోపనిషత్తులూ" వేదములలోనే బ్రహ్మతత్త్వమునూ, బ్రహ్మ సాక్షాత్కార విధానమునూ, జీవునిస్వరూపమునూ, జగత్తుయొక్క, ఋషియైన గురువునకూ, శిష్యునకూ జరిగిన సంవాదరూపంలో వివరిస్తున్నాయి! వేదంలోని 'కర్మకాండ'ను యజ్ఞములు చేసే శ్రౌతము వివరించినట్లే, 'జ్ఞానకాండ'ను ఉపనిషత్తులు వివరించుచున్నవి. వేదము యొక్క కొసలు (అంతము) కాబట్టి ఈ ఉపనిషత్తులు వేదాంతమును వ్యాఖ్యానించుచున్నవి.

ఈ నాలుగూ వేదసాహిత్యముయొక్క నాలుగు స్థూలభాగాలనీ చెప్పవచ్చు.

పై నాలుగు విభాగములలో మరికొన్ని వివరములు తెలుసుకుందాం.

## బ్రాహ్మణములు

వేదమునకు "వ్యాఖ్యానము" లేక వేద మంత్రమునకు పదముల అర్థమును వివరించునవి బ్రాహ్మణములు.

ముస్లిం దండయాత్రలలోనూ, అసంఖ్యాకమైనకాలం గడిచి పోవడం వల్లా అపారమైన వేదసాహిత్యములోని కొన్ని వేదభాష్యములో చెప్పబడిన కొన్ని బ్రాహ్మణములు ఇప్పుడు లభించుట లేదు.వేదభాష్యములో

చెప్పబడిన కొన్ని బ్రాహ్మణములు ఈనాడు లభించకపోవుట. అలానే వ్యాఖ్యానముతో ఆ పేర్లు మాత్రమే లభించి, ఆ గ్రంథములు లభించుట లేదని, ఆ బ్రాహ్మణముల పేర్లవల్ల మనం తెలుసుకోగలగలుగుతున్నాం. ఇలాంటివాటిల్లో పైంగి బ్రాహ్మణం ("పైంగ్య బ్రాహ్మణము)లో చాలాభాగము అపస్థంబ శ్రౌతసూత్రములు, భోధాయన శ్రౌతసూత్రములు, సత్యాషాఢ శ్రౌతసూత్రములు(3-7) లో వర్ణించబడిన సమగ్ర గ్రంథములు ఈనాడు లభించుటలేదు. ఈ బ్రాహ్మణముల వివరములు ఈ క్రింది విధముగా తెలుపబడినవి.

## A. ఋక్సంహిత .- బ్రాహ్మణాలు

### 1. పైంగి బ్రాహ్మణం :

ఋగ్వేద శాఖలలో పైంగిశాఖ ఒకటి అని"ప్రపంచ హృదయం" చెబుతున్నది. ఈ శాఖకు సంబంధించినది 'పైంగి బ్రాహ్మణం'. దీనికే పైంగ్య బ్రాహ్మణమని, పైంగ్యాయనీ బ్రాహ్మణమనికూడా పేర్లు. కాని ఇది మనకిప్పుడు దొరకడంలేదు. వైదిక వాఙ్మయంలో ఈ బ్రాహ్మణం చాలాచోట్ల పేర్కొనబడింది. ఇంకా ఎన్నో గ్రంథాల్లోని సందర్భాలను పరిశీలిస్తే పైంగ్య బ్రాహ్మణం ఒకప్పుడు సమగ్రంగా ఉండేదనీ ఆ తరువాత కాలంలో అంతరించిపోయిందనీ స్పష్టమౌతుంది.

### 2 బాహ్వృచ బ్రాహ్మణం

'బాహ్వృచ' అనే పదం ఋగ్వేదానికి పర్యాయ పదంగా వాడటం కనపడుతుంది. అయినా ఋగ్వేదంలో ఋహ్వృచ శాఖ కూడా ప్రత్యేకంగా ఉన్నట్లు తెలుస్తున్నది. దానికి సంబంధించినదే 'బహ్వృచ బ్రాహ్మణం' మీమాంసా దర్శనానికి భాష్యంవ్రాసిన శబరస్వామి ఈబ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు. ఋగ్వేదానికి ప్రస్తుతం దొరుకుతున్న ఐతరేయ - కైషితికి బ్రాహ్మణాల్లో శబరస్వామి పేర్కొన్న

"యావజ్జీవమగ్నిహోత్రం జుహూతి" యావజ్జీవం

దర్శపూర్ణమాసాభ్యాం యజేత"

అనే వాక్యాలు కనబడటంచేత దీన్నిబట్టి ఒకప్పుడు బాహ్వృచ బ్రాహ్మణం వుండివుండేదనీ స్పష్టమవుతున్నది.

### 3. అశ్వలాయన బ్రాహ్మణం:

రఘునందనుడు స్మృతితత్త్వమనే గ్రంథంలో మలమాస ప్రకరణంలో అశ్వలాయన బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు 'ఐతరేయ బ్రాహ్మణం' (3.11) లో కూడా ఇదే వాక్యం కనబడుతున్నది. అధునికులు కొందరు ఐతరేయ బ్రాహ్మణానికే అశ్వలాయన బ్రాహ్మణమని కూడా పేరు అని భావిస్తున్నారు.

### 4. గాలవ బ్రాహ్మణం :

ఋగ్వేదానికి గల ఐదుశాఖలో గాలవశాఖ ఒకటి. దీనికి సంబంధించిన బ్రాహ్మణం గాలవబ్రాహ్మణం. ఇది ఎప్పుడో కాలగర్భంలో కలసిపోయింది. గాలవుడు పాంచాల దేశంవాడు ఇతడికే బాభ్రవ్యుడని కూడా పేరు. ప్రపంచ హృదయం అనేగ్రంథం బాభ్రవ్యశాఖను పేర్కొంటున్నది. పతంజలి తన 'మహాభాష్యం' లో (6.3.61.1.11.44) ఒక వ్యాకరణ నియమాన్ని వివరిస్తూ గాలవుని ప్రశంస తీసుకువచ్చాడు. దీనిని బట్టి గాలవ బ్రాహ్మణం ఉండివు డేదనే సత్యానికి చరిత్రలో అవకాశం ఏర్పడుతున్నది.

## యజుస్సంహిత -- బ్రాహ్మణాలు

### 1. చరక బ్రాహ్మణం

కృష్ణయజుర్వేదానికిగల శాఖల్లో 'చరకశాఖ' ఒకటి. ఈ శాఖకు

సంబంధించిన బ్రాహ్మణమే చరకబ్రాహ్మణం లాహోరు డి.ఎ.వి. కళాశాల గ్రంథాలయంలో 'చరకారణ్యకం' వ్రాతప్రతి 'నెం.175' భద్రం చేయబడింది. మైత్ర్యుపనిషత్తుకూ దీనికీ అట్టేతేడా లేదు. ఈ చరక బ్రాహ్మణం మనకిప్పుడు దొరకడంలేదు. సాయణుడు తన ఋగ్వేదభాష్యంలో ఈ చరక బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు.

నిఘంటువునకు తాను వ్రాసిన వ్యాఖ్యానంలో దేవరాజ యజ్వీచరక బ్రాహ్మణాన్ని ఉదహరించాడు[2] నిరుక్త వ్యాఖ్యానంలో స్కంధస్వామి కూడా చరక బ్రాహ్మణాన్ని స్మరించాడు. భాషిక సూత్రంలోనూ దానిపైన అనంతభట్టువ్రాసిన వ్యాఖ్యానంలోనూ కూడా ఈ చరక బ్రాహ్మణ ప్రశంశ వినిపిస్తున్నది.

## 2. శ్వేతాశ్వతర బ్రాహ్మణం:

చరకుల అవాంతరశాఖ శ్వేతాశ్వతర శాఖ అని చరణవ్యూహంలో చెప్పబడింది. శ్వేతాశ్వతరోపనిషత్తు ఈ బ్రాహ్మణంలో ఒక భాగమే! దీన్నే 'మంత్రోపనిషత్తు' అనికూడా అంటారు. "అస్యవామస్య" అనే సూక్తానికి భాష్యం వ్రాసిన ఆత్మానందుడు శ్వేతాశ్వతర బ్రాహ్మణంలోని ఒక మంత్రాన్ని (పే.32) పేర్కొన్నాడు.

యాజ్ఞవల్క్యస్మృతికి 'బాలక్రీడ' అనే వ్యాఖ్యానంవ్రాసిన విశ్వరూపాచార్యులు కూడా శ్వేతాశ్వతర బ్రాహ్మణాన్ని పేర్కొన్నాడు. ఈ బ్రాహ్మణం మనకిప్పుడు లభించటంలేదు.

## 3. కాఠక బ్రాహ్మణం:

కాఠక శాఖ కూడా చరకశాఖల్లో ఒకటి. ఉత్తరదేశస్థులైన చరకులలో కఠశాఖీయులుకూడా వున్నారు. ఇప్పుడిది, మనకు పూర్తిగా దొరకడంలేదు.

## 4. మైత్రాయణీ బ్రాహ్మణం:

మైత్రాయణికి 1 .మానవ 2. వారాహ 3. దుందభ 4. చాగలేయ 5. హరిద్రవీయ 6. శ్యామాయనీయులని ఆరుగురు శిష్యులు. వీరందరికి "మైత్రాయణీయు" లని పేరు. ఈ శాఖకు సంబంధించిన బ్రాహ్మణం మైత్రాయణి బ్రాహ్మణం. వేంకట మాధవుడు తన "ఋగ్వేదభాష్యం" లో (8.1.14) ఈ బ్రాహ్మణాన్ని ఉదహరించాడు.

## 5. జాబాల బ్రాహ్మణం:

వాజసనేయ యాజ్ఞవల్క్యుని శిష్యుడు, జనకునికి సమకాలికుడు అయిన సత్యకామ జాబాలి ఈయన ఒక వేదశాఖకు ప్రవర్తకుడు. ఈ బ్రాహ్మణానికి సంబంధించిన 'జాబాలోపనిషత్తు' ప్రసిద్ధమైనది. జాబాల ధర్మసూత్రం, జాబాలగృహ్య సూత్రంకూడా స్మృతిచంద్రికలోనూ స్పందకారిలోనూ, గౌతమ ధర్మసూత్రంలోనూ (16-25, 23-22) కూడా పేర్కొనబడ్డాయి.

## 6. ఖాండికేయ బ్రాహ్మణం:

తైత్తిరీయంలో ఔఖేయ - ఢికేయ విభాగం వున్నదని చరణవ్యూహం చెబుతున్నది. ఖాండికేయుల్లో అయిదుశాఖలున్నట్లు తెలుస్తున్నది.

## 6. ఔఖేయ బ్రాహ్మణం:

ఔఖేయశాఖకు సంబంధించిన బ్రాహ్మణం ఔఖేయ బ్రాహ్మణం.

## 7. హరిద్రవిక బ్రాహ్మణం :

మైత్రాయణీ శాఖలలో ఒకటి హరిద్రవికశాఖ.

### 8. తుంబురు బ్రాహ్మణం:

యజుర్వేదానికీ, సామవేదానికీ 'తుంబురుశాఖ' తో సంబంధంవుంది.

### 10. ఆహ్వారక బ్రాహ్మణం:

చరకశాఖల్లో ఒకటి ఆహ్వారకశాఖ. దానికి సంబంధించిన బ్రాహ్మణమే ఆహ్వారక బ్రాహ్మణం.

### 11. కంకతి బ్రాహ్మణం:

కంకతి శాఖకు సంబంధించినది ఈ బ్రాహ్మణం. ఇది ఏ వేదానికి సంబంధించిన శాఖ అన్న విషయంలో విమర్శకులు ఒక నిర్ణయానికి రాలేదు.

### 12. ఛాగలేయ బ్రాహ్మణం:

తైత్తిరీయశాఖలో ఒక విభాగం ఈ ఛాగలేయ శాఖ. ఛాగలి మహర్షి శిష్యులకే ఛాగలేయులన్న పేరు.

## సామసంహిత బ్రాహ్మణాలు

ఇంకా సామ వేదసంహితలోని బ్రాహ్మణాలు;

1. భాల్లవి బ్రాహ్మణం 2. కాలబవి బ్రాహ్మణం 3. రౌరుకి బ్రాహ్మణం 4. శాట్యయన బ్రాహ్మణం 5. సంకీర్ణన బ్రాహ్మణాలు. ఇవి కాక ఏ వేదసాఖకుసంబంధించినవో స్పష్టంగా చెప్పడానికి కూడా వీలులేకుండా కొన్నివున్నాయి. అవే సంకీర్ణ బ్రాహ్మణాలు.

## సంకీర్ణ బ్రాహ్మణాలు:

i ఆరుణేయబ్రాహ్మణం
ii సౌలభ బ్రాహ్మణం
iii శైలాలి బ్రాహ్మణం
iv పరాశర బ్రాహ్మణం
v కాపేయ బ్రాహ్మణం
vi రహస్యామ్నాయ బ్రాహ్మణం
vii నిరుక్త బ్రాహ్మణం
viii అన్వాఖ్యాన బ్రాహ్మణం
ix భాష్కల బ్రాహ్మణం
x మాండూకేయ బ్రాహ్మణం
xi తిఖర్వ బ్రాహ్మణం
xii కరద్విష బ్రాహ్మణం

ఈ పదకొండున్నూ "సంకీర్ణ బ్రాహ్మణాల" క్రిందచెప్పబడినాయి. అందులో విద్యారణ్యభాష్యంలో తిఖర్య, షరద్విష శాఖలు ప్రత్యేకంగా పేర్కొనబడ్డాయి. ఈ శాఖలకు సంబంధించిన బ్రాహ్మణాలు ఆపస్తంభ శ్రౌత సూత్రాలలోనూ వాశిష్ట ధర్మ సూత్రంలోనూ ఉదహరింపబడినాయి. కానీ, ఈ బ్రాహ్మణాల్లోని వాక్యాలు వాజసనేయ - బహ్వృచ బ్రాహ్మణాలకు సంబంధించిననట్లుగా పేర్కొన్నబడ్డాయి!

కానీ ఈనాడు లభించేవాటిల్లో ఇవి మనకు కనపడటంలేదు. ఇలాగ ఎన్నో బ్రాహ్మణాల గురించి పరిశోధించవలసిన అవసరం వేదధర్మ పరిరక్షులపైనా, పరిశోధకులపైనా ఎంతైనా వున్నది! ఈ విధంగా ఋక్సంహిత బ్రాహ్మణాలూ, యజుస్సంహిత బ్రాహ్మ ణాలూ, సామసంహిత బ్రాహ్మణాలనీ, వాటియొక్క విభాగాన్నీ పేర్కొని విద్యారణ్య భాష్యంలో వీటిలోని మంత్రభాగాలను గూర్చి -- ఇంకా యిప్పుడు లభ్యంకాని మరెన్నో వేదశాఖల బ్రాహ్మణాలను గురించి

ప్రశంసా వుండటం చూస్తే  ఎంతంత వేదసాహిత్యం యిప్పటికే లుప్తమై పోయిందో తలుచుకుంటే విచారం వస్తుంది.



# వ్యాసుడు - బ్రహ్మసూత్రాలు

బ్రహ్మసూత్రాలలో ఉన్న విషయం అంతా ఒక్క అధ్యాయంలో చెప్పడం సాధ్యం అయితే బ్రహ్మసూత్రాల గురించిన అధ్యాయం వ్రాయడం ఎందుకూ అంటే సామాన్యంగా బ్రహ్మసూత్రాలలో ఉన్న విషయాల గురించి ఏమీ తెలియనివాళ్ళే ఎక్కువమంది! వాళ్ళకి అసలు బ్రహ్మసూత్రాలంటే ఏమిటో అందులో ఉన్న విషయమేమిటో చూచాయగా పరిచయం చేయడమే ఇక్కడ మన ఉద్దేశ్యంగాబట్టి బ్రహ్మసూత్రాల గురించి అందులోని విషయాల గురించి స్థూలంగా పరిశీలిద్దాము.

బ్రహ్మసూత్రాలు వ్యాసమహర్షిచేత రచించబడినాయి. బ్రహ్మ విద్యని ఒక సైన్సులోని సూత్రాలలాగ, కొద్దిలో సూక్ష్మీకరించి తెలిపిన సూత్రాలే ఈ బ్రహ్మసూత్రాలు "బ్రహ్మవిద్య-" అంటే ఈ జగత్తుఅంతా దేనితో తయారైవున్నదో అది బ్రహ్మము. దానిని తెలుసుకోడానికి సర్వాన్ని తెలుసుకొనే ఒక ప్రత్యేకమైన సాధన అవసరం. ప్రపంచంలోఉన్న సర్వం దేనితో తయారై ఉన్నదో తెలిపేదే బ్రహ్మవిద్య! అయితే ఈప్రపంచంలో ఒకవ్యక్తిగా సాధకుడు "తాను" కూడా ఉన్నాడుకాబట్టి తననుగురించి తాను తెలుసుకో

వడమే బ్రహ్మవిద్య అవుతుంది. తనగురించి అంటే తనపేరు, తన ఆకారం, తనస్వభావం, కులగోత్రాలు, ఉద్యోగమువంటివి తెలుసుకోవడంకాదు. మరి ఇవన్నీతొలగిస్తే ఇక తానుగా మిగిలేదేముంది తనలో?

## తానెవరు? :-

ప్రతిమనిషికీ ఒక శరీరంవుంటుంది. 'ఇదెవరిది'? అని అడిగితే "ఇది నా శరీరం" అని సమాధానంవస్తుంది అంటే తాను శరీరం కాదన్నమాట! అంటే ఈశరీరాన్ని యజమానిగా కలిగివున్న 'తాను' వేరేవస్తువన్నమాట. అలాగే ఇది **'నా'** మనస్సు అంటున్నారు. కాబట్టి ఈ మనస్సు తానుకాదు. అలాగే నా ప్రాణం, నా ఆలోచనలు - అని, ఇవి నావి, అంటూ ఏవైతే విడిగా మనం గుర్తిస్తున్నామో అవన్నీ మనంగాదు, మనకంటే వేరైనది ఇంకాపైన ఉన్నదన్నమాట ఏదో, ఇలా తనలోపలికి తవ్వుకుంటూపోతే **తానెవరో తెలుసుకొనే బ్రహ్మజ్ఞానంకలుగుతుంది.** ఈ ప్రపంచం దేనితో తయారైఉందో అందులోభాగమే తాను! అదేవస్తువుతో, తయారై తాను ఉన్నాడు కాబట్టి తనగురించి అలాగే ఈప్రపంచం **గురించి తెలుసుకోవడమే** బ్రహ్మజ్ఞానం అవుతున్నది. కాబట్టి ఆత్మవిద్యయే బ్రహ్మవిద్య. ఆత్మసాక్షాత్కారమే బ్రహ్మసాక్షాత్కారము! అసలు **'బ్రహ్మ అనేమాటకి అర్థం ఈ ప్రపంచంలో కనపడేదంతా దేనితో నిండివున్నదో ఆవస్తువు** అని అర్థం. (సంస్కృతంలో **బృంహణం= నిండించుట: బృంహణంచేసే శక్తి బ్రహ్మము)** దీనిని గురించి తెలిపే విజ్ఞాన సూత్రాలే బ్రహ్మసూత్రాలు.

ఇందులో మొదట **అథాతో బ్రహ్మజిజ్ఞాసః** అనే సూత్రంతో ప్రారంభమై ఈ బ్రహ్మను తెలుసుకోవడానికి మనస్సులో కావలసిన మానసిక సాధన దీని పేరు బ్రహ్మజిజ్ఞాస. దీని గురించి వ్యాసమహర్షి మనిషికి జన్మ ఎక్కడనుంచికలుగుతున్నదో అలాగే అన్నిజీవరాసులకీ పుట్టుక దేనివల్ల కలుగుతున్నదో అదేవిధంగా చివరికి మరణించే

కారణంకూడా దేనివల్ల ఏర్పడుతున్న. అంతేకాక చనిపోయింత ర్వాత ప్రతివాడు దేనిలో లయమై పోతున్నాడో దానిపేరు బ్రహ్మము అని మొదలుపెట్టి, ఈబ్రహ్మముగురించి మనస్సును పదునుపెట్టి ఆలోచనల సహాయంతో మనసును అంతర్ముఖం చేయడం అనే అధ్యాయం **'జిజ్ఞాసాధికరణ'** అనే పేరుతో ప్రారంభిస్తాడు.

బ్రహ్మసూత్రాలు కేవలం సాధన గురించి చెప్పటం కాకుండా ఈనాడు సైన్సు చదువుకున్నామనుకునే చాలమందిచెప్పే నాస్తిక వాదం, నిరీశ్వరవాదం, శూన్యవాదం, లోకాయుతం మొదలైన అనేక సిద్ధాంతాలు ఈ ప్రపంచం పుట్టుక గురించినవి, వివరంగా చర్చించి **వాటిలోని దోషాలు ఖండించి** నిశితమైన తర్కంతో **చక్కటి హేతు వాదంతో ఈ ప్రపంచం బ్రహ్మవల్ల ఎలా ఏర్పడిందో, బ్రహ్మం ఆధారంగా ఎలా** నిలిచివుందో అన్న సత్యాన్ని ఋజువుచేశాడు **వ్యాసమహర్షి.**

## ప్రపంచానికి – హేతువు ఏది?:-

ఈ ప్రపంచం పదార్థంతో తయారైనదని చెప్పే వాదం, వేరే దేవుడంటూ లేక ఈశ్వరుడంటూ లేడని చెప్పేవాదం సహేతు కంగా ఆధునికులకు చెప్పేకంటె తార్కికంగా చక్కగా తెలుపబడింది బ్రహ్మసూత్రాల్లో!

అలాగే ఈ ప్రకృతియే అన్నిటికీ కారణం అని చెప్పే నిరీశ్వరవా దము, ప్రకృతి - **పురుషులు** అనే జంటవల్లనే ఈ జగత్తునడుస్తున్నది అని చెప్పే సాంఖ్యవాదము, ఈలోకమేతప్ప పరలోకమేలేదని చెప్పే **లోకాయత** వాదము, అసలీ కనిపించేదంతా శూన్యం అనిచెప్పేశూ న్యవాదము వంటి వాదాలన్నీ ఒకదాని తరువాత ఒకటి వివరించి తర్వాత వాటిని చక్కని హేతువాదాలలో అసత్యాలని ఋజువుచేసి ఆ తర్వాత ఈజగత్తు బ్రహ్మమని, బ్రహ్మ సత్యమని కాబట్టే ఈ జగత్తంతా సత్యం మీదనే ఆధారపడి ఉందని ఆ సత్యాన్ని తెలుసు

కోవడమే జ్ఞానమని, ఆ జ్ఞానం కలిగినపుడు సర్వము తానే అయిన ఆనందం కలుగుతుందని, అదియే బ్రహ్మమని, అది మానవుడియొక్క హృదయంలో అంతరాత్మలాగ ఈశ్వరునివలే అనుభూతమయ్యే సత్యమని చెప్పే విషయం.

**సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ,**

**యోవేద, నిహితం గుహాయాం పరమోవ్యయం,.**

వేదవాక్యాన్ని విడకొడితే "సత్యం" "అనంతం" బ్రహ్మ 'గుహాయం' అంటే "హృదయ గహాయందు" అని సూచన.

## సైన్సులా అనుభూతిలేని 'తర్కం'కాదు:-

ఈ పై మహాసత్యాన్ని అనగా బ్రహ్మవిద్యను కేవలం మాటలలో తెలుసుకోవడం అసాధ్యమని. అలాగే ఆ బ్రహ్మయొక్క అనుభూతిని పంచదార రుచిని తెలుసుకున్నట్లుగా అనుభవించి తెలుసుకోడానికి వేదాలు చదివినా, సూత్రాలు శాస్త్రాలు చెప్పిన మాటలు దొర్లించినా, వాటిగురించి ఆలోచనలు తిరగేసినా అనుభవం కలగదని కేవలం పట్టుదలతో కూడిన సాధన, విశ్వాసంతో కూడిన నిష్ఠ వల్లనే సాధ్యపడుతుందని ఆధ్యాత్మిక సత్యాన్ని అతిచక్కగా హృదయానికి హత్తుకునేలా అతితక్కువ మాటలతో నిశితమైన వాక్యాలతో భాషలో బంధించి బ్రహ్మసూత్రాలనే బంగారు సూత్రాన్ని మనకి అందించారు వ్యాసమహర్షి.

## 'బ్రహ్మసూత్రం:-'

సంస్కృతంలో సూత్రం అంటే 'దారం' అని అర్థం. "బ్రహ్మ సూత్రం" అంటే ఈ ప్రపంచంలో అన్నిటికీ ఆధారమయి ఉన్న 'దారము' (సూత్రము)! ఒక దండలోని రంగురంగుల పూలకి విడిగా ఒకదానితో ఇంకొకదానికి సంబంధం లేకపోయినా, అన్నిటినీ

కలిపి ఉంచి ఒక దండగా ఏకీకరణ చేస్తున్న ఆధారం, ఈ పువ్వుల మధ్యనున్న దారమేకదా? కాని పైకి మాత్రం ఈ అన్నిటికీ ఆధారమైన దారం, దండను చూస్తే ఎక్కడా కనపడదు. పైకి పువ్వులే కనపడతాయి. ఈ పువ్వులే సృష్టిలోని మానవులు, దేవతలు, జీవరాసులు, చెట్లూ, నదీనదములు ఆకాశం, ఈ కనిపించే ప్రకృతి ఇదంతానే ఈ పైకనిపించే దండలోని పువ్వులు. ఈపైకి కనిపించే వివిధమైన వస్తువుల వెనకాలవున్న అన్నిటినీ కలిపివుంచే సూత్రమే బ్రహ్మసూత్రం. దండలోని ప్రతిపువ్వు హృదయంలోంచి సూదితో గుచ్చబడిన దారం ప్రయాణించినట్టే ఈ ప్రపంచమనే దండలో ప్రతి **మానవుడిలోంచి ఈ అంతరాత్మ** అనే **సూత్రం** అంతర్యామిగా ఉంది. అన్నిజీవులను అదే ఒక్కటిగా కలిపివుంచుతున్నది. ఇందువల్లనే ఈప్రపంచంఏకంగా - ఒక సమాజంగా ఒకే ఏకత్వాన్ని కలిపిఉంచే అంతరాత్మఅనే సూత్రం లేక పోయినట్లయితే, అదిఇసుకముద్ద గనక దానిలోని నీరు ఎండిపోతే పొడిగా ఇసుక రాలిపోయినట్టే ఈసృష్టికూడా ఏకాకారం ధరించక ముక్కలుగా విడిపోతుంది. కనుక ఈ సృష్టిలో అన్నిటినీ కలిపి ఉంచేదే **భగవత్ శక్తి బ్రహ్మయొక్క ధారణాత్మకమైన శక్తి.**

## అంగ-భూతులైన 'జీవాత్మలు' :-

ఈ శరీరంలోని అవయవాలవంటివారే సృష్టిలోని జీవరాసులందరూ! అందరినీ కలిపి ఉంచేది శరీరంలో ప్రాణం. ఈ ప్రపంచమనే శరీరంలో ఏ అవయవానికా అవయవం విడిగా కనబడుతూ వేర్వేరు పనులు నిర్వహిస్తూ వుండటం అనేకత్వం లేక 'ద్వైతము. ' సృష్టి-జీవుడు అనే రెండు వస్తువులు విడివిడిగా ఉండటమే ద్వైతం. కాని జీవుడు దేనితో తయారైవున్నాడో, ఈజగత్తు అదేవస్తువుతో తయారై ఉండటమనేది సత్యమే! ఈరెండూ ఒకటేననీ, లేక అభేధమని చెప్పేదే అద్వైతము. ఈరెండూ సత్యమే. అంతేకాదు

ఈరెండింటిని కలిపి ఉంచే విశ్వమంతా వ్యాపించిన ప్రణవమే. జగత్తును ఒక్క శరీరంలాగ కలిపివుంచిన "పరబ్రహ్మతత్వం".

## ద్వైతాద్వైతాలు :-

దీనితో అవయవాలు విడివిడిగా ఉంటే ద్వైతమూ, అన్నీ ఒక్క మనస్సుతో కలిసిపనిచేస్తే 'అద్వైతమూ. ఈ రెండూ ఏక కాలంలో మనకి శరీరంలో అనుభవమయ్యే చక్కటి సమ్మేళనాన్ని చూపెట్టే అద్భుతసత్యం శారీరకం! ఎలాగ ఈ రెండు రకాల సత్యాలు (ద్వైతము-అద్వైతము) సమ్మేళనచేసి నిత్యజీవితంలో నడిపిస్తున్నాయో ఆ విచిత్రాన్ని తెలిపే "మీమాంస" అంటే విజ్ఞానం పేరే బ్రహ్మసూత్రాలు. ఈ కారణంచేతనే బ్రహ్మసూత్రాలకు "శారీరక మీమాంస" అనేపేరువచ్చింది.

పైరహస్యం తెలియక కేవలం విభిన్నత్వాన్ని మాత్రమే చూసి జీవుడు వేరు ఈశ్వరుడువేరు అనే ద్వైతం ఒక్కటే నిజమని నమ్మేవారు ద్వైతులుగానూ, అలాకాక ఈ ప్రపంచంలో ఉన్న అన్నిజీవరాసులలోని భిన్నత్వం లేక భేదత్వం అసత్యమని నమ్మి "అవన్నీ ఒక్కటే" అనే ఒక్క సూత్రాన్నే నమ్మేవారు అద్వైతులుగాను, ఇలా రెండు తెగలుగా ఏర్పడి ఈ బ్రహ్మసూత్రాలకు వేరువేరు వ్యాఖ్యానాలు వ్యాస మహర్షి అనంతరం రచించడం జరిగింది. అలాగే పై రెండు సూత్రాలను అంటే ద్వైతమూ, అద్వైతమూ ఈ రెంటిని సమన్వయ పరచి, మనశరీరంలోని అవయవాలలోలాగే, సమ్మేళన చేసినదే 'విశిష్టాద్వైతం.' ఇలా వ్యాసమహర్షి రచించిన బ్రహ్మసూత్రాలు గురించి వేరువేరు భేదాలు ఏర్పడినాయి.

## అనుభూతిలేని తర్కం:-

వీటన్నిటికీ కారణం కేవలం తర్కంతోను, మాటల అర్థాన్ని చీల్చటంలోను బ్రహ్మసూత్రాలయొక్క పూర్తి భావం తెలుసుకోడానికి

ప్రయత్నించే వ్యర్థప్రయత్నంవల్లనే. అందువల్ల ఈబ్రహ్మసూత్రాలకు ఒక్క జిజ్ఞాస చాలదు అవి వ్యాసమహర్షియే "జిజ్ఞాసాధికరణం" **తోపాటు ఈ బ్రహ్మమును పొందే మార్గంకూడా చివరి అధ్యాయాల్లో తెలియజేశాడు.**

ఇలాంటి అనేకమార్గాలలో అర్చిరాది మార్గం అనివేదంలో చెప్పబడిన **"సిద్ధయోగ మార్గమే"** మానవుడికి అనుభవంతో కూడిన బ్రహ్మజ్ఞానం. ఈ బ్రహ్మజ్ఞానమే బ్రహ్మానుభూతిని, చివరికి బ్రహ్మంలో ఐక్యతను ఇవ్వగలదని వ్యాసమహర్షి స్పష్టంగా తెలియజేసిన తర్వాత కూడా, పండితులు ఆ ఆధ్యాత్మికతను, చదివి అర్థం చేసుకోలేకే మరియు ఈ బ్రహ్మసూత్రాల్లోని సత్యాన్ని **జీవితంలో సాధన చేయకుండా అనుభవంతో** జ్ఞానాన్ని అనుశాసనంగా మార్చకుండా సత్యం అనేది **తర్కం**లోనే గాని నిజజీవితంలో అనుభవించకుండా త్యాగం అనేది నిత్యజీవితంలో అభ్యాసం చేయకుండా, **తపస్సు** చేత మనస్సుకు, ఏకాగ్రత సిద్ధింపచేసుకోకుండా పై పై మాటలలో అందుకోవాలని చూడటమే.

ఫలితంగా బ్రహ్మసూత్రాలు ప్రపంచాన్ని ఏకీకరణ చేసే బ్రహ్మమును, ఏకీకరణసూత్రంగా కాక బ్రహ్మను గూర్చిన మూడు మతాలకు, అంటే ద్వైతం అద్వైతం, విశిష్టాద్వైతం అన్న మూడు మతాలకూ, దారితీసినవి హిందూమత చరిత్రలోనే. దీనివల్ల ఫలితం. **"భ్రమ' సూత్రమే బ్రహ్మసూత్రంకాదు.** ఎందుకంటే భేదత్వమే "భ్రమ" సమన్వయమే "బ్రహ్మ"! ఆ సమన్వయం చేసేది యోగమే! సంయోగమే యోగం.

కాబట్టి మూడు మతాలను ఖండించి మళ్ళీ ఒక్క మతంగా ఏకస్థంచేసి బ్రహ్మసూత్రాలు చూపించిన బ్రహ్మానుభూతిని రుచి చూపించాలంటే అది, యోగం ద్వారానే సాధ్యపడుతుందని తెలిపే గ్రంథమే భగవద్గీత. అందువల్లనే భగవద్గీత బ్రహ్మవిద్య యోగ శాస్త్రంగా పేర్కొనబడింది.

బ్రహ్మసూత్రాలకు చక్కని వ్యాఖ్యానం భగవద్గీతయే! ఇతరుల వ్యాఖ్యానాలు **పండితుల** వ్యాఖ్యానాల వంటివి. **భగవద్గీత యొక్క** వ్యాఖ్యా **యోగివ్యాఖ్య** వంటిది.

మహాయోగి అనుభవాన్నిస్తాడు. పండితుడు మాటలు దొర్లిస్తాడు. ఒకదాని ఫలితం త్రిమతాలు, రెండవదాని ఫలితం సాధనతో ఆరంభమై సిద్ధితో అంతమయ్యే బ్రహ్మసాక్షాత్కార రూపమైన ఆత్మసాక్షాత్కారం. ఇదే బ్రహ్మసూత్రం (ఏకసూత్రం).



13

# మానవ చరిత్రలో పరమ గురువుగా వ్యాసమహర్షి పాత్ర

ఈభూమ్మీద జరిగే సంఘటనలు రెండురకాలు. ఒకటి అకస్మాత్తుగా, అంటే యాదృచ్ఛికంగా పరిస్థితులమీద ఆధారపడి జరిగే చిల్లర సంఘటనలు. మన నిత్యజీవితంలో రోజురోజూ జరిగే సామాన్య సంఘటనలన్నీ ఈ తరగతిలోకి చేరుతాయి. ఇక రెండవరకం సంఘటనలు – పైలోకాలలో జరిగే దేవతల నిర్ణయాలను అనుసరించి లేదా 'దైవసంకల్పాన్ని' కారణంగా చేసుకుని జరిగే విషయాలు. ఇవి మన నిత్యజీవితపు దైనందిన విషయాలకు సంబంధించినవి కావు. ఇవి ప్రపంచ భవిష్యత్తుకు సంబంధించినవి. చాలమందికి ఈ రెండురకాల సంఘటనలు ఉంటాయనే తెలియదు. అందుకని

ఏవి చిల్లరవిషయాలో, ఏవి ఈశ్వర సంకల్పానుసారంగా జరిగే – మహాకార్యాలో తేడాతెలుసుకోలేరు. ఈ తేడా కళ్ళకి కనిపించేది కాదు. ఆత్మతో చూస్తేనేకాని ఈ తేడా గమనించలేరు.

చరిత్రనే తీర్చిదిద్దే సంఘటనలు ఈ రెండవ తరగతికి చెందుతాయి. పరమగురువులు ఈ రెండవరకం సంఘటనలు... అంటే 'దైవ సంకల్పం' ప్రకారం, పైలోకాలలో జరిగే నిర్ణయాలను ఆధారంచేసుకొని జరిగే సంఘటనల్ని కార్యరూపంలో తీర్చిదిద్దే పనిముట్లు! పై తేడా – ఈరహస్య ఆధ్యాత్మిక విషయాలతో వ్యక్తిగత అనుభవంలేని వారికి తెలియదు. అందుకని సామాన్యుడు అన్ని సంఘటనలూ ఒకటే అనుకొంటాడు! కాని పరమగురువులు మాత్రం అలాకాదు. భూమ్మీద జరిగే విషయాలలో, 'అనిత్యమైన' విషయాలేవో, 'నిత్యమైన' అంటే ఆధ్యాత్మిక ప్రాముఖ్యతకలిగిన సంఘటనలకు, తేడాతెలిసినవాడే పరమగురువు! వ్యాసమహర్షి జీవితంలో ఆశ్చర్యంగా మనకి కొట్టవచ్చినట్లు కనపడే లక్షణం ఇదే.

ఆయన ఏసంఘటనలలో కలగజేసుకొంటారో, ఏ సంఘటనలలో ఆయన కల్పించుకోకుండా మౌనం వహిస్తారో జాగ్రత్తగా గనక పరిశీలిస్తే పరమగురువుగా వ్యాసమహర్షి పనిచేసే తీరూ, పరమగురువుల విధానమూ బోధపడతాయి. ఉదాహరణగా మహాభారత యుద్ధమే తీసుకుందాం.

భారత యుద్ధానికి భూమ్మీద కనపడే కారణం కేవలం కురుపాండవుల మధ్య చెలరేగిన కుటుంబకలహాలు మాత్రమే గనుక నిజం అయితే, అందులో పరమగురువైన వ్యాసమహర్షి స్వయంగా కల్పించుకోవలసిన అవసరంలేదు. సాక్షాత్తూ నారాయణఋషి అవతారమైన శ్రీకృష్ణుడూ, కల్పించుకోవలసిన పనేలేదు. ఒకరి కుటుంబకలహాలతో కాని వ్యక్తిగత సమస్యలతోకాని పరమగురువులకు, మహాత్ములకు ఏమిటి సంబంధం? మహాభారతయుద్ధం నిజంగా ఒక 'దైవికమైన' కారణంచేత పైలోకాలలో జరిగిన దేవతల నిర్ణయం ప్రకారం ఈ భూమ్మీద జరిపించవలసి వచ్చింది. ఈ పైలోకాలలో జరిగిన నిర్ణయం పేరే 'దైవసంకల్పం'. ఇది ముందుగా సామాన్య

మానవులకు తెలియదు! అందుకని ఇలాంటి "దైవనిర్ణయాలను" దేవరహస్యాలు అంటారు. మానవుల మధ్య జరిగే మిత్రత్వ శత్రుత్వాదులను ఆధారం చేసుకొని వాటిని పైలోకాలలో జరిగే దైవనిర్ణయానికి పనిముట్లుగాచేసి ఆ దైవసంకల్పానికి భూమ్మీద జరిగేలాగ చూడటమే "పరమగురువుల" ఆధ్యాత్మిక ప్రణాళిక.

## యుద్ధ – యజ్ఞం

పైకిచూస్తే మహాభారత యుద్ధానికి కారణం జూదం అనే అనుకుంటారు. కాని అంతకుముందే భారతయుద్ధంలో జరుగబోయే భయంకర ప్రజానష్టానికి "నాంది" జరిగింది! ధర్మరాజు రాజసూయం ప్రారంభించాడు. ఆ యజ్ఞానికి శ్రీకృష్ణుని యజ్ఞరక్షకుడుగా వరించాడు ధర్మరాజు. వ్యాసమహర్షి యజ్ఞానికి బ్రహ్మత్వాన్ని అంటే "బ్రహ్మ"గాను, వ్యాసుని శిష్యులు ఋత్విక్కులుగాను, సకల రాజులు సదస్యులుగా అలా రాజసూయం ఏర్పాటయింది. నాలుగు వర్ణాలవారిని ధర్మరాజు ఆ యజ్ఞానికి ఆహ్వానించాడు. ఈ రాజసూయ యాగానికి ముందుగా దిగ్విజయం చేయడానికి సహదేవునికి అగ్నిహోత్రుడు సహాయంచేయడంతో ఈ దేవతల కార్యక్రమానికి భూమ్మీద నాంది జరిగింది.

ఇది వ్యాసమహర్షి సంస్కృత భారతం సభాపర్వంలో స్పష్టంగా తెలుపబడింది. ఇంద్రుడు, తారకాసురునితో జరిగిన యుద్ధంలో తాను ఉపయోగించిన రథం వసురాజుకి ఇచ్చాడు. శ్రీకృష్ణుడు, భీమార్జునులు మగధ నుంచి ఇంద్రప్రస్థానికి ఆ రథాన్నే ఎక్కి ఆకాశంలో ఎగురుతూ తిరిగివచ్చారని వర్ణించాడు వ్యాసమహర్షి. ఇక్కడ 'రథం' అంటే ఈనాడు అంతరిక్ష నౌకలవంటి ఇతర గ్రహమండలాలకు కూడ ప్రయాణం చేయగలిగిన "అంతరిక్ష నౌక"(Space Vehicle) అనే అర్థం. అలాగే సహదేవుడు నిషధ దేశానికి వెళ్ళి వచ్చాడు! తిరిగి సోవియట్ రష్యాలోని పరిశోధకుడు "జైట్సేవ్(Zaitsev)" చేసిన రామాయణ మహాభారతాలలోని "అంతరిక్ష నౌకల"పై పరిశోధనలో చూడవచ్చు.

వివరాలు నా గ్రంధము **"సోవియట్ రష్యాలో ఆధ్యాత్మిక పరిశోధన"** (అధ్యాయం అంతరిక్ష నౌకలలో అవతారమూర్తి)లో చూడవచ్చు.

జయం చేసినపుడు అతనికి అగ్నిహోత్రుడు ప్రత్యక్షమై సహాయం చేయగా యుద్ధంలో శత్రువులను జయించగలిగాడు. అలాగే ఘటోత్కచుడు ఆకాశంలో ఎగురుతూ సముద్రం దాటి లంకాపట్టణం వెళ్ళి విభీషణుడి నుంచి (రామావతారంలోని విభీషణుని వంశంవాడు) కప్పము కూడా తీసుకొనివచ్చాడు.

ఇలాగ అనేక ఆధ్యాత్మిక సహాయాలతో ఈ రాజసూయం ఎందుకు ప్రారంభంచేయబడింది? అన్న విషయం గమనిద్దాం! ఇది కేవలం ధర్మరాజుకి వ్యక్తిగతమైన సహాయం చేయడానికికాదు. దానికైతే ఇంతమంది దేవతలు, మహర్షులూ, పరమ గురువులు కలిసి పూనుకోవలసిన అవసరం ఏమీలేదు. భూమ్మీద జరుగవలసిన దైవిక కార్యక్రమమే దీనికి కారణం. అదేమిటంటే రాజసూయం పూర్తి అయిన తర్వాత ధర్మరాజు జూదంలో ఓడిపోయి, వనవాసంలో కష్టాలు అనుభవిస్తూంటే అటు దేవతలుగాని, ఇటు పరమగురువులుగాని, అటు శ్రీకృష్ణుడుగానీ కలుగజేసుకొని, ఆ వనవాసాన్ని నివారించలేదు! కాబట్టి ధర్మరాజు వనవాసం చేయడంగాని, అలానే ఏకచక్రపురంలో పాండవులు భిక్షాటన చేయడంవంటి అనేకరకాలైన కష్టసుఖాలు కేవలం వ్యక్తిగతమైన విషయాలు! ఇవి మానవ జాతి చరిత్రకు సంబంధించినవికావు. అందుకనే మహాభారతయుద్ధాన్ని **నివారించడానికి కూడా** ఈ పరమగురువులు, మహాత్ములు, శ్రీకృష్ణుడు కూడ **పూనుకోలేదు.**

దీనికి కారణం మహాభారతం **'దైవికమైన కారణాల'**వల్ల భూమ్మీద నిర్వహించబడిన ఆధ్యాత్మిక సంఘటన. ఈ విషయం అడుగడుగునా వ్యాసమహర్షి పాండవులకు దర్శనమిచ్చినపుడు రానున్న ఈ భవిష్యత్ కాలాన్ని భూమ్మీద జరుగునున్న ఈ దైవకార్యాన్ని తెలియబరచి వారికి సరైన మార్గదర్శకత్వం వహించాడు.

అలాగని వ్యాసమహర్షి పాండవులకు కష్టం వచ్చినపుడల్లా సాయం

చేస్తాడనికాదు. వ్యక్తిగత విషయాలలో ఆయన జోక్యం చేసుకోడు. అందుకే శ్రీకృష్ణుని నిర్యాణంలోకాని, ఆయన మరణించిన తర్వాత యాదవులను ద్వారకకు తీసుకొస్తున్న అర్జునుడు శత్రువుల చేతిలో **పరాభవం** పొందినపుడుగాని, లేక అర్జునుడు తన దివ్యాస్త్రాలు పనిచేయక అవమానంతో బాధపడినప్పుడుగాని, వ్యాసమహర్షి ఆధ్యాత్మికంగా **ఏవిధమైన సహాయం** అందివ్వలేదు. కేవలం వ్యక్తిగతంగా అర్జునుని ఓదారుస్తూ శాంతవచనాలు మాత్రమే చెప్పాడు. అంతే!

అలాగే శ్రీకృష్ణుడు కూడా మహాభారతయుద్ధం ఆరంభం అయ్యే సమయంలో అర్జునుడికి **'దైవనిర్ణయము'** ప్రకారము భగవద్గీతను ఉపదేశించి, అర్జునుడిద్వారా సంజయుడివల్ల వ్యాసమహర్షి రచనలో నుంచి భగవద్గీతను మానవజాతి కంతటికీ అందించాడు. అంతేకాని భారతయుద్ధానంతరము తిరిగి అర్జునుడు భగవద్గీతను తాను మరచిపోయాననీ అందుకని దానిని తిరిగి ఇంకొకసారి తనకి ఉపదేశించిమని ప్రార్థించినపుడు కూడా శ్రీకృష్ణుడు, అది నిరాకరించడమే గాక తనకది మళ్ళీ చెప్పటము సాధ్యము కాదనికూడా స్పష్టముచేశాడు. పరబ్రహ్మయొక్క ఆదేశానుసారము తనలోనుంచి బహిర్గతమయిన ఆ భగవద్గీతను తిరిగిచెప్పడం సాధ్యము కాదని సంస్కృత మహాభారతం **'అను గీతాపర్వం'**లో శ్రీకృష్ణుడు అర్జునుడికి స్పష్టంగా తెలిపాడు.

ఇంతెందుకు! రాజసూయ యాగం జరిగినతర్వాత ధర్మరాజు సభలో అందరు రాజులను సమావేశపరచి అక్కడ మహర్షులనూ, బంధువులను, సదస్యులను సమావేశపరచి అగ్రపూజ జరిపి యజ్ఞాన్ని ప్రశాంతిగా పరిపూర్తి చేయాలని సంకల్పించాడు. వైశాఖమాసంలో రోహిణీ నక్షత్రంతో కూడిన **అమావాస్యనాడు** ఆరంభమైన ఈ **రాజసూయ యాగము** ఎక్కడా ఏలోపము లేకుండా కళ్ళవేడుకగా ఘనంగా జరిగింది. భోజనాలతో అతిథులు, మంత్రాలతో యావన్మంది దేవతలూ, గౌరవసత్కారాలతో' వేలాదిమంది రాజులూ, సంతృప్తులయ్యారు. మామూలుగా అయితే ఇంతటితో ధర్మరాజు చేసిన యజ్ఞము సుఖాంతము అయ్యేదే. ఎందుకంటే ధర్మరాజు

యజ్ఞము చేయడము కేవలము అతని వ్యక్తిగతమయిన విషయము. రాజుగా రాజసూయము చేయడము తన ధర్మం కనుక చేశాడు. కాని ఈ యజ్ఞాన్ని ఆధారము చేసుకొని ఈ భూమ్మీద జరగవలసిన 'దైవకార్యం' ఇంకొకటి ఉన్నది. అది మహాభారత యుద్ధానికి **అంకురారోపణ!** -- అంటే **బీజం** వేయడం. ఈ విషయన్ని వ్యాస మహర్షి చాల స్పష్టంగా తన సంస్కృత మహాభారతంలో రెండవ ఆశ్వాసంలో ఇలా వర్ణించారు.

'ఆరోజు యజ్ఞం ఆరవదినం. అవబృదస్నానం అంటే యజ్ఞం పూర్తయిన తర్వాత చేసే స్నానం జరిగాక, అందరూ యజ్ఞ వేదికలలో కట్టిన అంతర్వేదిలో కూర్చున్నారు. అంతగొప్పగా జరిగిన రాజసూయంయొక్క వైభవమూ, ధర్మజుని శ్రద్ధా, ధర్మనిష్ఠ, అంతాచూసి ఎంతో ప్రశంశించాడు నారదుడు. ఇక్కడ నారదుడు ప్రశంసించడంలో ఎంతో అర్థముంది.

నారదుడు దేవఋషి, అంటే పైలోకాలలో జరిగే దైవసంకల్పాలనూ, దేవసభలో జరిగే దైవనిర్ణయాల గురించి పూర్తిగా తెలిసినవాడు ఆయన. ధర్మరాజును తగువిధంగా ప్రశంసించి, శ్రీకృష్ణునివంక చూసి ఏకాగ్రతతో ఒక **రహస్య సంకేతంగా** తల పంకించాడు. అంతే దాంతో శ్రీ కృష్ణునికి ఆనాడు దేవలోకంలో జరిగిన నిర్ణయం గుర్తుకు వచ్చింది! రాబోయే మహాభారతయుద్ధం ముందుగానే కళ్ళకు కట్టినట్లయింది" అని స్పష్టంగా వ్యాసమహర్షి సంస్కృత భారతంలో వర్ణించడంలోని అంతరార్థమిదే!

## శిశుపాల వధ — రాజుల మారణహోమం :

నారదుడు తలపంకించడంతో, ఆ తర్వాత ప్రారంభమయిన సంఘటనలు, శిశుపాలవధకు దారితీశాయి. దాంతో **యజ్ఞాంతంలో రక్తపాతం** జరిగింది. దీని ఫలితంగా 13 సంవత్సరాల తర్వాత, అక్కడ చేరిన యావన్మంది రాజులు ఘోరంగా నశించే మహాభారత యుద్ధమనే "యుద్ధయజ్ఞం" జరిగింది. ఇది **'దేవతల నిర్ణయం'.** భూమ్మీద ప్రజాక్షయంచేసి, **భూభారం** తగ్గించడం అనే 'దైవకా

ర్యంలో' పరమగురువులు, దేవఋషులు, తమ తమ పాత్రలను ఎలా నిర్వహిస్తారో, వ్యక్తుల కష్టసుఖాలతో నిమిత్తం లేకుండా -- అన్న రహస్యం తెలుసుకోవడానికి ఈ సందర్భం ఒక ప్రత్యక్ష దర్శనం!

## హిడింబి పెళ్ళి!

అలాగే వ్యాసమహర్షి ఆదిపర్వంలో భీముడు హిడింబాసురుని భయంకర ద్వంద్వయుద్ధంలో చంపిన తరువాతకూడా ఈ భవిష్యత్తును తెలిసిన సన్నివేశాలలో మరొక ఉదంతాన్ని ఇలా వర్ణించాడు.

హిడింబి కుంతీదేవితో ఆమెకు పాదాభివందనం చేసి ఇలా అన్నది. "నన్ను అనుగ్రహిస్తే మీరు చెప్పిన ఏపనైనా నిమిషాలపైన చేయగలను. మీకు కావలసిన చోటుకి అందరినీ ఎత్తుకుని వెళ్ళగలను. అంతేగాదు నామాట యదార్థం. నాకు జరగబోయేది, జరుగుతున్నదీ, జరిగిపోయిందీ - త్రికాలాలలోని విషయాలు తెలుసు. కావాలంటే చెపుతాను వినండి. మనం వెళ్ళే ఈ దారిలో ముందుగా ఒక సరోవరం వస్తుంది. అక్కడ ఒక మర్రిచెట్టు కనబడుతుంది. ఆవి రెండూ శాలిహోత్రమహర్షి తపశ్శక్తివల్ల నిర్మించబడినవి. ఆ సరస్సులో నీళ్ళుత్రాగినవారికి ఆకలి దప్పులు లేవు. ఆ చెట్టునీడన విశ్రమించిన వారికి ఎండ, వాన, చలి, వేడి వీటిబాధలుండవు. అంతేకాదు అక్కడ మీకు వ్యాసమహర్షి ప్రత్యక్షమవుతాడు" అని హిడింబి ఆశ్చర్యంగా, జరగబోయేదంతా చెబుతుంది.

ఆతర్వాత నిజంగానే పాండవులకి దారిలో ఒక చెట్టూ, అక్కడ 'శాలిహోత్రమహర్షి' తపోమహిమకలిగిన సరస్సూ రెండూ కనబడ్డాయి. ఆ సరస్సులో స్నానంచేసి సంధ్యావందనం, జపం నిర్వర్తించుకున్నారు పాండవులు. ఆసరస్సు నీళ్ళు కడుపునిండా త్రాగి చెట్టునీడను విశ్రమించగానే వారికి హిడింబి చెప్పినట్టుగానే ఆకలిదప్పులు పోయి శీతాపాది బాధలు లేకుండాపోయాయి.

అంతేకాదు, అక్కడ వారికి అకస్మాత్తుగా వ్యాసమహర్షి ప్రత్య

క్షమయ్యాడు. అందరూ దిగ్గునలేచి ఆయనకు పాదనమస్కారం చేసి పూజించారు. కోడలైన కుంతిని, మనుమలనూ ఆశీర్వదించి, వ్యాసమహర్షి వారికి కలిగిన వ్యక్తిగత కష్టాలకు కొంత ఓదార్పు మాటలు పలికి, ఇక 'దైవసంకల్పం' ప్రకారం జరుగవలసివున్న విషయాలను గురించి ఇలా ప్రస్తావించాడు.

"ఇది శాలిహోత్రుని తపశ్శక్తిచేత ఏర్పడ్డ సరోవరం! ఈ నీళ్ళు త్రాగినవారికి ఆకలిదప్పులు ఉండవు. ఈ చెట్టునీడన విశ్రాంతి తీసుకొన్న వారికి ఎండ, వాన, చలిగాలి వంటి బాధలు తగలవు. ఇక్కడే కొన్నాళ్లు గడపండి. తర్వాత ఏకచక్రపురం అనే బ్రాహ్మణ అగ్రహారం చేరి అక్కడ బ్రాహ్మణ వేషాలతో బ్రాహ్మణుల మధ్యనే నివసిస్తూ రహస్యంగా ఉండండి. అక్కడ మళ్ళీ అవసరమైన సమయానికి నేను మళ్ళీ కనిపిస్తాను." అని వ్యాసమహర్షి వారికి జరగవలసిన కార్యక్రమంలో దారిచూపించాడు.

## భారతదేశపు – భవిష్యత్-సామ్రాట్ :

ంతేకాదు. రానున్న భవిష్యత్తులో దైవసంకల్పంగా జరగవలసిన మహాభారతయుద్ధం అంతమయినాక శక కర్తగా యుధిష్ఠిరుని *పట్టాభిషేకం భారతదేశ సామ్రాట్టుగా జరుగవలసి యున్నది. ఇది దేశానికి నిర్ణయించిన భవిష్యత్ నిర్ణయము ఇదే రానున్న భవిష్యత్తు. ఈ రెండింటిని తెలియజేస్తూ వ్యాసమహర్షి ఇలా అన్నాడు.

"ధర్మజుడు రానున్న కాలంలో తప్పక సార్వభౌముడవుతాడు. విష్ణుమూర్తియొక్క నాలుగు భుజాలవంటి నలుగురు తమ్ముల పరాక్రమంతో రాజులందరినీ జయిస్తాడు. రాజసూయం, అశ్వమేధం వంటి యజ్ఞాలు చేస్తాడు. పూర్వీకుల రాజ్యాన్ని తిరిగి పొందుతాడు.

---

* **'యుధిష్ఠిర శకం'** -- భారతదేశ చరిత్రలో సప్తర్షులు మఖానక్షత్రంలో ప్రవేశించగానే ఆరంభించిందని భాగవతం -- 12వ స్కందం. ఇది 3123 B.C. అవుతుంది.

అఖండ రాజ్యలక్ష్మిని అనుభవిస్తాడు. కురువంశాన్ని ఉద్ధరిస్తా"డని చెప్పి హిండింబి బలశాలి అయిన కుమారుని ఘటోత్కచుని కంటుందనీ, అతడు **"పనికి వస్తాడు"** అని ఆశీర్వదించి మాయమయ్యాడు వ్యాసమహర్షి. అంతేగాని ఘటోత్కచుడు చిరంజీవి అవుతాడనీ పాండవులతో సుఖంగా జీవిస్తాడని చెప్పలేదు వ్యాసమహర్షి. **'అవసరం వచ్చినపుడు పనికివస్తాడని'** మాత్రమే ఎంతో అర్థంతో నొక్కి చెప్పాడు. ఆ 'అవసరం' రానే వచ్చింది! మహాభారత యుద్ధంలో, అది అర్జునుడి ప్రాణాలు దక్కించుకోవలసిన అవసరం. కర్ణుడు ఇంద్రుడిచ్చిన శక్తితో అర్జునుడిని చంపాలనే దృఢ నిశ్చయంతో వున్నాడు. దానికి ఈ ఘటోత్కచుడే ఆహుతై దాంతో అర్జునుని ప్రాణాలు రక్షించబడటం జరిగింది. ఇదీ వ్యాసమహర్షి మాటలలో – **"అవసరం వచ్చినపుడు"** అంటే అర్థం! మహర్షుల వాక్యాలూ, పరమ గురువుల సూత్రాలు అతి సూక్ష్మంగానూ, **ఎంతో గంభీరమైన** అర్థంతో నిండి ఉంటాయి.

ఎందుకంటే భూత భవిష్యత్ వర్తమాన కాలాలు తెలిసి జరుగుతున్న సంఘటనలలో, ఏవి **అనిత్యమైన సామాన్య సంఘటనలో,** దైవసంకల్పంతో జరిగే దైవకార్యాలేవో తెలిసి, అవి భూమ్మీద మానవజాతి పురోగతికి మానవపరిణామంలో ఎలా అవసరమో కూడా తెలిసి, వాటిని సక్రమంగా నిర్వహించడానికి మార్గదర్శిగా ఈ భూమ్మీద ఆ కార్యక్రమాన్ని నడిపించేవారే పరమగురువులు!

పరమ గురువుగా ఈ సంఘటనలో వ్యాసమహర్షి నిర్వహించిన పాత్రను ఎత్తిచూపటమే ఈ అధ్యాయములోని ప్రయోజనం. అందరూ కథమాత్రమే చూస్తారు. కాని మహర్షుల జీవితాల్లోని ఆధ్యాత్మిక రహస్యాలు గమనించటం కష్టం! ఈ దృష్టితో భారతం చదవాలి. అప్పుడు ఎన్నో దేవరహస్యాలు తెలుస్తాయి.



# 14

# "వ్యాస శిష్యులు"

ఇంతవరకూ మనం వ్యాసమహర్షి హిందూమతం వెనుక దాగివున్న సనాతనధర్మాన్ని మానవజాతికి అందుబాటులో వుండేలాగ శాశ్వతసత్యాన్ని వేదార్థాన్ని అందరికీ సుబోధకంగా తెలిసేలాగ తేటతెల్లమైన శైలిలో పద్దెనిమిది పురాణాలద్వారా ఎలాగ మానవజాతి కందించాడో అన్నది గమనించాం. బ్రహ్మసూత్రాలు, వేదవిభాగం, అష్టాదశపురాణాల రచన అన్నది ఒక మహత్తరమైన కార్యక్రమం.

ఈ కార్యక్రమంలో వ్యాసమహర్షియొక్క రచనలు ప్రజలలో జనసామాన్యంలో వేళ్ళుపాతుకొనిపోయి, ఒక మహావృక్షంలాగ శాశ్వతంగా నిల్చిపోవడానికి కారకులైనవాళ్ళు ఎవరో ఈ అధ్యాయంలో గమనిద్దాం. వారే, వ్యాస -- శిష్యులు! వ్యాసమహర్షికి అనేకమంది శిష్యులున్నారు. ఈ శిష్యుల్లో ఎవరెవరు ఏవిభాగాన్ని అధ్యయనం చేశారు అన్నది

ప్రస్తుతం ఈ అధ్యాయంలో గమనిద్దాం.

వ్యాసమహర్షియొక్క జ్ఞానం ఒక మహాసముద్రం వంటిది. ఆ సముద్రంలో ఒక్కొక్కభాగం ఒక్కొక్క మహర్షి తీసుకొన్నారు. ఆ మహర్షుల్లో ప్రతిఒక్కరూ తను తీసుకున్నటువంటి 'వేదశాఖ'ని తాను ప్రత్యేకంగా అధ్యయనంచేసి, తన శిష్యులద్వారా తన కుమారులవల్ల, తన శిష్యుల సంతతివల్లా ఆ 'వేదశాఖ'ను శాశ్వతంగా భారతదేశంలో నిలిచిపోయేలాగ చేయటానికి తమ జీవితాన్ని అంకితంచేశారు.

## వేదశాస్త్రాలు :-

ఇలాగ కొందరు పురాణాల్ని, కొందరు బ్రహ్మసూత్రాలు, కొందరు వేదశాఖలు, కొందరు జ్యోతిష ఆయుర్వేద మంత్రశాస్త్రాలు, మరికొంతమంది 'ఆగమశాస్త్రం' -- అంటే ఆలయాలు వాటి నిర్మాణం, విగ్రహాలూ, వాటి వాస్తు వాటిని పూజించే శాస్త్రవిధానం; ఇదంతా ఆగమశాస్త్రం - ఈ ఆగమశాస్త్రాన్ని జనసామాన్యంలో నశించిపోకుండా కాపాడారో! అలాగే, కొంతమంది ఉపనిషత్తులు, యోగ రహస్యాల్ని, ఉపాసనా పరంపర ఇలాగ ఒక్కొక్క మహర్షి ఒక్కొక్క విభాగాన్నితీసుకొని దాన్ని జనసామాన్యంలో ప్రచారంచేశారు. అది ఎవరెవరు ఏ విధంగా చేశారో ఈఅధ్యాయంలో గమనిద్దాము.

వేదవ్యాసమహర్షి అనే మర్రిచెట్టుకు అనేక శాఖలు, ఉపశాఖలు ఉన్నాయి. ఈ శాఖలే ఆయన శిష్యులు ఒక్కొక్క శిష్యుడు ఒక్కొక్క వేదశాఖని లేదా పురాణశాఖని తీసుకున్నారని చెప్పానుకదూ! ముఖ్యంగా వ్యాసుడి శిష్యులు నలుగురు. వీళ్ళపేర్లు పైలుడు, వైశంపాయనుడు, జైమిని, సుమంతుడు.

## వ్యాసమహర్షి -- శిష్యులు :-

ఇందులో పైలుడు "బహు బురుచ" అనే పేరుగల ఋగ్వేద సంహితను గ్రహించాడు. తరువాతవాడెన వెశంపాయనుడు

"నిగదాఖ్య" అనేపేరుగల యజుర్వేద సంహితను వ్యాసమహర్షి నుండి గ్రహించాడు. మూడవవాడైన జైమిని "ఛందోగ" అనేపేరు గలిగిన సామవేదసంహితను వ్యాసమహర్షినుంచి గ్రహించాడు. ఇక సుమంతుడు "ఆంగీరసీ" అనే పేరుగల అథర్వణ సంహితను వ్యాసమహర్షినుండి గ్రహించాడు.

ఈ నలుగురు శిష్యులకు ఆశాఖరక్షణకు మళ్ళీ వేరే శిష్యపరంపర ఉన్నది. ప్రతి ఋషీ తాను వ్యాసమహర్షినుండి గ్రహించిన వేద - సంహితను మళ్ళీ తిరిగి తన శిష్యులకు ఉపదేశించారు. ఆ శిష్యప్రశిష్యులు ఒకరినుంచి ఒకరికి సంహితల్ని వ్యాపింపజేస్తూ శిష్యపరంపరగా స్థాపించినదే ఈనాటి వేదశాఖలుగా నిల్చిపోయింది.

ఈ పనిచేసినవారి వివరాలుకూడా మనము ఇక్కడే తెలుసు కుందాం. ఈ నాలుగువేదాలను, వేదసంహితలను, పైల, వైశంపాయన, జైమిని, సుమంతులు గ్రహించారు. ఇక పద్దెనిమిది పురాణాలు పురాణసంహితలు, అన్నీకూడా రోమహర్షణుడు అను పేరుగల "సూతుడు" గ్రహించారు. ఆయన వ్యాసమహర్షియొక్క ఐదవ శిష్యుడు. అతను పురాణభాగం అంతాకూడా వ్యాసమహర్షినుండి గ్రహించాడు. అతడి కొడుకు - తర్వాత ఉగ్రశ్రవుడు లేక రోమహర్షణి! మళ్ళీ ఈ పరంపరను వ్యాపింపజేశాడు. రోమహోర్షణి నుండి తరువాత ఆయన తన శిష్యపరంపరద్వారా ఆ పురాణసంహితలకు సంబంధించిన విద్యనంతాకూడా తన శిష్యులకుపదేశించాడు.

(1) పైలుడు :-

ఇప్పుడు క్రమంగా ఒక్కొక్క వ్యాసశిష్యుడియొక్క పని ఏమిటో గమనిద్దాం. మొదట 'పైలుడు' అనే వాణ్ణి తీసుకుందాం. ఈ పైలమహర్షి 'బహుఋరుచ' అనే పేరుగల ఋగ్వేదసంహితని గ్రహించాడు. ఈ పైలునికి 'ఇంద్రప్రమతి' అనే వాడు శిష్యుడు, అతని తర్వాత బాష్కలుడు అనేవాడు యాజ్ఞవల్క్యుడు......ఇలాగ ఈ

శిష్యపరంపర ఒకరినుంచి ఒకరు ఈ వేదభాగంచేసి తీసుకున్నారు.

## యాజ్ఞవల్క్యుడు :-

యాజ్ఞవల్క్యుడనేవాడు నాలుగుభాగాలు చేసి అది విస్తరింపజేశాడు. ఈ మాండుక్యఋషి తిరిగి దీన్ని మళ్ళీ 'దేవమిత్రుడు' కి, ఆయన తిరిగి "సౌభరి" మొదలైన మహర్షులకుపదేశించాడు. ఈ సౌభరి తన కుమారుడైన శాకల్యుడు యీ సంహితను ఐదుభాగాలుచేసి వాత్స్య, ముద్గల, శాలీయ, గోఖల్య, శిశిర అనే పేరుగల ఆయన శిష్యులకు ఉపదేశించాడు. ఇతడు తన శిష్యుడైన "జాతకర్ణుడి" తో తనయొక్క సంహితను అధ్యయనం చేయించాడు. తరువాత వైద్య, వేతాళ, విరజ అనేవాళ్ళు యీ జాతకర్ణుడి నుంచి గ్రహించారు. బాష్కలి అనేవాడు తర్వాత ప్రాతిశాఖ్యలను విస్తరింపజేశాడు. 'వాలఖిల్యసంహిత' అనే పేరుగల సంహితను ఆయన అధ్యయనంచేసి దాన్ని గ్రహించాడు. 'వాలాయని' లేక 'కాసార' అనే పేరుగల సంహితకూడా ఈయన గ్రహించాడు. ఈవిధంగా 'బహుఋరుచ' అనే పేరుగల వేదశాఖ అనేక శిష్యులద్వారా గ్రహించబడి, ఇది ఛందోబద్ధంగా వారిచేత ముఖస్థంగా వినడంద్వారా యోగ్యులైన మనుష్యశ్రేష్ఠులైన, శిష్యులచేత జనసామాన్యంలో విస్తరింపజేయబడినది. ఇది వ్యాసశిష్యులలో మొదటి వాడైన పైలునియొక్క శిష్యపరంపర.

## (2) వైశంపాయనుడు :-

ఇక రెండవాడు వైశంపాయనుడు. ఈ వైశంపాయనుడు 'నిగదాఖ్య' అనే పేరుగల, 'యజుస్సంహిత'ను వ్యాసమహర్షినుండి గ్రహించాడు. ఈయనశిష్యులు -- చరకుడు, అధ్వర్యుడు అనేవారు. బ్రహ్మహత్యా పాతకాన్ని పోగొట్టే విధానాన్ని గురించి వ్రతాలూ, శరీరాన్ని శుద్ధిచేసేటువంటి వ్రతకరణాలు అవన్నీకూడా గ్రహించారు. అవి వాళ్ళుతమ శిష్యుడైనటువంటి యాజ్ఞవల్క్యుడికి ఉపదేశించారు.

తరువాత తపస్సు చాలా తక్కువైనటువంటివాళ్లు'తపస్సు' క్షీణమైతే ఏం చేయాలి? దుష్కరమైన తపస్సు చేయడమా?" అని ఆలోచించి విచికిత్స చేయగా గురువు బ్రహ్మహత్యా పాపాన్ని తాను నివారించగలను అన్నప్పుడు గురువు ఆయనమీద కోపించి యాజ్ఞవల్క్యానికి శాపం ఇచ్చారు. యాజ్ఞవల్క్యుడిని తన ఆశ్రమాన్నుంచి వెడలగొట్టాడు. దేవరాతుడుయొక్క పుత్రుడైన యాజ్ఞవల్క్యుడు యజుర్వేదాన్ని మంత్ర రూపంగా తన కంఠంలోంచి రక్తంతోపాటు బయటకి గురువాజ్ఞప్రకారం కక్కివేశాడు.

ఇలా శపించి గురువు "తానుపదేశించిన వేదం తనకి కక్కవలసింది అని కోపించినప్పుడు ఆయన ఈ విధంగా తను నేర్చుకున్న మంత్రాన్ని కక్కినప్పుడు కంఠంద్వారా బహిర్గతమైన దాన్ని తిత్తిరి పక్షులు అలా బయటపడిన రక్తఖండాల్ని, మాసఖండాల్నీ భుజించాయి! ఆతిత్తిరి పక్షులు మాట్లాడే భాషలోంచి వేదమంత్రాలు మళ్ళీ అప్రయత్నంగా వాటంతట అవే వెలువడ్డాయి. అదే "తైత్తరీయ" సంహితగా ప్రజలలో వ్యాప్తి చెందింది. ఇది యజర్వేదముయొక్క విభాగము. అందుకే ఈశాఖకు 'తైత్తిరీయ' శాఖ అనేపేరు పెట్టబడి వృద్ధిపొందింది. యాజ్ఞవల్క్య మహర్షికూడా వేదాధ్యయనం ఇంకా చేయవలెనని చాలాకోరికతో గురువుని ఆశ్రయించాడు. ఆతర్వాత సూర్యుని ఉపాసించి ఆయన సూర్యభగవానునినుంచి "వాజసనేయ సంహిత"లోని శుక్లయజుర్వేద సంహిత అనే సంహితను ఉపదేశంగా పొందాడు.

వైశంపాయనుడు గ్రహించినటువంటి యజుర్వేద సంహిత ఈవిధంగా రెండువిభాగాలైంది. ఒకటి 'కృష్ణయజుర్వేదం', రెండవది 'శుక్లయజుర్వేదము.' తిత్తిరి పక్షులు కక్కినటువంటి మంత్రాల నుంచి తైత్తిరీయమునూ, సూర్యుడినుంచి వాజసనేయ సంహితమూవచ్చాయి. ఈ విధంగా వైశంపాయనునియొక్క శిష్య పరంపర వృద్ధిపొందింది.

## (3) జైమినిమహర్షి :-

ఇక మూడవవాడైన 'జైమిని' సామవేద - శాఖను వ్యాసమహర్షి నుంచి గ్రహించాడని తెలుసుకున్నాంకదా! ఈయన కుమారుడు సుమానుడు అనే పేరుగల ఈయననుండి గ్రహించాడు. ఈయననుంచి ఈయన శిష్యుడు సుకర్మ అనేవాడు సామవేదాన్ని మళ్ళీ శాఖలుగా విభజించి విస్తరింపజేశాడు. సుకర్మ అనేవాడు మళ్ళీ తమ శిష్యులైన హిరణ్యనాభుడికీ, కౌశల్యుడికీ, "పౌష్యాజ్ఞి" మొదలైన ఇతర శిష్యులందరికీగూడా సామవేదాన్ని శాఖోపశాఖలుగా విడదీసి ఉపదేశించాడు. వారు ఒక్కొక్కరు ఒక్కొక్క ఉపశాఖని గ్రహించి సామవేదాన్ని విస్తరింపజేశారు.

ఇలాగ ఐదువందలమంది (500) శిష్యులు పశ్చిమదిశగా దేశంలో పర్యటిస్తూ ఈ సామవేద శాఖను ప్రజలలో వ్యాపింపజేశారు.

అవంతి అనేపేరుగల దేశం తూర్పుదిక్కుగా ఉన్నది. అక్కడ పౌష్యుడు 'పౌషజ్య అనే శాఖనూ, 'లోగక్షి' అనేవాడు, 'మాంగలి 'కుల్వ' కుశీద, కుక్షి మొదలైనవాళ్ళు తూర్పుదిక్కుగా సంచారంవెళ్ళి - ఈ శాఖను విస్తరింపజేశారని తెలుస్తున్నది.

ఇది ఇలాగ శాఖోపశాఖలుగా చీలి వేర్వేరు సంహితలుగా విడదీసి గ్రహించబడి అనేకవిధాలుగా ప్రజలలో వ్యాప్తినిపొందాయి. 'హిరణ్యనాభుడు, అనేవాడు ఇరవైఐదు సంహితలను తయారు చేసి తనశిష్యులచే వీటిని అధ్యయనంచేయించి 'అవంతి' దేశంలో వ్యాపింపజేశాడు. ఆవిధంగా వేదంయొక్క శాఖలు అనేక ప్రశాఖలక్రింద ఒక్కొక్క వ్యాసశిష్యుడినుంచి వారి ప్రశిష్యులకూ, వారి కుమారులకూ శిష్యపరంపరగా గురుపరంపరద్వారా వ్యాపించింది.

## వేద -- శాఖలు :-

అదే ఈనాటికి మనము 'సంకల్పం' చెప్పకొనేటప్పుడు మనయొక్క

"శాఖను" యజుశ్శాఖాధ్యాయీ" - "అనీ, సామవేదశాఖ్యాధ్యాయీ" అని చెప్పకొంటాము. అంటే మనము ఏఋషియొక్క సంతతిలో జన్మించామో ఆ ఋషియొక్క శాఖనే అధ్యయనంచేయవలసింది, ఈనాటికీ విధిగా జరుగుతూంది.

ఇలా ముఖస్తముగా యాభైశతాబ్దాలు... అంటే శ్రీకృష్ణుడు నిర్యాణమైన క్రీ||పూ|| 3102 B.C. సం|| నుంచీ ఈనాటివరకూ... విభాగమైనదే అంటే ఐదువేల సంవత్సరాలదాకా ముఖస్తముగానే గురువునుంచి శిష్యుడికి ఈవిధముగా వేదశాఖలుగా, శాఖోపశాఖలుగా విస్తరించి, రక్షింపబడటానికి కారణం -- కృష్ణద్వైపాయన వ్యాసమహర్షి తన శిష్యులద్వారా చేసినటువంటి ప్రచారం. ఇది ఈయన శిష్యులు చేసినటువంటి బ్రహ్మాండమైన "వేదరక్షణ కార్యక్రమము." ఈ వేదరక్షణ కార్యక్రమాన్ని చూసి మహత్తరమైనటువంటి ఆశ్చర్యాన్ని అపరిమితమైనటువంటి ప్రశంసనీ పశ్చిమదేశాలు కూడా యీనాటికీ జోహారుచేస్తూ వ్యక్తం చేశాయి.

## ఈనాడు వేదాల రక్షణ :-

ఇప్పుడు మళ్ళీ ఈ వేదశాస్త్రాలని అధునాతనిక దృష్టితో అందరికీ సుబోధకంగా అర్థం అయ్యేటువంటి భాషలో రచించి ఈశాస్త్రాన్నే మళ్ళీ రానున్న కాలానికి అనుసరించేవిధంగా కాలానికి అనుగుణంగా ప్రజలలో వ్యాపింపజేయటానికి మళ్ళీ ఎంత ప్రయత్నం చేయాలో మనం ఆలోచిస్తే తెలుస్తుంది.

దీన్నిబట్టి ఆనాడు వ్యాసమహర్షి ఎంత మహత్తరమైన కార్యక్రమం రూపొందించాడో ఆయనయొక్క అసాధారణ కృషి, తపశ్శక్తి, వారికున్నటువంటి త్యాగశీలతవల్ల ఈనాటికీ వేదవిద్యలూ, పురాణ సంహితలూ నిలిచి ఎలా ఉన్నాయో మనకి తెలుస్తుంది.

## రోమహారణి -- సూతముని :-

ఇప్పుడు చతుర్వేదాలయొక్క విభాగం ఆయనయొక్క నలుగురు శిష్యులూ ఎలా తీసుకున్నారో గ్రహించాం. ఇక మిగిలినవి పురాణ సంహితలు. ఈ పురాణ సంహితలను 'రోమహర్షణుడు' అనే పేరుగల సూతుడు వ్యాసమహర్షినుండి గ్రహించాడు.

"సూతః పురాణ తత్త్వజ్ఞః" అనేది ప్రతి పురాణంలోనూ వస్తుంది. ఈసూతుడు పురాణాల్ని వేదవ్యాసమహర్షినుంచి గ్రహించాడు.

ఆయన శిష్యుల పరంపర ఈవిధంగా వుంది. 'సుమతి' అనేవాడు ఆత్రేయస గోత్రుడు. 'అకృతవ్రణుడు' అనేవాడు కాశ్యపగోత్రికుడు, 'అగ్నివర్చ' అనేవాడు భరద్వాజగోత్రుడు. 'మిత్రాయువు' అనేవాడు వశిష్ఠ గోత్రుడు. 'సోమదత్తి' అనేవాడు సావర్ణిగోత్రుడు. 'సుశర్మ' అనేవాడు శంశపాయనగోత్రుడు. ఈపేర్లుగల ఈ ఆరుగురు శిష్యులున్నూ రోమహర్షణియొక్క పురాణ సంహితను ప్రజల్లో విస్తరింపజేశారు. వాయు పురాణంలో ఈ శిష్యుల పరంపరయొక్క విధానం అంతాగూడ ఈవిధంగా వర్ణించబడిఉంది.

"షట్యః కృత్వా మయావ్యక్తం పురాణం ఋషిసత్తమాః
ఆత్రేయాః సుమతి ర్ధీమాన్ కాశ్యపోహ్యా కృతవ్రణః
భారద్వాజో అగ్నివర్చ్యా వసిష్ఠో మిత్రాయుశ్చవః
సావర్ణిః సౌమదత్తశ్చ సుశర్మ శంశపాయనః
ఏతే శిష్యా మమ బ్రహ్మాన్ పురాణేషు ధృఢవ్రతాః"

అని వ్యాసమహర్షియే తన వాయుపురాణం 61వ అధ్యాయంలో వ్యాసమహర్షి శిష్యుల్ని స్వయంగా తన వాక్కులతోనే స్మరించి -- "ఈ ఆరుగురు శిష్యులూకూడ నా పురాణాలన్నీగూడ ధృఢవ్రతులైనటువంటి

సుశిక్షితులైనటువంటివారు, మంచి శ్రద్ధాభక్తులతో తు.చ తప్పకుండా నా ఉపదేశాన్ని అనుష్ఠించేటటువంటి నా ఆరుగురు శిష్యులమూలాన నాయొక్క పురాణ సంహితలన్నిగూడ ప్రపంచంలో వ్యాపించినాయి." అని వ్యాసుడే స్వయంగా వాయుపురాణంలో చెప్పిన శ్లోకానికి అర్థం ఇది. ఈ శిష్యుల్లోంచి కాశ్యపుడు, సావర్ణి, శాంశపాయనుడు అనే ముగ్గురు ఋషులూగూడా వారు మళ్ళీ స్వయంగా వేరే సొంతరచనలు కొన్ని చేశారు. అవి పురాణసంహితల రూపంలో నిర్మాణం చేశాడు.

ఇందులో ముగ్గురికీ గురువు రోమహర్షణి ఆయన నాలుగు సంహితల్ని విష్పన్నం చేశాడు. ఈ విషయం విష్ణుపురాణంలోను, అగ్నిపురాణంలోను స్పష్టంగా తెలియజేయబడింది. అగ్ని పురాణంలో--

"శాంశ. పాయనా దయశ్చక్రుః పురాణానాంతు సంహితాః"

అని అగ్ని పురాణంలో స్పష్టంగా వ్రాయబడింది.

ఈవిధంగా యయన తనయొక్క శిష్యపరంపర పురాణాలయొక్క వ్యాప్తికి, వాటివిస్తరణకి ధారణచేసి ప్రజలలో వాటిని ప్రచారం చేయడానికే, ఈ ప్రచారం -- అనేకచోట్ల, అంటే ఏదైనా యజ్ఞాలు జరిగేటప్పుడు, ధర్మకార్యాలు జరిగేటప్పుడు, మహత్తరమైన ఆశ్రమాల్లోని మునుల సమావేశాలు జరిగేటప్పుడూ, సత్రయాగాల్లోనూ, ఈ సూతుడూ ఆయనయొక్క శిష్యులున్నూ అనేకచోట్ల సంచారంచేసి ఈపురాణాలయొక్క గ్రంథాల్ని ప్రజలలో నిలిచిపోయేలాగా శాశ్వతమైన కృషిచేశారు. వారు మనకి నిత్యం స్మరణీయులు.

ఈ విశేషమైన ఈ కృషిఫలితంగానే ఈనాటికీ మనకి ఈ సూతుడనేపేరుగల వ్యాసశిష్యునిద్వారా ఈ పురాణాలన్నీ గూడా నిల్చివున్నాయి. అందుకని ఈ వ్యాస శిష్యులందరూ ప్రతి హిందు వునకూ నిత్యమూ ప్రాతఃస్మరణీయులైన మహాత్ములు! ఎందుకంటే ఈనాడు హిందూమతం కలియుగంలో ఇలా నిలచివుండటానికి, వారు

ఆనాడు కలియుగం ఆరంభమయ్యే కాలంలో చేసిన నిస్వార్థశ్రమ, గురుభక్తితోచేసిన  పనియే కారణం.



15

# నిధీ -- పెన్నిధీ

ధర్మరాజుకు అడుగడుగునా తోడుపడి, అండగా నిలిచి అత్యవసర సన్నివేశాలలో దైవ సహాయాన్ని అందించిన అవతారమూర్తులు మహా భారతంలోచూస్తే ఇద్దరే కనిపిస్తారు. ఒకరు వ్యాసమహర్షి తర్వాత శ్రీకృష్ణుడు. ఈ ఇద్దరూ కారణ జన్మలే! అంటే ఈభూమ్మీద జన్మించిన పరమ గురుమండలిలోనివారే!

శ్రీకృష్ణుడుకూడా పరమగురుమండలిలో చేర్చి చెప్పడంవల్ల కొందరికి ఆశ్చర్యంగా అనిపించవచ్చు. నిజమేశ్రీకృష్ణుడు మహర్షి కాదుకదా! చిరంజీవుడూ కాదు. అయినా ఆయన పరమ -- గురుమండలిలోని సిద్ధపురుషులైన మహర్షుల మండలికి ప్రతినిధివంటివాడే! ఎందుకంటే పూర్వ సృష్టిలో మహర్షిగా పరిపూర్ణుడై నారాయణ తత్వాన్ని సిద్ధింప చేసుకొన్న 'నారాయణ ఋషి' యొక్క అవతారమే

శ్రీకృష్ణుడు! అందుకని ఈయన పరమ -- గురుమండలిలోనివాడని చెప్పిన కారణం, ఎందుకంటే నారాయణఋషి కృతయుగంలో బదరికాశ్రమంలో తపస్సుచేసిన నర-నారాయణులలో ఒకరు. ఆ రెండవ ఋషి 'నరుడే' -- పాండవ మధ్యముడైన అర్జునుడి శరీరంలో అవతరించాడు.

పైలోకాల్లోని దైవనిర్ణయాలు ఈ భూలోకంలో నడిపించాలంటే ఈ భూమ్మీద జరిగే రాజకీయ సంఘటనలు మానవజాతిలో జరిగే 'ఆధ్యాత్మిక ప్రణాళిక' తో సమ్మేళనచేస్తేగాని రాజకీయాలు, ఆధ్యాత్మిక మార్గంలో నడవడంజరగదు. ఎందుకంటే ఏ కాలంలో చూసినా రాజకీయవేత్తలు, స్వార్థపరులు, అధికార దాహంతో, పదవీ వ్యామోహంతో కళ్ళు మూసుకొనిపోయి నిరంకుశత్వాన్ని చలాయించాలన్న స్వభావంగల వ్యక్తులే ఉంటారు. రాజకీయాలంటే బలము, అధికారము, డబ్బూ కలిగినవారి స్వార్థానికి బలై ప్రజల జీవితాలు సంక్షోభంలో ఇరుక్కోవడమే రాజకీయ చరిత్ర!

దీన్ని మానవజాతికి ఉపయోగించే విధంగా ఆధ్యాత్మికశక్తియుక్తులైన పరమగురువుల సంకల్పంతో జోడించి జరిగే విషయాలను లోక కళ్యాణంకోసం మలుపు తిప్పాలి! భారతంలోని రాజకీయసంఘటనలు దీనివైపు నడిపించిన వ్యక్తే శ్రీకృష్ణుడు. ఆధ్యాత్మిక సన్నివేశాలను నిర్వహించిన పరమఋషి వ్యాసమహర్షి.

## రాజకీయాల్ని -- లోక కళ్యాణం వైపు :-

అందుకే శ్రీకృష్ణునిలో రాజకీయకుతంత్రాలకూ, మాయోపాయాలకూ అధర్మానికి అధర్మంతోనే బుద్ధిచెప్పే రాజకీయ కుశలతా కనిపిస్తుంది. అంతేకాదు రక్తపాతానికి సమాధానం ఆయుధాలతోనే ఇవ్వాల్సిన ఆపద ఏర్పడితే దానికి కావలసిన తెగింపూ, పట్టుదల, సాహసంతోపాటు పరమగురువులయందు వినయ విధేయతలూ, ఈ రెండూ శ్రీకృష్ణునిలో కనబడతాయి. ఈ ఇద్దరి పాత్రలవల్లనే మహా భారత చరిత్ర నడిపించబడింది. భారతయుద్ధం జరిగి స్వార్థపరులూ,

అవకాశవాదులూ, అధికార దాహంతో పెచ్చు పెరిగిపోయిన రాజకీయ నాయకులను అంతమొందించేందుకే భారత యుద్ధం ఏర్పాటు చేయబడి -- ఆతర్వాత అన్ని రాష్ట్రాల ఏకీకరణతో 'భారతదేశం' అనే దేశంగా ఏర్పాటు చేయబడింది. ఈ దేశనిర్మాణ మహాయజ్ఞంలో రాజసూయ యజ్ఞం జరిపే యజమాని ధర్మరాజు! యజ్ఞానికి రక్షకుడు అంటే 'రాజకీయ రక్షణ' కల్పించేవ్యక్తి -- శ్రీకృష్ణుడు! ఆధ్యాత్మిక శక్తులు సంపాదించి యజ్ఞంలోని మంత్రభాగాన్ని నడిపించే అధ్వర్యుడు వ్యాసమహర్షి! ఈ యజ్ఞానికి యజ్ఞాంగాలను నిర్వహించే ఋత్విక్కులు పరమ గురుమండలిలోని మహర్షులు. ఈ రెండింటి సమ్మేళనంవల్ల (రాజకీయ ఆధ్యాత్మిక) మహాభారత యుద్ధం నిర్వహింపబడింది.

శ్రీకృష్ణుని పాత్ర ఇందులో ఎలా నిర్వహించబడిందో తెలిపేవి రాయబారం, రెండు సేనలమధ్య జరిగిన భగవద్గీత, విశ్వరూపం యుద్ధ నిర్వహణలోనూ భారతంలో వ్యాసమహర్షి స్పష్టంగా వివరించారు. రెండవ పాత్రగా - తానే వ్యాసమహర్షి ఆధ్యాత్మిక శక్తినీ సహాయాన్ని అందిస్తూ అవసరమైనపుడు వ్యాసమహర్షి తానే సాక్షాత్కరించి అనేక సార్లు ధర్మరాజుకు అశ్వమేధయజ్ఞం చేయడానికి కావలసిన ధనసహాయం ఎలా చేశాడో ఇక్కడ గమనిద్దాము.

## అశ్వమేధం :-

ధర్మరాజు యుద్ధంలో అత్యవసరంగా చేయవలసివచ్చిన రక్తపాతంలో మహాత్ములైన భీష్మ ద్రోణులవంటి పుణ్యమూర్తులను సంహరించాల్సివచ్చింది. అంతేకాక లక్షలాదిమంది అమాయకులైన యోధులు, మూగజీవాలైన ఏనుగులు, గుర్రాలు వంటి జీవరాసులకు వినాశనం కలిగింది. ఆ మహామారణహోమం చేసిన 'అశాంతి' నివారణ అయి సుస్థిరమైన సామ్రాజ్యం ఏర్పడాలంటే ధర్మరాజుచేత అపారమైన పుణ్యం కలిగే ఆధ్యాత్మిక కర్మకాండ జరిపించాలి! దీనికి వ్యాసమహర్షియే సమర్థుడు. అందుకే వ్యాసమహర్షి ధర్మరాజుకు

అశ్వమేధయాగం చేయమని ప్రోత్సహించాడు. కేవలం ప్రోత్సాహమిచ్చి ఊరుకోకుండా దానికి కావలసిన సలహా, సహాయం, సామగ్రి, వస్తు సముదాయం, యజ్ఞం చేయగల మహర్షులను ఋత్విక్కులుగానూ, సమకూర్చి చివరికి తానే అధ్వర్యుడుగా వుండి వేదమంత్రాలతో యజ్ఞాన్ని నిర్వహించాడు.

ఈ మహత్తర యాగంలో ధర్మరాజుచేత కొన్నివేలమంది ప్రజలకు అన్నదానం, బట్టలు, డబ్బు, గోవులు మొదలైనవి లెక్కలేకుండా దానంచేయించాడు వ్యాసమహర్షి! అంతేకాకుండా ఆ యజ్ఞస మయంలో అక్కడచేరిన యావన్మంది రాజులకూ, మహామునులకు, బ్రాహ్మణులకు, బీదవారికీ, బిక్షుకులకు, అనాధులకు, సమృద్ధిగా రక రకాల పిండివంటలతో మృష్టాన్న భోజనాలు నిరంతరం చేయిం చాడు! అలాంటి 'అశ్వమేధయాగం' నిర్వహించడానికి అంతకుముందే భయంకరమైన యుద్ధం నిర్వహించిన ధర్మరాజుదగ్గర తగిన డబ్బు చేతిలో లేదు.

## అశ్వమేధ ప్రయత్నాలు :-

భారత యుద్ధం జరిగిన కొత్తరోజులవి! పాండవులందరూ బందువుల మరణంతో మనస్సులు భారంగా రోజులు నెట్టుకొని జీవిస్తున్నారు. అందులోను ప్రత్యేకంగా అభిమన్యుడి మరణం ప్రజలందరూ కూడా తలచుకొని విచారిస్తూ ఉండేవారు. అభిమన్యుడి గురించి అతడి చిన్న వయస్సు, పాలుకారే యవ్వనం, అసమాన పరాక్రమం గురించిన మాటలు చెవులకు బాధగా తగిలేవి పాండవు లకు! భర్తను తలచుకొని ఓదార్పులేని దుఃఖంతో ఉత్తర నిరంతరం దుఃఖిస్తూ వుండేది. ఆమె దుఃఖంచూసి పాండవులకు గుండెలు తరుక్కుపోయేవి. జరిగిన బంధువినాశనం గుండెలలో ఆరని మంటగా బాధిస్తూ ఉండేది. ఈ సమయంలో దయామూర్తి అయిన వ్యాసమహర్షి మెరుపు మెరిసినట్లు అక్కడ ప్రత్యక్షమయ్యాడు!

ఆజానుబాహువైన గంభీరవిగ్రహం! ఎత్తైన శిరస్సుపైన హిమాలయ

శిఖరంలాగ జడలతో జుట్టుముడి. లేతపసుపువన్నెతో మెరిసినగడ్డాలు మీసాలతో జపమాలలు ధరించి యోగదండం, కమండలంతో సూర్యునివలే వెలిగే బ్రహ్మతేజస్సుతో వారిముందు సాక్షాత్కరించాడు వ్యాసమహర్షి! చుట్టూ వేదమంత్రాలు వల్లిస్తున్న శిష్యులతో సహా ప్రత్యక్షమైన వ్యాసమహర్షినిచూసి అందరిమనస్సులోనూ, ఒక చల్లని గాలివీచినట్లు ప్రశాంతత తాండవించింది పాండవులకు. ఆయన సరాసరి దుఃఖంతో కూడుకున్న ఉత్తర దగ్గరకు వెళ్ళి ఆమె హృదయంలోని దుఃఖాన్ని ప్రశాంతమైన ఆయన మనస్సుతో తీసివేస్తూ ఆమె హృదయంలో ఆవేదనను చల్లార్చి మనస్సును ఆధ్యాత్మికంవైపు మళ్ళించి ప్రశాంత విజ్ఞానమైన వాక్యాలతో ఆమెను ఓదార్చాడు. 'మానవజన్మ ఎప్పటికీ అశాశ్వతమేనని, క్షణికమైన శరీరంతో శాశ్వతమైన వీరస్వర్గాన్ని అభిమన్యుడు సంపాదించాడని' చెప్పి మానవజన్మయొక్క గమ్యాన్ని, వైరాగ్యాన్ని అందరి మనస్సులకు హత్తుకునే లాగ బోధించాడు.

అనంతరం అశ్వమేధం నిర్వర్తించాల్సిన అవసరం ధర్మరాజుకు వివరించాడు. మానవుల ఆత్మలకు వారి బంధువుల శోకానికి, పాండవుల హృదయాలలోని శోకాగ్ని చల్లారడానికీ, లక్షలాది జనుల మారణహోమం చేసిన మహా పాపానికి ప్రాయశ్చిత్తంగానూ కోటిరెట్ల పుణ్యఫలప్రదమైన అశ్వమేధయాగం నిర్వహించమని ఉపదేశించాడు. శ్రీకృష్ణుడు కూడా అదే సరైన మార్గమని ధర్మరాజుకు ప్రోద్బలం చేశాడు.

## హిమాలయ యాత్ర :-

తర్వాత ధర్మరాజు తన తమ్ములనందరినీ పిలిపించాడు. కళ్ళతో ఉత్సాహం, ఆనందం తాండవిస్తూ ఉండగా ఇలా అన్నాడు. "వ్యాసమహర్షి మనమీద అపారమైన దయతో ఉపదేశించిన మహనీయమైన మాటలు, పవిత్రమైన సలహా విన్నారు కదా! రాజ్యంలో ఇప్పుడు అసలే ధనంలేదు! మనకి ధనసహాయం అత్యవసరం. వ్యాసమహర్షి హిమాలయాలలో దాగివున్న నిధిని మనకు ప్రసాదించి యజ్ఞానికి

కావలసిన ధనసహాయం చేస్తానని వరం ఇచ్చారు. అందుకు తగిన సన్నాహంతో హిమాలయాలకు వెళ్ళే ప్రయత్నాలు చేయాలిప్పుడు."

ఈ మాటలకు భీమార్జున నకులసహదేవులు సంతోషంగా హిమవత్పర్వతానికి ప్రయాణం కట్టారు. ఆ తరువాత లెక్కలేనన్ని ఏనుగులూ, ఒంటెలూ, కంచర గాడిదలూ, వాహనాలు మొదలైనవి ఏర్పాటు చేసుకొని ధృతరాష్ట్రునికీ, గాంధారికీ, కన్న తల్లి కుంతీదేవికి నమస్కరించి వాళ్ళకు వ్యాసమహర్షి ఆదేశాన్ని వినిపించి వాళ్ళ ఆశీస్సులు అందుకున్నారు. పురోహితులతో, వేదమంత్రాలతో అర్చనలుచేసి, పూజలు సలిపి హిమాలయాలకు ప్రయాణమయ్యాడు. నగర రక్షణకు యుధిష్ఠిరుడు, విదురుని సైన్యంతో నిలిపి మిగతా చతురంగ బలాలు తీసుకొని నలుగురు తమ్ములతో సహా బయలుదేరాడు. ఇంతలో అనేకమంది సామంతరాజులు వారి సేనావాహినితో రక్షణకోసం కూడానడిచారు.

అలా మహా వైభవంతో ధర్మరాజు దేవేంద్రుడంత లెక్కలేనంత సేనతో ప్రయాణమై వెళ్ళాడంటే ఒక సముద్రమే కదలివెళ్ళుతున్నట్లు నేల ఈనినట్లుగా సేనాకోలాహలంతో ఆనందంగా వున్నది ఆ దృశ్యం. ఇలా ప్రయాణంచేసి మధ్యప్రాంతాలు దాటి హిమాలయ ప్రాంతాలు సమీపించారు. ఎత్తైన కొండ చరియలు దాటుకుంటూ అడవులను దాటి ప్రయాణం చేయగా హిమవత్పర్వత శిఖరాలు కనుచూపు ఎదుట నిండుగా సాక్షాత్కరించినవి. ఇంతలో అనుగ్రహించి ఆ ప్రయాణం చేస్తున్న సేన ముందరగా వ్యాసముని ప్రత్యక్షమయ్యారు! ఆయన జటాజూటం బంగారు రంగుతో బాలసూర్య కిరణాలలాగ ప్రకాశిస్తోంది. నీటితో నిండిన మేఘంలా నీలంగా నిగనిగలాడుతోంది శరీరం! చేతిలో యోగదండం తేజస్సు చిమ్ముతున్న శరీరంమీద నల్లని లేడిచర్మం పట్టులా తళతళ మెరుస్తున్నది. ఉదయించిన సూర్యునివలె ప్రసన్నమైన విశాలనేత్రాలతో ఎదుట సాక్షాత్కరించిన వ్యాసమహర్షిని దర్శించటమే తడవుగా పాండవులు పరమ భక్తితో వాహనాలు దిగి భూమ్మీద సాష్టాంగపడి నమస్కరించారు. "ఇపుడు మా కర్తవ్యం

సెలవీయ వలసిందని" వినయంగా పరమభక్తితో ప్రార్థించారు.

"ఈనాటికి మీరు దర్భశయ్యలమీద విశ్రమించాలి! ఉపవాసంతో శుచి అయి దైవధ్యానంలో రాత్రి గడపాలి. ఈ హిమాలయం పరమ శివుని నివాసం! అందుకని రేపు మీరు యావన్మందీ ఆ రుద్రుని పూజించాలి. ఇప్పటికి మీరు విశ్రాంతి తీసుకోవచ్చు" అని ఆదేశించాడు వ్యాసమహర్షి. అలాగే పాండవులు ఆ రాత్రంతా గడిపారు.

తెలతెలవారక ముందే వ్యాసమహర్షి బ్రహ్మముహూర్తంలో లేచి తన స్నాన సంధ్య, జప, హోమ అనుష్టానాలు నిర్వర్తించుకొని పాండవులచేత శివపూజకు సంకల్పంచేసి పూజ ప్రారంభించారు. ఆయన స్వయంగా తపోమూర్తి అయి- సర్వదేవతలనూ భక్తిపూర్వ కంగా ఆవాహనంచేసి అష్టదిక్పాలకులను, నవగ్రహాలను, విష్ణుమూర్తిని ఆవాహించి తర్వాత శివపూజనుచేసి ఆ ప్రదేశాన్ని రక్షా కర మంత్రా లతో దిగ్బంధన చేశాడు. ధౌమ్యుడు మొదలైన పురోహితులతో రక్షోఘ్నమంత్రాలు వల్లిస్తూ బ్రాహ్మణులు ముందు నడవగా పాండ వులు వెనుక నడిచారు. అలాగ యావన్మందీ వ్యాసమహర్షి వెంట నిధి ఉంచినచోట పర్వత ప్రదేశానికి వెళ్ళారు. అక్కడ విధివశాత్తుగా భూత తృప్తిచేసి బలమైన సేవకుల చేత ఆ నిధిని తవ్వడానికి ప్రారంభంచేశాడు. వ్యాసమహర్షి నిలబడి చూస్తూవుంటే ఆ ప్రదేశంలో తవ్వినచోట అకస్మాత్తుగా సూర్యునివంటి కాంతితో, ధగధగా మెరిసే తేజస్సుతో దిక్కులు వెలిగించే పచ్చని కాంతులతో, బయటపడింది బంగారం! కొండలా రాశిలా ఉన్న ఆ బంగారంచూసి భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు సంతోషం పట్టలేక ఒకరినొకరు కౌగలించుకున్నారు. ఆ బంగారంతో నిండిన నిధికి తగిన విధంగా ధర్మరాజు లక్ష్మీపూజ, భూపూజ వ్యాసమహర్షి చెప్పిన విధంగా నిర్వ ర్తించాడు. ఆ విధంగా సకల మంత్ర రహస్య విద్యానిధి అయిన వ్యాసుడు ఆ మహత్తరమైన నిధిని సాధించి పెట్టాడు!

ధర్మరాజు ఆయన పాదాలకు సాష్టాంగ దండప్రణామాలుచేసి

చేతులు జోడించి నిలబడ్డాడు. అతన్ని ఆశీర్వదించి కౌగిలించుకొని తన దివ్యశక్తిని అతని శరీరంలోకి ప్రవేశింపచేశాడు వ్యాసమహర్షి! ఆనందంతో దివ్యశక్తితో పులకితుడై ధర్మరాజు నీళ్ళతో నిండిన కళ్ళతో ఆయనను చూస్తూ ఉండగానే ఆ కళ్ళలోని కాంతి మసకలతో కరిగిపోయినట్లు మాయం అయి అంతర్ధానమయ్యాడు వ్యాసమహర్షి.

త్రుళ్ళిపడి ఈ ప్రపంచంలోకి వచ్చాడు ధర్మరాజు! అనంతరం తమ్ముల సహాయంతో ఆ బంగారం ఎత్తి వేలకువేల బళ్ళమీద, కొన్నివేల ఒంటెలమీద, గుర్రాలమీద, ఏనుగులమీద, కూడావచ్చిన వాహనాలమీద పెట్టించాడు ధర్మరాజు. లక్షలమంది భటులు మేమంటే మేమని ఆ బంగారం కావిళ్ళతో భుజాలకెత్తుతున్నారు. యజ్ఞశాలకు కావలసిన కటకాలు, కావిడులు, గుండిగలు, భాండాలు, ఆసనాలు, శయ్యలు, చివరికి రోళ్ళు రోకళ్ళు, యూపస్తంభాలు కూడా, అన్నీ అచ్చమైన కుందన బంగారంతో తయారైన వస్తువులన్నీ ఎత్తి గోనెసంచులలో బళ్ళమీద బారులుకట్టి హస్తినాపురంవైపుకు నడిపించాడు ధర్మరాజు. రక్షణగా సేనలు నడుస్తుంటే లెక్కలేనంత ఆ బంగారాన్ని చూసి అందరూ ఆశ్చర్యంతో అంత బంగారమూ, అలా బారులుకట్టి హస్తినాపురానికి తరలివస్తూ ఉంటే జనులు తండోపతండాలుగా ఆ వింతను చూడ్డానికి గుమిగూడారు.

వ్యాసమహర్షి ఆశీర్వచనం వల్లనే ధర్మరాజు ఆ నిధిని సంపాదించి మహత్తరమైన యజ్ఞం చేయగలిగాడు. ధర్మరాజు అశ్వమేధం అని ఈ నాటికీ ప్రజలు చెప్పుకొనేలాగ చరిత్రలో నిలిచిపోయే అశ్వమేధ యాగాన్ని అంతులేని దానాలతో, ధర్మాలతో చేయగలిగాడంటే అది వ్యాసమహర్షి అనుగ్రహంవల్ల లభించిన ఈ నిధివల్లనే.

ఇది పూర్వం కొన్ని యుగాలక్రిందట 'మరుత్' అనే మహారాజు హిమాలయాలలో బ్రహ్మాండమైన యజ్ఞాన్ని నడిపించి దానధర్మాలు చేయగా మిగిలిన ధనాన్ని అంతనీ హిమాలయాల్లో 'నిధి'గా దాచిపెట్టిన దానిని ధర్మరాజుకు తాను అనుగ్రహ పూర్వకంగా సాధించి ఇప్పించానని వ్యాసమహర్షి యజ్ఞసమయంలో శ్రీకృష్ణునకు, పాండవులకూ

వివరించాడు. అన్ని నిధులకు మించిన నిధి వ్యాసులవారు ధర్మరాజుకు పక్కన ఉండగా ఈ బంగారు నిధి ఎంతమాట! ధర్మరాజుకు దొరికిన పెన్నిధియే వ్యాసమహర్షి, జీవితానికి 'పెన్నిధి!' ఆయనయే తపస్సుకు, ధర్మానికి నిధి!



16

# "మృత సంజీవనం"

ఆనాడు ధృతరాష్ట్రుని ఆశ్రమం చుక్కలతోనిండిన ఆకాశంలా విరాజిల్లింది. పచ్చని చెట్లతోను, కొబ్బరిచెట్లతోను వున్న ఆ తపోభూమిలో అంతటా బారులుతీరి కూర్చున్న జనం అక్కడక్కడా తెల్లగా ఆకాశంలోని చుక్కల్లా కలకలలాడుతున్నారు.

అది మహాభారత సంగ్రామం జరిగింతరువాత పదిహేను సంవత్సరాల అనంతరం. అప్పుడు తపోవనంలోవుండి, ఆశ్రమవాసం చేస్తున్న ధృతరాష్ట్రుణ్ణి చూసిరావాలని హస్తిననుంచి ధర్మరాజుతో సహా బైలుదేరివచ్చిన యావన్మంది బంధువులతోనూ ఆనాడు ఆశ్రమ భూమి ఎంతో కళకళలాడుతోంది.

ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు, వారివారి భార్యలతోసహా అంతా సపరివారంగా బయలుదేరివచ్చారు. పచ్చటి

అరటిచెట్లతోను, పండ్లచెట్లతోనూ, చూడముచ్చటగా నవ నవ లాడుతోంది అడవి అంతా! ధర్మరాజు దూరాన్నే రథందిగాడు. ఆయన తరువాతే అందరూ తమతమ వాహనాలు దిగి, పాదచారులై ధృతరాష్ట్రుని ఆశ్రమంలో ప్రవేశించారు. వారి వెనుకనే వచ్చిన మేనా,(పల్లకిలలో) ఎడ్లబండ్లలోను వచ్చిన రాణులు, అంతఃపుర స్త్రీలు దిగి వరుసలో ఆశ్రమంలో ప్రవేశించారు. వారితోపాటు వచ్చిన పరిచారకులు, మోసుకొచ్చిన కావిళ్ళతోను, వారు వేసిన గుడారాలతోను, వారి వెంట నడచివచ్చిన పౌరులతోను ఆనాడు ఆశ్రమప్రదేశమంతా కిటకిటలాడుతోంది.

ముందుగా ధౌమ్య పురోహితుడు! ఆయనను అనుసరించి వెంటనే కృపాచార్యుడు, తర్వాత ధర్మరాజు, ద్రౌపదీ ప్రవేశించారు. చిత్రమైన రంగురంగుల పతాకాలతోనూ, ఆశ్రమభూమివెలుపల గాలికి ఎగిరే రంగు రంగుల సిల్కు వస్త్రాలతోనూ విచిత్రమైన వింత అందంతో తొణికిసలాడుతోంది ఆశ్రమభూమి ఆనాడు. అల్లంతదూరంలో ఆగి నల్లతోకలు కల్గిన 16 తెల్లటి గుఱ్ఱాలు పూన్చిన బంగారు రథం ధర్మరాజు దిగిన ప్రదేశంలోనే దూరంగా నిల్చివున్నది. ధర్మరాజు వెంట ముత్యాల కుచ్చులు వ్రేలాడుతున్న తెల్లటి ఛత్రంపట్టుకొని, మంత్రులు, సామంతులూ నడుస్తున్నారు. ద్రౌపది వెంటనున్న అంతఃపుర స్త్రీలు అందరూ ప్రవేశించి వారివారి స్థానాలలో కూర్చున్నారు.

ధృతరాష్ట్రుడు అప్పుడే గంగానదిలో స్నానంచేసి, తడిబట్టలతో చేతిలో కడవనిండా నీళ్ళు మోసుకుంటూ, నడిచివస్తున్నాడు. పూజకు పూవులు కోసుకుంటూ దట్టంగా పెరిగిన చెట్లమధ్యనుంచి ఆయన అలానెమ్మది నెమ్మదిగా అడుగులువేస్తు నడచివస్తున్నాడు తెల్లని ఛాయకల్గి, కష్టాలకోర్వలేని ఆయన శరీరం ముడుతలుపడి, తపస్సుతో చిక్కివున్నది. వెంట ఇంకో కడవతో నీళ్ళుపట్టుకొని రాజమాత గాంధారీ దేవి నడచివస్తున్నది. ఆమె ఎప్పటిలాగే తెల్లటి గుడ్డతో కళ్ళకు గంతలు కట్టుకొని ఆయన వెనకగా నడచివస్తున్నది. వారివెంటనే సంజయుడూ, కుంతీ, తపస్సుచేసుకొనే మునులవలె

కనబడుతూ కాషాయాలు ధరించి స్నానాలుచేసిన తడీ-పొడి బట్టలతో నడచి వస్తున్నారు.

ఇది దూరాన్నుంచేచూసిన సహదేవుడు పరుగు పరుగున వెళ్ళి తల్లి కుంతీదేవి పాదాలమీదపడి కన్నీళ్లు పొంగిరాగా సొమ్మసిల్లి దుఃఖించాడు. కుంతీదేవి ఆగి, చటుక్కునవంగి అతన్ని ఎత్తి కౌగిలించి గుండెచెఱువయ్యేలాగా దుఃఖించింది. వెంటనే మిగిలిన పాండవులు నలుగురూ వెళ్ళి కుంతి పాదాలమీద వ్రాలారు. ప్రేమతో అందరినీ పొదివిపట్టుకుందామె, తల్లిప్రేమతో కన్నీళ్లు కార్చింది. ఈ సందడి అంతావిని గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు "గాంధారీ! ఎవరు?" ఎవరని -- చేతులతో తడువుతూ వస్తూవుంటే ఆమె "పాండవులు వచ్చారని"ని చెప్పింది. కుంతి ఏడుస్తూ "సహదేవుడు" అని చేత్తో తాకించి గాంధారికి చూపి చెప్పింది. ఆమె చేతులతో తాకిచూస్తూ వాత్సల్యంతో కన్నీళ్లు కార్చింది. ఐదుగురు పాండవులూ, ధృతరాష్ట్రునికి నమస్కరించారు. ద్రౌపది మొదలైన తక్కిన కోడళ్లూ అలానే తక్కిన నూరుగురు కౌరవులభార్యలు వరుసగావెళ్ళి ధృతరాష్ట్రుని, గాంధారినీ, కుంతిని దర్శించి వెనుకగా నడచి వారిని అనుసరిస్తున్నారు. అంతమందితోను కలిసి ఆశ్రమానికి నడచి వచ్చాడు ఆనందంతో ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుని చేతిలోని నీటికడవను తానే అందుకున్నాడు ధర్మరాజు. గాంధారి చేతిలోని నీటికడవ తీసి అందుకున్నది ద్రౌపదీదేవి. అలా అందరూ ఆశ్రమంలోకి ప్రవేశించి, సందడిగా ఒకరిని ఒకరు పలకరించుకుంటూ వుంటే కళకళలాడే ఆ దృశ్యంచూస్తే ఒక్కసారి హస్తినాపురంలో వున్నట్లే అనిపించింది ధృతరాష్ట్రునికి. అంతమంది బంధుజనంతో ఆనాడు ధృతరాష్ట్రుని ఆశ్రమం నిజంగా చుక్కలతో నిండిన ఆకాశంలాగే కనిపించింది. అందరినీ చూచిన ఆనందంతో ఉప్పొంగి పోయాడు ధృతరాష్ట్రుడు. ఆయన చుక్కలమధ్య చంద్రునివలె నిండుగా కనిపిస్తున్నాడు. యావన్మంది ధృతరాష్ట్రుని చుట్టూ కూర్చొన్నారు. స్త్రీలందరూ ఒకవైపు కూర్చున్నారు: మునులందరూ కుడివైపుగా దర్భాసనంపై పరచిన జింక చర్మాలపై

కూర్చున్నారు. "శతయూపుడు" ధృతరాష్ట్రుని బంధువు;ఆదగ్గర లోనే తపోవనం నిర్మించుకుని తానూ తపస్సుచేసుకొంటున్నాడు. ఆయనకూడా ధృతరాష్ట్రుని ప్రక్కగా ధర్భాసనంమీద కూర్చున్నాడు.

అప్పుడు ప్రక్కనేవున్న సంజయునితో "ఇక్కడ వున్న బందు జనం ఎవరెవరో ఒక్కసారి నాకు పరిచయం చెయ్యి" అన్నాడు గ్రుడ్డివాడైన ధృతరాష్ట్రుడు.

## బంధువుల పరిచయం :-

వెంటనే సంజయుడు లేచి నిలబడి ధృతరాష్ట్రునికి నమస్కరించి, "చిత్తగించండి" అంటూ కళ్ళతో చూడలేని లోటులేకుండా ఆయనకు ఒక్కొక్కరినే వర్ణించి చెబుతున్నాడు. ఇలా!

"బంగారు వర్ణం కలిగి, పల్చని ఎత్తయిన శరీరమూ, ఉన్నతమైన పొడవాటి నాసికా, విశాలమైన సోగకన్నులూ, సింహరేఖా కలిగి, చూపుకి ఎంతయినా అగ్గజంగా కనిపిస్తున్న ఇతడు ధర్మరాజు." అని చేతితో తాకించాడు. ఆతర్వాత

"ఎఱ్ఱదనంతోనూ, ఆ ఎత్తయిన మూపులతోనూ, పొడుగాటి చేతులతోనూ, వెడల్పాటి రొమ్ముతోనూ కనిపిస్తూన్న మీ భీముడు!"

"ఉజ్వలమూ, సుందరమూ అయిన ఈ శ్యామల శరీరమూ' మదగజంలాంటి ఠీవితో, పద్మాలవంటి నేత్రాలు గల ఇతడు అర్జునుడు."

"సాటిలేని సుందరాకారాలతో కుంతికి రెండువేపులా కూర్చున్నారే చూడండి, విష్ణుమూర్తి దేవేంద్రుల్లాగ—ఆఇద్దరూ నకుల సహదేవులు! వినయమే వారికి భూషణం."

"అదిగో! నల్లకలువఛాయువంటి ఆ శరీరంఛాయా, నవ పద్మ దళాలవంటి క్రొమ్మెరుగు నేత్రాలూ, నడిమి ప్రాయమూ కలిగి అందాల ఒప్పుల కుప్పలావున్నదే ఆ ఉదారమూర్తి ద్రౌపది"

అలానే ఆ ద్రౌపదిప్రక్కన "కట్టెఱ్ఱ శరీరంతోనూ, పద్మంలాంటి

మొహంతోనూ, సూర్యుని మహిమ ఉజ్వలమైన ఆకారం ధరించిందా అన్నట్లు లతవంటి దేహంగల ఆమెయే శ్రీకృష్ణుని చెల్లెలు, సుభద్ర అర్జునుని ఇల్లాలు!"

"ద్రౌపదీ సుభద్రల ప్రక్కగా కూర్చొని; బంగారం వికసించిన, ఇప్పపూవురంగు శరీరాలు కలిగిన ఆ పడుచులు ఇద్దరూ చిత్రాంగద, ఉలూచి! అర్జునుని భార్యలు."

"అదిగో! నవపద్మంలాంటి ఛాయకలిగిన శరీరంతోనూ, ఆ బెదిరిన లేడికళ్ళవంటి సోగకళ్ళతోనూ ఆకూచున్నదే ఆమె భీముని భార్య కమలపాలిక ~~ఈ~~మె హిడింబ." "క్రొత్త సంపంగి పువ్వువంటి తెలుపుచాయ శరీరంతోనూ, కమలంవంటి మొహంతో కలకలలాడు తున్న ఆమె సహదేవుని భార్య!"

"క్రొత్త కలువ పూవులాంటి శరీరకాంతితో వున్నదే, ఆమే నకులుని భార్య!"

"వీరికి ప్రక్కగా కూర్చొని పాపట లేకుండా తెల్లటి బట్ట లతో తమ శరీరాలు దాచుకున్న వీరంతా, ధృతరాష్ట్ర మహారాజా! తమ నూరుగురు కోడళ్ళూవారు!" "వీరిలాగే సుభద్రప్రక్కగా ముడుచుకుని మూలగాకూర్చున్న ఆమెయే, ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన మహావీరుల్ని కలతపెట్టి కళ్ళుమూసిన వీరాగ్రేసరి అభిమన్యుని ప్రియభార్య ఉత్తర"- అని ఇలా అంతమందినీ చూపి చెప్పాడు సంజయుడు!

అప్పుడు ధృతరాష్ట్రుడు ధర్మరాజువైపు తిరిగి "క్షేమంగా వున్నావా బాబూ! పౌరులూ, జానపదులూ క్రమం తప్పకుండా నిన్ను అనుసరిస్తున్నారా? నీ తమ్ముళ్లందరూ సుఖంగా వున్నారా? స్నేహితులు అంతా కులాసాయేనా? బంధువులు యావన్మందీ సంతోషంగా వున్నారుకదా!" అంటూ సంభావించాడు.

ఆరోజు ఇలా బంధువులందరూ చాలాకాలంతరువాత ధృతరాష్ట్రుడు ఆశ్రమవాసం చేస్తున్న ఆచోట ఒక్కసారి సమావేశమై అందరూ సంతోషంగా కొంతకాలం గడిపారు. ఒకనాడు అలా సమా

వేశమైన ఆ గోష్ఠిలో అందరూ ఎవరికివారు ధర్మ విషయాలూ, అనుభవాలూ, కబుర్లుగా పరస్పరం చెప్పుకుంటున్నారు.

ఆ సమయంలో ధృతరాష్ట్రునికి అలా అంతమంది బంధువుల్ని ఒక్కసారి చూశాక తన నూరుగురుకుమారులూ, తాత భీష్ముడూ, ఆచార్య ద్రోణుడూ యుద్ధంలో మరణించిన తక్కిన యావన్మందీ ఒక్కసారిగా బెంగగా గుర్తుకువచ్చారు! ఆయనకు విచారంతో గుండె బరువెక్కింది! గతించిపోయిన తన నూర్గురుకుమారులను ఒక్క సారి తలచుకొని ధృతరాష్ట్రుడు, గాంధారి మనస్సుమండే దిగులుతో కుమిలి పోసాగారు. అక్కడ వున్న కుంతీదేవికూడా యుద్ధభూమిలో ఊరూపేరూ లేకుండా దిక్కుమాలిన చావును పొందిన తన తొలిచూలి కుమారుడు 'కర్ణుణ్ణి' తలచుకొని ఎంతో బెంగపడింది. అలా అనుకోకుండా అందరి హృదయాలలోనూ తీరని వేదనగూ డుకట్టుకుని ఆశ్రమం అంతా ఒక్కసారిగా అలముకున్నట్లైనది. అక్కడి సభ అంతా నిశ్శబ్దం అయింది.

ఇంతలో ఎదురుగా ఆకాశమూ భూమీ కనపడే తూర్పురేఖమీద ఒక ఆజానుబాహుడైన జడలు ధరించిన, ప్రశాంత కమనీయ విగ్రహం వారిముందుగా ఉదయించి సాక్షాత్కరించింది. ఎక్కడో మర్చిపో యిన ఊహమనస్సులో మెరసి, తళుక్కున గుర్తుకు వచ్చినట్లుగా ఆ ప్రదేశంలో ఎవరూ ఊహించనివిధంగా ఆకస్మాత్తుగా రూపం ధరించి కనబడ్డాడు వ్యాసమహర్షి."వ్యాసమునీంద్రులు!"

అన్న కలకలంతో ఒక్కసారి అక్కడ సభఅంతా అలుముకుంది. ధృతరాష్ట్రుడూ, అక్కడవున్న సభా సదులూ భయసంభ్రమాలతోలేచి, బద్ధాంజులులై ఆ మునిచంద్రుని సమీపించారు! గూడుకట్టుకొన్న బాధతో బరువెక్కిన హృదయంతో "తండ్రీ!"అని వారి వ్యాసమహర్షి యొక్క పాదాలమీదపడి సాష్టాంగ నమస్కారంచేశాడు ధృతరా ష్ట్రుడు! ఆ తర్వాత గాంధారి, కుంతి, ధర్మజుడూ అందరూ నమస్కారం చేసి ఆయనకు అర్ఘ్యపాద్యాలుఇచ్చి సమంత్రకంగా "గురుపూజ" చేసుకొన్నారు.

విశాలమైన వృక్షం క్రింద ఉన్నతమైన అరుగుపైన ఒక దర్భాసనంవేసి దానిపైన పరచిన నల్లని జింకచర్మంపై వ్యాసమహర్షి ఆసీనుడయ్యాడు. నీలమేఘ సమమై, విశాలమైన, గంభీరమూర్తి, లేత పసుపు బంగారువన్నె కలిగిన జడలతో ఆ సభలో చేరిన బంధువులందరినీ చూస్తూ, కళ్ళతోనే వారిని ఆశీర్వదిస్తూ అలా ప్రశాంత గంభీర దృక్కులతో ఒకమాటు అంతా కలయచూశారు. అంతలోనే ఆ చూపుతో క్షణకాలంలో అందరి హృదయాలలో గూడు కట్టుకున్న దిగుళ్లు ధృతరాష్ట్రుని మనస్సునూ, గాంధారి హృదయంలో నిప్పులా రాజుకొంటున్న పుత్రశోకాన్ని, తాను దూరాన వున్నా, తన ఆశ్రమంలోంచే గ్రహించి, వారికి ప్రశాంతిని ప్రసాదించటానికి మెరుపు మెరసినట్లు వారిముందు అలా సాక్షాత్కరించారు వ్యాస మహర్షి. సిద్ధపురుషులైన ఆ మునిరాజును అందరూ కన్నుల కరువుతీరా దర్శించారు! ఆయన గంభీరస్వరంతో —

"మీ మనస్సులోని దిగులును దూరాన్నుంచే తెలుసుకొన్నాను. భారతయుద్ధం జరిగి పదహారు (16)సంవత్సరాలు గావస్తున్నా ఇంకా మీమనస్సులో రగులుతూవున్న పుత్రశోకంలో మరణించిన మీ వాళ్ళను చూడాలన్న మీ ధృఢమైన కోర్కెనుగ్రహించాను. దుష్కరమైనా, అసాధ్యమైనాసరే, మీకోర్కెను తీర్చాలని సంకల్పించాను. అందుకే మీముందు సాక్షాత్కరించాను!" అన్నారు.

అది విని, ఒక్కసారిగా ధృతరాష్ట్రుని హృదయంలో మంచి ప్రేమ, అపారమైన భక్తీకలసి భరించలేని దుఃఖంగా పెల్లుబికి ఒక్కసారిగా వ్యాసమహర్షి పాదాలపైన పడిపోయాడు. వారి పాదాలు తన శిరస్సుకు ఆనించి, కన్నీళ్ళతో పాదాభిషేకం చేస్తూ, అన్నాడు.

"కారుణ్యావిధిని తండ్రీ, గురువూ, దైవం అంతా నాకు మీరే! అంతులేని దయతో నన్ను ఇలా అనుగ్రహించారు. ఈనాడు తమ రాకతో నాఆశ్రమం, నాహృదయం పావనమైనాయి. నాజన్మసఫలమైంది. ఇక్కడ అందరూ ధన్యులైనారు! తమ దర్శనంతో తమ అకారణ అనుగ్రహంతో నా అన్నికోర్కెలూ నశించాయి. నాకిక

ఏకోరికాలేదు ఈరోజున నన్ను ఇంతగా ఆదరించారు. కోరిక కోరమంటున్నారు కనుక గతించిన నాకుమారులను నాకంటితో ఒక్కసారి చూడాలన్నదే ఈ జన్మలోని ఒక్క చివరి కోర్కె! మూఢు లైన వారిఅజ్ఞానానికి వారేబలియై యుద్ధంలో మరణించిన కురు కుమారులమీద, వారి భార్యలు ఇక్కడంతా సభలో కూర్చొనివున్న దురదృష్టవంతురాళ్ళమీద తమ అనుగ్రహ దయాదృష్టి వర్షించవలెనని ఈ దీనుని ప్రార్థన!"అంటూ ఇంక మాటలురాక ఎక్కిళ్ళుగావస్తున్న దుఃఖంతో సొమ్మసిల్లిపోయాడు ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుని ఆ మాటలువిన్న గాంధారికి కుంతి, ద్రౌపది, సుభద్రలకీ, తక్కిన యావన్మంది స్త్రీలకూ కూడా పట్టలేని దుఃఖం ఉవ్వెత్తుగా తుఫానువలే పరవళ్ళుతొక్కింది. కంటికి కట్టుకొన్న కంతల కట్టులోంచే గాంధారి దయాసముద్రుడైన మామగారివైపు తిరిగి వ్యాసమునీంద్రునికి నమస్కరించి ఇలా అన్నది.

"దయా సముద్రులూ, దైవస్వరూపులైన మునిచంద్రులకు నమస్కృతులు! పదహారు ఏళ్ళుగా గతించిన నా కుమారులను చూడాలని రోజూ నేనూ, కుంతీ, ఇక్కడవున్న యావన్మందికూడా కోరుతున్నాము. లోకాలను తిరిగి సృష్టిచేయగలంతటి తపశ్శక్తి తమది! పరలోకంలోని కుమారులను చూపించటం తమకి ఏమంత పని? లోకం ఆశ్చర్యపోయేలాగ తమ విచిత్రమైన అనుగ్రహాన్నీ, అమోఘ తపశ్శక్తినీ ప్రదర్శించి మమ్ము అనుగ్రహించండి!" అంటూ గాంధారి అన్నవెంటనే కుంతికూడా మామగారికి నమస్కరించి తన కడుపులో ఉన్న బాధను యావత్తూ వెళ్ళబోసుకుంది. ఆనాడు కర్ణుణ్ణి కన్యగా ఎలా కన్నదో అప్పటినుంచి జరిగిన గాథంతా వ్యాసమహర్షి ముందు వెళ్ళబోసుకుంది కుంతి.

"నేను చేసింది పాపమో పుణ్యమో తెలియక ఇన్ని సంవత్సరాలుగా నాకడుపులో ఇంతబాధని అణుచుకొని బ్రతుకుతున్నాను. ఇప్పుడు చరమదశలో ఆశ్రమవృత్తిలో ఉన్న నామనస్సు విప్పి దైవసమానులైన మీముందు చెప్పాను. నాపాపాలకు తగిన నిష్కృతినీ, నా దుఃఖానికి ఉపశాంతినీ ప్రసాదించమని ప్రార్థిస్తున్నాను."

వింటూనే అకస్మాత్తుగా లేచినుంచున్నారు వ్యాసమహర్షి! ఆకాశంలో వెలిగే నక్షత్రాలు ఆయన వెనుకగా అస్తమించిన సూర్యుని సంధ్యాకాంతులలో ప్రకాశిస్తూ ఉంటే, దానికడ్డంగా పర్వతశిఖరంలాగ లేచి నిలబడిన, జడలతో అల్లుకున్న వ్యాసుని శిరస్సు గంభీరమైన మేరుపర్వత శిఖరంవలె-ఏదో అనిర్వచనీయమైన, అపూర్వమైన శాంతి తరంగాలతో ఒక్కసారి వెలిగినట్లైనది. గంభీరమైన ఉరుములాంటి కంఠంతో ఆయన మాటలు అందరికీ వినిపించేలాగు, అందరి హృదయాలలోనూ ప్రతిధ్వనించాయి. ఆయన స్వరం వింటూన్న వ్యక్తులకు తమ లోపలినుంచే వినిపించినట్లు తోచింది.

"నాయనా! కురు రాజా! నీహృదయంలోని బాధ, దుఃఖం నా ఆత్మకే తెలిసింది. కుమారుల మరణంవల్ల శోకంతో నీ హృదయం ఉడికి పోతున్నది. నీ దుఃఖం పోగొట్టేందుకూ, ఇక్కడ చేరివున్న నీ బంధువులందరి హృదయాలు ఒక్కసారి ఆనందంలో మునకలు వేసేందుకూ, మీఅందరికి నా అనుగ్రహంతో అద్బుతమైన దృశ్యం చూపెడతాను. చనిపోయిన నీ యావన్మంది బంధువులూ, మీ ముందుకు వచ్చి కనిపించి మీతో సరససల్లాపాలు ఆడేలాగు చేస్తాను. భయపడకండి! చిరకాలం ఘోరంగా తపస్సుచేసి ఆర్జించిన అద్భుతమైన నాశక్తిచూడు!" అంటూ అతిలోకమైన ఆదివ్యమూర్తి ఈ మాటలు అంటూవుంటే అందరి హృదయాలు ఒక్కసారి మెరుపులా తళుక్కున పులకరించాయి.

వినీలమైన ఆనాటి సాయం సమయంలో ఆకాశంకంటే నీలంగా మెరిసిపోతున్న వ్యాస మునిచంద్రుని దివ్యముఖమండలం, ఏదో చెప్పరాని అనిర్వచనీయమైన ఒకానొక అలౌకిక తేజస్సుతో వెలిగి పోతోంది! విశాలమయిన ఆయన నుదురుమీద బంగారు కాంతులీనే పచ్చని పింగళవర్ణ జటాజూటము పిల్లగాలికి ఎగురుతూంటే, తామర రెక్కల్లాగ అరవిచ్చిన కనురెప్పలతోవున్న ఆ మహాయోగి నేత్రములు ఎత్తుగా తామర మొగ్గలను మరిపించేంత సోయగంతో విచ్చినాయి. నిలుచున్న హిమాలయ పర్వతములాగున్న ఆయన గంభీర విగ్రహం చూస్తూ అందరూ మంత్రించినట్లు ఆయన చెప్పేది అందరూ,

గబగబా కొట్టుకుంటున్న గుండెలను అణచుకొంటూ ఆదుర్దాగా వినసాగారు.

"తపశ్శక్తితో పూర్వం ఎవరూ సాధించలేనిది, వినరానిది అయిన ఒక అద్భుతం ఈనాడు మీకు అనుగ్రహిస్తున్నాను! మహదాశ్చర్యము, అసాధ్యము అయిన నా తపోబలం ఈనాడు మీరు దర్శించండి!"

అంటూ వ్యాసమహర్షి అందరినీ తనవెంట గంగానదీతీరానికి తీసుకువెళ్ళాడు. గంభీరంగా ఆయన ముందు నడుస్తూవుంటే వెనుక ఆదరాబాదరాగా వృద్ధులూ, స్త్రీలు, యువకులు, మునులూ, రాజులు యావన్మందీ కౌరవుల వితంతువులైన రాణులూ, అలా అందరూ కదలివచ్చారు, హస్తినాపురమే తానై నడచివచ్చిందా అన్నట్టు!

గంగానది ఒడ్డున యిసుకలోనే ఆజనం గుమికూడారు. యిసు కేస్తే రాలకుండా, స్నాన సంధ్యలు నిర్వర్తించుకోడానికి సన్నద్ధులై వ్యాస భగవానుడు చేత యోగదండము, నడుమునకు నల్లని కృష్ణా జినముతో, మెడలో జపమాలతో కమండలముతో మూర్తీభవించిన వేదరాశిలాగ వున్నాడు.

"ఈనాడు రాత్రికి ఇక్కడే మీరందరూ విశ్రమించండి. రేపు ఉద యమే మీ కోర్కెలను తీరుస్తాను." అంటూ స్నానానుస్నానాదులకు గంగాతీరం వైపునకు దిగివెళ్ళారు.

అది తెలతెలవారుతున్న ప్రాతఃకాలసంధ్య అయిపోవస్తున్నది. సూర్యుని ఎర్రనిరేఖలు ఆకాశాన్ని ఎర్రగా అగ్నిహోత్రంలాగా రాగ రంజితం చేస్తున్నాయి. ఆకాశం నీలంగా ఇంకాపైన వజ్రపుటుం గరంలా సంధ్యాకాంతులీనుచూ చల్లనిప్రత్యూషపవనాలను గంగానదీ ప్రవాహం యొక్క చల్లనిపవిత్రస్పర్శనూ, నీటివాసననూ మోసుకొని వస్తున్నాయి. జనం అప్పటికప్పడే స్నాన సంధ్యలు ముగించుకొని బిలబిలమంటూ హడావిడిగా వ్యాసమహర్షి ఎక్కడున్నారో కళ్ళుతోనే వెతుకుతూ నడుస్తున్నారు. యావన్మంది జనసమ్మర్దమూ.

అదిగో అల్లంత దూరాన బంగారు రంగులీనుతున్న పరుపులావున్న

యిసుక తిన్నెమీద ఉదయించె బాలభానుని కిరణాలు కాషాయ వర్ణంతో ప్రకాశిస్తుంటే ఆయన పద్మాసనంలో నిటారుగా కృష్ణాజినంమీద కూర్చుని వున్నారు. వ్యాసమహర్షి! అలా ధ్యాన సమాధిలోవుండే అరమోడ్పు కన్నులతో యావన్మందీ తనవేపురావటం చూశారు.

ఒక్కరొక్కరే చేరుకున్నారు ఆయన వద్దకు. ధృతరాష్ట్రుడూ, గాంధారీ, కుంతి, ధర్మరాజూ, ద్రౌపది, తక్కిన పాండవులూ, సంజయుడూ, మహర్షులు వారివారి శిష్యగణాలతోనూ, పురజనులూ, యావన్మంది బంధువులూ, ఇంకోవైపు సుభద్ర, ఉత్తర, ఉలూపి మొదలయిన స్త్రీలంతా అక్కడ చేరివున్నారు గాంధారి, వినయంగా ముందుకు రెండడుగులువేసి సాష్టాంగపడి మ్రొక్కి, చేతులెత్తి నమస్కరించి ఇలా అన్నది: "భగవంతుని ప్రత్యక్షమూర్తి మీరు! లోకాంతరంలో వున్న మృతబంధువులను దర్శింపచేయటం ఎంతపని? దయతో మమ్మల్నందరిని అనుగ్రహించరా ప్రభూ!" ఆర్తితో ఇక దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

ఉన్నట్టుండి ఒక్కసారి లేచాడు వ్యాసమహర్షి! గంగానదివైపు నడిచాడు. "రండి! అందరూ చూడండి! ఇలారండి!" అని ఎలుగెత్తి పిలిచారు. మోకాలి బంటి నీటిలోకి దిగి చేత్తో అలలను తాకినట్టుగా చేయెత్తి పిలిచారు.

గట్టుమీద మూగివున్న యావన్మందీ ముందుకు కదిలారు, తమని పిలుస్తున్నారేమోనని! కాని ఆశ్చర్యం! వీళ్ళ అడుగు ముందుకువేసే లోగా నదిలోంచి ఒక పెద్ద కలకలం చెలరేగింది! ఎంతోమంది జనసమ్మర్దం దగ్గరవుతూన్న హోరు అది! అంతా చుట్టూ చూడసాగారు ఎటూ ఏమీ కనిపించలేదు! కాని ఎండుటాకులలో నుంచి గాలివీస్తుంటే వినవచ్చే హోరులాంటి, జనం కదలి వస్తున్న హోరు! ఒకటే రొద! జనం దగ్గిరవుతున్నకొద్ది గొంతుఫెళలు, కవచాలు, కత్తులూ .రాసుకుంటూన్న శబ్దాలు, జెండాల రెపరెపలూ ....అరె! .... ఆశ్చర్యం! చూస్తుండగానే గంగానదిలోంచి ఉదయించినట్టుగా లేచింది ఒక పెద్ద సేనావాహిని! నీటిమట్టం దాటి సూర్యోదయానికి అడ్డంగా గోడవలె లేచిన సైన్యంలో ఏనుగులు,

గుఱ్ఱాలు, భటులు..... అరె! ఏనుగుపై అంబారీతో రారాజు దుర్యోధనుడు వెనుకనే రథాలతో, కవచాలతో భీష్మపితామహుడూ, ఆవెంటనే ద్రోణాచార్యులు, ఆ వెంట కర్ణుడు! ఒక్కసారి నూర్గురు కొడుకులను అలా సజీవంగా చూసి ధృతరాష్ట్రుడు చలించిపోయాడు! చేతులు చాచి గబగబ పరిగెత్తాడు లేస్తూపడుతూ అందరినీ కౌగ లించుకుంటూ, గుడ్డితనం ఏమయిందో తెలియదు! వెనుకనే గాంధారి ఆదరా బాదరాగా తన కళ్ళకి కట్టుకున్న కట్టును తీసివేసి తన అందరు బిడ్డలనూ మనసార చూసుకొని కన్నీళ్ళు వర్షించే మాతృమూర్తియై పరుగిడింది! ఇక కుంతీదేవి గుండెలు బ్రద్దలవుతాయేమోనన్నంతానందం! ఆవేశంతో తన తొలిచూలిబిడ్డ కర్ణుణ్ణి చేరి పొదివి పట్టుకొని కౌగలించుకుంటున్నది ఉత్తరాభిమన్యులు మైమరచి నృత్యంచేస్తున్నారు ఒళ్ళు తెలియని ఆనందంలో! ద్రుప దుడు, ధర్మజుడు, పాంచాలి అన్యోన్యం సంభావించుకొని ఆనందంలో తలమునకలైనారు. ఇలాగ అన్నలని తమ్ములూ, భార్యలతో భర్తలు హృదయాలమీద పడి, సోలిపోతూనూ; తండ్రులు కొడుకులతోనూ వారిని దగ్గరకు తీసుకొని ఆనందాశ్రువులు విడిచేవాళ్ళు — ఇలా ఒక్కసారిగా ఆ పవిత్ర గంగానదీ తీరం అంతా చీమల పుట్టవలే కిటకిటలాడే బంధుజనంతో నిండిపోయింది, ఒక ఆనంద సముద్రమా అన్నట్టు!

యుద్ధంలో మరణించిన ఆ యావన్మంది తమ బంధువులతో కలసి మెలసి ఆనందోత్సాహంతో ఒక్కరోజూ, ఒక్కరాత్రి గడిపారు! ఆశ్చర్యం! అది దృశ్యంకాదు యదార్థం! ఎవ్వరికీ శక్యంగాని వ్యాసము నీంద్రుని అఖండ తపోబలంవల్ల ఆ మహత్తర దివ్యానుగ్రహఫలితంగా ధృతరాష్ట్రుడు తన మనస్సునిండేలాగ, తనివి తీరేదాకా - మరణించిన అందర్ని చూశాడు! బంధువులతోసహా అందరు భీష్మాచార్యులవారు, ద్రోణాచార్యుడు మొదలైన కురువృద్ధలందరూ ఇంకా రణరంగంలో తమని ఎదిర్చి పోరాడిన యావన్మంది బంధువులందరితో సహా, సజీ వంగా, అందరూకలిసిమెలిసి తమ పూర్వ శత్రుత్వాలు మరచిపోయి బాంధవ్యంతో మెలగడంచూసి అందరికీ ఆనందం, ఆశ్చర్యమూ

అయింది. కుంతీదేవికూడా తన పెద్దకొడుకైన కర్ణుడికీ, ద్రోణాదులందరికీ నమస్కరించి వారి దీవెనలందుకున్నది. ఇలాగ ఎందరో యోధులు -- అభిమన్యుడూ, ఉపపాండవులూ, మహావీరుడైన ఘటోత్కచుడూ, భూరిశ్రవుడూ, భగదత్తుడూ, శల్యుడూ మొదలైన యావన్మందీ కనపడి వారి వారి ఆభరణాలతో, ఆయుధాలతో యధాతధంగా అందమైన పట్టు వస్త్రాలూ పూలమాలలూ ధరించి ఘుమఘుమలాడే సుగంధ పరిమళాలతో చందనంపూసుకుని, పైన తాము వీరస్వర్గంలో ఎలావున్నారో సరిగ్గా అలానే, దర్శనమిచ్చారు ఆ గంగానదీ జలంలోంచి వెడలివచ్చి! అందరికీ మహదాశ్చర్యమైంది వ్యాసమునీంద్రుని అమోఘ అనుగ్రహశక్తి పరమ గురువుగా ఆయనశక్తి అపారం! వ్యాసులవారు సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారమూర్తి అంటూ అందరూ భక్తితో మునీంద్రులకు మోకరిల్లారు.

ఇంతలోనే తెలవారవస్తోంది. వేకువ జామున బ్రాహ్మీ ముహూర్తం సమీపిస్తుండగానే వ్యాఘ్ర చర్మంపైన ఠీవిగా కూర్చుని వున్నాడు వ్యాసమహర్షి! తన జపధ్యానాలను ముగించుకొని!

"యావన్మందీ వినండి! మీరు మళ్ళా తిరిగి మీమీలోకాలకు వెళ్ళిపోవలసిన సమయం ఆసన్నమైంది! ఇక బయలు దేరండి!"

అంటూ వ్యాసమహర్షి మేఘగంభీరమైన కంఠంవిని అందరూ ఒక్కసారి ఉలిక్కిపడి మళ్ళీ ఈలోకంలోకి వచ్చారు!!! ఒక దివ్యమైన కల కరిగిపోయినట్టు అంతలోనే ఆ గంగాతీరం అంతా ఓ సముద్రం హోరులా ఒక్కసారి లేచిన జనం ప్రయాణానికి సిద్ధపడుతుంటే గుమికూడిన ఆ మృతవీరుల కలకల ధ్వని మళ్ళీ హోరులాగ అంతటా మిన్నుముట్టింది. అది ఉభయ పక్షాలవాళ్ళూ ఒకరి దగ్గిర ఒకళ్ళు శలవు పుచ్చుకుంటున్న కలకలం! అంతలోనే మళ్ళీ ఉరుములాంటి ప్రశాంత గంభీరమైన వ్యాసమహర్షి యొక్కగంభీర కంఠధ్వని అందరికీ వినిపిస్తోంది.

"ఇక్కడవున్న కురువీరుల భార్యలువినండి! ఎవరెవరు తమ భర్తల వెంటనే వుండాలని కోరుకుంటున్నారో వారు యావన్మందీ గంగా

నదిలోకి వారివెంట నిర్భయంగా వెళ్ళవచ్చు!"

అదివిని ఆశ్చర్య సంభ్రమాలతో అక్కడున్న వీరపత్నులంతా గబ గబా లేచి ధృతరాష్ట్రుడూ, గాంధారి మొదలైన పెద్దల అనుజ్ఞపొంది వ్యాసమహర్షికి ప్రణమిల్లి, అప్పటికే ప్రయాణమై నడచిపోతున్న ఆ అమరవీరులతో కలిసి, గంగానదిలో ప్రవేశించి, చూస్తుండగానే క్షణకాలంలో అంతా అదృశ్యమైపోయారు!

కొద్దిసేపు తర్వాత వారి మృతదేహాలు గంగానదీ ప్రవాహంలో తేలుతూ వెళ్ళి గంగా సాగరసంగమంవేపు కొట్టుకొని పోయాయి! ఆశ్చర్యం!! మహాపుణ్యాత్ములకేగాని లభ్యంకాని ఈ పుణ్యం తమ అస్థికలు మరణించిన తర్వాత శ్రద్ధతో గంగలో కలిసే అదృష్టం వీళ్ళశరీరాలకు అనుకోకుండానే అలాగ, లభించింది!

అలా చూస్తుండగానే కనుమరుగైపోయారు యావన్మంది! అదంతా కన్నార్పకుండా చూస్తూ నిలబడ్డాడు ధృతరాష్ట్రుడు అలా వెడుతున్న వాళ్ళ ఆనందోత్సాహాలను చూస్తూ ఆశ్చర్యపోయి! పెళ్ళికి తరలివెళుతున్న శోభతో వెలిగిపోతున్నారందరూ! తమ తమ భర్తలతో చెట్టా పట్టాలు వేసుకుని వెళ్ళారు! ధృతరాష్ట్రుడి కళ్ళు వ్యాసులవారి అనుగ్రహదృష్టి ఇప్పటికీ ఇంకా అదంతా స్పష్టంగానే చూడగలుగుతున్నాడు.

"ఇక్కడ నీవు చూస్తున్న ఈ ఆనందంకంటే వాళ్ళ ఆనందం, ఎన్నో రెట్లు ఎక్కువ! సంతోషంతో పై లోకాలలోకి, పోయి ఎంతో ఆనందిస్తున్నారు, నీ కుమారులూ, ఇంకా యుద్ధంలో వారితో వీరస్వర్గం అలంకరించిన యావన్మంది వీరులూ, ఇప్పుడైనా తీరిందా! నీ అనుమానం పోయిందా నీమనస్సులో గూడుకట్టుకున్న శోకం! ఊరికే విచారిస్తూ కూర్చుని నీ అమూల్యమైన జీవిత కాలాన్ని ఇలా వ్యర్థం చేసుకోవద్దు, లే! ఇక నీవు యోగ మార్గాన్ని అనుసంధించు! నీ మనస్సును బైట వస్తువులమీదకు వెళ్ళకుండా నిరోధించి తాబేలు తన కాళ్ళను లోపలికి ముడుచుకున్నట్లుగా నీ ఇంద్రియాలనూ, మనస్సును అంతర్ముఖంచేసి, మనస్సును ఇంద్రియాలద్వారా బైటకి

ప్రవహించకుండా లోపలికి త్రిప్పి పరమాత్మయందు లగ్నంచేసి నిశ్చలంగా ధ్యానించు! ఆత్మను దర్శించు! నీకు మేలు కలుగుగాక!!!"

"ఇంకొకమాట! ధర్మరాజు నెలరోజులుగా ఇక్కడ నీవద్దనే ఉంటున్నాడు, తన తమ్ములతో భార్యా సమేతంగా భక్తితో నీ సేవలుచేస్తూ! అతడిని వెంటనేనీవు హస్తినకు పంపించు! రాజ కార్యాలు ఆగిపోరాదు. అతనికి శలవు ఇచ్చి నిండుమనసుతో దీవించి పంపు! గతంగురించి నీమనస్సులోవున్న కల్మషమంతా జపం, ధ్యానం భక్తి, తపస్సులతో కడిగిపోసి నీ హృదయాన్ని నిర్మలంచేసి స్ఫటికంలాగచేయి! క్రోధంకాని శోకంగాని బంధువులమీద మమకారం గాని ఇంకే విచారంగాని నీమనస్సులో లేకుండా వెతికి, యోగంతో పవిత్రంచేసుకో!

"నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ నీవెంటనే వుంటాయి! నీ మీద అనుగ్రహంతో చెబుతున్నాను నీవు పైలోకంనించి దైవ కార్యం నిమిత్తం భూమిమీద జన్మించిన గంధర్వుడిని! పైలోకంలో కూడా నీ పేరు ధృతరాష్ట్రుడే! నీవు నేను చెప్పినట్టు నడుచుకుంటే పుణ్య లోకాలకు చేరుకుంటావు! విచారించకు! అని తనకు సాష్టాంగపడి మ్రొక్కిన ధృతరాష్ట్రుడితో చెప్పి, గాంధారికీ, కుంతికీ, యావన్మంది పాండవులకీ అనుగ్రహపూర్వకంగా దీవెనలిచ్చి చూస్తూండగానే ఆలో చనలా మాయమయ్యాడు తన శిష్యులతో సహా వ్యాసమహర్షి!!

వ్యాసుని ఈ అద్భుత దివ్యలీలనూ, ఆయనయొక్క అపార తప శ్శక్తినీ ఆయన అనుగ్రహ మహిమనూ తెలిపే ఈ దివ్యానుభవాన్ని వివరించి వింటున్న జనమేజయునివైపు పరికించాడు, వైశంపాయన మహర్షి! తన గురుదేవుడు వ్యాసులవారిని స్మరించటంవల్ల కలి గిన అపార భక్తిపారవశ్యంతో ఆనంద భాష్పాలతో నిండిన కళ్ళతో జనమేజయుడింకా అడుగుతున్నాడు విస్మయంతో!

"మహానుభావా! ఇది చాలా అద్భుతం. ఈ దివ్యానుభూతి ఇలా నిజంగానే జరిగిందా? ఎంతాశ్చర్యం! నమ్మశక్యంకాని అద్భుతం ఇది! ఎక్కడైనా చనిపోయినవాళ్ళు తిరిగి రావడం సంభవమా!

అందులోనూ ఒకళ్ళు కాదు- ఇద్దరు కాదు - యావన్మంది! ఒక రోజు రోజంతా, అలా బ్రతికివున్న తమ బంధువులతో గడపటమా! వ్యాసమునీంద్రులు నిజంగానే ఈ అద్భుత లీలను చేసిచూపారా? ఆశ్చర్యం! వ్యాసమహాముని దైవాంశస్వరూపులే! సందేహంలేదు.

వారి అఖండ తపోబలానికి అసాధ్యమన్నదే లేదు నాకు తెలుసు. కాని నిజంగా కళ్ళతో చూడందే నమ్మకం కలగడం కష్టంగదా! ఉదాహరణకు నాకిప్పుడు, ఇన్నేళ్ళతర్వాత, గతించిపోయిన నాతండ్రి పరీక్షిత్తు మహారాజు బ్రతికివచ్చి సజీవంగా కళ్ళకు కనిపించేలాగ చెయ్యగల శక్తి వ్యాసమునీంద్రులకు వున్నదా! ఇది సంభవమా!"

ఒక క్షణం వ్యాసుని శిష్యుడయిన వైశంపాయిన మునీంద్రుడు కధను చెప్పకుపోతున్నవాడల్లా అకస్మాత్తుగా విషమసంకటంలో పడ్డాడు! చూసేది చూపలేకపోతే ఇతడు నేను చెప్పకుపోతున్న కధావస్తువయిన 'మహాభారతాన్నే శంకిస్తాడే'! అంతటితో ఆగక **తన గురుదేవుల్నే** సందేహిస్తాడేమో - ఆయనగురించి తాను ఇంతవరకూ చెప్పకుపోతున్న అద్భుత ఆధ్యాత్మిక చరిత్రనే యావత్తూ కధకింద జమకట్టిపారెయ్యడుగదా! ఇప్పుడేమిటి దారి!

ఎటూ తోచక ఆయన చెపుతున్న కధని ఒక్క క్షణం ఆపి, మనస్సులోనే తన గురుదేవుని భక్తితో తల్చుకున్నాడు - ఈ విషమ పరీక్షనుండి గట్టెక్కించమని గట్టిగా తన హృదయం మధ్యగా వినీలమైన వ్యాసమునీంద్రుని నిర్మలరూపాన్ని ధ్యానించాడు భక్తితో చేతులు జోడించి!

అంతే, కళ్ళు తెరిచేసరికి తన ముందరే నిల్చునివున్నాడు పరమ గురువైన వ్యాసమునీంద్రుడు!! ఆ! ఎప్పుడు వచ్చారీయన! ఆశ్చర్యం! అనుకుని ఆయన పాదాలకి సాగిలపడి నమస్కరించి కన్నీళ్ళతో లేవకుండా జనమేజయుడు ఆయన పాదాలను కౌగలించుకుని దుఃఖించినట్టి ఆవేశంతో ఊగిపోతూ భక్తి పరవశుడయిపోతున్నాడు. పరిస్థితి అర్థం గాక ఇంతలో **అతని చుట్టూ చూస్తే** ఆ వెనుక - అరే! ఆశ్చర్యం ఇదేమిటి! మరణించిన **పరీక్షిత్తు** మహారాజు నిల్చు

నివున్నాడు! ఈయనెప్పుడు దర్శనమిచ్చాడు స్వర్గంనించి దిగివచ్చి! ఇదంతా ఎప్పుడు జరిగింది! ఇంతలోనే?

జరిగిందంతా అప్పుడుఅవగతమయింది వైశంపాయనుడికి. అతడు క్షణకాలం తన గురుదేవులైన వ్యాసమునీంద్రులను తల్చుకుని, ధ్యానిస్తూ వారి రూపాన్ని హృదయంలో చూస్తూ అలా తననే తాను మరచిపోయిన ఆ తృటిలోనే - **అదే సమయంలో** తనలోనే గాక బైటకూడా దర్శనమిస్తూన్నాడన్నమాట వ్యాసుడు, జనమేజయ మహారాజుముందు కూడా ప్రత్యక్షమై! ఆశ్చర్యం! జనమేజయుడు తన సందేహాన్ని, వెలిబుచ్చుతూ అడిగిన తన ప్రశ్నని **అడిగీ అడగ కుండానే తీర్చేశాడు** ఆ సందేహాన్నికూస్తా వ్యాసులవారు. అంతా క్షణంలో జరిగిపోయింది.

అలనాడు చనిపోయిన పరీక్షిత్తునేగాదు, అతడిని శపించిన 'శృంగి' అనే ముని కుమారుడు కూడా వెంటవచ్చాడు - అతడి తండ్రి శమీకుడూ ఇంకా ఆనాడు పరీక్షిత్తుతో జీవించి వుండిన మంత్రి సామంత పురోహితులయిన సమకాలికులందరినీ **సరాసరి వెంటబె ట్టుకుని ప్రత్యక్షమైనాడు** వ్యాసమహర్షి!! ఆహా? పిలచినవెంటనే పలికి ఇలాగ, తనని కాపాడి, తన పరువూ, జనమేజయుని కోరికా రెండూ సార్థకమయ్యేలాగ నిలబెట్టారు తన గురుదేవులు! అనుకుని ఆశ్చర్యంతో భక్తితో పొంగిపోయాడు వైశంపాయనుడు!

అప్పుడు, జరుగుతున్న ఆ సర్పయాగం చూడటానికి వచ్చిన ఆస్తీక మహర్షి, లేచి వ్యాసునికీ ఆయనతోపాటు ప్రత్యక్షమయిన దేవర్షులకూ వ్యాస శిష్యులందరకీ అభివాదనచేసి అన్నాడు! "పురాణ ఋషియైన వ్యాసమహర్షి ద్వైపాయనులవారు అనంత తపోనిధులు! ఈ ఇహలోకపు కళ్ళకి కనిపించని పరలోకమూ — ఈ రెండింటినీ కూడా తన తపస్సుతో గెల్చుకున్న దివ్యస్వరూపుడు! **'వ్యాసో నారాయణోహరిః'!!** అంటూనే సాగిలపడి నమస్కరించాడు జర త్కారుడు.

యజ్ఞదీక్షలోవుండి వైశంపాయనునివల్ల పురాణం వింటున్న

జనమేజయుడు పరలోకంనుంచివచ్చిన తనతండ్రి పరీక్షిత్తును అవబృధస్నానంతో అభిషేకించుకుని పవిత్రుడైనాడు.

ప్రత్యక్షంగా పూర్వం తన తాతలయిన పాండవుల కాలంలో చూపిన మహిమను మళ్లీ ఈనాడు తనముందు ఆశ్చర్యపడేట్టుగా చూపిన వ్యాసమహర్షిని పాదాలుపట్టుకుని మళ్ళీ పూజించి క్షమించమని వేడుకున్నాడు జనమేజయుడు. వ్యాసుడు తను దర్శింపచేసిన మృతులను మళ్ళీ అంతర్ధానం చేసి, తాను యజ్ఞంలో అక్కడచేరిన అందరనూ ఆశీర్వదించి, తన శిష్యులతోసహా అదృశ్యుడై మాయమైపోయాడు.

వైశంపాయనుడు తాను వినిపించుకు వస్తున్న పురాణాన్ని మళ్ళీ ఆరంభించాడు– ద్విగుణీకృతమైన భక్తి, శ్రద్ధలతో వింటూన్న జనమేజయునికి.

ఇలా, రెండు సార్లు, చేసి చూపెట్టాడు వేదవ్యాస మహర్షి – మృతులను బ్రతికించి **'మృత-సంజీవనం'** తో!



17

# శాపంతో - చిరంజీవులు!

దుర్యోధనుడు గదా యుద్ధంలో భీముడిచేత తొడలు విరిగి క్రింద పడ్డాడు. ఆఖరి భారతయుద్ధవీరుడు నేలకొరగటంతో యుద్ధం ఆఖరి అంకంలోకి ప్రవేశించింది.

దుర్యోధనుడు ఇంకా చావలేదు. రక్తం మడుగులో మూలుగుతూ బాధతో కక్షతో ఉడికి పోతున్నాడు. సాయంత్రం అయింది. చీకటిపడడంతో రెండువేపులా యుద్ధంలో చావగామిగిలిన వీరులూ, సేనలూ వారి వారి శిబిరాలకు చేరుకుంటున్నారు. చనిపోతున్న రారాజు దుర్యోధనుడు అస్తమిస్తున్న సూర్యునివలే వున్నాడు. ఎర్రటి మడుగులో దొర్లుతూ రోషంతో ప్రతీకారవాంఛతో ప్రాణంపోక ఇంకా కొట్టుకుంటున్నాడు ప్రక్కనే భక్తితో జాలిగా కృతవర్మా, కృపాచార్యులూ, అశ్వత్థామా నిలబడివున్నారు. ఆఖరి ఎత్తువేశాడు పాండవ నిర్మూలనకు దుర్యోధనుడు. అశ్వత్థామను పిలిచి అతడిని సర్వసేనానిగా అభిషేకించి పట్టంకట్టాడు. కక్షతీర్చుకొనే భారం అంతా నీమీదనే పెట్టానంటూ....

అశ్వత్థామ దుర్యోధనుని జాలిగొలిపే స్థితికి అగ్నిహోత్రంలా మండిపడ్డాడు. వెంటనేలేచి శత్రువులను నిర్మూలనం చేస్తానని ప్రతిజ్ఞచేసి బయలుదేరాడు. అర్ధరాత్రి తను చేయవలసిన ఘోరమైన ప్రతీకారాన్ని తలచుకొని అశ్వత్థామ తనలో సంహారకరూఢుడైన రుద్రుణ్ణి ఆవేశింప చేసుకొని భయంకరమైన శివుని అఘోరమూర్తిని ధ్యానించాడు.

వెంటనే ఎదుట భూతాకారంలో శివుడు అశ్వత్థామకు అడ్డంగా నిలిచాడు. అశ్వత్థామ ఆయనను గుర్తించలేక ఆయనపైన అనేక దివ్యాస్త్రాలను వర్షించాడు. అవన్నీ రుద్రుడు తనలో లీనం చేసుకొన్నాడు. చివరికి ఆశ్చర్యంతో అశ్వత్థామ చేతులుజోడించి దేవదేవుడైన మహాదేవుని అఘోరమైన మంత్రాలతో స్తుతించాడు. అంతలో ఒక అద్భుతమైన తేజస్సు వచ్చి అశ్వత్థామలో ప్రవేశించి అతడిని ఆవేశించింది. అసలు అశ్వద్ధామ పుట్టుకలోనే రుద్రుని అంశతో జన్మించాడు. అందువల్ల ఈ భూమిమీద జరుగనున్న మహా ప్రణాళికలలో జరుగవలసిన సంహారం, రక్తపాతం అశ్వత్థామ చేతిమీదుగా కూడా జరుగవలసింది ఇంకావుంది.

అశ్వత్థామ నిద్రిస్తున్న పాండవుల శిబిరంలో ప్రవేశించాడు. వీరావేశంతో ఊగిపోతున్నాడు. వెనుకా ముందూ లేకుండా నిద్రపోతున్న ద్రౌపది కొడుకులు ఐదుగురినీ తుండేలు తుండేలుగా నరికేశాడు. రక్తం వోడుతున్న కత్తితో బైటకువచ్చి దుష్టద్యుమ్నుణ్ణి ఘోరంగా ఉరి తీసి చంపాడు. తరువాత పాంచాల రాజుల సేనాధిపతులను, అతని సైన్యాన్ని దిక్కులేకుండా నరికేశాడు. ఆ తర్వాత, దుష్టద్యుమ్నుడి తమ్ముళ్ళను నిశ్శేషంగా అంతంచేశాడు.

కృతవర్మ, కృపాచార్యులు వెంటరాగా శిఖండి తల నరికేశాడు! మధ్యదేశపు సేనంతా ప్రబద్ధక సైన్యమూ, ఇలా ఒక్కరేమిటి అక్కడ కనిపించిన ప్రతిప్రాణినీ ఆకలితోవున్న తన భైరవ ఖడ్గంతో ఆహుతిచేశాడు. పారిపోతున్నవాళ్ళని, భయంతో ఏడుస్తూ బ్రతిమాలుకొంటున్న వారిని కూడా విడిచిపెట్టకుండా సొంతం చంపేశాడు. గుఱ్ఱాలు,

ఏనుగులుకూడా: అవీ దిక్కు తెలియని అతడి పిచ్చి ఆవేశానికి ఆహుతి అయినాయి.

అంతా అయింతరువాత ఒళ్లుతెలిసింది అశ్వత్థామకు. ఏదో భయంకరమైన శక్తి తన్నావహించి తనద్వారా ఈ సంహారకాండను జరిపించి చివరికి తాగుడు నిషా తగ్గిపోయినట్లు ఆ మైకం దిగిపోయింది. అప్పటికి తెలిసింది అశ్వత్థామకు ఐదుగురు పాండవులు ఆ శిబిరంలో లేరని! అది తెలిసి అశ్వత్థామకు భయం పట్టుకొంది. పరుగు పరుగున వెళ్ళి కొన ఊపిరితోవున్న దుర్యోధనునికి తానుచేసిన ఘోరమైన హింసాకాండ వర్ణించాడు. ఆనందంతో అశ్వత్థామను కౌగలించుకొని దుర్యోధనుడు ఎంతగానో సంతోషించాడు. భీష్ముడు, ద్రోణుడూ వంటి మహా వీరులను చంపిన శిఖండి, దుష్టద్యుమ్నులను చంపి పగతీర్చుకొన్నావని అశ్వత్థామను కౌగలించుకొని ఆనందంతో కన్నుమూశాడు రారాజు!

ఇక అశ్వత్థామకు తనవెంట తరుముకొంటూ భీమార్జునులు కృష్ణునితోసహా తనకోసం వస్తారని గుర్తుకు వచ్చింది. గుండెలు గుభేలు మన్నాయి. తానుచేసిన మహాఘోరానికి పాండవుల ప్రతీకారాగ్నిని తలచుకొని పారిపోదామన్నా ఎటూ దిక్కు తెలియలేదు. చివరికి ముగ్గురికి ముగ్గురూ విడిపోవడానికే నిశ్చయించుకొన్నారు. కృపాచార్యుడు హస్తినాపురంవైపు రథంయెక్కి దౌడుతీశాడు. కృతవర్మ ద్వారకవైపు పలాయనం చిత్తగించాడు.

ఇక అశ్వత్థామకు ఎటుపోవటానికి తోచలేదు. ఎక్కడికి పోయినా పగబట్టి! చంపుతారు పాండవులు, భీముడు, అర్జునుడూ తనను ప్రాణాలతో విడచిపెట్టరు. నిద్రిస్తున్న ద్రౌపది కొడుకులను ఘోరంగా చిత్రవధ చేశాడు నిద్రలోనే తాను పైగా శ్రీకృష్ణుడుకూడా వెంటనే వుంటాడు కాబట్టి వారిని ఎదిర్చి ఎదుట నిలవటం అసాధ్యం! ఇంక పరమ గురువైన వ్యాసమహర్షే తనకు శరణ్యం అనుకున్నాడు అశ్వత్థామ. ఇక హడావిడిగా వ్యాసాశ్రమం వైపు దౌడుతీయించాడు రథాన్ని. అక్కడ ఆశ్రమంలో వ్యాసమహర్షి అనుష్ఠానాది జపతపాలు

ముగించుకొని శిష్యులకు వేదం చెబుతున్నాడు. ఉదయం వెలిగించిన హోమాగ్ని ఇంకా మండుతూనేవున్నది. ఆశ్రమం వాతావరణం పవిత్రంగా, ప్రశాంతంగా, మంగళకరంగా వున్నది ఎంతో ధ్యానంచేసిన వాని మనస్సులాగా అటూ, ఇటూ చూశాడు అశ్వత్థామ. తన ఘోరమైన వికృతాకారంతో ఆశ్రమం ప్రవేశింపలేక పోయాడు. అంతరాత్మ ఒప్పుకోలేదు. ఆ పవిత్ర వాతావరణంలోకి ప్రవేశించడానికి.

వెంటనే రథాన్ని కవచాలను ఆశ్రమానికి దూరంగాపోయి వదిలివేశాడు. అక్కడ కొలనులో స్నానంచేసి యుద్ధం చేసిన తనరూపాన్ని పూర్తిగా వదిలేశాడు. కాషాయాంబరాలు ధరించి ఒంటినిండా విభూతి పూసుకొని గుర్తుపట్టలేకుండా తన రూపమంతా మార్చుకొని వ్యాసుని ఆశ్రమంలో ప్రవేశించాడు. వ్యాసమహర్షి తీవ్ర ధ్యాననిష్ఠలో వున్నాడు. పిల్లిలాగ సద్దుచేయకుండా ఆశ్రమంలో ప్రవేశించి అక్కడ కూర్చుని వేదాలు వల్లిస్తూ, ముని కుమారుల మధ్యదూరి కనబడకుండా కూర్చొన్నాడు తలవంచుకొని. ఒక ప్రక్క గుండెలు పరుగులు తెడుతున్నాయి. భయంతో పశ్చాతాపంతో ఆణగారివున్న కక్షతో ధ్యానంలోవున్న తన కళ్ళకు ద్రోణుణ్ణి ఘోరంగా చంపిన దృశ్యం అతని కళ్ళముందే మెదులుతోంది.

ఇక అశ్వత్థామ కూర్చున్నాడో లేదో వెంటనే ఆశ్రమంలోనికి ఒక రథంవచ్చి ఆగింది. దానిలో భీముడు; వెంటనే అర్జునుడు కూడా శ్రీ కృష్ణుడు తళతళ మెరుస్తున్న ఆయుధాలతో, కవచాలతో క్రిందికి దూకారు! ఆశ్రమం నలుమూలలా పరికించారు. అశ్వత్థామ ఎటు పోయాడో కనిపించలేదు. ఆయుధాలను ఆశ్రమం బయట వదలి వ్యాసమహర్షికి గౌరవంగా ప్రణామం చేసి ముగ్గురూ ఆశ్రమంలోకి ప్రవేశించారు. వ్యాసమహర్షికి గంగానదీ తీరంలో ప్రశాంతముున ఆ వాతావరణంతో ప్రవహిస్తున్న గంగవలె పవిత్రమూర్తియై జడలుకట్టిన వ్యాసముని ఆ దివ్యస్వరూపాన్ని సందర్శించారు.. అశ్వత్థామను గురించి అడిగేలోగానే నిశితమైన భీముడి కళ్ళు ముని కుమారుల మధ్య దాక్కొని విభూతి పూసుకొన్న అశ్వత్థామమీద

పడ్డాయి. చూడగానే అశ్వత్థామను అంతంచేయాలని తలపెట్టాడు భీముడు.

త్రికాలవేదియైన వ్యాసమహర్షి చటుక్కున మెరుపు మెరిసినట్లు లేచి భీమార్జునులకు, శ్రీకృష్ణునకు ఎదురేగి నిలుచున్నాడు. భీముడి హృదయంలో మెరసిన ఆలోచనను గుర్తించి ప్రశాంతవదనంతో అతని వంక చూశాడు. అతని ఆశయం క్షణంలో గ్రహించాడు వ్యాస మహర్షి. తన ఆశ్రమం పవిత్ర వాతావరణం రణభూమి కారాదు. ఇక్కడ రక్తపాతం జరగటానికి వీలులేదు. అలా అని అశ్వత్థామను సమర్థించనూ లేదు. అశ్వత్థామ చేసింది మహాపాతకం. పవిత్రుడైన ద్రోణాచార్యుని కుమారుడై, బ్రాహ్మణవంశములో జన్మించినా, అశ్వత్థామకు చిన్నతనం నుంచీ స్నేహాలన్నీ క్షత్రియులతోనే. అందుచేత చిన్నప్పటినుంచీ ఆయుధాలను పట్టుకొని తిరుగుతూ కురుపాండవ వీరులలో తిరిగాడు, వారితో స్నేహమే చేశాడు వారి కక్షలు, కార్పణ్యాలు, మాత్సర్యాలు అవే అలవాటయ్యాయి. వారి సాంగత్యం వల్ల అశ్వత్థామకు! అశ్వత్థామ పుట్టుకతో బ్రాహ్మణుడేగాని స్వభావతః క్షత్రియుడుగా వ్యవహరించాడు.

క్రోధాగ్నితో మండుతూ వచ్చిన భీమార్జునులకు వారి వెంట వచ్చిన శ్రీకృష్ణునికి తన బ్రహ్మతేజస్సుతో ఎదురేగి నిలుచున్న వ్యాసమహర్షి శరీరంచుట్టూ వ్యాపించిన ప్రశాంతి ఆధ్యాత్మిక తరంగాలు వారిలోని వేడి, క్రోధం హరించగా అన్నీ అక్కడికక్కడే అగిపోయాయి. నోరు మెదపకుండా ప్రశాంత పరచాడు వ్యాసమహర్షి. కాని భీముడు అశ్వత్థామను చూసి మండిపడ్డాడు, "ఓ బ్రాహ్మణాధమా"! రాత్రి అంత ఘోరంచేసి అప్పుడే మునివైపోయావా? విభూతి పూసుకుంటే చావు తప్పుతుందా? లేనీ దొంగ తపస్సు చాలు. యుద్ధానికిరా అంటూ పెద్దగా రంకెలువేశాడు.

అశ్వత్థామ గడగడలాడిపోయాడు. గుండెల్లో తాను చేసిన పాపాలు తలచుకొనడమైనది. అర్జునుని దివ్యాస్త్రాలు, భీముని ఆవేశం చూసి వాళ్ళ దివ్యాస్త్రాలను తలచుకొని అదిరిపడ్డాడు. ఇక ఎటూ

త్రోవలేక ఆ ప్రక్కనేవున్న ఒక దర్భపరకను, తీసుకొన్నాడు. వ్యాసమహర్షి వున్నాడనికూడా మరచిపోయి బ్రాహ్మణుడుగా తాను నిత్యం ఆరాధించే గాయత్రి మంత్రాన్నే ఘోరమైన అస్త్రంగాచేసి ప్రయోగించాడు.

క్షణకాలం ధ్యానించి చూస్తూవుండగానే ఆ దర్భపుల్ల కరెంటు ప్రవహించిన తీగలాగ వెలగటం మొదలుపెట్టి వెయ్యి మెరుపుల తేజస్సుతో తళుక్కుమన్నది!! అశ్వత్థామ కన్నులమధ్యనుండి వెలి గిన తపోశక్తి అర్జుని తేజస్సుతో మిరుమిట్లు గొలిపేలాగ భగ్గుమని చూస్తుండగానే భూమి ఆకాశాలు వ్యాపించింది తన తేజస్సు. "అపాండవమస్తు!" అని సంకల్పించి ప్రయోగించాడు అశ్వత్థామ. ఆ దివ్యాస్త్రం విజృంభణ చూసి క్షణకాలంలో గ్రహించాడు శ్రీకృ ష్ణుడు అది బ్రహ్మశిరోనామక అస్త్రం అని దానికి తిరుగులేదని అది మనుష్యులమీద ప్రయోగించకూడదని అంత బ్రహ్మాండమైన అస్త్రం. ఈనాటి Hydrogen bomb లాగా ఉద్దేశించిన మనిషినే కాక చుట్టుప్రక్కల జీవరాసులన్నింటిని భస్మం చేస్తుంది. భయపడ్డాడు శ్రీకృష్ణుడు వ్యాస మహర్షివైపు చూశాడు నిదానంగా. ఆయన తొణకకుండా పర్వతంలాగా నిలిచియున్నాడు. పరధ్యానంలో వున్న ట్టుగా అర్జునునివైపు తిరిగి శ్రీకృష్ణుడు కంగారు పడుతూ ఇలా అన్నాడు.

"అర్జునా! అర్జునా!! ఇది మహాస్త్రమైన బ్రహ్మశిరం! దీనికి మరో అస్త్రం ఎదురులేదు. నిన్నూ నీకుటుంబాన్ని రక్షించుకో! త్వరపడు. నీవూ బ్రహ్మశిరం ప్రయోగించాలి!!" అంటూ తొందరచే శాడు. అర్జునుడు పరిస్థితి గ్రహించి కంగారుపడ్డాడు. గభాలున రథం దిగాడు. వ్యాసునికి నమస్కరించాడు. గురుదేవుడైన ద్రోణాచార్యుని స్మరించాడు. బ్రహ్మశిరస్సు మంత్రం అనుసంధించి అశ్వత్థామకు అపాయం రాకుండా వుండాలని ప్రార్థించాడు. తనకీ అస్త్రం ప్రసాదించిన గురువుయొక్క పుత్రునికి అపాయం రాకుండా తనసో దరులకు రక్షణ కలగాలని ప్రార్థిస్తూ సంకల్పించి అస్త్రదేవతను ధ్యానించాడు. తనపైకి వచ్చే అస్త్రాన్ని ఈ అస్త్రం హతమార్చాలని

బ్రహ్మశిరస్సు అస్త్రాన్నే తిరిగి ప్రయోగించాడు.

మంటలు గ్రక్కుతూ క్షణకాలంలో ఆ మహాస్త్రం మిరిమిట్లు గొలిపే తేజస్సుతో ఆకాశంలోకి లేచింది. అటునుంచి వస్తున్న అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రానికి ఎదురుగాపోయి భీకరమైన నీలిమంటలు క్రక్కుతూ ప్రళయ భయంకరంగా విజృంభించటం జరిగింది. ఆ రెండు మహాస్త్రాల వేడికీ భూమి, ఆకాశం ఒక్కసారి భగ్గుమన్నాయి వేయిసూర్యులకాంతితో నూరు "హైడ్రోజన్ బాంబు" Hydrogen bomb లు ప్రేలినట్లు ప్రపంచమంతా కల్లోలం కాసాగింది. సూర్యుని బింబం వెలుగు తగ్గిపోయి ఆముదుపు దీపంలా మెలగసాగింది. ఆ దివ్యాస్త్రాల తేజస్సు ముందర. తళతళలాడే తెల్లని తెలుపుతో కళ్ళుజిగేలుమనిపించే విద్యుత్ కాంతిని వ్యతిరేకించే తేజస్సు ప్రకృతిపైన తిరుగబడి విజృంభించినాయి. బ్రహ్మశిరోనామక అస్త్రాలు రెండూ.

వ్యాసమహర్షి ఇక ఆలోచించలేదు! క్షణకాలంలో తను నిలిచిన చోటున అదృశ్యుడైనాడు. కృష్ణుడు అర్జునుడు నివ్వెరపోయి ఏంజరుగుతుందో గుర్తించేలోగా ఆకాశంలో ఢీకొంటున్న ఆ రెండు ప్రళయాస్త్రాల నడుమ నిలిచాడు. ఆరెండు అస్త్రాలమధ్య ప్రత్యక్షమై వ్యాసమహర్షి తేజము బ్రహ్మాస్త్రం కంటే అధికమై ప్రపంచాన్ని చల్లగా చేసే చల్లని సూర్యునిలాగా తేజరిల్లింది. అవి ఘోరమైన ఉగ్రతపస్సుతో సాధించిన మారణాయుధాలైతే ఈ సర్వజగత్తునూ రక్షించే ప్రశాంతి కిరణం వ్యాసుని తేజస్సు. సకల జీవరాసులకి ప్రాణభిక్ష పెడుతూ ఒక చేతితో అభయం ఇస్తూ రెండవచేత్తో యోగదండం, కమండలువూ ధరించి ఆకాశంలో ప్రత్యక్షమయిన వ్యాసమహర్షి ఉరుములాంటి కంఠస్వరంతో వారిని ప్రశాంతపరుస్తూ ఇలా అన్నాడు. "ఈలోకంలో వీరులు ఎందరో పుట్టారు! వారికి తెలియవా ఈ అస్త్రాలు. స్వార్థంకోసం జగత్తును ప్రళయంచేసే ఈ బ్రహ్మశిరోనామ అస్త్రాన్ని మనుషులమీద ప్రయోగిస్తారా? లోకహితమై మీ అస్త్రాలను ఉపసంహరించండి!! వ్యాసమహర్షి మాటలు

పూర్తయ్యేలోగా ఆయన ప్రక్కనే ప్రత్యక్షమయ్యాడు నారదమహర్షి తన తపస్సుతో ఆ ప్రశాంతిని మరింత బలపరుస్తూ.

ప్రళయాగ్నులు క్రక్కుతూ విజృంభిస్తున్న ఆ అస్త్రాలమధ్య వాటి మంటలలో ఏమాత్రం చలించకుండా ముఖమైనా వాడకుండా ప్రశాంతిలో నిలిచారు ఇరువురూ! ఆ పరమ గురువులను చూశాడు అర్జునుడు. తన తొందరపాటును తేల్చాడు. మహర్షుల కంజలిఘటించి అస్త్రంతో అస్త్రం శాంతింపచేయటం కోసమే బ్రహ్మశిరం ప్రయోగించాను నేను. అస్త్రంతో అస్త్రాన్ని నిలువరించటమే నాఉద్దేశ్యము. నా అస్త్రం ఉపసంహరిస్తే ఇతడు మమ్మల్ని భస్మంచేసి వదిలిపెడతాడు కనుక నా క్షేమంకూడా విచారించండి మీరు. ఆజ్ఞ అయితే నా అస్త్రాన్ని ఉపసంహరిస్తాను అన్నాడు. చిరునవ్వుతో చేయెత్తి దీవించారు మహర్షులు! భారం మునులపై వేసి తన అస్త్రాన్ని ఉపసంహరించాడు అర్జునుడు. ఆశ్చర్యం అశ్వత్థామ ప్రయోగించిన అస్త్రం భీమార్జునుల నేమి చేయలేదు. మహర్షుల అనుగ్రహం పరిపూర్ణంగా ఉన్నది.

తపస్సు, బ్రహ్మచర్యము, సత్యము, అహింస, గురుశుశ్రూష పరిపూర్తిగావున్న అర్జునుడు తప్ప ఈ ఘోరమైన బ్రహ్మశిరస్సు ప్రయోగించటం ఎవరికీ సాధ్యంకాదు. దేవతలకుకూడా శక్యంకాని ఆ మహాస్త్రాన్ని ఉపసంహరించిన అర్జునుని తపశ్శక్తికీ అహింసకూ మునులు సంతోషించారు. కాని ఆవేశపరుడు కక్షతో కూడిన మనస్సుతో వున్నవాడైన అశ్వత్థామకూడా తన అస్త్రాన్ని ఉపసంహరించబోయాడు! సాధ్యంకాలేదు. ఆ దివ్యాస్త్రం అలానే మంటలు క్రక్కుతూవుంది. వ్యాసుడు అశ్వత్థామవైపు తిరిగి అపాండవం అనే నీ సంకల్పాన్ని విడిచిపెట్టు! నా మాట విను! ఎంతో ప్రేమతో బృహస్పతి అంశలో జన్మించిన నీతండ్రి ద్రోణాచార్యుడు ఈ బ్రహ్మశిరస్సు అస్త్రాన్ని అర్జునునికి ఉపసంహారంతో సహా ఉపదేశించాడు. ఎందుకంటే ఇతడు కారుణ్యమూర్తి! కనుక ఇతడికి తన స్వార్థం కంటె, తన ప్రాణంకంటె, ప్రపంచంలోని సర్వజీవులూ ముఖ్యం!

అలాంటి ఈ అర్జునుణ్ణి, పాండవులను నాశనం చేస్తాననటం నీ తరంకాని పని! నీ అస్త్రం ఇతని అస్త్రంవల్ల అణిగిపోగలదు! అంతేకాదు. ఉపసంహరించకపోతే రెండు అస్త్రాలు ఒకదాని మీద ఒకటి ప్రయోగించబడిన దేశంలో **పన్నెండేళ్ళు వర్షాలు పడవు!** కనుక నీ క్షేమం, దేశక్షేమంకోరి చెబుతున్నాను. నీ సంకల్పాన్ని అస్త్రాన్నీ విడిచిపెట్టు! నీ క్రోధాగ్ని విడిచివెట్టు. పాండవులు ఏ ఆపదా లేకుండా ఉందురుగాక! నిన్ను అన్యాయంగా ఓడించాలని అర్జునుడెప్పుడూ ప్రయత్నించడు. నీ చూడామణిని అర్జునునకిస్తే వారికి నిన్ను జయించిన ఫలితం కలుగుతుంది. దీనివల్ల నీ ప్రాణం రక్షించబడుతుంది. అందరికీ తగిన సంధిమార్గం ఇదే.

"దీనికి అశ్వత్థామ క్రోధంతోనూ, అవమానంతోనూ ఆయా సపడుతూ " ఈ మణి ఎవ్వరికీ ఇచ్చేదికాదు. ఇది నా తలమీద నిత్యంవుండే చూడామణి! ఈ మణివుంటే ఆకలి దప్పాలుండవు. నిద్ర రోగము మానవుణ్ణి బాధించదు. ఇలాంటి మహామహిమగల చూడామణిని మీ ఆజ్ఞ ఎదురులేనిదికనుక ఇష్టంలేకపోయినా ఇచ్చే స్తున్నాను. కాని నా సంకల్పం మాత్రం మారదు! నా అస్త్రం **వ్యర్థంకాదు.** పాండవుల గర్భాలను నశింపజేస్తుంది. అప్పుడుగాని శాంతించదు ఒకసారి సంధించిన అస్త్రం ఉపసంహరించడానికి నాకు శక్తిలేదు. అందుకనే పాండవ గర్భంలో ఈ అస్త్రాన్ని విడిచిపెడుతు న్నాను. మహామునీ! నీ ఆజ్ఞ పరిపాలించనందుకు మన్నించవలసింది. దీనికి వ్యాసమహర్షి గూఢార్థంకలిగిన ఈమాటలు అన్నాడు.

"ఇంతవరకూ చాలు పాండవ స్త్రీల గర్భముల నశింపజే శావు అక్కడికి వూరుకో." ఆమాటలు విని అశ్వత్థామ తన అస్త్రాన్ని విడిచిపెట్టాడు. పాండవులు రక్షింపబడ్డారు. అస్త్రం మాత్రం పాండవ స్త్రీల గర్భంమీదే ప్రయోగించబడింది. మెరుపులో ప్రమాదం తప్పిపోయింది వ్యాసమహర్షి సమయ స్ఫూర్తివల్ల. లేకుంటే అశ్వత్థామ ఆ బ్రహ్మాస్త్రం పాండవులమీదే వదిలిపెట్టేవాడు సంకల్పపూర్వకంగా! ఆ ఆపదను తప్పించాడు వ్యాసమహర్షి.

దానికి శ్రీకృష్ణుడు ఉత్తరా గర్భాన్ని తాను రక్షిస్తానని శపథం చేసి పూర్వం భవిష్యత్తు తెలిసిన ఒక బ్రాహ్మణుడు పరిక్షీణమైన ఆయుష్షుతో పరీక్షిత్తు జన్మించి చాలాకాలం పరిపాలిస్తాడని తెలిసి గర్భంలో చనిపోయి పుట్టినా ఆతడు తిరిగి ప్రాణవంతుడవుతాడని అంటూ అశ్వత్థామను ఇలా శపించాడు.

"నీ వీ మహాపాపం బుద్ధిపూర్వకంగా చేస్తున్నావు! ఏ పాపం యెరుగని పసిగుడ్డు, గర్భస్థుడైన శిశువుమీద నీ ప్రతాపం చూపు తున్నావు! ఇది నీచుడు చేసేపని. నీవు మహాపాతకమైన ఈ బ్రహ్మహత్యా ఫలితాన్ని అనుభవించు! దీనికి ఫలితంగా మూడు వేల సంవత్సరాలు ఈ భూమిమీద దిక్కులేకుండా తిరుగుతావు! తిండిలేకుండా ఆకలితో అలమటిస్తూ మలమలా మాడుతూ దేవు లాడతావు! శరీరం దుర్గంధమై చీమూ, రక్తం వోడుతూ మూడు వేల సంవత్సరాలు తిరుగు!!!.

దీనికి వ్యాసమహర్షి అందుకొని "ఎన్ని విధాల చెప్పినా నువ్వు మామాట వినిపించుకోకుండా ఈ దారుణమైన బ్రహ్మహత్య చేశావు! ఉత్తమమైన బ్రాహ్మణ కుటుంబములో జన్మించినా నీ నడత ఈ విధంగా పతనమై పోయింది. శ్రీకృష్ణుడు చెప్పినమాటలే సరియైనవి. నిశ్చయంగా అతడు చెప్పినట్లే రానున్న కాలంలో నీవు ఈ పాపాన్ని తప్పక అనుభవించు! బ్రాహ్మణుడవై చేసిన కర్మం వూరికే పోదు!"

దానికి అశ్వత్థామ తీక్షణంగా చూస్తూ!! సరే మీయిద్దరి మాటలూ నిజమే కానివ్వు కాని, తాముకూడా ఈ భూమిమీదే నాతోపాటే వుంటారు.మనుష్యుల మధ్యలో మీరూ అనుభవించండి నాతోనే" – అని వ్యాసమహర్షికి ప్రతిశాప మిచ్చాడు.

చివరికి అదే మానవజాతికి వరమయ్యింది. చిరంజీవులై వ్యాస మహర్షి కలియుగంలో మానవులమధ్యనే సంచరిస్తూ మానవజాతికి అపారమైన సేవచేస్తూ కలియుగమంతా మన మధ్యే నిలచివున్నారు.

ఇలా ఇద్దరూ రానున్న "**కలియుగాంతం**" వరకూ శాపంతో – చిరంజీవులుగా వుంటారు!





# సిద్ధచిరంజీవుడుగా - వ్యాసమహర్షి !

వ్యాసమహర్షి దివ్యచరిత్ర అన్నిపురాణాలలోనూ విశదంగా వర్ణించబడివున్నది. ముఖ్యంగా 'దేవీ భాగవతం' మొదటి స్కంధం (20 - 21వ అధ్యాయం) లోనూ ఇంకా ఇతరత్రాకూడా వ్యాసమహర్షి జన్మ, ఆయన చేసిన వేదవిభాగమూ ఇతిహాసపురాణల సృష్టి వ్రాయబడివున్నాయి. మహాభారతంలో కూడా అనేక చోట్ల వ్యాసులవారే స్వయంగా పాత్రధారియై పరమగురువుగా దైవకార్యాలను ఎలా నిర్వహించినదీ వేరే అధ్యాయాలలో గమనించాముకాని వ్యాసమహర్షి నిర్యాణంగురించి ఎక్కడా ఏ పురాణాలలోనూ వర్ణించిలేదు.

వ్యాసుని కుమారుడైన శుకయోగి బ్రహ్మజ్ఞానిగా చివరకు ఎలా తన శరీరాన్ని త్యాగంచేశాడో భాగవతంలో వర్ణించబడివున్నది కాని, వ్యాసమహర్షి శరీరత్యాగంప్రసక్తి మాత్రం ఎక్కడాలేదు ! దీనికి కారణం వ్యాసమహర్షి **చిరంజీవుడు !** **'సిద్ధ- గురుమండలి'** లోనివాడు !! పరమగురువుగా లోకపాలకవర్గంలో ప్రపంచానికి జరగబోయే **'ఆధ్యాత్మిక - భవిష్యత్తు'**ను సరిదిద్దే చిరంజీవులలో ఆయన వొకరు ! అందుకే వారి నిర్యాణం వర్ణించబడలేదు. కాని ఈవిషయం చాలామంది గమనించని గొప్ప రహస్యం. అంతేకాదు, అశ్వద్థామ బ్రహ్మాస్త్రం ప్రయోగించి ఉత్తరాగర్భంలోవున్న పరిక్షిత్తును నాశనంచేసే ప్రయత్నం

చేసినపుడు అతనికి శాపం ఇచ్చాడు వ్యాసమహర్షి. దానికి అశ్వర్థామ అలిగి వ్యాసమహర్షికి తిరిగి ప్రతి - శాపం ఇచ్చాడు. ''కలియుగాంతంవరకూ ఈభూమిమీదే తనతోపాటు చావులేకుండా వ్యాసమహర్షి కూడా నిలిచివుండాలని!''

ఇలాగ ఇద్దరూ చిరంజీవులై నిలిచివున్నారు. ఇతర చిరంజీవులు మార్కండేయ ముని, దత్తాత్రేయుడు. ఆంజనేయులవారు, అగస్త్యుడు, నారదుడు జ్ఞానేశ్వరమహారాజు రాఘవేంద్రస్వామి వంటివారు. జీవసమాధిని పొంది కొందరూ, లేకనే మరికొందరు ''చిరంజీవ''త్వాన్ని పొందివున్నారు. కాబట్టి, వ్యాసమహర్షి కలియుగాంతంవరకూ - ఏదో ప్రచ్ఛన్నమైన రూపంలో భూమిమీదేవుండే వుండాలి!

## వ్యాస - దర్శనం!

ఈ విషయం నిజమా కాదా? అని చారిత్రకదృష్టితో పరిశోధిస్తే మనకి కొన్ని ఆశ్చర్యకర విషయాలు చరిత్రలో తారసపడతాయి. అవేమిటంటే చారిత్రక పురుషులైన విద్యారణ్యస్వామి, మధ్వాచార్యులవంటి వారికి వ్యాసమహర్షి దర్శనం కలిగిందని వారిచరిత్రే తెలుపుతున్నది!

ఐతే ఏనాటి వ్యాసమహర్షి? అప్పటికే దాదాపు 3000 సంవత్సరాలక్రితంవాడు. ఆయన ఇంకా జీవించివుండటమేమిటి? ఇది ఎలా సాధ్యం? కేవలం అభూతకల్పనా? లేక కవితా కల్పనా? అని ఆలోచిస్తే - ఈ రెండూకాదు! ''అపరిమిత - ఆయుష్షును'' కలిగిన మహాత్ములు జన్మించడం సాధ్యమేనని తెలిపే జ్యోతిష శాస్త్రప్రమాణం ఒకటికూడా ఈ విషయాన్ని ధృవపరుస్తున్నది.

## జ్యోతిషశాస్త్ర ప్రమాణం:

వ్యాసమహర్షి ఆషాడపూర్ణిమనాడు జన్మించాడని మాత్రమే తెలుపబడిందికాని ఆయన జన్మించిన సమయానికివున్న గ్రహస్థితి ఏమిటో శ్రీరామచంద్రుని జాతకంలో గ్రహాలు వర్ణించినట్టుగా వర్ణించబడిలేదు!

అయినా జ్యోతిషశాస్త్ర గ్రంథమైన ''బృహజ్జాతకం'లో వరాహమిహిరాచార్యులు ఒక్కో అధ్యాయంలోనూ అనేక గ్రహయోగాలు వర్ణించాడు. జాతకంలో గ్రహాలు ఏ స్థితిలోవుంటే చక్రవర్తి అవుతాడో అటువంటి రాజయోగాలన్నీ ఒక అధ్యాయంలో ఇచ్చాడు. అలానే మనిషికి ఏగ్రహం ఎంతెంత ఆయుర్దాయం ఇస్తుందో గణితం చేసే పద్ధతిని చెప్తూ కొన్నికొన్ని జాతకాలలోమాత్రం **''అపరిమిత - ఆయుర్యోగము''**ను ఇచ్చే గ్రహస్థితులుకూడా వుంటాయని అటువంటి జాతక గ్రహస్థితులను కొన్నింటిని వర్ణించాడు. అందులో ఒక యోగంలో 7000 సంవత్సరాలకుమించి జీవించే అమితాయుర్యోగం కూడా తెలుపబడింది. మీనలగ్నంలోని - మీననవాంశను (అనిమిష పరమాంశకేవిలగ్నే) లగ్నం ఉదయిస్తూండగా మిగతా గ్రహాలు ఏయేస్థితుల్లోవుంటే అమితాయుర్యోగం కలిగినవారు జన్మిస్తారో కూడా వర్ణించబడివున్నది.

కాబట్టి వ్యాసమహర్షి జాతకంలోకూడా ఇటువంటి యోగమే వుండివుండాలి!! దీనికితోడు ''చేపనుండి'' జన్మించిన ''మత్స్య - కన్య''వంటి జ్యోతిష సూచనలద్వారా వ్యాసమహర్షి జన్మించినది మీనరాశి చివరిభాగమని సూచనగా తెలుపబడింది!

దీన్నిబట్టి చూస్తే వ్యాసమహర్షి చిరంజీవుడా? ఆయన చరిత్రలో ఎవరికి దర్శనమిచ్చాడు! అలాంటి నిదర్శనములు దాఖలాలూ ఏమైనావున్నవా? - అంటే వున్నవి!

శ్రీవిద్యారణ్యస్వామి చరిత్రలో 'సింగరిభట్టు' అనే బ్రహ్మరాక్షస భూతము సహాయంతో విద్యారణ్యస్వామికి కాశీలో వ్యాసమహర్షి దర్శనం లభించిందని తెలుస్తున్నది! అదెలా జరిగిందో ఆ విశేషాలు ఇక్కడ తెలుసుకుందాం!

మాధవాచార్యులు 'ప్రజోత్పత్తి' నామసంవత్సర కార్తీక శుద్ధ సప్తమినాడు శతభిషా నక్షత్రమున 1331 A.D. లో సన్యాసాశ్రమము స్వీకరించి శృంగేరీ శంకరపీఠమును అధిష్ఠించిరి! అప్పటినుండి ఆధ్యాత్మిక, ధర్మసింహాసనమును అలంకరించి గురుసార్వభౌముడై, మునుపు కేవలము యోగిగా, విద్యాంసుడుగానే పేరొందిన మాధవాచార్యుడు, అప్పటినుండి హిందూధర్మ సింహాసనమునకు చక్రవర్తియై ''శ్రీ విద్యారణ్యస్వామి'' అన్న సన్యాసాశ్రమ నామంతో లోక ప్రసిద్ధుడయ్యెను. నాటినుండి 1331 A.D. లగాయతు అంటే 55 సంవత్సరములపాటు శ్రీవిద్యారణ్యులు ధర్మపరిపాలన చేస్తూ అనేక అద్భుత గ్రంథములను రచించి తమ ఆధ్యాత్మిక శక్తితో అనేకులను అనుగ్రహించి తరింపచేయుటయేకాక ''హిందూరాజ్య స్థాపన'' కు బీజము నాటి ''విజయనగరం'' పట్టణమునకూ, శ్రీవిజయనగర సామ్రాజ్యము నకూ స్థాపనాచార్యుడై, మూలపురుషుడై హిందూధర్మ చరిత్రలో భారతదేశానికి ఎనలేని సేవచేసిన దివ్యపురుషుడిగా చరిత్రకెక్కినాడు! ఈ మహత్తర అసాధ్యకార్యములు సాధించుట చేతనే ఈనాడు మనం శ్రీ విద్యారణ్యస్వామిని స్మరిస్తున్నాం.

ఇలా పీఠాధిపతులై వుండి తమ యోగదృష్టితో జరుగబోయే భవిష్యత్కాలమునుకూడా దర్శించి, రాబోవు విజయనగర రాజులూ, వారి పరిపాలనాకాలములతో సహా, ఎవరెన్ని సంవత్సరాలు పరిపాలిస్తారో విజయనగర సామ్రాజ్యం సకల వైభవాలతో ఏరకంగా తులతూగుతుందో ఆ రాజ్యం, అలా ఎన్నిరోజులు నిలుస్తుందో మొదలగు యావత్ ''భవిష్యత్'' విషయాలన్నీ ''శ్రీ విద్యారణ్య కాలజ్ఞానం'' అనే గ్రంథంలో రచించి మానవాళికి అందించారు.

## కాశీయాత్ర – వ్యాసదర్శనం :

శృంగేరీ పీఠాధిపతులైన మాధవాచార్యులు 'శ్రీ విద్యారణ్యస్వామి' పేర తన సన్యాసాశ్రమ గురువులతోకలిసి దేశసంచారం చేస్తూ కాశీయాత్రచేసినట్లు చరిత్ర తెలుపుతున్నది. విజయనగర రాజుల చరిత్రలోని అనేక ఆశ్చర్యకర విషయాలను, చారిత్రకసత్యాలను ఈనాటి చరిత్ర పరిశోధకులకు అందించిన ''రాయవాచకం'' అనే గ్రంథంలో

శ్రీవిద్యారణ్యుల కాశీయాత్రను గూర్చిన అనేక అద్భుతవిషయాలు నాకులభించాయి. అందులో శ్రీవిద్యారణ్యులు హిందూ సామ్రాజ్య స్థాపకుడు అవడానికి ముందు ఆ మహత్తర ధర్మస్థాపనకు దోహదం చేసిన అనేక అధ్యాత్మిక రహస్యాలను మనకు ఏ విధంగానూ చరిత్రలో అందకుండా మరుగున పడిపోవలసిన అనేక ఆశ్చర్యంగొలిపే దివ్యానుభవాలు 'రాయవాచకం'లో నమోదుకావడం వల్లనే మనకి తెలుస్తున్నాయి. అవి ఇక్కడ వ్రాస్తాను.

''శ్రీ విద్యారణ్యులు బైల్దేరి అనేక పుణ్యక్షేత్రములను దర్శిస్తూ 'విరాటపురం' దాటి, విరాటదేశమునకు పోయి అక్కడ సమీపాన్నే వున్న అశ్వత్థ వృక్షం ముందు కూర్చొని తన వేదాధ్యయనమును వల్లెవేసుకుంటుండగా అక్కడ ఒక వేద వేదాంత పారంగతుడైన పండితుడు బ్రహ్మరాక్షసుడై చెట్టుపైనుండి దిగివచ్చి విద్యారణ్యులకు నమస్కరించి వారిఎదుట నిలచెను.''

''అంతట స్వామివారు అతడితో 'మహాపండితులై వుండికూడా 'బ్రహ్మరాక్షసులయ్యే ప్రారబ్ధం మీకెందుకు కలిగింది?' అని విచారించి, అతడు బ్రహ్మహత్యా పాతకం పోవడానికి చేసిన దానాన్ని స్వీకరించడం వల్ల ఈ విధంగా పిశాచత్వం లభించిందని చెప్పి, విద్యారణ్యులు కాశీయాత్రకు పోతారని తనకు ముందే తెలుసుననీ తనపేరు ''సింగిరి భట్టు'' అనీ, యజ్ఞములు చేసిన ''సోమయాజి'' ననీ తెలిపి, కాశీలో చండాలుని రూపంలో కుక్కలు వెంటరాగా మణికర్ణికవద్ద స్నానంచేసే సమయంలో వేదవ్యాసమహర్షిని జాగరూకతతో కనిపెట్టి పాదములపైబడి అనుగ్రహించేవరకూ పాదములు విడువకుంటేనే వారి ఆశీస్సులు లభిస్తాయనీ ఉపాయము చెప్పి, ఇంకా ఆ దర్శనం చేసి తిరిగివచ్చేటప్పుడు తనకు ఆ పుణ్యంవల్ల బ్రహ్మరాక్షసత్వంనుంచి తనకు విముక్తి కలిగేలాగ ప్రార్థించగా స్వామివారు అంగీకరించి తనయాత్రను కొనసాగించారు.

## వ్యాసదర్శనం!

కాశీచేరి విశ్వనాథుని దర్శించి అన్నపూర్ణా, విశాలాక్షి, కాలభైరవుడూ, డుంఢివిఘ్నేశ్వరులను సేవించి గంగా స్నానమునకై మణికర్ణిక వచ్చిరి. ఆసమయంలో మలినమైన, దుర్వాసన కొట్టే కల్లు కుండలతో, తోలుతిత్తిని భుజాన వుంచుకుని నాలుకు కుక్కలు వెంటరాగా

నీలం శాలువా కప్పుకుని కిర్రుచెప్పులతో స్నానానికి ఒక ఛండాలుడు వచ్చాడు. అలాటి అపవిత్రమైన రూపంతో స్నానానికి మిట్టమధ్యాహ్నం వచ్చినవారిని చూసి గుర్తించి అక్కడ రహస్యముగా దాక్కునివున్న విద్యారణ్యస్వామి పోయి వారి పాదములపై పడి వందనం చేయగా ఆయన చీదరించుకున్నారు! పాదాలు పట్టి అనుగ్రహించమని ప్రార్థించిన విద్యారణ్యులను వేదవ్యాసులవారు క్షణకాలం జ్ఞానదృష్టితో చూసి ''మీరు ఆ సింగరిబట్టు తెలుపగా మా నిజస్వరూపం కనుగొని ఇలా పట్టుకోవడం సరియైన పనియేనా? అని ప్రశ్నించగా వారి శక్తికి, దృష్టి తీవ్రతకు విద్యారణ్యులు గడ, గడ వణకసాగిరి!

అంతట విద్యారణ్యులను వ్యాసులవారు ఆశీర్వదించి అశ్వత్థవృక్షంపై నున్న సింగిరిభట్టుకు అన్నశాంతి చేసే విధానము తెలిపి, రానున్న కాలంలో కర్ణాటక దేశమున రాజ్యస్థాపన చేయగలవనీ, అప్పుడు స్థాపనచేయబడే విజయనగరం 300 సంవత్సరాలు లక్ష్మీకళను, సంపదలను కలిగివుండునని ఆశీర్వదించి కొన్ని మంత్రరహస్యాలను విద్యారణ్యులకు. అనుగ్రహించి వేదవ్యాసులవారు అదృశ్యులైరి!!

పరమానందభరితులైన విద్యారణ్యులు, వ్యాసమునీశ్వరుడు నిలచిన చోటనుండి పాదధూళిని స్వీకరించి మణికర్ణికా స్నానం చేసి అక్కడనుంచి ప్రయాగలో త్రివేణీ సంగమాన్ని సేవించి, గయా, మధుర, అయోధ్యల మీదుగా దేశసంచారముచేసి తిరిగి తుంగభద్రానదీ ప్రాంతానికి చేరుకున్నారు. దీని తర్వాత 'వ్యాసవాక్యం' - ఎలానిజమైందో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది!!!

## నగర ప్రతిష్ఠ – కాలం

విజయనగర పట్టణం 1336 A.D. లో స్థాపించబడివున్నదనీ బ్రిటిష్ చరిత్రకారుడైన జి.డంకన్ వ్రాసాడు. కాని దీనికి రూఢిగా నమ్మదగ్గ ఆధారాలు ఇవ్వలేదు. రాబర్ట్ సీవెల్ (Robert Sewell) కూడా గ్రుడ్డిగా ఇంకొక బ్రిటిష్‌వాడి తేదీనే అనుసరిస్తూ వ్రాశాడుకాని శాసనాలనుబట్టి చూస్తే, వీరువ్రాసింది నమ్మతగ్గదిగా తోచడంలేదు. ''కాసలూరు తామ్ర శాసనములు'' అన్న రాగిరేకులు 1336-37 A.D. మధ్యలో లభించిన చారిత్రకాధారాలే! ఇందులో ఈనగరం ఇంతకు పూర్వమే మొదటి హరిహరరాయల కాలంలో విద్యారణ్యస్వామి ఆదేశం

ప్రకారం విజయనగరం నిర్మాణం చేయబడిందనీ తెలుస్తున్నది.
'గురువంశ కావ్యంలో ఇవ్వబడిన ఈ క్రింది ప్రమాణంవల్ల

సగేవ్యర్త్యై ఇహశకే శాలివాహేస్స్యాయతే
ధాతర్యబ్దే శుభ సముచిత మాసే వైశాఖ నామ్నే
శుక్లపక్షే సుగుణ పిత్రుభే సూర్యవారే సులగ్నే
— సప్తమ్యాం శ్రీ విజయనగర్ నిర్మమే, నిర్మమేంద్రః ॥

— శ్రీ గురువంశం

పై శ్లోకం 'ధాత'నామ సంవత్సర వైశాఖమాస శుక్లపక్ష సప్తమీ, ఆదివారం మఖానక్షత్రంలో అనగా 18-4-1336కు సరియైన శక సంవత్సరం 1258లో విజయనగరం స్థాపన చేయబడినదనీ తెలుస్తున్నది.

కాని విజయనగర కాలంలో జరిగిన అనేక చారిత్రక సంఘటనలకు ప్రత్యక్ష సాక్ష్యమైన సమకాలీన గ్రంథం **'రాయవాచకము'** మాత్రం''శాలివాహన శకం **1127** ఏండ్లమీద వచ్చే ప్రభవనామ సంవత్సర చైత్రపౌర్ణమి స్థిరవారం రాత్రి నిశీధి సమయంలో సంకల్పాది కార్యములు పూర్తిచేసి ఆ తరువాత బహుళ పక్షంలో అమావాస్య నాడే అర్ధరాత్రి సమయంలో నగరానికి శంఖుస్థాపన జరుపబడిందనీ'' తెలుపుతున్నది. అప్పుడో చిత్రం జరిగింది!

## వాస్తుపూజ – మంత్రదీక్ష

శ్రీవిద్యారణ్యస్వాములవారు స్వయంగా మహాసంకల్పంచేసి, వాస్తుపురుషుని ఆవాహనచేసి, ఉత్తర, దక్షిణాల ఏర్పాటుకు ధృవనక్షత్రాన్ని చూసి దిక్సాధన చేసి త్రిశంకువును ప్రతిష్టించి తూర్పు - పడమర దిక్కులను శంకువులు ఏర్పాటు చేసి నవరత్నములను 16 కళల కుందనపు బంగారమును (కొన్ని మణుగులు) నగరం పునాదిలో కరిగిపోయించి దానిపై 'శ్రీసామ్రాజ్యలక్ష్మి యంత్రం' స్థాపించి ఆ స్థంభమునకు అభిముఖంగా జలాశయం త్రవ్వి అక్కడ శిష్యులను లగ్నం తప్పకుండా సరియైన సమయానికి పునాది వేసే ఖచ్చితమైన కాలాన్ని తాను సంకేతంతో సూచిస్తాననీ, దానికై శంఖాన్నీ, ఘంటానాదమును తాను చేయగా హరిహరరాయలునూ, బుక్కరాయలునూ పునాదిరాయినీ అదే సెకండులో స్థాపన చేయవలెననీ కట్టడిచేసి తాను కొండశిఖరానికివెళ్ళి ఆకాశంవైపు చూచి శుభముహూర్తానికై శీర్ష నక్షత్రమును గణించుచూ

అనుష్ఠానంలో నిలిచివుండిరి.

సరియైన సంకేతమునకు ఆలస్యం లేకుండా పునాది రాయి పునాదిలో పడుటకుగాను చివర సన్ననిదారముతో పునాది ఇటుకనూ, దానిపై వాస్తు యంత్రమును, పాదరసము, నవరాత్నాలు కట్టి సరియైన ముహూర్తమునకు ఆ ఘంటమ్రోగగానే ఒక కత్తెరతో ఆ దారము కత్తిరించే సమయమునకు ఆ పునాదిరాయి జరుగగలందులకు అతిసూక్ష్మమైన కాలముహూర్తం తప్పకుండా ఏర్పాటుచేసి హెచ్చరికచేసిరి. శ్రీవిద్యారణ్యస్వామి తాను అఖండ జ్యోతిషపాండిత్యముతో శ్రమించి అపూర్వమైన శుభముహూర్తమును 3,600 సంవత్సరములపాటు నగరము, సామ్రాజ్యమూ చెక్కు చెదరకుండా నిలచివుండే శుభముహూర్తాన్ని గణితంచేసి సిద్ధంగా పెట్టుకుని ఆ సమయానికి ఆలస్యం లేకుండా పునాదిరాయి పడుటకు పై చెప్పిన ఏర్పాట్లు చేసి తపస్సులో కూర్చుండిరి.

''ప్రారబ్దవశాత్తు అదేకొండ క్రిందిభాగంలో ఒక కాపాలికుడు అర్ధరాత్రి శివపూజను చేసి హారతి నిస్తూ శంఖం పూరించి, గంట వాయించాడు.'' అదే ముహూర్తమని భావించి హరిహరరాయలు హుటాహుటీ దారమును కత్తిరించగా పునాదిరాయి యధాస్థానంలో పడింది. ముహూర్తం సఫలమైనందుకు ఆనందిస్తూండగా మళ్ళీ కొంతసేపటికి ఇంకో ఘంటానాదం, శంఖధ్వనీ కొండపై నుండి శ్రీవిద్యారణ్యులు చేసింది విని, కంగారుగా పరుగు, పరుగున వెళ్ళి శ్రీవారికి రెండు శంఖారావములు గురించి అడిగినందున వారు జ్ఞానదృష్టితో చూసి లగ్నముహూర్తం తప్పింది, ముందుగానే పునాది వేశారనీ ఆశాభంగంతో విలపించినారు.

## వ్యాస - వాక్యం తప్పదు !

''అయ్యో ఎంతో తపస్సుతో సాధించిన కలియుగం చివరవరకూ నిలిచే హిందూసామ్రాజ్య ముహూర్తం వ్యర్థమయ్యేనుకదా ! అని విచారించి, ''కాశీలో వ్యాసులవారు తెలిపిన మాటలు నిజమైనది'' - అని లగ్నం తప్పిన ఆ ముహూర్తాన్ని గణితంచేసి 260 సంవత్సరాలవరకూ ఈ నగర ఆయుర్దాయం వుండుననీ తరువాత ముహూర్త దోషంవల్ల శత్రువులచే ధ్వంసం గావించబడునని, తమ దివ్యదృష్టితో జరుగబోయే భవిష్యత్తు తెలిపి కాలపురుషని విచిత్రలీలకు ఆశ్చర్యపడి దైవసంకల్పానికి తలవంచిరి.

''శ్రీవిద్యారణ్య కాలజ్ఞానం'' లో వ్యాసులవారినుండి ఆనాటినుండి ముందు రాగల విజయనగర పరిపాలకులైన రాజులపేర్లు తెలిసినది వివరించి ఎవరు ఎన్ని సంవత్సరాలు పాలిస్తారో ఆ భవిష్యత్తు వివరంగా వ్రాసిపెట్టినారు. ఈ గ్రంథం నేటికినీ వ్రాతప్రతిగా లభిస్తున్నది.





# మధ్వాచార్యులకు - శ్రీ వేదవ్యాస దర్శనం!

శ్రీవేదవ్యాస మహర్షి సిద్ధత్వంపొంది 'చిరంజీవుల' - పరమ **గురుమండలిలో** గురుస్థానం వహించి ''కలియుగాంతం'' దాకా జీవించి ఉండి అనేకమంది మహాపురుషులకు తన దివ్యదర్శనం ప్రసాదించిన నిదర్శనాలలో ఒకటి శ్రీవిద్యారణ్యస్వామికి ఎలా దర్శనమిచ్చిందీ గమనించాము. అంతేగాక 'ఇది కథకాదు - నిజం' అని తెలిపే చారిత్రక ఆధారాలలో మూలమైనదీ, శ్రీకృష్ణదేవరాయల నిత్య దినచర్యను మనకి ''డైరీ''(Diary)లాగ వర్ణించే ''రాయవాచకమే'' స్వయంగా సాక్ష్యాధారాలతో 'వ్యాసదర్శనం'' సింగరిభట్టు మూలంగా కాశీలో శ్రీవిద్యారణ్యులకు అనుగ్రహం యిచ్చిన వైనంకూడా గమనించాము! ఇలా ఈ కలియుగం మధ్యలో ఇంకెవరికైనా వ్యాసులవారు దర్శనమిచ్చారా? అలా యిచ్చివుంటే అది ఇంకొక గట్టి సాక్ష్యాధారమూ, చారిత్రకంగా గొప్ప ఋజువూ కూడా అవుతుంది! అని చూస్తే అలాంటి సందర్భం ఒకటి వున్నది!

ద్వైతమత స్థాపనాచార్యులైన శ్రీమధ్వాచార్యులవారు తమ

జీవితకాలంలో స్వయంగా తామే బదరీవెళ్ళి అక్కడ వ్యాసులవారి దర్శనం ఎలాచేసుకున్నదీ తెలిపే అద్భుతానుభవం ఆయనజీవిత చరిత్రలో మనకి లభిస్తోంది. అదేమిటో ఇక్కడ గమనిద్దాం.

మధ్వాచార్యులవారి జీవితచరిత్ర సంస్కృతం లో 'శ్రీ నారాయణ పండితుడు' "శ్రీసుమధ్వ విజయం" అన్న పేరుతో పదహారు సర్గల కావ్యముగా రచించాడు. దానిలో శ్రీపూర్ణప్రజ్ఞులైన మధ్వాచార్యుల వారు స్వయంగా బదరీయాత్రచేసి హిమాలయాలను దర్శించిన సందర్భంగా వ్యాసదర్శనం చేసిన ఘట్టం విపులంగా అందులోని, ఆరు-ఏడు (6,7) సర్గలలో వర్ణించాడు. దాన్ని తెలుగులోకి ఆదోని వెంకోబరావు స్థూలానువాదం చేసిన దానిలో చూడవచ్చు. ఇది అందరికీ సులభంగా లభించక పోవచ్చునని అందులో ఉన్న సంబంధిత శ్లోకాల్ని, వెంకోబరావువ్రాసిన అనువాదాన్ని (భావానువాదం) ఈ క్రింద ఛాయగా ఉదహరిస్తున్నాను. శ్రీమధ్వాచార్యుల అద్భుతానుభవాన్ని వివరంగా తెలుపుతాను.

## శ్రీమధ్వ చరిత్రలో - 'వేద వ్యాసదర్శనం'!

మధ్వాచార్యులు ముగ్గురు ఆచార్యులలో కడపటివాడు. ద్వైత మతపరంగా 'బ్రహ్మ-సూత్రము'లకు, భగవద్గీతకూ వ్యాఖ్యానము చేసినవాడు. ఆయన తీర్థయాత్రలు చేస్తూ దైవప్రేరణ వల్ల బదరీనాథ్ యాత్రకు వెళ్ళవలెనని స్వల్పం కలిగింది. అప్పుడు బదరీవెళ్లి నారాయణుని దర్శించి, బదరీనాథ్ ఆలయములో భగవద్గీతా వ్యాఖ్యానము, ప్రవచనం చేశారు. అక్కడ వారికి దైవప్రేరణగా నారాయణుని ఆదేశమువలే "ఉచ్యతాం" - అన్న శబ్దం వినిపించింది.

ఏకాగ్ర మనస్సుతో దాన్నివిని, తమ ద్వైతపరమైన గీతా వ్యాఖ్యానము చేసారు. ఆ తరువాత గంగానదిలో మంచువలె చల్లటి నీటియందు స్నానముచేసి, ఆలయంలో కూర్చుని నారాయణుని

ధ్యానిస్తూ మౌనంగా ఉపవాసనిష్ఠతో వుండగా ఆ సమయములో వ్యాసమహర్షి ఇతరులు గుర్తుపట్టలేని ప్రచ్ఛన్న రూపముతో బదరీనాథ్ ఆలయమునకు వచ్చి కొన్ని రోజులుగా వ్యాస దర్శనమునకై ఏకనిష్ఠతో ధ్యానం చేస్తూఉన్న మధ్వాచార్యుల వారిని చూశారు. కానీ, ఆచార్యులు ఆ ధ్యాననిష్ఠలో అప్పుడు వ్యాసులవారిని చూడలేదు. అప్పుడు వ్యాసులవారు తమ సంకల్పముతో మధ్వాచార్యులను తమ వ్యాసాశ్రమము నకు రమ్మని సంకల్పించి అదృశ్యులైపోయిరి.

తమ మౌన దీక్షను వీడక ఉదయమే మధ్వాచార్యులు ఒక చీటీపైన తాము వ్యాసాశ్రమమునకు పోవుచున్నామని శిష్యులకు వ్రాసి పంపిరి. ''నేను శ్రీమన్నారాయణావతారుడైన వ్యాసుల వారి దర్శనమునకు వెళ్ళుచున్నాను. నేను తిరిగి వస్తానో లేదో తెలియదు. ఆ సంగతి వ్యాసులవారికే తెలియును. మీకు క్షేమమగు గాక'' అని వ్రాసి శిష్యులకు తెలుపకయే బయలుదేరి ప్రయాణమై పోయెను.

ఇలాగ ఎవరికీ తెలియకుండా మధ్యాచార్యులవారు బయలుదేరి వెళ్ళినా, సత్యతీర్ధ యతీంద్రులు, మహీదాసు అనే ఇద్దరు శిష్యులు మాత్రం గురువును వెన్నాడి అనుసరించారు. మధ్వాచార్యులు మౌనంగా యోగదృష్టితో అతివేగంగా నడుస్తూ ఒక్కొక్క బండరాతిపై నుంచి అనాయాసంగా దాటుకుంటూ వెళ్ళసాగారు. వారిని కలుసుకోలేని శిష్యులు ప్రయాసపడుతూ వెంబడిస్తూంటే మధ్వాచార్యులు వెనక్కి తిరిగి చూచి, వెంబడిస్తున్న సత్యతీర్థ మహీదాసులను, మీరు వెనక్కి వెళ్ళండి. నావెంట రారాదు. అని చేతితో సైగలు చేసారు. ఆశ్చర్యం! రోజంతా వాళ్ళు కష్టపడి సాయంత్రం దాకా ప్రయాణం చేసిన ఆ మార్గమంతా రెండు గంటల్లోనే తిరుగుప్రయాణం చేయగలిగి ఇంటికి చేరారు! ఆశ్రమంలోని ఇతర శిష్యులకు మధ్వాచార్యులు ఆశ్చర్యంగా బండశిలలపై దాటుకుంటూ ఎలా వెళ్ళిందీ, తిరుగు ప్రయాణంలో వెనువెంటనే తాము వెనక్కి రాగలగటం ఆశ్చర్యంతో చెప్పారు.

మధ్వాచార్యులు శ్వాసను బంధించి యోగబలంతో బండశిలలు దాటుకుంటూ బదరికి ఉత్తరముగా హిమవత్పర్వతాలను బట్టి ప్రయాణంచారు. అలా పోయి పోయి ఉత్తర బదరీకాశ్రమం (ఉత్తరకాశిని) దాటి ప్రయాణించి, ఒక దట్టమైన రేగుపండ్ల చెట్లతో ఉన్న వనం చూసారు. అక్కడక్కడ నిరాహారులై, యోగంలో ఉన్న మునులనూ, సాధువులనూ చూసి ఆశ్చర్యపోయారు. ఇలా ముందుకు సాగి అకస్మాత్తుగా ఎదుట ముదురు ఆకుపచ్చ ఆకులతో గొడుగువలే దట్టంగా పెరిగిన పెద్ద మహా వృక్షాన్ని, పడగ విప్పిన పామువలె ఉన్న దాని ఆకారం చూసి ఆశ్చర్యపడి, సూర్యకిరణాలు చొరబడకుండా ఉన్న మహావృక్షాన్ని మధ్వాచార్యులు చూశారు.

అధతస్య వేదికాంతరే
సువిశాలే విమలే మనోహరే
అవలోకిత దావనంతధీ
ర్దివి దేవానివ తాపసోత్తమానే.

7-14

ఆ విశాలమైన వేదికపైన మనోహరమైన తేజోమూర్తులైన మునులను దర్శించెను. వారు దేవతలలాగ ప్రకాశముతో నుండిరి.

" అతి చిత్ర విచిత్ర పత్రిణం
బహు వర్ణం హరిగో నివారకం!
మునినందన మిందిరాపతే
రధికేష్టం పతతా మివాధిపమ్!! "

**మహామునుల మండలి :**

దాని క్రింద శుద్ధమైన అరుగుమీద కూర్చొని ఉన్న ఋషుల గుంపును చూసి వారి మధ్యనే దివ్య తేజస్సుతో ప్రకాశిస్తున్న వ్యాసుల వారిని మహాశ్చర్యంతో చూసెను. మరుక్షణమే సూర్యునివలె ప్రకాశిస్తున్న వ్యాసమహర్షి పాదాలపైపడి సాష్టాంగ నమస్కారం చేసాడు మధ్వాచార్యులు.

నల్ల కలువల వంటి నిగనిగలాడే శరీరంతో సుందరమైన తామర రేకులవంటి నేత్రములతో కృష్ణాజినంపై కూర్చొనివున్న వ్యాసమునీంద్రులు బంగారు జరీవంటి తళ తళ మెరిసే జడలు, గడ్డము, మీసములతో మహాపురుష లక్షణములు కల్గిన యోగిపుంగవుని, సూర్యునివలె కాంతితో ప్రకాశిస్తున్న వారిని దర్శించాడు.

మునిమండల మధ్యవర్తినం
త్రిజగన్మండల మండనాయితం
ఇహ సత్యవతీ సుతం హరిం
పరిపూర్ణప్రమతిః స్వమైక్షత.

—7. సర్గ- 16.

ఆముని మండల మధ్యన వారికంటే తేజోమూర్తియై మూడులోకాలనూ తేజస్సుతోవైన వెలిగించు సత్యవతీ సుతులైన సాక్షాత్ విష్ణు వేదవ్యాసులను నిండు మనస్సుతో చూశారు (శ్రీ మధ్వాచార్యులు) - 7. వసర్గ - 16శో

ఇలా ఆ అద్భుతమూర్తిని వర్ణించే ఘట్టం "మధ్వ విజయం" సప్తమ సర్గలో 30-40 శ్లోకాలలో వర్ణించారు.

వ్యాసుల ఆశీస్సులను, అనుగ్రహమును పొంది కొన్ని రహస్య విషయములు తెలుసుకొని, వారితో ఏకాంతమైన అరణ్య ప్రదేశంలో గడిపారు. శ్రీవ్యాసుల ఉపదేశమును పొంది అక్కడికి ఉత్తర దిక్కుగావున్న నారాయణాశ్రమాన్ని దర్శించి, అక్కడ నారాయణఋషిని కూడా దుష్కరమైన సిద్ధరూపంలో దర్శించాడు.

ధర్ముని కుమారులుగా నరనారాయణులు అవతరించిన ఋషీశ్వరులు. త్రిగుణములకూ అతీతమైన సిద్ధశరీరంలో వున్న వారిని దర్శించారు. శంబల - గ్రామం: అక్కడే రానున్న కల్కి అవతారస్థలమైన "శంబల" గ్రామము అనబడే సిద్ధక్షేత్రాన్ని దర్శించి, విష్ణుయశస్సు అను పేరుగల యోగిపుంగవుడు తపస్సు చేస్తూవుంటే వారి దర్శనం

చేసుకున్నాడు. (ఈయన ' కల్కి భగవానుని ' తండ్రిగా ' కలియుగాంతం 'లో అవతారంగా వస్తారు). ఆ అద్భుతవిషయాన్ని '' మధ్వ విజయం '' స్పష్టంగా తెలిపిన ఈ క్రింది శ్లోకం విశేషమైనది.

'' మహిదాసపూజ్య చరణో ద్విజాదభూత్
విదితాత్స విష్ణు యశస్కో మతాత్మనః!
ఇహ యోదదేజగతి పాపశాంతయే
బహుధామ హేతిమతి దీప్తగోష్ఠితిమ్!!
8-35. - (గూఢార్థము)

ఈ విధంగా సిద్ధగురువైన వ్యాసమహర్షిని ప్రత్యక్షంగా దర్శించిన మధ్వాచార్యులవారి అనుభవం, ఆశ్చర్యం గొలిపే అద్భుత దివ్యానుభూతి. ఆదిశంకరులకు కూడా వ్యాసులు దర్శనం ఇచ్చి, వారి ఆశీస్సులతో అల్పాయుష్కులైన శంకరుల ఆయుష్షును వృద్ధి చేసారు. అలాగే గోదావరి జిల్లాలోని '' **ద్రాక్షారామం** '' వద్ద వ్యాసులవారు, అగస్త్యమునితో కలిసిన సన్నివేశాన్ని చూపే శిల్పం, ఇప్పటికీ ఆలయం గోడపైన చూడవచ్చు. ఇప్పటికీ వ్యాసమహర్షి సిద్ధగురువులతో కలిసి, శంబల సిద్ధక్షేత్రము వద్ద ' **కలియుగాంతం** ' కోసం ' పరమగురుమండలి ' చేసే ఒక రహస్య ఆధ్యాత్మిక ధ్యానప్రక్రియ — నేటికీకూడా వైశాఖపూర్ణిమనాడు జరుగుతు ంది. దాన్ని రష్యన్ సిద్ధురాలు ' **మేడమ్ బ్లావెట్స్కీ** ' స్వయంగా దర్శించి వర్ణించింది. ఈ అద్భుత సన్నివేశం ' మహామునుల యోగమండలి ' గురించి తెలిపే అధ్యాయంలో వివరిస్తాను.





# దివ్యదృష్టితో భవిష్యత్కాలజ్ఞానము!

## ప్రపంచ భవిష్యతు :-

జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు, తన భవిష్యత్తు ఎలా ఉంటుందో తెలుసుకోవాలని ఆశపడనివాడు వుండడు. జీవితం ఒకప్పుడు సుఖంగానూ, దిగ్విజయంగానూ, నడుస్తూ మరొకప్పుడు కష్టాలు, సమస్యలే ఎదురుకావడం అనేది అందరికీ అనుభవమే. ఇలా కష్టాలు దాపురించినపుడూ, సమస్యలు ఎదురైనప్పుడు మనభవిష్యత్తు ఎలా ఉంటుందో తెలుసుకోవాలని మన మనస్సు సహజంగానే ఉబలాట పడుతుంది.'

ఇలాంటి పరిస్థితే దేశం విషయంలోనూ కలుగవచ్చు. "మనభారతదేశం భవిష్యత్తు ఎలా వుంటుంది?" మన స్వాతంత్ర్యం సుస్థిరంగా ఉంటుందా? లేక పరదేశాలు దురాక్రమణలవల్లా. ఇతరుల కాలిక్రింద బానిసతనం గతంలోలాగ మనకేదైన వ్రాసిపెట్టిఉందా? గతంలో జరిగినట్టే వుంటుందా? అన్న మానవుని సందేహాలకు సమాధానంగా, వ్యాసమహర్షి దర్శించిన 'భవిష్యత్తును' అధ్యయనం చేసిన శుకయోగి, ముందు జరుగబోయే భావికాల గతులనూ, అందులో దేశంయొక్క భవిష్యత్తును కూడా తన దివ్యదృష్టితో దర్శించి, రానున్న సంఘటనలన్నీ వివరంగా కళ్ళకు కట్టినట్టు వర్ణించాడు. ఈ విషయం ఈనాడు 'బమ్మెరపోతన రచించిన ఆంధ్ర భాగవతంలోని ద్వాదశస్కంధంలో చదివినా అది అంతా మన కళ్ళకు కట్టినట్టు స్పష్టంగా కనపడుతుంది.'

## భాగవతంలో మనదేశం భవిష్యత్తు :-

ఈ ద్వాదశ స్కంధంలో మనదేశం చరిత్ర అంతా మొదటినుంచి చివరిదాకా వర్ణించబడి వుంది. రాజుల పేర్లూ, వారివారి వంశాలతోసహా ఇంకా ఎవరు ఈ దేశాన్ని ఎంతకాలం పరిపాలిస్తారో, అంతకూడా మనం ఈ భాగవత పురాణంలో కూడా చూడవచ్చు.

భవిష్యపురాణంలోని విషయాలే సంక్షేపంగా భాగవతంలో శుకయోగి చెప్పిన ద్వాదశస్కంధంలోనూ వ్రాయబడినవి.

రానున్నకాలపు ప్రజలకోసం, దేశభవిష్యత్తును అన్నివివరాలతో సహా ఈ భవిష్యత్ పురాణం స్పష్టం చేస్తుంది. ఈ భవిష్యత్పురాణ గ్రంథం బ్రిటీష్‌వారి ఈస్టిండియా కంపెనీ (East India Company) పరిపాలనలోనే ముద్రించబడింది. ఇందులో వ్రాయబడిన అనేక విషయాలు ఇది ముద్రింపబడిన తర్వాత మన దేశచరిత్రలో జరిగాయి.

## దేశ భవిష్యత్తును దర్శించడం సాధ్యమా? :-

ఒక మనిషియొక్క భవిష్యత్తును జాతకంచూసి చెప్పవచ్చు. కాని, దేశభవిష్యత్తును చెప్పటం ఎలా సాధ్యం? అని మనలో చాలామందికి ఆశ్చర్యంకూడా కలగవచ్చును! నిజమే. ఇదిమనకు అసాధ్యంగా కనపడవచ్చు.

కాని మానవచరిత్రలో పూర్వం అనేకమంది మహర్షులు, ద్రష్టలూ ప్రవక్తలు, మనుషులయొక్క, దేశంయొక్క భవిష్యత్తును ముందుగా చెప్పడం, ఆ తర్వాత చెప్పినవి చెప్పినట్టుగా జరగడం ఈనాటి ఆధునిక కాలంలో కూడా మనం అనుభవంలో గ్రహించగలిగిన నగ్నసత్యం.

"కీరో"(Cheiro) అన్న పేరుతో ఒక ఇంగ్లీషు జ్యోతిష్కుడు అనేకమంది వ్యక్తుల భవిష్యత్తునూ, 'ప్రపంచ భవిష్యత్తునూ,' చెప్పి ప్రపంచాన్ని ఉఱ్ఱూతలూగించాడు. ఈయనొక ప్రపంచ ప్రఖ్యాత జ్యోతిష్కుడు అయినాడు. ఒకసారి 'బోల్షివిక్' విప్లవం రష్యాలో ఇంగా రాక ముందే 'జారు' చక్రవర్తి తన భవనం (Winter Palace)లో తన జాతకాన్ని ఈ 'కీరో' ద్వారా తెలుసుకున్నాడు. అప్పుడు 'కీరో' ముందే చెప్పిన రష్యన్ విప్లవం, అందులో జరిగిన రక్తపాతం 'జారు' వంశస్థుల పరిపాలన అంతం కావటం ఇవన్నీకూడా 'కీరో' ముందుగానే చెప్పిన సంగతి ఆనాటి వార్తా పత్రికలు చూచిన వారందరికీ తెలుస్తుంది

ఇంకోసంగతి. బ్రిటిష్ ప్రభుత్వంలో సర్వసేనానిగా పనిచేసిన 'లార్డ్‌కిచ్‌నర్' (Lord Kitchner) సముద్రంలో మునిగి మరణించే 'జలగండం' వున్నదన్నసంగతి ఆయనకు కొన్నేళ్లుముందే చెప్పటం, బెల్జియం రాజైన లియోపాల్డు చక్రవర్తి (King Leopold) రాజ్యభ్రష్టత, దేశ బహిష్కారం ఈయన వ్రాసినట్టే జరగడం, విక్టోరియా, మహారాణిమరణం, పర్షియాదేశపు 'షా'(Shah)పైనా, నరాన్‌దేశపు

రాజులపై జరిగిన హత్యా ప్రయత్నాలు, ఇంకా గాంధీ మహాత్ముని 'సహాయ నిరాకరణోద్యమమూ' (Non Cooperation Movement) భారతదేశ స్వాతంత్ర్యమూ, ఇలాంటివన్నీకూడా ఎన్నో సంవత్సరాలకు ముందే 'కీరో' ప్రపంచమంతా ఆశ్చర్యపోయేలాగ, ముందుగానే తన రచనలద్వారా ప్రకటించాడు. ఇవి గ్రంథాలలో చూడవచ్చు.

ఒకరోజున లండనులో ఒక క్లబ్బులో వాతావరణం మంచి హుషారుగా వుంది. అందరూ డిన్నరు చేసినతర్వాత సర్దాగ కబుర్లు చెప్పుకుంటున్నారు. ఎవరికో ఒక చురుకైన ఆలోచన కలిగింది. అందరికీ గొప్ప వినోదం, ఆశ్చర్యం కలిగించే ఒక 'ప్రోగ్రాం' ఏదైనా ఏర్పాటుచేస్తే క్లబ్బుమెంబర్లందరికీ హుషారుగా వుంటుందని; ఏంచేస్తే బాగుంటుందా అంటే చప్పున ఎవరో 'కీరో' కి చక్కటిపోటీపెట్టిస్తే బాగుంటుందన్నారు. సరే, ఆయనకో గట్టి 'విషమపరీక్ష' కూడా పెట్టినట్టూ వుంటుంది, అందరికీ వినోదంతోపాటు "జ్యోతిషం" నిజమా! మోసమా కూడా ఒకే దెబ్బతో తేలిపోతుంది, అసలురంగు-అని అందరూ ఉత్సాహంతో సరేనన్నారు! కాని ఆయన వస్తారా, ఇలాంటి పరీక్షకి? అన్నదే సందేహం. ఎవరో ఆయనను బాగా ఎరిగిన ఒక 'సొసైటీ' సభ్యురాలిద్వారా 'కీరో'ను ఆహ్వానించితే బాగుంటుందని సూచించారు. అంతే.

ఆమె ఫోను చెయ్యగానే 'కీరో' సుముఖతగా కనపడలేదు. క్లబ్బుల్లో అక్కడా చౌకగా ప్రదర్శించే 'మ్యాజిక్ (Magic)' వంటిదికాదు జ్యోతిషం' అని ఆయన అభిప్రాయం వెలిబుచ్చాడు. అందులోనూ హిమాలయ పర్వతాలలోని యోగులవద్ద తాను నేర్చుకున్న ఈపవిత్ర విద్యను, హేళనగా నవ్వే ఈక్లబ్బు వినోదాలమధ్య అసభ్యంగా ప్రదర్శించడమా! బజార్లో అందరికీ పెట్టేదికాదు. వ్యక్తిగతంగా మా క్లబ్బుకు తెలిసిన, అదీ గౌరవనీయులైన పెద్దలకే 'ఇందు' తన జవాబుదారీమీద ఏర్పాట్లు అన్నీ గౌరవంగా, మర్యాదలతో ఏర్పాటు

చేస్తాన్నమీదట 'కీరో' అంగీకరించాడు.

సాయంత్రం సరిగ్గా నియమించిన టైముకి 'ఆపాయంట్ మెంటు' ప్రకారం 'నల్లనికారు' 'కీరో'నూ వారి స్నేహితురాలితో తీసుకుని వచ్చి క్లబ్బుముందు ఆగింది.

కారులోంచి హుందాగా ఆజానుబాహుడైన వ్యక్తి నల్లసూటూ, పెద్దాధికార్లు ధరించే టోపీతో 'కీరో' కార్లోనుంచి దిగారు తన సెక్రెటరీతో, క్షణకాలం క్లబ్బుఅంతా కలకలం సద్దుమణిగింది. ఒక పెద్ద 'కరెంటు' షాకు తిన్నట్టు అందరూ కళ్ళు 'కీరో'మీదనే నిలిపి పేర్ల పరిచయాలు షేక్‌హ్యాండ్లూ, అన్నీ అయినాక డిన్నరు జరిగింది. అయినతర్వాత అతిథుల్లో ఒక పెద్దమనిషి వినయంగా 'కీరో'ను తమ శక్తిని ప్రదర్శించమని కోరటమూ, ఆయన అంగీకరించటమూ జరిగిపోయాయి.

జ్యోతిషం చెప్పే వ్యక్తిని 'కీరో' చూడరాదు! ఒక నల్లటితెర కట్టి-ఆతెరకు అవలిపైపున కుర్చీ ఆ వ్యక్తికీ, తెరకు ఈవతలగా 'కీరో'కు కుర్చీవేశారు. ఆయన చేతిని రేఖలుచూసి 'కీరో' ఏంచెబుతాడో అదీ పరీక్ష.

అందరూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు. 'కీరో' లేచి నిలబడి తన కుర్చీలో కూర్చుని అరక్షణంసేపు మౌనంలో మునిగిపోయాడు. ఇంతలో నల్లని తెరలోంచి చేతిని ముందుకుచాచి టేబులుమీద పెట్టాడు తెల్లగా నాజూకుగా గులాబిరంగు అరచేతినీ, పొడుగాటివేళ్ళూ చూస్తే స్త్రీయేమో ననిపించింది అందరికీ. 'కీరో' ఒక నిమిషం చేతిని పరికించి రేఖలూ, వేళ్ళ గోళ్ళూ చూచి, రెండవ చేతిని కూడా చూపగలరా! అనటం తడవుగా తెర వెనుకనుంచి రెండవ హస్తం చాచి టేబులుమీద పెట్టబడింది శబ్దంకూడ చెయ్యకుండా. ఎందుకంటే కంఠస్వరంవిన్నా గుట్టు తెలుస్తుందేమోనని! వెంటనే 'కీరో' తన టోపీ తలపెనుంచి తీసేస్తూ గౌరవంగా నిలబడి "యువర్

మెజస్టీ" (Your Majesty) అని మహారాజుకుచేసే సెల్యూట్ చేశాడు!

అందరూ ఒకరిమొహాలు ఒకరుచూసుకున్నారు. ఈ వింత ఏమిటో? అని ఈ చేతిని, రేఖలను ఈ టైమూ అన్నీచూస్తే ఈ రెండుచేతులూ మరెవరివీ అయివుండటం అసాధ్యం. అని ఈదేశం పరిపాలించగల మహారాజువేగాని యితరు డెవ్వరిచేతిలో ఈ రేఖలుండవు. నాకు తెలిసిన శాస్త్రం అబద్ధం చెప్పదు. అని ఎవరికీ తెలియదు అవతల వ్యక్తి ఎవరో?

ఇంతలో నల్లటి తెరను తీసేస్తూ అందమైన తనచేయిచాచి 'తేంక్యూ' (Thank You) అంటూ బ్రిటీషు రాకుమారుడు, కానున్న చక్రవర్తి అయిన ఎనిమిదవ ఎడ్వర్డు ప్రభువు బైటికివచ్చి 'కీరో' ప్రతిభను ఎంతో పొగడినవార్త వెంటనే వార్తాపత్రికలలో అంటుకుంది. ఎలా చెప్పగలిగారు? అని అందరూ ఆశ్చర్యపోతూవుంటే, 'కీరో' ఇంకాకూడా చెప్పవచ్చు మీచేతినుంచి. తమరు ఈ దేశం చక్రవర్తి కాబోతున్నవార్త అంతా తెలిసినదేగదా! కాని మీ చేతిరేఖలనుబట్టి మీరీ దేశానికి రాజు అవలేరనీ, దేశంవిడిచి విదేశంలో జీవితశేషం గడపవలసిన 'భవిష్యత్తు' వ్రాసివున్నది మీ జాతకంలో. అదెలా? అసాధ్యం అనుకున్నారు అందరూ.

కొద్దినెలలకే ఎనిమిదవ ఎడ్వర్డు ప్రభువు రాజ్య పరిత్యాగం (Abdicate) చెయ్యటం, ఆయన తమ్ముడు ఆరవజార్జి ఇంగ్లండుకు చక్రవర్తి కావటంతోబాటు ఎడ్వర్డు ప్రభువు అమెరికాలో స్థిరపడి యావజ్జీవం స్వదేశం రాలేడన్నవార్త ప్రపంచాన్ని కదిలించి వేసింది. కొద్దికాలం కింద అమెరికాలో ఆయన మరణించాడు. భవిష్యత్తును 'రో' దర్శించిన అనేక సంఘటనలలో ఇది చిన్న మచ్చుతునక మాత్రమే.

## భారతదేశ స్వాతంత్ర్యం :-

ఏనాడో అంటే 1923 వ సంవత్సరములోనే -- మన దేశానికి స్వాతంత్ర్యం వస్తుందని ఎవరికీ ఊహలోకూడా నమ్మకంలేని కాలంలో, ఆనాడే కీరో తన "ప్రపంచ భవిష్యత్తు" అనే గ్రంథంలో (Cheiro's World Predictions) మన స్వాతంత్ర్యం గురించి ఇలా వ్రాశారు.

* "If this, then, is the "Voice of Heavens", how can a England hope to hold India, a country that, in the events that are coming will respond more to Aquarian influence than, perhaps any other. No England with all her power might just as well tell the Sea to go back or the Moon to stand still, than to attempt to stem planetery forces that, for the time being are arrayed against her. "

"గ్రహస్థితులు సర్వవిధాలా ఇంగ్లండుకు ప్రతికూలంగా ఉన్న ఇటువంటి కాలంలో భారతదేశాన్ని తనచేతిక్రింద ఉంచుకోవాలని బ్రిటను ప్రయత్నం చేయడం కేవలం భ్రమ. భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చి తీరుతుందనేది రూఢిఅయిన విషయం. బ్రిటను దీనిని ఆపుచేయాలని ప్రయత్నించడం సముద్రపు అలల్ని వెనక్కి పొమ్మని కోరటంవంటిది. ముందుగానే స్నేహభావంతో, బుద్ధి పూర్వకముగా భారతదేశానికి స్వాతంత్ర్యం ఇచ్చినట్లయితే కనీసం ఆదేశపు సుహృద్భావం మనకు దక్కుతుంది."

-- కీరో ప్రపంచ "భవిష్యత్తు"

## పాకిస్థాన్ విభజన :

ఇంతేకాదు; మనదేశానికి స్వాతంత్ర్యం రాగలదని రూఢిగా చెప్పడమే కాకుండా ప్రఖ్యాత బ్రిటీషు జ్యోతిష్కుడైన ఈ కీరో

ఇండియా పాకిస్థాన్‌ల రూపంలో మన దేశవిభజన జరగడం కూడా తథ్యమని ఆయన తన ప్రపంచ భవిష్యత్తు అన్నగ్రంథంలో నిస్సంశయంగా చెప్పినమాటలే అందుకు తార్కాణము.

"భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతకాలంలో హిందువులూ, ముస్లిములూ, కలిసిమెలసి ఐకమత్యంగా దేశాన్ని పరిపాలించుకుం టారనేమాట కల్ల. అది అసంభవం. అసలు జరగబోయేదేమిటంటే. భారతదేశంలో భవిష్యత్తులో రాబోయే మతకలహాలు, రక్తపాతమూ, దేశాన్ని రెండుగా చీల్చివేస్తాయి.

కీరో-- ప్రపంచ భవిష్యత్తు.

* "That Budhists and Mohammedans will join together to make India a united nation, is out of the question. The outmost one hopes for is that, in a native Government. They wquld form opposition parties and so rule the country together. The danger is, however a form of religious civil war that will keep the country in a state of continued upheaval.

- Cherio's World Predictions

ఈ విధంగా దేశభవిష్యత్తును అనేకమంది ముందుగా దర్శించి చెప్పిన నిదర్శనాలు మనకాలంలోనే చాలావున్నాయి. ఇందులో ఎలాంటి అసంభవము లేనప్పుడు ఒక్క వ్యాసమహర్షి వంటి మహాయోగి, దివ్యదృష్టి సంపన్నుడికి భవిష్యపురాణంలో వ్రాసినవిధంగా, దేశానికి జరగబోయే భవిష్యత్తును ముందుగానే వ్రాయడం సంభవమా! అని మనం ఆశ్చర్య పడనక్కరలేదు. ఈనాటికీ అనేకమంది విదేశాల్లోకూడా, జరగబోయే భవిష్యత్తును చెప్పిన జ్యోతిష్కులూ, యోగులు, దివ్యదృష్టికలవారూ వుండటమే, దీనికి తార్కాణం.

అందువల్లనే భవిష్యపురాణములో వ్యాసమహర్షి వ్రాసినభవిష్యత్తే నిజమైన భారతదేశ చరిత్ర అని పై విషయాలవల్ల రూఢిగా ఋజువు

అవుతున్నది. "నాడీగ్రంథాల"లో కూడా యీ భవిష్యపురాణంలోలాగే మనుష్యుల పేర్లతోకూడా భవిష్యత్తును వర్ణించేచోట ఇవ్వబడినాయి. ఇంకా ఇలాంటి తార్కాణాలు, ఋజువులు ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా లభిస్తున్నవి వున్నాయి. అవి ఏమిటో చూద్దాము.

## భవిష్యత్తు -- నాడీగ్రంథాలు -- విదేశాలలోని అనుభవాలు.

అమెరికాలో "డిక్సన్‌సతి" (Mrs. Dixon) ఇటీవలనే అమెరికా భవిష్యత్తు, ప్రపంచ భవిష్యత్తు ముందుగానే చెప్పడం, అవి యధాతథంగా జరగడంకూడా అమెరికాలో ప్రచురించిన పుస్తకాలవల్ల మనకి తెలుస్తున్న సత్యమే.

కెన్నడీ అమెరికా ప్రెసిడెంటుగా రావడం, తర్వాత అతడి హత్య, రష్యాచే రోదసీలోకి ఉపగ్రహం ప్రయోగించబడడమూ, కృశ్చేవ్ పతనం, 1962 లో -- జరిగిన అష్టగ్రహకూటమి , అదేరోజున హిమాలయ పర్వాతాలలో ఒకమూల ఆశ్రమములో -- ప్రపంచాన్నే మార్చివేయగల ఒక అవతార పురుషుడి జననం ఇవన్నీకూడా డిక్సన్ సతి (Mrs. Dixon) తన దివ్యదృష్టితో తెలిపింది. ఇలాంటి సాక్ష్యాలు కొల్లలు * "Crystal Ball" లో శ్రీమతి డిక్స్ జీవితము (Mrs. Dixon) గ్రంథంగా వచ్చింది. ఇది ఆవిడ అద్భుత శక్తులను గురించిన పుస్తకము. ఇంకా డిక్సన్‌సతిని గురించి ఒక అద్భుత వ్యాసము -- "Readers Digest" Sept. 1965 సంచికలో చూడవచ్చు.

దివ్యదృష్టితో భవిష్యత్తు ముందే చెప్పిన యోగులు ఇలాగే అనేకమంది ఉన్నారు. వారి గ్రంథాలు ఈ నాటికీ మనం చూడవచ్చు. వీరబ్రహ్మంగారు సంస్కృత శ్లోకాల్లోరచించిన "కాల జ్ఞానం" అనే గ్రంథమూ, సిక్కుమతగురువులైన 'గురుగోవిందసింగు' 'గురునానక్'లు వ్రాసిన రానున్న అవతార విశేషాలూ, శ్రీశైలంలో యోగసమాధిలోవుండి -- ** శివాజీమహారాజు తెలిపిన మన

దేశభవిష్యత్తు, Charles Kincaid వ్రాసిన "The Grand Reble" అన్న గ్రంథంలో చూడవచ్చు.

శివాజీ మహారాజు భారతదేశ భవిష్యత్‌ను చెప్పిన విషయాలూ అన్నీకూడా ఈ తరగతిలోనివే.

ఇంకా ఇటువంటివి అనేక సాక్ష్యాలు ప్రత్యక్షంగా నిరూపిస్తున్న విషయం -- ఎంతమూర్ఖుడికైనా అర్థమయ్యే నగ్నసత్యం. ఆ సత్యమేమిటంటే దివ్యదృష్టితో లేదా జ్యోతిషంతో దేశభవిష్యత్తును ఏ నాడో వ్రాసి పెట్టిన రచనలే అవి. అలాంటి దేశభవిష్యత్తు తెలిపేదే మన భవిష్యపురాణం కూడా!





# భవిష్యపురాణం - ప్రపంచ భవిష్యతు

వ్యాసమహర్షి హిమవత్పర్వతాలలో తపస్సు చేసినపుడు పొందిన 'మహత్తర విశ్వానుభూతి'లో దివ్యదృష్టితో ఆయన యావత్‌స్పృష్టిచరిత్రనూ T.V తెరమీద చిత్రంలాగా దర్శనమిచ్చినరీతిని మొదటి అధ్యాయంలో గమనించాము! కాలంలో ఆదీ అంతమూలేని నిరంతర పరిభ్రమణం జరిగే చక్రాకారంలో గతస్పృష్టి చరిత్రను, ప్రళయాలను - రాబోయే భవిష్యత్తును అంతాకలిసి ఏకాకారంగా దర్శించాడు. ఆ విశ్వానుభూతిలో! రానున్న భవిష్యత్తును మనకు తెలిపే పరమాశ్చర్యకరమైన కావ్యంగా శ్రీవ్యాసమహర్షి దీనినే 'భవిష్యపురాణం' -- అన్న పేరుతో మానవాళికి అందించాడు!

ఇప్పుడు మనకి ఈ భవిష్యపురాణం శిథిలమైనస్థితిలో బ్రిటీషువారు

నాశనంచేయగా మిగిలిన తాటియాకు గ్రంథంగా లభిస్తున్నదానిని శ్రీవెంకటేశ్వర స్టీమ్‌ప్రెస్ వారు బొంబాయినుండి ప్రచురించారు!

అసలీ భవిష్యపురాణమే ఇప్పటి మిగతా 18 పురాణాలలోని భవిష్యత్తును తెలిపే అధ్యాయాలకు మూలం! ఈ విషయాన్ని బ్రిటిష్ పరిశోధకులు కూడా అంగీకరించారు! ఈనాటి భవిష్యపురాణంకంటే పురాతనమైన గ్రంథం ఒకటి ఉండేదని దానిలో ఇపుడు నడుస్తున్న కలియుగం చరిత్రంతా భవిష్యత్తు కాలజ్ఞానరూపంలో "రానున్న చరిత్ర" (Future History)గా గ్రంథస్థంచేయబడి వున్నదని, ఈ బ్రిటిష్ చరిత్రకారులైన స్మిత్‌మోనియర్ విలియమ్స్ (Smith) సర్ విలియమ్స్ జోన్స్(Sir Williums Jones) వంటివారుకూడా అంగీకరించారు! అంతేకాదు, ఈ మౌళికమైన భవిష్యపురాణ సంహితనుండే [ప్రస్తుత భవిష్యపురాణం కాదు] అన్ని పురాణాలూ ఇప్పటి రూపాన్ని దాల్చి విడివిడిగా సంకలనం చేయబడినాయని కూడా పరిశోధకుల అభిప్రాయం!

ఇప్పటికైనా ఈ శిథిలావస్థలో మనంచదివే ఈ భవిష్యపురాణం అనే గ్రంథం ఒక అద్భుతమైన విచిత్రరచన! రానున్న భవిష్యత్తును యథాతథంగా కళ్ళకు కట్టినట్లు వర్ణించేసాహిత్యం ప్రపంచంలోనే అరుదు! అందులో ప్రఖ్యాత ఫ్రెంచిద్రష్ట 'నోస్ట్రడేమస్' (Nostradamous) రాసిన భవిష్యత్ రచనలు, ఇంకా వీరబ్రహ్మేంద్రయోగి వ్రాసిన "కాలజ్ఞానం" ఇలాంటి మచ్చుతునకలు వీరబ్రహ్మేంద్రయోగికి ముందుగా రెండువందల సంవత్సరాల పూర్వమే శ్రీవిద్యారణ్యస్వామి రానున్న భవిష్యత్తును 'శ్రీవిద్యారణ్య-కాలజ్ఞానం' అన్నపేరుతో రచించారు! ఇది అముద్రితము! దీని వ్రాతప్రతి నావద్ద వున్నది! ఇందులో, అప్పుడు రానున్న కలియుగం చివరలో ఏర్పడే గ్రహస్థితులు సరైన కలియుగప్రమాణం దానిని లెక్కించే రహస్యగణితం - ఇదంతా ఆగ్రంథం మొదటి అధ్యాయంలో ఇవ్వబడింది! ఇప్పుడు మన పంచాంగాలలో రాసుకునే కలియుగలెక్కలు కాకుండా విద్యారణ్యస్వామి కాశీలో వేదవ్యాసమహర్షిని దర్శించి వారి అనుగ్రహాశీస్సులు పొందినపుడు

తనకు లభించిన కలియుగాన్ని గుణించే గణితరహస్యాలు కొన్ని ఈ గ్రంథంలో ఇచ్చియున్నాడు! దీన్ని అనుసరించే వీరబ్రహ్మేంద్రయోగి తన కాలజ్ఞానంలో రాగల భవిష్యత్తును తెలుగు సంవత్సరాలలో, తిథి, నక్షత్రాల వివరాలతో రాసివున్నాడు! దీనిని బట్టి "యుగసంధి" ప్రారంభించేకాలము రానున్న కల్క్యావతారం జన్మించే వివరాలు అందులో ఇవ్వబడివున్నాయి.

ఈ గణితమంతా వ్యాసమహర్షి భవిష్యపురాణంలో జరగబోయే భవిష్యత్తును గణితంచేసి ముందుగానే రాసివున్నాడు. కాబట్టి, వేదంకంటే పురాతనమైన "విశ్వచరిత్ర" అనబడే శాశ్వతభవిష్యత్తును తెలిపే ప్రాచీన పురాణసంహితయొక్క మూలరూపమే ఈ భవిష్యపురాణసంహిత! ఈ భవిష్యపురాణం చాలామందికి పరిచయంలేని గ్రంథం! అందుకని ఇందులో కొన్ని వివరాలను ఇక్కడ పరిశీలిద్దాం! కొన్ని విశేషాలు నా గ్రంథం "1999 కలియుగాంతం" లో ఇచ్చివున్నాను! ఇప్పుడు భవిష్యపురాణగ్రంథం యొక్క దృక్కోణంనుంచి వ్యాసమహర్షి మనకిచ్చిన అమూల్యసంపదను మెతుకుపట్టి చూచినరీతిలో తెలుసుకుందాం!

## కలియుగప్రారంభంలో పురాణరచన :-

వ్యాసమహర్షి మహాభారతయుద్ధం జరిగిన 36 సంవత్సరాల తర్వాత కలియుగం ఆదిలో మహాభారతం రచించాడని తెలుస్తోంది! నా "మహాభారత కాలనిర్ణయం" పరిశోధనవల్ల భారతయుద్ధం జరిగిన 36సం॥ల తర్వాత అంటే మనపంచాంగ లెక్క ప్రకారం ప్రమాధినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారంకు సరియైన 18-2-3102 B.C సంవత్సరంలో అర్ధరాత్రి 2 గంటల 27 నిముషాల 30 సెకండ్లకు శ్రీకృష్ణనిర్యాణం జరిగింది! ఆ సమయంలోనే కలియుగం ప్రవేశించింది! ఈ విషయాన్ని వ్యాసమహర్షి -

"యస్మిన్ కృష్ణో దివంయాతః
తస్మిన్ ఏవ తథా అహని ప్రతిపన్నం కలియుగం"

అని మహాభారతంలోనూ, భాగవతంలోనూ తదితర పురాణా లన్నింటిలోనూ రూఢీగా తెలిపివున్నాడు! కాబట్టి శ్రీకృష్ణనిర్యాణమే కలియుగానికి ప్రారంభం! ఈ కలియుగభవిష్యత్తు భవిష్యపురాణంలోని కావ్యవస్తువు!

శ్రీకృష్ణనిర్యాణం జరిగినవెంటనే ధర్మరాజు సోదరసమేతంగా రాజ్య పరిత్యాగం చేశాడు! తన మనుమడైన పరీక్షిత్తుకు పట్టాభిషేకంచేసి హిమాలయాలకు వెళ్ళి స్వర్గారోహణం చేశాడు! అప్పటికి సప్తమహర్షులు - మఖానక్షత్రంలో ప్రవేశించి వున్నారు!

"ఆసన్ మఖాసు సమనయః
యుధిష్ఠిరే శాసతి పృధివీం"

ఇంకా భాగవతము, విష్ణుపురాణం ఇంకా మత్స్య, వాయుపురాణ ములలో కూడా ఈ కాలప్రమాణం ఖచ్చితంగా నియమించబడినది! కాబట్టి ఇది ముఖ్యమైన మైలురాయిగా భావించవచ్చు! ఖగోళశాస్త్ర జ్ఞుడు, జ్యోతిష పండితుడైన వరాహమిహిరుడు ఈ సప్తమహర్షులస్థితిని గణితంచేసి తన గ్రంథం "బృహత్‌సంహిత"లో నిరూపించాడు! ఈ సప్తఋషులు నూరేళ్ళకు 100సం|| ఒక నక్షత్రంలో ప్రయాణిస్తారు! ఇలాగ 27 నక్షత్రాలు చుట్టివచ్చేందుకు 2700 సం||లు (సరాసరి లెక్కన) పట్టుతుంది. ఈ కలియుగప్రమాణం గణితంచేసిన ముఖ్యాధారం ఈ సప్తమహర్షుల చలనమేకాని, సూర్యచంద్రాది నవగ్రహగణితం కాదు! ఇది చాలామందికి తెలియని రహస్యం!

పరీక్షిత్తు పరిపాలనతో ప్రారంభించిన 'కలియుగం' దానిలో జరిగే భవిష్యత్తు ఒక్కొక్క రాజుయొక్క పేరు అతని పరిపాలనాకాలం వ్యాసమహర్షి వివరంగా వర్ణించాడు! వీరి పరిపాలనా కాలములను కూడికచేస్తే ఈ భవిష్యపురాణంలో చెప్పబడిన 'కలియుగ భవిష్యత్తు' ఎప్పటికి పూర్తి అవుతుందో నిర్ధారణగా తేలిపోయింది! దానినిబట్టి శ్రీమద్భాగవతం 12వ స్కందంలో కూడా శుకయోగి పరీక్షిత్తుకు రానున్న భావికాలగతులు వర్ణించాడు! అందులోకూడా ముఖ్యమైన

రాజుగా పరీక్షిత్తు పట్టాభిషేకం, కలిలో మొదటిరాజు అని గుర్తించి -

"యావత్ పరీక్షితో జన్మ యావన్నందాభిషేచనం
ఏకమేవ సహస్రంతు జ్ఞాయం పంచశతోత్తరం"

అనగా - "పరీక్షిత్తు పుట్టుకనుంచీ మహాపద్మనందుని పరిపాలన ఆరంభంవరకూ జరిగే భవిష్యత్తు 1500 సం|| నడుస్తుంది! ఈ మహాపద్మనందుడు సర్వక్షత్రియుల పరిపాలనను అంతం చేసే మైలురాయి వంటివాడు! ఇతడు కలిలో మొట్టమొదటి శూద్రచక్రవర్తి! ఇతడితో కలియుగంలో క్షత్రియరాజుల పరిపాలన అంతమవుతుంది" - అంటూ స్పష్టంగా వ్యాసమహర్షి 'సర్వక్షత్రాంత కరో భవేత్' అని వర్ణించాడు! కాబట్టి కలియుగంలో ఇది మొదటి అధ్యాయంగా భావించవచ్చు! తరువాత కలియుగం భవిష్యత్తును ఈ భవిష్యపురాణంలో వివరాలతోసహా వర్ణించాడు వ్యాసమహర్షి! ఇందులో ముఖ్యమైన ఘట్టాలు కొన్ని ఇక్కడ తెలుసుకుదాం!

బుద్ధదేవుని అవతారం - ఇక్ష్వాకువంశంలో శుద్ధోధనుని కుమారుసిగా జన్మిస్తాడని భవిష్యపురాణం ప్రతిసర్గపర్వం (అధ్యా - 6 శ్లో - 36 - 43 వరకూ)లో వర్ణించబడినది! ఈ బుద్ధదేవుని అవతారం అజాతశత్రువు అనే రాజుకాలంలో జరిగింది అని చరిత్ర పరిశోధకులు అంగీకరించారు! వ్యాసమహర్షి-

"చత్వారింశత్ త్సమారాజ్యం క్షత్రౌజాః ప్రాప్యతేతతః
అష్టత్రింసత్సమారాజన్ విధిసారో భవిష్యతి
అజాత శత్రుర్భవితా పంచవింశత్సమాన్నృపా"

అనగా - "40సం||లు క్షత్రౌజస్సు పరిపాలించినతరువాత విధిసారుడు రాజగును! అతడు 38 సంవత్సరములు పరిపాలిస్తాడు! ఆ విధిసారునికి 'అజాతశత్రువు' అనే కుమారుడు పుట్టి అతడు 25 సంవత్సరాలు పాలిస్తాడు! ఈ 'విధిసారుడే' చరిత్రలో 'బిందుస్సారుడు' (విధి = బిందు =నీరు) అనే పేరుగలవాడు! అతని తరువాత అజాతశత్రువు, ఉదయునుడు, నందివర్ధనుడు, మహానంది అనే పదిమంది రాజులు శిశునాగ వంశీయులు పరిపాలిస్తారు! వీరిలో 4 ఆఖరివాడు

మహానందుడు! ఆ సమయంలో -

కాశ్యపా దుద్భూతో దేవో గౌతమోనామ విశ్రుతః
బౌద్ధధర్మంచ సంస్కృత్య ... ... ...
శాక్యమౌయోనీతి విఖ్యాతో సూర్యవంశశ్చ భూమిపః
శాక్యసింహ ఇతిఖ్యాత శుద్ధోదన సుతో భవతి
కలే అర్ధసహస్రేతు యాతేతే ది శాతాధికే

అనగా ఈశాక్య వంశస్థుని శుద్ధోదన కుమారుడుగా గౌతమ బుద్ధుడు జన్మిస్థాడనీ, ఈ గౌతమబుద్ధుడు బౌద్ధధర్మాన్ని స్థాపిస్తాడని, కలియుగం 1200 సంవత్సరాలు దాటిన వెనుక శుద్ధోధనుని పుత్రుడుగా బుద్ధుడు పుట్టగలడు - అని భవిష్యపురాణం రాసింది! కాబట్టి కలియుగం 3102 B.C లో నుంచీ 1200 తీసివేయగా - 1898 B.C బుద్ధుని కాలం! ఆయన జాతకం ఆధారంతో గణితంచేసిన కాలం కూడా సుమారుగా 18.7 B.C. లో జరిగిందని ధృవపడుతున్నది! అలాగే ఈ భవిష్యత్తులో పరిపాలించే కలియుగరాజులు గురించి వ్యాసమహర్షి వివరంగా యిచ్చాడు. అవేమంటే:-

| | | |
|---|---|---|
| (1) | బార్హద్రధవంశం | 1000సం॥లు |
| (2) | ప్రద్యోతవంశం | 138 సం॥లు |
| (3) | శిశునాగవంశం | 360 సం॥లు |
| (4) | నందవంశం | 100 సం॥లు |
| (5) | మౌర్యవంశం | 316 సం॥లు |
| (6) | శుంగ వంశం | 300 సం॥లు |
| (7 | కాణ్వ వంశం | 95 సం॥లు |
| (8) | ఆంధ్ర శాతవాహనులు | 450 సం॥లు |

మొత్తం కలియుగం 2771 కు సరిపోయింది!

భవిష్యత్తులోని పైరాజుల చరిత్రను వర్ణించి వ్యాసమహర్షి సప్తమ హర్షుల నక్షత్రమండలాన్నిబట్టి 2700 సంవత్సరాలకు ఒకసారి తిరిగి తరువాత తిరిగి ధర్మరాజు పరిపాలించేనాటి వున్నచోటునే-అనగా

మఖానక్షత్రంలో ప్రవేశిస్తారు! ఇది 24 వ ఆంధ్రరాజుల కాలంలో జరుగుతుందని :-

"ఆంధ్రాంశే సచతుర్వింశే భవిష్యత్యేషవై కలిః!

అంటూ 24వ ఆంధ్రరాజులకాలంలో తిరిగి ధర్మం ఉద్ధరింప బడుతుంది అని సప్తఋషుల లెక్కను కలియుగ ప్రమాణంతో సరిపెట్టాడు!

ఇప్పుడు మళ్ళీ రాబోయే కాలంలో కలియుగాంతానికి సప్తఋషులు ఇదే ప్రాంతాన్ని చేరుకుని దానితోపాటు అన్నిగ్రహాలు మేషరాశిలో చేరి, కలియుగం ప్రారంభంలోవున్నట్టే తిరిగి ఏర్పడతాయి! ఆ సమయంలో 'కల్క్యవతారం' వచ్చి తిరిగి ధర్మస్థాపన చేయడం జరుగుతుందని కలియుగ రాజుల చరిత్ర రానున్న భవిష్యత్ చరిత్రగా 'భవిష్యపురాణం' వర్ణించింది!

ఇందులో చాణక్యుడు అనే బ్రాహ్మణుడు నందరాజులను సంహరించి చంద్రగుప్తమౌర్యులకు పట్టాభిషేకం చేయడం, అలానే అశోకుని పరిపాలన, విక్రమాదిత్యుని జననం, శకకర్తలైన శాలివాహన, విక్రమాదిత్యుల చరిత్ర, అంతాకూడా, ఎంతో విశదంగా వర్ణించి చివరకు "కలియుగం 3000 సంవత్సరాలు నిండేసరికి 'శక-కర్త' విక్రమాదిత్యుడు జన్మిస్తాడు" - అని చరిత్రకాలంలో-కలియుగ కాలగమనం విశదంగా తెలిపింది! అప్పటికి 101 B.C. కాలం సరిపోతుంది - విక్రమార్కుని జననకాలంతో. కర్తగా "విక్రమార్క శకాన్ని" స్థాపించేనాటికి కలియుగం, 3044 సం||లకు సరియైన 31 - మార్చి -57 B.C.కి - సరిపోతున్నది. ఇది కలియుగ సంవత్సరాల ప్రమాణం!

ఇలా భవిష్యపురాణం ఆశ్చర్యంగా వర్ణించే భవిష్యత్తులో విక్రమాదిత్యుడు, శాలివాహనుడు మొగల్ చక్రవర్తులైన, బాబర్, అక్బరు, ఔరంగజేబులే కాక ఏసుక్రీస్తు, మహమ్మద్ ప్రవక్తల చరిత్రకూడా వ్యాసమహర్షి ఈ 'భవిష్యపురాణంలో వర్ణించాడు!

## మ్లేచ్ఛజాతులు:-

ఇంకో విచిత్రమేమంటే ఈనాటి కలియుగం అంతా పాశ్చాత్య - సంస్కృతియొక్క చరిత్రయే - అని మ్లేచ్ఛవంశ చరిత్రతో "కలియుగం" ప్రారంభం అవుతుందని దానికి బీజమైన ఈ మ్లేచ్ఛుల పుట్టుక గురించికూడా వ్రాశాడు!

## మ్లేచ్ఛజాతుల చరిత్ర -- కలిధర్మం ఉద్భవం

ఈ కలియుగాంతం అయితే ఏమి జరుగుతుంది? అన్న విషయాన్ని అర్థంచేసుకోడానికి, ఇప్పుడు ఈ ఇరవయ్యో శతాబ్దిలో జీవిస్తున్న మనకి కొన్నిముఖ్యమైన విషయాలు -- తెలియాలి! ఇప్పుడునడిచేది కలియుగధర్మం -- ఈ 'కలిధర్మం' నశించి పూర్తిగా "సత్యయుగ" ధర్మం ఏర్పడుతుందని భవిష్యపురాణము, కాలజ్ఞానము మొదలైన భవిష్యత్‌గ్రంథాలలో చెప్పబడివున్నది. అయితే ఈ 'కలిధర్మం' నశించటం అంటే ఏమిటి? దీనికి సమాధానంగా భవిష్యపురాణంలో ఇప్పటి పాశ్చాత్య నాగరికతకు "కలిధర్మం" అని పేరుపెట్టారు! ఈ శతాబ్దంలో ప్రపంచమంతటా వ్యాపించివున్న ఒకేరకమైన పాశ్చాత్య సంస్కృతి, జుట్టు కత్తిరించుకునే పద్ధతి, ప్యాంటూ షర్టూ ధరించడం, పొగత్రాగడం ఈ విదేశీయ జీవనవిధానం -- వీటన్నిటికీ మూలకారణమైనదే "మ్లేచ్ఛదర్మ వ్యాప్తి"

## 'భవిష్యపురాణం' లో -- మ్లేచ్ఛుడైన "కలి" :-

ఈ మ్లేచ్ఛధర్మం, ద్వాపరయుగం చివరిభాగంలో పశ్చిమ సముద్రం లోని ఒక ద్వీపంలో కలియుగానికి అధిపతి అయిన 'కలిపురుషుని' తపస్సుతో ప్రారంభమయిందని భవిష్యపురాణం తెలుపుతున్నది. చాలాకాలం ఈ కలిపురుషుడు ప్రపంచంలో కలియుగఛాయలను వ్యాపింపచేయలేక -- ఎక్కడ చూసినా వేదమంత్రాలు యజ్ఞాలూ

తపస్సులూ నడుస్తూంటే అడుగుపెట్టలేక దుఃఖితుడై భగవంతుని ఇలా ప్రార్థించాడు.

"దేవా! ఎక్కడచూసినా ధర్మం అగ్నిహోత్రంవలే, ప్రజ్వలిస్తుంటే ఇక కలియుగప్రభావం ఏమివ్యాపిస్తుంది? మీరే అవతరించి ఆ ధర్మాన్ని స్థాపించారు! మీ అనుగ్రహం లేకుండా నాకు కాలుపెట్టే సావకాశం కూడా లేదు! ఇంతకన్న కలియుగం తీసివేసి నాకు శలవిప్పించటం మేలు!" -- అన్న ధోరణిలో దుఃఖితుడై ప్రార్థించిన 'కలి'కి భగవానుడు ప్రసన్నుడై పశ్చిమ సముద్రంలో ఒక ద్వీపం చూపించి అక్కడ మ్లేచ్ఛజాతికి మూలపురుషుడైన 'ఆదముడు' ఆదం= (Adam), హవ్యవతి హవ్య= "హవ్వా" (Eve) అనే స్త్రీ పురుషులను ఒక సుందరమైన వనంలో (Eden) స్థాపించి అన్ని సౌఖ్యాలూ వసతులూ కల్పించాడు. అలా భగవంతుని అనుగ్రహంతో జీవిస్తున్న ఆ తోబుట్టువులకు మధ్య 'కలి' (Satan) సర్పరూపుడై ప్రవేశించి అక్రమమైన కామాన్ని ప్రేరేపించి తద్వారా అధర్మమైన సంతానాన్ని కనమని ప్రోద్బలం చేస్తాడు!! ఫలితంగా భగవదనుగ్రహం నుండి పతితులైన దివ్యశక్తులు కోల్పోయి (Fall of Man and Paradise Lost) జీవించే ఈ జంటనుంచి కలిధర్మానికి మూలమైన 'మ్లేచ్ఛజాతి' ఉద్భవించింది! వీరి వంశీయులే ఒకశాఖ క్రైస్తవమతానికీ, ఇంకొకశాఖ ముస్లింసంస్కృతికీ - మరొక్కశాఖ యూదులు (Jews) పుట్టుకకూ దారితీశారు. ఈ విధమైన పాపంతో పుట్టిన జాతిని బైబుల్‌లో కూడా "Original Sin" వున్న సంతతిగా -- క్రీస్తుకూడా వర్ణించాడు. ఈ 'చెడుకర్మను' అనుభవించడానికి క్రీస్తు శిలువనెక్కవలసి వచ్చింది.

ఇలా పశ్చిమ ద్వీపంలో ఆరంభించిన 'మ్లేచ్ఛధర్మం' ప్రపంచమంతా వ్యాపించి ఇప్పుడు మన భాషలో పాశ్చాత్యనాగరికత (Western Civilization) అనబడే 'కలియుగధర్మానికి' మూలమైంది అని భవిష్యపురాణంలోని 'మ్లేచ్ఛజాతుల చరిత్ర' మనకు ఆశ్చర్యం కలిగించేలా వర్ణిస్తున్నది. ఇలా ప్రారంభించిన ఈ కలిధర్మం

రాబోయే 'యుగసంధి' చివరలో జరిగే మహాయుద్ధమూ ప్రకృతి ప్రళయాలలో వినాశమై, తిరిగి వేదధర్మమైన 'సనాతనధర్మం' -- కార్తీకశుద్ధ నవమినాడు ఆరంభించే "కృతయుగం"లో విష్ణుమూర్తి అవతారమైన 'కల్కిభగవానుని'చే -- స్థాపించబడుతుంది.

ఈ విషయాన్ని నిరూపించే ఈక్రింది ప్రమాణ శ్లోకాలు భవిష్యపురాణంలోనివి మనకి అత్యంతాశ్చర్యాన్ని కలిగిస్తాయి.

మ్లేచ్ఛయుగము(కలిచతుర్థపాదం)

"నారాయణం పూజయిత్వా మ్లేచ్ఛః సహభార్యయా....

... ... సాక్షాద్భగవాన్ భక్తవత్సలః"

"కలింప్రోవాచ సహసా యుష్మదర్థే యుగోత్తమం

... ... తవేచ్ఛా పూరయామ్యహమ్"

"అదమో నామ పురుషః పత్నీ హవ్యవతీ తథా

... ... మ్లేచ్ఛవంశ ప్రవర్థనౌ"

(అంటే అర్థం కలిభూపతి మ్లేచ్ఛరూపుడై తనభార్యతో కలిసి శ్రీమన్నారాయణుని పూజించగా సాక్షాద్భగవంతుడూ, భక్తవత్సలుడైన హరి, కలితో ఈవిధంగా చెప్పాడు.

"ఓ కలిరాజా నీకోరికను నెరవేర్చెదను ఆదముడనే పేరుగ లపురుషునీ హవ్యవతి అనే పేరుగల స్త్రీనీ సృష్టించెదను" -- అని.

ఈ మ్లేచ్ఛధర్మం ప్రారంభం ఎప్పుడు జరిగిందనీ అంటే

"ద్విశతాష్టసహస్రీ ద్వేశేషేతు ద్వాపరయుగే

మ్లేచ్ఛదేశస్య యాభూమి ర్భవితా....."

ద్వాపరయుగంలో చివరిభాగాన -- రెండువేల ఎనిమిదివందల సంవత్సరాలు (2800) ఇంకా ద్వాపర యుగాంతమున బాకీవుండిన కాలంలో మ్లేచ్ఛదేశంలో పై చరిత్ర ప్రాభించినది!

"హం త్వంతర్ధధే తత్ర కలిరానందమాప్తనాన్"

-- భవిష్యపురాణం (ప్రతిసర్గపర్వం అధ్యాయం 4. శ్లో 10-20)

-- మ్లేచ్ఛయుగాది :- (కలియుగాది 1-17 సంవత్సరం)

పైవిధంగా ఉద్భవించిన మ్లేచ్ఛవంశంనుంచి 'న్యూహకుడు' (Noah) అనే పేరు గల యవనుడు పుట్టుననీ, వారిమతం ప్రపంచమంతా వ్యాపిస్తుందనీ తెలిపే ఈశోకం గమనించదగ్గది.

"న్యూహాఖ్యో యవనోనామ, తన్మతం పూరితం జగత్"

మూసాచార్యులు :- ఈ న్యూహకుని వంశంలోనే 'మూసా' చార్యుడు (మోసెస్ Moses) జన్మించి "మ్లేచ్ఛధర్మాన్ని" ప్రపంచంలో వ్యాపింపచేయడం తెలిపింది!

## క్రీస్తు ఇండియా రావటం:

బైబుల్లోని క్రీస్తు జీవితచరిత్ర మాత్రమే చదివినవారికి ఈవిషయం నమ్మశక్యం కాకుండా వుంటుంది. ఎందుకంటే యేసుక్రీస్తేమిటి? భారతదేశం రావటం ఏమిటి? హిందూదేశం వచ్చిపుచ్చుకున్నట్లు ఎక్కడా నిదర్శనం లేదే? అని ఆశ్చర్యపోతారు. కాని, వ్యాసమహర్షి భవిష్యపురాణంలో కలియుగం 'మూడు వేల ఒక వంద' సంవత్సరాలు దాటిన తరువాత -- ఇద్దరు శకకర్తల జననం, అంతకుముందే ఇంకొక శకకర్త జననం గురించి తెలుపుతూ, క్రీస్తు హిమాలయ పర్వతాలలో తపస్సు చేసి, సిద్ధపురుషుల ఆశీస్సులను తీసుకొని దివ్య మహిమలనుపొందినట్టు, ఆ సమయంలో శాలివాహన చక్రవర్తిని కలసినట్టూ చూపించటం జరిగింది.

"ఈశ పుత్రంచ మాం విద్ధి
కుమారీ గర్భ సంభవం
'మ్లేచ్ఛ ధర్మస్య వక్తారం"
- భవిష్యపురాణం

ఇది సంభవమే, చారిత్రకంగాచూస్తే! శాలివాహన శకము A.D. 78లో అయితే క్రీస్తు జననము 7 A.D. అని చరిత్రకారులు చెబుతారు. దీని వల్ల ఇద్దరూ సమకాలికులే అవడానికి సావకాశమున్నది. ఎందుకంటే శాలివాహన చక్రవర్తి శత్రువులను భారత దేశంనుంచి నిర్మూలించి "శాలివాహన శకాన్ని" స్థాపించకముందే జన్మించివుండాలి. శాలివాహనశక ఆరంభానికి క్రీస్తు వయస్సు సుమారు 55-60 సంవత్సరాల మధ్యన ఉండాలనుకుంటే జననమూ సమీపంలోనే అవుతుంది.

ఇటీవల "నొటోవిచ్"(Notovitch) అనే ఒక రష్యన్ యాత్రికుడు టిబెట్ దర్శించినప్పుడు అక్కడి తాళపత్రగ్రంధాలలో "యోగి ఈశా జీవిత చరిత్ర అన్న అమూల్యగ్రంధాన్నిచూచి, హిమాలయాలకు ఎంతో ప్రయాసతోవెళ్లి అందులోని యేసుక్రీస్తు చరిత్రను ఒక అద్భుత చారిత్రక పరిశోధనగా ప్రచురించాడు.

అంతకుముందే క్రీస్తు 12 ఏండ్లవాడై వుండగా తన జన్మస్థానమును వీడిఎక్కడికో వెళ్ళిపోయినట్లూ - తిరిగి 30 సంవత్సరాలు దాటిన తరువాత స్వస్థలంలో అడుగుపెట్టినట్లూ - అప్పటికే ఆయనవద్ద యోగశక్తులు వున్నట్లూ, బైబిల్చూస్తే మనకి కనబదుతుంది. కాబట్టి ఈమధ్యకాలంలో క్రీస్తు తిరిగిన యాత్రలగురించి పరిశోధన చేయగా, ఆయన కాలినడకన హిమవత్పర్వతాలకు వచ్చినట్లూ, అక్కడ కొంతకాలం బౌద్ధులైనవారితో హిమాలయాలలో యోగాభ్యాసం చేసినట్లు, అక్కడనుంచి భారతదేశంలోని కాశీ ప్రయాగ, 'బుద్ధ - గయ'వంటి పుణ్యక్షేత్రాలలోవుండి సాధనచేసినట్లూ తెలింది. దీనిని

తెలిపే ఒక సినిమాకూడా "The Lost Years of Jesus Christ" అన్నపేరిట తీయడం జరిగింది. ఇది విదేశాల్లో గొప్పసంచలనం కలిగించింది! కాని ఈసినిమా చూసినవారెవరికీ "భవిష్యపురాణం"లో ఉన్న వర్ణనగురించి తెలియదు. అది నేను వారికి -- "ఎపుడో అయిదువేల (5000) సంవత్సరాలనాడు వ్యాస మహర్షి వ్రాసిన భవిష్యత్ ప్రకారం -- క్రీస్తు భారతదేశం రావటం తెలిపినప్పుడు -- వారు ఎంతో ఆశ్చర్యపోయారు.

అంతేకాదు, క్రీస్తుకు భారతదేశంలో భవిష్యత్తును దర్శించి ముందు గానే వ్రాసిపెట్టిన పురాణాలు (Scriptures) ఉన్నాయని తెలుసు. ఆ పురాణాల్లోనూ, నాడీగ్రంధాలలోనూ వ్రాయబడ్డ వ్యక్తుల భవిష్యత్తూ వారిపేర్లూ, వారి జీవితంలో జరగబోయే సంఘటనలూ, ముందుగా వ్రాయబడటమేగాక అవి, తప్పక జరుగుతాయని కూడా -- క్రీస్తు విశ్వాసం! అందుకే తన జీవితంలోకూడా, పురాణాల్లో(Scriptures) వ్రాసిన భవిష్యత్తులు తప్పక జరుగుతాయని, అందుకు తనజీవితమే ఒక నిదర్శనమని తెలుపుతాడు.

"The Scriptures shall be fulfilled"

"I come to fullfil the Scriptures"

అలాగే ఆయన స్వదేశానికి వెళ్లాకకూడా తనను పట్టుకోవ డానికివచ్చిన శత్రువునుండి తప్పించుకోవటానికి ప్రయత్నంచేయ నిరాకరించాడు. "రాసిపెట్టివున్న భవిష్యత్ తప్పదని" గ్రహించి -- భగవంతుని సంకల్పమనే భూమిమీద జరుగుతుందని, తనది కాదనీ.

"They Will be done on Earth, as it is in Heaven"

అనికూడా చెప్పినట్లు బైబుల్‌లోవున్న వాక్యాలే తెలుపుతాయి! ఇవన్నీ చూస్తే క్రీస్తు హిమాలయ పర్వతాలకు రావటమేకాకుడా, అక్కడ నిక్షిప్తమైవున్న మనపురాణాలలోని భవిష్యత్తుకూడా ఆయనకు తెలుసని ఋజువవుతున్నది.

## శిలువపై - మరణించలేదు!

ఇంకోవిచిత్రం! "భవిష్యపురాణం"లో క్రీస్తు శిలువమీద మరణించినట్లు వ్యాసమహర్షి వ్రాయలేదు! అంతేకాదు ఈయన తాను ప్రజలలో బోధించిన ఆధ్యాత్మిక ప్రచారం పూర్తికాగానే శత్రువులబారినుండి తప్పించుకుని భారతదేశంవచ్చి, హిమాలయాలలో తపస్సుచేసుకుని 80సంవత్సరాలు పైబడిన పండువయస్సులో సమాధిచెందాడని చెబుతారు! దీనికి ఒక అత్యాశ్చర్యకరమైన నిదర్శనంకూడా ఇటీవల బయటపడింది! ప్రఖ్యాత ఇంగ్లీషు మాస పత్రిక (Readers Digest)లో 'క్రీస్తు కాశ్మీరులో మరణించాడ'ని ఒక పరిశోధనావ్యాసం ప్రచురింపబడింది. అందులోని ఫోటోలో ఆసమాధి మీద 'హిబ్రూ'(Hebrow)భాషలో చెక్కబడిన శాసనం కూడా కనుగొనబడింది.!!!

ఏదిఏమైనా క్రీస్తు శిలువమీద మరణించలేదన్నది "బైబుల్" కూడా అంగీకరిస్తున్నది. "నాడీజాతకాలు - నాడీగ్రంధాలు" అనే పేరుతో ఋషీశ్వరులైన భృగు, వసిష్ఠ, శుక్ర ప్రోక్తమైన, నాడీగ్రంధాలలో అనేకులు నాశిష్యులూ యోగమిత్రులూ ఇటీవల ఆశ్చర్యంగా చదువుకున్న అనుభవాలు "శుభవార్త" మాసపత్రికలో ఎన్నో వ్యాసాలు ప్రచురించరు.ఇంకా, కీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రి, మాస్టర్. సి.వి.వి.గారి నాడీ జాతకఫలితాలు చూడవచ్చు! దీనికి ఇంకొక ఆధారం కూడా వున్నది. బైబుల్‌లోని కథ ఖురాన్‌లోకూడా "ఆదం" నుండి ఏసుక్రీస్తువరకు "యూదుల చరిత్ర" యధాతధంగా వ్రాయబడియున్నది.

ఖురాన్‌లో కూడా క్రీస్తు శిలువమీద మరణించలేదని, తన శత్రువుల బారినుండి ఈనాటి 'దలైలామా' వలేనే పలాయనం చిత్తగించినట్లే వున్నది. కాశ్మీరులోని - 'క్రీస్తు సమాధి' లభించటంతో భవిష్య పురాణంలో వ్యాసమహర్షి రాసినట్లు లభించటంతో క్రీస్తు

ఇండియారావటం గురించిన వర్నన ఈ విషయాన్నేఋజువుచే స్తున్నాయి. అంతేకాదు. కాశ్మీరులో "క్రీస్తు సమాధి" గా అక్కడి స్థానికులుచూపే సమాధి యిప్పటికీ కన్పిస్తుంది! దీనిమీద "హిబ్రూ" (Hebrow) భాషలో వ్రాసిన లిపితో శాసనాలుకూడా నేటికీ, గన్పిస్తున్నాయి! దీనివల్లకూడా "భవిష్యపురాణం"లో "ఈశ పుత్రుడు" అనే పేరుగల ఏసు ("Isha") హిమాలయాలకి వచ్చి శాలివాహన చక్రవర్తిని దర్శిస్తాడని రాసినదానికి ప్రత్యక్షచారిత్రక ఆధారాలు కన్పిస్తున్నాయి!! ఇతడు "మ్లేచ్ఛ-జాతుల"కు ప్రవక్త అని ఈతనిని వాని దేశీయులు "మసీహా" (Messaiah) అనిపిలుస్తారని కూడా "భవిష్యపురాణం" - సరిగ్గా "నాడీగ్రంధాల"లో పుట్టబోయేవారి జాతకాలను వారిపేర్లతోసహా వర్ణించినట్లుగానే వర్ణిస్తుంది!

'నాడీగ్రంధాలు' వ్రాసిందికూడా వేదవ్యాసమహర్షి శిష్యులైన 8,800మంది ఋషులే!! కలియుగ ప్రారంభంలో 'భవిష్యపురాణంలో' ప్రపంచ భవిష్యత్తు వ్రాసినట్లే ప్రతిప్రాంతంలోనూ జన్మించబోయేవారి భవిష్యత్తునూ లిఖించిపెట్టినవేనని అవే -- నేటి "సరస్వతీ మహల్" గ్రంధాలయం తంజావూరులో లభిస్తున్నాయనీ నా పరిశోధనలో తేలింది.

నేటి బైబుల్ కంటే భవిష్య పురాణంలోని సంఘటనలే చారిత్ర కంగా ఎక్కువ సత్యమని దీనివల్ల ఋజువవుతున్నాయి! బైబిల్ లో వ్రాయబడిన క్రీస్తుకధలో చాలాభాగం, క్రీస్తు మరణించిన 800 సంవత్సరాల తరువాతకూడా అనేక మార్పులూ చేర్పులూ చేయబడిన "బైబుల్" లో చేర్పబడిన 'అతుకులబొంత' అని క్రిస్టియన్ మతంలోని బిషప్‌లు, పండితులు బైబుల్‌పై పరిశోధనచేసి వారందరూ కూడా అంగీకరించిన విషయమే!

వీటన్నిటికీ మూలమైన మ్లేచ్ఛజాతి (Semitic Race)యొక్క సృష్టి, ఈ "కలియుగం" ప్రారంభానికి ముందే 'ఎలా జరిగిందో' "కలిపురుషుని" ప్రభావంతో ప్రపంచమంతటా వ్యాపించిన "పాశ్చాత్య

సంస్కృతి" (Western Culture) "కలియుగ ప్రారంభానికి"ముందే ఎలాగ బీజం ఎలా నాటబడిందో, ఆ తెరవెనుకగాధ అంతాకూడా "భవిష్యపురాణం"లో ఆశ్చర్యకరంగా వర్ణించబడింది.

## మహమ్మద్ ప్రవక్త పుట్టుక :-

క్రీస్తుతర్వాత ప్రవక్త అయిన 'మహ్మామ్మదు' గురించి "భవిష్యపు రాణం" ఏమివ్రాసిందో చూస్తే ఇంకాఆశ్చర్యమేస్తుంది.

భవిష్యపురాణంలో ఆతరువాత వచ్చిన ప్రవక్తలలో వ్యాసమహర్షి వర్ణించింది 'మహమ్మద్' ప్రవక్త జననాన్ని! అతనిభవిష్యత్తును తెలపటమే గాక అతని పేరుకూడాతెలిపాడు ఎంతో ఆశ్చర్యంగా!

"మహామద ఇతిఖ్యాతః
మ్లేచ్ఛ ఆచార్యేణ సమన్వితః"
-- భవిష్యపురాణం
(ప్రతిసర్గపర్వం)

మ్లేచ్ఛులకు గురువైన "మహమదు" డనేపేరుగల 'ప్రవక్త' జన్మించటం, ఆయన అనుయాయులందరూ

"ముసలవంతశ్చయే ఖ్యాతాః"

ముసల్ మానులు అని పిలువువబడతారనికూడా తెలిపాడు. ఇంకొక ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే 'మహమ్మద్' ఆరాదించినది 'మఖ్కే-శ్వరుడైన' శివుడేనని స్పష్టంగా వర్ణించాడు! ఈ పేరే ఈనాటి 'మక్కా; (Mecca) అన్న పేరుకి కారణమైంది. అరేబియాలో ఇస్లాం పుట్టుకకుపూర్వము ప్రాచీనహిందూమతము ఉండేదని, 'అల్లా' అనిఖురాన్‌లో పేర్కొనబడ్డ దేవుడుమమఖ్కేశ్వరుడైన శివుడనీ దీనివల్ల ఋజువౌతున్నది.

## ఇస్లాం శైవమా?

ఇంకా పరిశోధనాదృష్టితో చూస్తే కొన్ని ఆశ్చర్యకరమైన నిదర్శనాలు కూడా లభిస్తాయి! హిందూమతంలో ఈనాటికీ శివునికి ఒక ఆకారమేలేదు!! కేవలం ఒక 'లింగము' రూపంలోనే పూజిస్తారు! ముస్లిముల 'అల్లా'(Allah) కూడా నిరాకారుడే!

ఇంకొక నిదర్శనము శివునికి సోమవారం ప్రీతి! శివుని జటాజూటంమీద 'అర్ధచంద్రుడు' వెలుగొందుతాడు. అర్ధచంద్రుడు అర్ద్రానక్షత్రముతో కలిసి 'అర్ద్రా దర్శనం'నాడు ఆకాశంలో కనిపించినదే రుద్రుని పవిత్ర 'దర్శనంగా' శైవులు భావిస్తారు. ఇదే నేటికీ ఇస్లాంమతంలో మసీదులపైన కనిపించే- "అర్ధచంద్రుడూ" దానిపైన నక్షత్రంలోని అర్థం! చాలామంది ముస్లిములకు వారిచిహ్నమైన 'చంద్రవంక నక్షత్రం' యొక్క అర్థంతెలియదు! దీనికి సమాధానము భవిష్యపురాణంలోని 'మఖ్ఖేశ్వరుడైన శివుడు' అన్న వాక్యమే!

## రాణీ సంయుక్త (రాణి సంయోగిని)

ఇలాగ, భవిష్యపురాణం 'మహ్మదు' జననం ఇస్లాంమత స్థాపననూ స్పష్టంగా వర్ణించినది! ఆ తరువాతి భవిష్యత్తు చూద్దాం!

"జయ చంద్రస్య భూపస్య యోషితాః షోడశాభవన్

తాసాం న తనయోహ్యాసిత్ పూర్వకర్మ విపాకతః

గౌఢభూపస్య దుహితా నామ్నా దివ్య విభావరీ!

జయచంద్రస్య మహిషీ తద్దాసీ సురభానవీ!!

రూప యౌవన సంయుక్త రతికేళి విశారధా!

దృష్ట్వా తాం స నృపః కామీ బుభుజే స్మరపీడితః!!

తస్యాం జాతా సుతాదేవి నామ్నా 'సంయోగినీ'శుభా!

ద్వాదశాబ్ద వయ(ప్రాప్తా సా బుభూవ వరంగానా!!

తస్యా స్వయంవరే రాజా ఆహ్వాయద్భూపాన్మం శుభాన్

భూమిరాజస్తు బలవాన్ చ్ఛ్రిత్వా త(ద్రూపముత్తమం

-- భవిష్యపురాణం 3-వ ఖండం 6వ అధ్యయం (4-8శ్లో)

## ముస్లిముల పరిపాలన :-

'భవిష్యపురాణం ఎలాగైతే క్రీస్తు, మహమ్మదుల పుట్టుక వర్ణించినదో చూశాము. 3 తరువాత మస్లిములైన గోరీ, గజనీ మహమ్మదులూ, పృధ్వీరాజు, రాణీసంయుక్త చరిత్రనూకూడా వర్ణించి' మొగలులైన బాబరు, హుమాయూన్‌నుండి ఔరంగజేబువరకూ వర్ణించి బ్రిటీషుపాలన కుడా ఎలా వర్ణించిందో ఇక్కడ గమనిద్దాము.

ఇకపోతే కాలగణనంలో, కలియుగం 3102 B.C.లో ప్రారంభించి నదిమొదలు లెఖ్ఖిస్తూ వస్తే గజనీమహమ్మదు మనదేశానికి 999 A.D. లో మొదట దండయాత్రచేసేనాటికి కలియుగం 2013 B.C సంవత్సరాలు. క్రీస్తుశక 1398 A.D. లో "తైమూరు" మనదేశంపై దండెత్తేనాటికి కలి 4500 సంవత్సరాలు! ముస్లిములపాలన 708 సంవత్సరాలు అంటే 999 A.D ఏళ్ళు జరిగింది!

## మొగలురాజులు :-

'బాబర్' కుమారుడైన "హుమాయూన్" భారతదేశానికి రావడం కూడా ఇలా వ్రాయబడివున్నది.

"బాబరేణ ఛ ధూర్తేణ
ఏహూమాయుస్తనయస్తస్య
కృతం రాజ్యం పితుస్తమం"

ధూర్తుడైన బాబరు కుమారుడు 'హుమాయూను' తండ్రితో సమానంగా పరిపాలిస్తాడనీ, అకస్మాత్తుగా అతని కొడుకు జన్మించినందున "అక్బరు" అనే పేరుతో పాలిస్తాడనీ భవిష్యపురాణం ఈ క్రిందివిధంగా వర్ణిస్తున్నది.

"అకస్మాచ్చ వరో జాతః
తస్మాదకవర స్మృతః"

'అక్బర్' అనేపేరు, బెంగాలీ భాషలో వలే 'వా'కు 'బా'ను ఉపయోగించడంవలన 'అకవరు' - "అక్బర్" అయిందని భవిష్యపురాణం నిర్వచించింది. అకస్మాత్తుగా పుట్టిన శ్రేష్టుడు 'అక్బరు' అనే నామంతో ప్రసిద్ధి చెందాడని పై శ్లోకవచనం అర్థం. తన కొడుకు 'సలీం' (జహాంగీరు) అనే ఆ శ్లోకం

"సలోమా తనయస్తస్యః....
నౌరంగోహి మధ్యమః"

అన్నదమ్ములలో మధ్యవాడైన(మధ్యమః) ఔరంగజేబు (నౌరంగోహి) భారతసామ్రాజ్యాన్ని పరిపాలించడంకూడా భవిష్యపురాణం వర్ణించింది.

ఈ భవిష్యపురాణంలో, గుప్తరాజులతర్వాత ఎన్నోవేల సంవత్సరాల చరిత్ర 'భవిష్యత్' ఎంతో విపులంగా వర్ణింపబడింది. అక్బరు, హూమాయూను, జహంగీరు, ఔరంగజేబు మొదలగు మొగల్ చక్రవర్తులు, శివాజీమొదలైన హిందూరాజులూ వీరందరినీ వర్ణించి, ఆతరువాత బ్రిటీషువారి పరిపాలననూ అందులో ముఖ్యంగా విక్టోరియా మహారాణి గురించీ ఈ క్రిందిశ్లోకంలో వర్ణించింది.

## విక్టోరియా :-

"వికటే పశ్చిమే ద్వీపే తత్పత్నీ వికటావతీ
అష్టకౌశలమార్గేణ రాజ్యమంత్రం చకార హ"

ఎనిమిదిమంది మంత్రుల సలహాసంఘం (Advisory Council) యొక్క సలహాతో భారతదేశాన్ని విక్టోరియా మహారాణి పరిపాలిస్తుందనీ, ఆమె భర్త "వికటుడు" లేక వికటరు (Albert Victor) అనీ, కలకత్తాను దేశపు ముఖ్యపట్టణంగా మార్చి, ఆమె రాజ్యాన్ని పరిపాలిస్తుందనీ భవిష్యపురాణం వర్ణించింది.

## కలియుగం - లెఖ్క :-

ఇలాగ కలియుగ ప్రారంభంనుంచీ విక్టోరియావరకూ పరిపాలించిన రాజుల కాలాలన్నీ కలిపితే- సరిగ్గా విక్టోరియా మరణించేనాటికి అంటే 1901 A.D. కి కలియుగం అయిదువేల సంవత్సరాలు పూర్తి అవుతున్నాయి! ఇదిచాలా ముఖ్యమైన మైలురాయి!

వ్యాసమహర్షి వ్రాసిన భవిష్యత్తు అంతా కలియుగం అయిదువేలు 5000 నిండిన తరువాత వచ్చే "యుగసంధి" గురించీ, ఆ తరువాత వచ్చే కల్క్యవతారం గురించీ, భవిష్యపురాణం, మహాభారతం, భాగవతంలో వివరంగా వర్ణించాయి! మనలాగే ఈనాడు చాలామందికి పండితులకూ పరిశోధకులకూ కూడా, ఈ కలియుగం భవిష్యత్తులో రాబోయే "కల్క్యవతారం" గురించీ - ఆయన జీవితంలోని పూర్తి వివరాలను భవిష్యపురాణం వర్ణించిందని తెలియదు. ఒక "నాడీగ్రంథం"లో లాగ కల్కి అవతార కథలో వర్ణించిన వివరాలు ఏమిటో మీకు, ఇప్పుడే తెలియజేస్తాను!

## మ్లేచ్ఛభాష (ఇంగ్లీష్) :-

కలియుగంలో వేదధర్మమైన దేవతార్చనమును, వేదభాషయైన సంస్కృతమూ క్రమంగా నశించి వానిస్థానే "మ్లేచ్ఛాచారము" (Western Culture) మ్లేచ్ఛమతం (Semitic Religion అనగా క్రైస్తవ ముస్లిము యూదుమతాచారాలు) మ్లేచ్ఛభాష (English) వ్యాపించాయని తెలిపే ఈక్రిందిశ్లోకం ప్రమాణం.

"దేవార్చనం వేదభాషా నష్టా ప్రాప్తే కలౌయుగే

మ్లేచ్ఛాచార్యస్య మూసాఖ్యః తన్మతైః పూరితం జగత్"

మ్లేచ్ఛబాషలంటే :- మ్లేచ్ఛాచార్యుడైన మూసాచార్యుని (Moses) ప్రచారంవల్ల మ్లేచ్ఛాధర్మం వృద్ధియై వేదభాష, వేదమతమూ క్షీణించాయని పైశ్లోకం అర్థం.

ఈ మ్లేచ్ఛభాషలు ఎలావుంటాయోకూడా వేదవ్యాసమహర్షి భవిష్యపురాణంలో సోదాహరణంగా భవిష్యత్తును తెలిపిన ఈక్రింది శ్లోకాలు ఆశ్చర్యం కలిగిస్తాయి.

"ప్రజభాషా మహారాష్ట్రీ, యావనీచ, గురుండిగా

పానీయం పానీ ఇత్యుక్తే, భుభుక్షా భూఖ ఉచ్యతే"

అనగా ఆర్యభాష అయిన సంస్కృతం నశించిపోగా ప్రజభాషయైన హిందీ, మహారాష్ట్రీ (మరాఠీ), యావనీ యవనుల భాష అయిన ఉర్దూ, గురుండిక గురుండులైన ఇంగ్లీషువారుమాట్లాడే ఇంగ్లీషుభాష ఆర్యదేశంలో వ్యాపిస్తాయట! ఈ భాష ఎలావుంటుందంటే

"పానీయం" అనగా 'పానీయమును' -- 'పానీ' అనిపిలుస్తారు! "భుభుక్షా" లేక ఆకలిని -- 'భూక్' అంటారు అని ఈభాషల స్వరూపంకూడా వర్ణించాడు.

ఇంగ్లీషుభాష ఎలావుంటుందో కూడా, వ్యాసమహర్షి తమ భవిష్యపురాణంలో ఇలా వర్ణించారు.

"రవి వారేచ" 'సండే' =Sunday(రవివారం)

షష్టిం "సిక్ట్సీ" వదంతి చ. "సిక్ట్సీ" =Sixty(షష్టి)

అనగా 'రవి వారము' లేక ఆదివారమును 'సన్-డే'(Sunday) అని పలుస్తారనీ అలానే ఈ ఇంగ్లీషుభాషలో షష్టిలేక "అరవై"ని 'సిక్ట్సీ' అని పిలుస్తారనీ - నాడీగ్రంథమైన 'కాకభుషుండి' నాడిలో ఈనాడు వచ్చిన రేడియో - టెలివిజన్లను -పేర్లతోసహా ఎలాగైతే

ఉదహరించారో అలాగే 'భవిష్యపురాణం'లో నేటి భాషలలనులయిదువేల సంవత్సరాల(5000)నాడే పేర్కొనడం చదివితే - ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుంది.



# "అష్టాదశ" - పురాణకర్త

వేదవ్యాసమహర్షి ఒక్క వేదాన్ని ఎలాగైతే విభజించాడో అదే విధంగా వేదంకంటే ప్రాచీనమైన, పురాణసంహితను విభాగించి 18 పురాణాలుగా రచించాడు. ఈ పురాణాలలో ముఖ్యమైన విషయం గత పద్దెనిమిది బ్రహ్మకల్పాలలో జరిగిన సృష్టిచరిత్ర మహాప్రళయముల గాధ, ఇంకా అనేక శాస్త్రాల రహస్యాలతో కలిపి వేదం యొక్క సందేశాన్ని తన అమరవాణితో అద్భుత కావ్యంగా వినిపించాడు.

**"ఇతిహాస పురాణాభ్యాం**
**వేదం సముపబృహితం"**

## వేదార్ధం - వ్యాస సందేశం:-

అని పద్ధెమినిది పురాణాలలోనిసారాన్ని సూచించాడు. పురాణాలు 18 ఎందుకు అంటే, ఈ సంఖ్యకు మంత్ర శాస్త్రములో, జ్యోతిషంలో ఇతిహాసంలో ఒక నిగూఢమైన అర్ధం వున్నది. అందుకే 'వ్యాసమహర్షి' ఈ పద్దెనిమిది పురాణాలేకాక తాను రచించిన మహాభారతంలోకూడా

18 పర్వాలూ, భగవద్గీతలో కూడా 18 అధ్యాయాలూ, భారతయుద్ధంలో పాల్గొన్న సేనలు 18 అక్షౌహిణిలుగానూ ఇంకా 18 ఉప పురాణాలు, 18 లఘు పురాణాలు, 18 అతి పురాణాలుగా ఏర్పరచాడు. దీనివల్ల ఆ సంఖ్యయొక్క ప్రాముఖ్యతనూ తద్వారా మనకో రహస్య సంకేతాన్నీ అందించాలనే ఆయన సంకల్పం.

అదేమిటి! కాలచక్రంలో ప్రతి 18 సంవత్సరాలకీ సూర్యచంద్రులు రాహువుతో కలిసినపుడు ఏర్పడే 'గ్రహణం' తిరిగి ఒక చక్రాకారంగా, మళ్లీ అదేచోటుకి చేరుకుంటుంది. అంటే రాహుకేతువులు రాశిచక్రంలోని 12 రాసులూ ఒక చక్రంతిరిగి వస్తారు. ఇందులో సూర్యుడు మొదలుకొని 9 గ్రహాలు పైనుంచి కిందకూ మళ్లీ కేతువునుంచి 9 గ్రహాలూ కిందినుంచి పైకీ పరిపాలిస్తారు గనుక 9x2=18 సంఖ్య ఏర్పడింది.

**జయము :-**

సంస్కృతంలో ఈ 18 అన్న సంఖ్యకు 'జయ' - మని అర్థము. అందుకనే వ్యాసమహర్షి మహాభారతం ప్రతి పర్వం మొదట్లో ఈ జయమనే శబ్దాన్ని 18 సార్లు పునరావృతంచేశాడు, ఈక్రింది శ్లోకంతో

**"నారాయణం నమస్కృత్య, నరంచైవ నరోత్తమం**
**దేవీం సరస్వతీం వ్యాసం, తతో జయ ముదీరయేత్"**

ఈకారణం చేతనే మహాభారతానికికూడా "జయ" మనే పేరు పెట్టాడు, వ్యాసమహర్షి! ఒక్కొక్క 'కల్పం' లో జరిగిన 'సృష్టికథ' మరోకల్పంలో జరిగే సృష్టికథను పోలివుండినా కొద్దికొద్ది మార్పులతో ఇతర కల్పాలలో కూడా జరుగుతూ వచ్చినప్పటికీ - ఒక్కొక్క కల్పంలో కొద్దిపాటి మార్పుతో జరుగుతుంది. ఈ రహస్యం 18

కల్పాలగురించిన 18 పురాణాల కథావస్తువునూ పోల్చిచూస్తే మనకి తెలుస్తుంది.

ఆయన వ్రాసిన మహాబారతంలో = 18 పర్వాలు.

ఆయన వ్రాసిన భగవద్గీతలో = 18అధ్యాయాలు.

వ్యాసమహర్షి వ్రాసిన మహాపురాణాల సంఖ్య= 18.

మహాభారతయుద్ధంలో సేనల అక్షౌహిణులు కూడా = 18.

ఈ కారణంచేత సృష్టిలోని బ్రహ్మకల్పాలుకూడా 18 మహాకల్పములు ద్వారానే జరుగుతోంది.

## బ్రహ్మ కల్పముల పేరు

1. శ్వేతవరాహ కల్పము
2. నీల లోహిత కల్పము
3. వాసుదేవ కల్పము
4. రధంతర కల్పము
5. రౌరవకల్పము
6. ప్రాణ(దేవ) కల్పము
7. బృహత్ కల్పము
8. కందర్ప కల్పము
9. సత్య కల్పము
10. ఈశాన కల్పము
11. ధ్యాన (తమః)కల్పము
12. సారస్వత కల్పము
13. ఉదాన కల్పము
14. గరుడ కల్పము
15. కూర్మ కల్పము
16. నారసింహ కల్పము
17. సమాధికల్పము
18. ఆగ్నేయ కల్పము
19. విష్ణుజ కల్పము
20. సౌర కల్పము
21. సోమ కల్పము
22. భావన కల్పము

23. సుప్నమాలి కల్పము
24. వైకుంఠ కల్పము
25. అర్చిష కల్పము
26. వల్మీక కల్పము
27. 'మహేశ్వరకల్పము'
28. పితృ కల్పము
29. మానవ కల్పము
30. తత్పురుష కల్పము
31. వైకుంఠ కల్పము
32. లక్ష్మీ కల్పము
33. సావిత్రీ కల్పము
34. అఘోర కల్పము
35. పద్మ కల్పము

అలా గతించిపోయిన 36 మహాకల్పాల చరిత్రే ఈ పద్దెనిమిది మహాపురాణాలలోనూ చూడవచ్చు.

## సృష్టి - చరిత్ర :-

అలాగే ఒక్కొక్క పురాణంలోని 'సృష్టి' చరిత్రా మనువులూ, వారి వంశచరిత్రనూ, వారివారి మన్వంతరముల క్రమమూ, ఇంకా నాలుగు యుగాలలోజరిగే చరిత్ర ప్రతిఒక్క పురాణంలోనూ కొద్ది తేడాతో వర్ణించబడివున్నది. ఒక పురాణంలో ఇవ్వని రహస్య వివ-రాలు మరొక పురాణంలో ఇంకొకచోట ఇస్తూ సందర్భసహితంగా కథను నడిపిస్తూ చివరికి అన్నింటిలోనూ కలిపి అన్ని వేదశాస్త్రాలలోని సైన్సునూ కథాసందర్భాన్నిబట్టి మనకు ఉపదేశించడమే వ్యాసమహర్షి ఉద్దేశ్యం.

వేరువేరు కల్పాలలోని చరిత్రకాబట్టి ఈ 18 పురాణాలలోని కథలు కొద్దికొద్ది తేడాలతో కనబడతాయి!

"మద్వ్యయం భద్వ్యయంచైవ బ్రత్రయం వచతుష్టయం అనాప లింగ కూస్కాని పురాణాని పృథక్ పృథక్"........

అంటే అర్థం - "మద్వ్యయం" = 'మ'తో ప్రారంభించేవి రెండూ 'మత్స్యపురాణం' - మార్కండేయ పురాణం)

(2) 'భ - ద్వయం' = 'భ' తో ప్రారంభించేవి రెండూ ( "భవిష్య-పురాణం" "భాగవతం")

(3) బ్రత్రయం = "బ్ర"తో మొదలయ్యేవి మూడు ( "బ్రహ్మ - పురాణం" 'బ్రహ్మండ పురాణము' "బ్రహ్మవైవర్త పురాణం")

(4) 'వ' చతుష్టయం "వ"తో మొదలయ్యేవి నాలుగు ('వాయుపు-రాణం' 'విష్ణుపురాణం' 'వరాహ పురాణం' 'వామనపురాణం'

(5) అనాపలింగ ('అ') = అగ్ని పురాణం "ప" = పద్మపురాణం 'లిం' = లింగ పురాణం 'కూ' = 'కూర్మ పురాణం' "గ" = 'గరుడ పురాణం' "నా" = 'నారద పురాణం' "స్కా" = 'స్కాంద పురాణం — ఇవి 18 - మహా పురాణాలు

ఈ రహస్యం తెలియని ఇంగ్లీషు చదువుకున్న ఈనాటి ప్రొఫెస-ర్‌లు **'ఒక పురాణంలోంచి ఇంకొక పురాణం కాపీచేసిందనీ'** వేరువేరు పురాణాలు వేరువేరు శతాబ్దాలలో వ్రాయబడ్డాయనీ, ఇంకా వేర్వేరు వ్యక్తులు వ్యాసునిపేర వ్రాసి ఈ గ్రంధాలను ఏర్పాటుచేశారనీ ఇలా ఎవరికి తోచినట్లు వారు **పొట్టకూటికోసం, డిగ్రీలు కావాలి కాబట్టి** చేస్తున్న రచనలే! ప్రజల మనస్సులో గందరగోళం సృష్టిస్తున్నాయి ఇవి, వీరికి సరైన సంస్కృతజ్ఞానం లేకపోవటం అనేదే ముఖ్యకారణము.

## మహాపురాణాలు

కాబట్టి 'పురాణ -సంహిత' నుంచి విడివడ్డ పురాణాలు. 'అ
దశ' అంటే 18 అని, పైన తెలుసుకున్నాము. అవి ఏవి అంటే

1) పద్మ పురాణం
2) మత్స్య పురాణం
3) మార్కండేయ పురాణము
4) భాగవతము
5) బ్రహ్మ పురాణం
6) బ్రహ్మాండ పురాణం
7) బ్రహ్మవైవర్త పురాణం
8) వాయు పురాణం
9) వామన పురాణం
10) వరాహ పురాణం
11) విష్ణు పురాణం
12) అగ్ని పురాణం
13) లింగ పురాణం
14) కూర్మ పురాణం
15) స్కాంద పురాణం
16) గరుడ పురాణం
17) నారసింహ పురాణం
18) భవిష్య పురాణం .

## ఉప పురాణాలు-

ఇవికాక "ఉపపురాణాలు," "లఘుపురాణాలు" కూడా ఉన్నాయి. ఈ ఉపపురాణాలు కూడా పద్దెనిమిదే. అవి

1. సనత్కుమార పురాణం
2. నారసింహపురాణం
3. వాయువీయ పురాణం
4. శివధర్మపురాణం
5. దూర్వాస పురాణం (ఆశ్చర్య పురాణం)
6. నారదీయపురాణం
7. నందికేశ్వర పురాణం
8. ఔశీనసపురాణం
9. కపిల పురాణం
10. వారుణపురాణం

11. శామ్యపురాణం (యమపురాణం)
12. కాళికాపురాణం
13. మాహేశ్వర పురాణం
14. కల్కి పురాణం
15. దైవీపురాణం
16. పారాశరపురాణం (పరాశర)
17. మరీచిపురాణం
18. భాస్కర పురాణం

## అతిపురాణాలు;

ఉపపురాణాలు పైన చూపినవికాక 'అతిపురాణములు' అనబడేవి ఈ క్రింద పట్టికలో చూపబడినవి.

1. బృహన్నారదీయపురాణం
2. బృహద్విష్ణుపురాణం
3. బృహద్వామనపురాణం
4. బృహన్మత్స్యపురాణం
5. బృహత్ స్వాయంభూపురాణం
6. బృహద్ధర్మపురాణం
7. గణేశపురాణం
8. కూర్మపురాణం
9. బ్రహ్మపురాణం
10. బృహత్ విష్ణుధర్మపురాణం
11. బృహన్నారసింహపురాణం
12. బృహత్ ఔశీనసపురాణం
13. దేవీ పురాణం
14. భవిష్యోత్తరపురాణం
15. బృహన్నందికేశ్వరపురాణం
16. వశిష్ఠ పురాణం
17. యుగపురాణం
18. మానవ పురాణం

## లఘు పురాణాలు;

లఘు పురాణాలు కూడా పద్దెనిమిది గా చెప్పబడినాయి! ఇంకా

లఘు పురాణాలపై ఎంతో పరిశోధన చేయవలసి వున్నది.

1. లఘునారదీయ పురాణం
2. లఘు వామనపురాణం
3. లఘు బ్రహ్మవైవర్తపురాణం
4. స్వల్ప మత్స్యపురాణం
5. ఆత్మ పురాణం
6. శివ ఉత్తరఖండం
7. వృద్ధపద్మపురాణం
8. ఋజుపురాణం
9. పశుపతి పురాణం
10. పరానంద (లేక) నందానందపురాణం
11. చండీ పురాణం
12. అంగీరస పురాణం
13. మాఘ పురాణం
14. విష్ణుధర్మోత్తర పురాణం
15. గర్గ పురాణం
16. కార్తవపురాణం
17. సౌర పురాణం
18. భాగవతపురాణం (లఘు)

ఈ పురాణాల సంఖ్యలో "పురాణ - పురుషుడి"యొక్క ఆత్మ-తత్వం ప్రతిపాదించబడిందని సాంఖ్య రహస్యవేత్తలు చెబుతారు. పదిహేడు తత్వాలూ అంతరాత్మతో కలిస్తే పద్దెనిమిది 18- అవుతాయి. ఇదే విషయం వ్యాసుడే ఈక్రింది శ్లోకంలో సూచించాడు.

**యం త్రిధాత్మాన మాత్మస్థం వృతం షోడశభిర్గుణైః**
**ప్రాహు స్సప్తదశం సంఖ్యాస్తస్మై సంఖ్యాత్మనే నమః**

-- మహాభారతం

పై శ్లోకంలో పదిహేడు తత్వాలు పేర్కొనబడినవి. అవి ఏమంటే, ఐదు (5) - కర్మేంద్రియాలు, ఐదూ (5) - జ్ఞానేంద్రియాలు, ఐదు(5)-తన్మాత్రలు, మనోబుద్ధులు కలిసి (3 x 5 + 2) =17 "పదిహేడు" ఇది అహంకారం లేక 'అంతరాత్మ' తో కలిస్తే మొత్తం పద్దెనిమిది (18) అవుతున్నాయి.

## సాత్త్విక, తామస, రాజసిక పురాణాలు :-

పురాణాలను మూడువిధాలుగా విభజించారు. అందులోని కథావస్తువునుబట్టి మానవుడి అంతరాత్మలోని 3 గుణాలైన సత్వ, రజ, తమస్సులని పేరుగలవి ఎలావుంటాయో అలాగే పురాణపురుషుడి అంతరాత్మలోని ఈ 'త్రిగుణాలను' బట్టి ఆయన ఎత్తే అవతారాలు-కూడా సాత్త్విక, తామస, రాజస స్వరూపాలలోనే వుంటాయి.

ఉదాహరణకు జంతురూపాలైన మత్స్య, కూర్మ, వరాహ అవతారాలు **'తామసిక'** అవతారాలు. రాజసికమైనవి భగవంతుడే బ్రహ్మాది సృష్టికర్త అయిన అవతారాలు, అలాగ సృష్టికర్త అయిన బ్రహ్మ **రాజసికంతోను**, సృష్టిని పరిపాలించే విష్ణువు **'సాత్త్విక'** గుణంతోనూ, ప్రళయంలో సృష్టిని సంహరించే రుద్రుడు **'తామస'** రూపాలలోను ఉండడంవలన ఈ పురాణ - గుణాలుకూడా అలానే ఏర్పడినాయి.

అందుకని సాత్త్వికపురాణాలలో విష్ణుమూర్తి మహిమా, రాజసికపురాణాల్లో బ్రహ్మ యొక్క మహాత్మ్యం, అగ్నిహోత్రుని మహిమా( అగ్ని పురాణం) తెలుపబడివవుంటుంది. అలాగే తామసిక పురాణాలలో శివుడు, పితృదేవతలు, సారస్వతుల మహిమలూ తెలుపబడివుంటాయి అని ఈక్రింది శ్లోకంవలన తెలుస్తుంది.

**"సాత్త్వికేషు పురాణేషు మహాత్మ్యమధికం హరేః**
**రాజశేషుచ మహాత్మ్యమధికం బ్రహ్మణో విభుః**
**తద్వదగ్నేశ్చ మహాత్మ్యం తామసేషు శివస్యచ**
**సమత్యేషు సరస్వత్యాః పితౄణాం నిరుచ్యతేః"**

## పురాణాల కథావస్తువు :-

పురాణాలలోని ముఖ్యకథలోని శాస్త్రవిషయం ఇంతకుముందే

వ్యాసుని జ్ఞానసముద్రం అనే అధ్యాయంలో సైన్సు జ్ఞానంతో 'పురాణాలలో సైన్సు' అనే అధ్యాయంలో వివరించాను. ఒక్కొక్క పురాణం గురించి విడివిడిగా వచ్చే అధ్యాయాలలో గమనిద్దాము.



23

# ఉపపురాణాలు

ఉపపురాణాల గురించి గొప్ప పరిశోధకులుగా చలామణీ అయ్యేవారి అజ్ఞానం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. ఈ ఉపపురాణాల గురించి వివరాలకై నేను పరిశోధన చేపట్టిన సందర్భంలో అనేకమంది 'రిసెర్చి' (Research) ప్రముఖులుగా ఇంగ్లీషు చదువుకున్న వర్గాలలో ముద్ర వేసుకొని పాతుకుపోయినవారుకూడా ఈ ఉపపురాణాల్ని గురించి అజ్ఞానం వ్యక్తంచేయడం ఊహకు మించిన ఆశ్చర్యం! గొప్ప ఇంగ్లీషు పరిశోధకుడుగా పేరుపొందిన 'విల్సన్' (Wilson) మహాశయుడు విష్ణుపురాణమునకు వ్రాసిన ఇంగ్లీషు అనువాదానికి తన పరిశోధనాపీఠికలో ఉపపురాణముల గురించి అయిదుపేజీలు మాత్రమే అంటీ అంటనట్టు వ్రాశాడు!

అలాగే ఉద్దండపండితుడని పేరుపొందిన హరప్రసాదశాస్త్రి తన (Preface p.p.CC-CCXV) తన Asiatic Society of Bengal వారి వివరణ కేటలాగులో (Descriptive Catalogue of Sanskrit Manuscripts) ఉపోద్ఘాతంలో కూడా అతి సంగ్రహంగానే ఇచ్చాడు. మన హిస్టరీ ప్రొఫెసర్లు, సంస్కృత ప్రొఫెసర్లు సైతం ప్రామాణికంగా భావించే 'వింటర్‌నిజ్' (Winternitz) మహాశయుడుకూడా తన 'భారతీయ

సాహిత్యచరిత్ర' లో '**ఉపపురాణాల**' గురించి అతి స్వల్పంగా ముట్టీముట్టనట్లు 7-పేజీలలో వ్రాసాడు.

ఇలాగే ఫర్క్యార్(J.N.Farquhar) మహాశయుడు '**భారతీయుల మతసాహిత్యం**' అన్న తన గ్రంథంలో కూడా కొన్ని ఉపపురాణాల్ని మాత్రమే స్పర్శించి తప్పుకున్నాడు. ఇకపోతే '**కేంబ్రిడ్జి హిస్టరీ**' (Cambridge History of India, Vol.1) లో ఒక అరపేజీలో ఈ విషయాన్ని తేల్చివేశాడు. ఇంకొక ప్రబుద్ధుడు '**మేక్‌డోనెల్**' (MacDonnel) ఉపపురాణాల గురించి నాలుగు పంక్తులే వ్రాయగలిగాడు. తెలియకనా ? తెలియకుండాలని ఉద్దేశ్యమా ?

'**మతములపై విజ్ఞానసర్వస్వం**' అనబడే గ్రంథంలో (Encyclopedia of Religion and Ethics. Vol x p.455) కేవలం 14 పంక్తులు మాత్రమే తెల్పాడు.

ఇక గొప్ప సాహిత్యకేంద్రం, పండితుల కేంద్రం అనుకునే రాజమండ్రిలోని వేదపండితులుసైతం '**లఘు పురాణాలు**', '**అతి పురాణాల**' గురించి తమ పరిపూర్ణ అజ్ఞానం వెళ్లబెట్టారు !!! అతికష్టంమీద '**సీతంపేట సంస్కృత కళాశాల అధ్యాపకులు**' మాత్రం '**శబ్దకల్పద్రుమము**' ఆధారంగా ఉపపురాణాల పేర్లు మాత్రం ఇవ్వగలిగారు. ఈ ఉపపురాణాలలోని విశేషాలుగాని '**లఘుపురాణాల**' పేర్లుగాని, '**అతిపురాణాల**' విషయంగాని వీరికెవ్వరికీ తెలియదన్నారు. ఇక పోతే '**ఖిలపురాణాల**' విషయం గురించి, వీరికి అసలే అంతుపట్టదు ! అంతటి గాఢనిద్రలో అజ్ఞానంలోవున్నది మన పండిత ప్రపంచం !!! ఇది కలిప్రభావమా ? నిరంతర స్వార్థచింతన ప్రభావమా ?

ఏమైతేనేమి ? ఈ కారణంవల్ల నేను, విశేష అన్వేషణచేసి, అనేక తాళపత్ర గ్రంథాలు, వ్రాతప్రతులనుకూడా పరిశోధించి ప్రాచీనమైన '**లఘుపురాణాలు**', '**ఉపపురాణాలు**'మాత్రమే కాక '**ఖిలపురాణాల**' గురించి పూర్తి వివరాలను నేనుగా, సంగ్రహించగలిగిన వాటిని భవిష్యత్తులో

పరిశోధకులకు ఉపయోగపడాలని ఇక్కడ పాఠకుల ముందుంచుతున్నాను.

## ' అష్టాదశ - ఉపపురాణాలు :

అష్టాదశపురాణములు వున్నట్లే ఉపపురాణాలు కూడా అదే సంఖ్యలో 18 ఉన్నాయని చాలమందికి తెలియదు. దీనికి ప్రమాణం వున్నదనికూడా తెలియదు! ఈ ఉపపురాణాలు పేర్లు ఏవోకొన్ని కల్పించి చేర్చి ఏర్పరచినవనికూడా విదేశీ మానసపుత్రులైన మనపండితులు, పరిశోధకులు అభిప్రాయపడ్డారు.

## ఉప-పురాణాలు ' అప్రధాన ' పురాణాలుకావు :

ఉపపురాణములు అప్రధానములనే దృష్టి తప్పుడు దృష్టి! అజ్ఞానంతో కూడుకొన్నది. వారి అసమర్ధతను కప్పిపుచ్చుకోవడంకోసం ముసుగుమాత్రమే అని నా పరిశోధనలో తేలింది! ప్రఖ్యాత పరిశోధకుల ఈ క్రింది వాక్యాలు కూడా ఈవిషయాన్నే తెలుపుతున్నాయి.

"In these days when all Indologists are feeling the want of a true history of Indian life and thought of the past, and our able antiquarians are directing their attention and energy towards its reconstruction, it is a matter of great surprise and disappointment that very little is known, and still less, has yet been said about those valuble records of Indian life and thought which are known as '**Upapuranas**' (or Secondary Puranas). The whole responsibility for such apathy of scholars towards these valued treasures must be laid on the high importance which has been attached, deservedly or undeservedly, for hundreds of years, to the

Eighteen 'great'(Maha) Puranas as well as on the disparaging prefix 'Upa' commonly attached to the title Purana to characterise those Puranic works which are different from the 'Great Eighteen'

Whatever the reason may be, we should not, with our critical outlook, befitting the present age and its culture, be swayed by mere tradition, and baseless impression but be ready to give due consideration to this long neglected branch of Sanskrit literature".

## ఉప - పురాణాల సంఖ్య :

మహాపురాణాల్లోనే - ఈ 'ఉపపురాణాలు - అష్టాదశ' అన్న సంఖ్యకు ప్రమాణం లభించడంవల్ల వీరి అనుమానాలు కొట్టిపారేయవలసి ందే! ఎందుకంటే 'కూర్మపురాణంలో' ఈ పద్దెనిమిది ఉపపురాణాల పేర్లూ లభిస్తున్నాయి. అవి ఈ క్రింది ప్రమాణ శ్లోకంలో కనబడుతున్నాయి.

"అన్యాన్యుపపురాణాని మునిభిః కథితాన్యపి
ఆద్యం సనత్కుమారోక్తం నారసింహం తతః పరం
తృతీయం వాయవీయంచ కుమారేణచ భాషితం
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశ భాషితమ్
దూర్వాస ప్రోక్త మాశ్చర్యం, నారదీయమతఃపరం
నందికేశ్వర ముక్తంచ తథైవౌశీనసేరితం
కాపిలం వారుణం శాంభం కాళికా హ్వాయమేవచ
మహేశ్వరం తథా కల్కి, దైవం సర్వార్థ సిద్ధిదం
పరాశరోక్తమపరం మారీచం, భాస్కరాహ్వాయం.

— కూర్మ 1,(i) 17-20

"సనత్కుమారం ప్రథమం నారసింహం తతః పరం,
నారదీయం శివం చైవ దౌర్వాసస మనుత్తమమ్
కాపిలం మానవచ్చైవ తథా చౌశనం సంస్కృతమ్,
వారుణం కాలికాభ్యశ్చ శాంభం నందికృతం శుభం
సౌరం పారాశరం ప్రోక్తమాదిత్యం చాతి విస్తరం,
మహేశ్వరం భాగవతం వాశిష్ఠంచ సవిస్తరం!!
ఏతాన్యుపపురాణాని కథితాని మహాత్మభిః

అదేవిధంగా గరుడపురాణంలోని ఈ క్రింది ప్రమాణశ్లోకం ఇలా తెలుపుతోంది.

"అద్యం సనత్కుమారోక్తం నారసింహమథాపరం
తృతీయం స్కాంద ముద్దిష్టం కుమారేణ తు భాషితం
చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశ భాషితం!
దూర్వాససోక్త మాశ్చర్యం నారదోక్తమతఃపరం!
కాపిలం వామనంచైవ తథైవోశనసేరితం బ్రహ్మాండం
వారుణంచాథ కాలికాహ్వాయ మేవచ!

మాహేశ్వరం తదా సాంబం సౌరం సర్వార్థ సంచయం!
పరాశరోక్తమపరం మారీచం భార్గ వాహ్వాయ"
"సోయం ప్రోక్తశ్చతుష్పంచాశత్ పురాణ సముదాయః"

— అన్న వచనంవల్ల మహాపురాణలని వొదిలితే మొత్తం పురాణాలు - 54 అవుతున్నాయి. (ఉప - 18; అతి=18; లఘు = 18; మొత్తం = 54 అవుతాయి)

అనగా పైశ్లోకంలోని 'ఉపపురాణాలు':

1. సనత్కుమార పురాణం
2. నారసింహపురాణం
3. వాయవీయ పురాణం
4. శివధర్మపురాణం

5. దూర్వాస పురాణం (ఆశ్చర్య పురాణం)
6. నారదీయపురాణం
7. నందికేశ్వర పురాణం
8. ఔశీనసపురాణం
9. కపిల పురాణం
10. వారుణపురాణం
11. శామ్యపురాణం (యమపురాణం)
12. కాళికాపురాణం
13. మహేశ్వర పురాణం
14. కల్కిపురాణం
15. దైవీపురాణం
16. పారాశరపురాణం (పరాశర)
17. మరీచిపురాణం
18. భాస్కర పురాణం.

ఈ 'పద్దెనిమిది ఉపపురాణాలన్న' మాటనే కూర్మపురాణం ఆధారంగా 'శబ్దకల్పద్రుమం'(P.257) కూడా అదే తెలుపుతున్నది.

ఇంతేగాక పద్మపురాణం పాతాళఖండంలో, స్కాందపురాణం (VII) శివమహాత్మ్యఖండం సౌరసంహితలోను, వాయుపురాణంలోని రేవా మహాత్మ్యం లోనూ ఇంకా అనేకచోట్లా మహాపురాణాల్లోనే ఈ ప్రమాణం లభిస్తున్నది. బ్రహ్మవైవర్తపురాణంలోనూ, ఇంకా అనేక పురాణాలను ఆధారంచేసుకొన్న, అనేక ఇతర వ్రతగ్రంధాలలోనూ "ఈ పద్దెనిమిదీ ఉపపురాణాలు" అన్న విషయం ఎంతో స్పష్టంగా తెలుపబడింది. అయినా వీటి గురించి అజ్ఞానం పండితులలో కూడా అపారం!

## ఉపపురాణాలు :-

అనేక పురాణాలలో ఇచ్చిన ఉపపురాణాల వివరాలు కొన్ని కొన్ని భేదాలతో కొన్నింటికి సమాన ప్రాధాన్యత కలిగినవి సరిపోల్చిచూస్తే అందులో ఇవ్వబడిన వివిధ ఉపపురాణాల వివరాల్ని ఈక్రింద చూపిస్తున్నాను.

## I. వారుణోప పురాణంలో :

వారుణోప పురాణము (మొదటి అధ్యాయం) లో ఇవ్వబడిన పురాణాలు ఇలా వున్నాయి.

1. కుమారుడు చెప్పిన అధ్యాయం (అద్యం కుమారగది తమ్)
2. నారసింహ పురాణము
3. నారదీయ పురాణము
4. వశిష్ఠ పురాణము
5. మరీచి పురాణము
6. నందాఖ్య ఉప పురాణము
7. భార్గవ పురాణము
8. మహేశ్వర పురాణము
9. ఔశీనస పురాణము
10. ఆదిత్య పురాణము
11. గణేశ పురాణము
12. కాళికా పురాణము
13. కపిల పురాణము
4. దూర్వాస పురాణము
15. శివధర్మ పురాణము
16. పరాశర ఉపపురాణము (పరాశరేణ కథితమ్)

17. సాంబ పురాణము
18. వరుణ పురాణము

## II ఏకామ్ర పురాణంలో :

ఉప-ఏకామ్రపురాణము మొదటిఖండంలో (20-23 శ్లో) ఇచ్చిన పురాణాలపట్టిక ఈ విధంగా వున్నది.

1. బృహన్నారసింహ పురాణం
2. బృహద్వైష్ణవ పురాణం
3. గరుడ పురాణం
4. బృహత్ నారదీయ పురాణం
5. నారదీయ పురాణం
6. ప్రభాసక పురాణం
7. లీలావతీ పురాణం
8. దేవీ పురాణం
9. కాళికా పురాణం
10. ఔఖేయ పురాణం
11. బృహన్నందీశ పురాణం
12. నందికేశ్వర పురాణం
13. ఏకామ్ర పురాణం
14. ఏకపాద పురాణం
15. లఘు భాగవత పురాణం
16. మృత్యుంజయ పురాణం
17. అంగీరస పురాణం
18. సాంబ పురాణం

## III బ్రహ్మవైవర్తంలో :-

ఇక బ్రహ్మవైవర్త పురాణంలో పేర్కొనబడిన 18

ఉప-పురాణాల వివరాలు గోపాలదాసుని భక్తిరత్నాకరంలో "అష్టాదశ ఉపపురాణాని" చ బ్రహ్మవైవర్తమతే అని ఈ క్రిందివిధంగా ఉదహరించబడి వున్నాయి.

1. సనత్కుమార పురాణం
2. నంద పురాణం
3. నారసింహ పురాణం
4. దూర్వాస పురాణం
5. శివధర్మ పురాణం
6. కపిల పురాణం
7. మానవ పురాణం (మనుపురాణం)
8. శుక్ర లేక "ఉశనస" - (ఔశీనస) పురాణం
9. వరుణ పురాణం
10. బ్రహ్మాండపురాణం
11. కల్కిపురాణం
12. వశిష్ట - (లైంగ) పురాణం
13. మహేశ పురాణం
14. సాంబ పురాణం
15. సౌరపురాణం
16. మారీచ పురాణం
17. భార్గవ (సర్వధర్మ ప్రవర్తక) పురాణం

సనత్కుమారం నారదంచ, నారసింహం తథైవచ
దౌర్వాసనం, శైవధర్మం, కాపిలేయంచ మానవం
శౌక్రంచ వారుణం చైవ వాశిష్టం సాంబమేవచ.
కాళీపురాణం మాహేశం పారాశరంచ భార్గవం
మారీచంచ తథాసౌరం బ్రహ్మాండాఖ్యం తథైవచ
ఏతాన్యుప పురాణాని నిగదంతి పురావిదః
వీరమిత్రోదయం IX పారిభాషికప్రకాశము (12, 18 పేజి - 32)

## IV బృహత్ ఔశనస పురాణంలో :

"ఉశనసు"డు అంటే శుక్రాచార్యుడని అర్థము. తత్ సంబంధితం 'బృహత్ ఔశనస' - ఉపపురాణంలోని "వింధ్యామహాత్మ్యం" (4, అధ్యాయం లో ఇవ్వబడిన జాబితాలో ఇలావున్నవి.

సనత్కుమారం ప్రథమం నారసింహం తథః పరం
నారదీయం శివంచైవ దూర్వాసనం అనుత్తమయం
కాపిలం మానవం పుణ్యం తథా చౌనస నంస్మృదం
వారుణం కాలికార్యాంచ సాంబం నందీకృత శుభం
శౌరం పారాశరం ప్రోక్తం ఆదిత్యాం చాలి విస్తరం
మహేశ్వరం భార్గవాఖ్యం వాశిష్టంచ సవిస్తరం"

అన్న శ్లోకంలోనివి, ఈక్రిందపట్టికగా చూపిస్తున్నాను

1. సనత్కుమార పురాణము
2. నారసింహ పురాణము
3. నారదీయ పురాణము
4. శివధర్మ పురాణము
5. అనుత్తమ పురాణం లేక దూర్వాస పురాణము
6. కపిల పురాణము
7. సంపూర్ణ మానవ పురాణము
8. ఔశీనస పురాణము
9. వరుణ పురాణము
10. కాలికా పురాణము
11. సాంబ పురాణము
12. నందీకృత పురాణము
13. సౌర పురాణము (లేక భాస్కర పురాణం)
14. పరాశర పురాణము

15. అతివిస్తార ఆదిత్యపురాణము (లేక 'బృహత్ ఆదిత్య పురాణము)
16. మహేశ్వర పురాణము
17. భార్గవాఖ్య - భార్గవ పురాణము (శుక్రాచార్యుని పేరున)
18. సవిస్తారమైన వశిష్ఠ పురాణము

## V బృహద్ధర్మ పురాణంలో : -

బృహద్ధర్మపురాణంలోని మొదటి ఖండం (25-23-26) ఉపపురాణాల జాబితా ఇలా యిచ్చింది.

1. ఆది పురాణము
2. ఆదిత్య పురాణము
3. బృహన్నారదీయ పురాణము
4. నారదీయ పురాణము
5. నందీశ్వర పురాణము
6. బృహన్నందీశ్వర పురాణము
7. సాంబ పురాణము
8. క్రియాయోగసార పురాణము
9. కాళికా పురాణము
10. ధర్మ పురాణము
11. విష్ణు ధర్మోత్తర పురాణము
12. శివధర్మ పురాణము
13. విష్ణుధర్మ పురాణము
14. వామన పురాణము
15. వరుణ పురాణము
16. నారసింహ పురాణము
17. భార్గవ పురాణము
18. ఉత్తమ బృహద్ధర్మ పురాణము

## VI పరాశర ఉపపురాణంలో :

పారాశరోప పురాణంలోని 18-ఉపపురాణాలు ఈ క్రిందివిధంగా చెప్పబడినాయి!

1. సనత్కుమార పురాణము
2. నారసింహ పురాణము
3. నంద పురాణము
4. శివ ధర్మ పురాణము
5. దూర్వాస పురాణము
6. నారదీయ పురాణము
7. కపిల పురాణము
8. మానవ పురాణము
9. ఉశనస పురాణము
10. బ్రహ్మాండ పురాణము
11. వరుణ పురాణము
12. కల్కి పురాణము
13. వశిష్ఠ (లైంగ) పురాణము
14. సాంబ పురాణము
15. సౌర పురాణము
16. పరాశర పురాణము
17. మారీచ పురాణము
18. భార్గవ పురాణము

## VII గారుడ పురాణంలో : –

ఈ గరుడ పురాణంలోని ప్రథమఖండంలోనూ, ఇంకా స్కాందపురాణము, ప్రభాస ఖండములోనూ, సూతసంహితలోనూ ఇవ్వబడిన ఉపపురాణాల పట్టికలలో కొద్దిపాటి భేదాలున్నాయి.

1. సనత్కుమారప్రోక్త ఆద్యపురాణం
2. నారసింహ ఉపపురాణము
3. స్కాందములేక కుమారస్వామి చెప్పిన ఉపపురాణము
4. శివదర్మ ఉప పురాణము
5. దూర్వాసోప పురాణము లేక ‘ ఆశ్చర్య పురాణము ’
6. నారదోక్త పురాణము
7. కపిల పురాణము

8. మానవ పురాణము
9. ఔశనస పురాణము
10. బ్రహ్మాండ పురాణము
11. వారుణ పురాణము
12. కాళికా పురాణము

ఇవి కాక మిగతావి పైనచెప్పినవే ఉన్నాయి.

## VIII స్కాంద పురాణంలో : –

అలాగే స్కాందపురాణములోని 'సూత సంహిత' 'శివమహాత్మ్యఖండం' లోనూకూడా ఈ ఉపపురాణాల పట్టిక యివ్వబడింది. అవేమంటే,

1. ఆదిపురాణం : దీనిని సనత్కుమారుడు చెప్పినట్లు చెబుతారు
2. నారసింహ పురాణము
3. నందీశ్వర పురాణము
4. శివధర్మ పురాణము
5. దూర్వాస పురాణము
6. నారదీయ పురాణము
7. కపిల పురాణము
8. మానవ పురాణము
9. ఉశన సీరిత లేక ఔశనస పురాణము
10. బ్రహ్మాండ పురాణము
11. వరుణ పురాణము

పైనచెప్పిన ఉపపురాణాలేకాక ఇంకా మరికొన్ని పురాణాలు కూడా లభిస్తున్నాయి. నేను సేకరించినవి అవన్నీ కలిపితే దాదాపు 54–దాకా వున్నట్టు ఈనాటి పరిశోధకులకు అందిన ఉపపురాణాల సంఖ్య తేలింది.

## అచ్చులో లేని పురాణాలు :

మరికొన్ని "ఉపపురాణాలు" కూడా ధర్మశాస్త్రగ్రంథంలోను, వీరమిత్రోదయం వంటి గ్రంథంలోనూ ఉదహరించబడినవి. కాని వాటి

ప్రతులుమాత్రం - అచ్చులో లేవు! చాలా ఉపపురాణాలు వ్రాతప్రతుల్లో తాళపత్రగ్రంథాలలోనే మారుమూలల్లో మూలుగుతున్నాయి.

ఇలాగ ఏర్పడినవన్నీ 18 మహాపురాణాలతో కలిసి పురాణ సాహిత్యమంతా జల్లెడపట్టితే తేలినవిషయం ఇలావున్నది!

వ్యాసమహర్షి ప్రోక్తమైన 18 **మహాపురాణాలు, 18 ఉపపురాణాల** పేరులో సమానంగా అన్నిగ్రంథాలలో ఉదహరించబడినవి. అలానే 18 **లఘు పురాణాలు,** 18 **అతిపురాణాలు** మాత్రమేకాక 18 **ఖిల పురాణాలు** కూడా వున్నాయి! ఇలా మొత్తం అనేకమంది ఋషుల పేర్లతోవున్న ఇతర పురాణాలను కలిపితే మహాపురాణాలతో కలిపి 108 దాకా వుండవచ్చు.

| | | |
|---|---|---|
| **మహాపురాణాలు** | **18** | |
| **ఉపపురాణాలు** | **18** | |
| **లఘుపురాణాలు** | **18** | లేక **18**X6 = 108 |
| **అతిపురాణాలు** | **18** | |
| **ఖిలపురాణాలు** | **18** | |
| ఇతర పురాణాలు | **18** | |
| **మొత్తం అన్నీ** = | **108** | |

## ఉపపురాణములలోని కథావస్తు పరిశీలన :

కొన్ని ఉపపురాణాలు అతి ప్రాచీనమైనవీ, అజ్ఞాతమైనవీ - వున్నాయి! ఉపపురాణములుగా లభించే వీటిల్లోని కథావస్తువును బట్టి—వీటిని

1. విష్ణుదేవతా సంబంధమైనవి '**వైష్ణవ ఉపపురాణములు**'గానూ
2. శివ సంబంధమైనవి '**శైవ ఉపపురాణములు**'గానూ
3. శక్తికి సంబంధించిన లేదా శక్తిప్రధానమైనవి '**శాక్తేయ ఉపపురాణము**'లనీ
4. సూర్యుడు ప్రధానదేవతగా చెప్పేవి '**సౌర ఉపపురాణములు**'గానూ
5. ఒక ప్రాచీన ఋషిచే చెప్పబడినవి '**ఋషిప్రోక్త పురాణాలు**'గానూ విభాగించబడినాయి. వీటిల్లో విష్ణుదేవతా సంబంధమైన **వైష్ణవ ఉపపురాణాలు** ఈదిగువ యివ్వబడ్డాయి!

**1. విష్ణుధర్మ పురాణము**

2. విష్ణు ధర్మోత్తర పురాణము
3. నారసింహ పురాణము
4. పురుషోత్తమ పురాణము
5. బృహన్నారదీయ పురాణము
6. కల్కి పురాణము
7. క్రియా యోగసార పురాణము
8. బృహన్నారదీయ పురాణము
9. ఆది పురాణము

ఇక శైవప్రధానమైన కథావస్తువుగలవి (6) 'శైవపురాణాలు'గా చెప్పుకోవచ్చు. అవేమంటే—

1. నందికేశ్వర పురాణము
2. మృత్యుంజయ ఉపపురాణము
3. రుద్ర ఉపపురాణము
4. శివధర్మ ఉపపురాణము
5. మహేశ్వర పురాణము
6. వాయదీయ ఉపపురాణము

అలాగే 'శక్తి' ప్రధానంగా వర్ణించబడ్డ ఉపపురాణాలను శాక్తేయములు అంటారు. అవి

1. కాళికా పురాణము
2. దేవీ పురాణము
3. ఛండీ పురాణము
4. మహా భాగవత పురాణము
5. దేవీ భాగవతము
6. శారదా పురాణము

**IV** ఉప పురాణాలలోని ఒక శాఖ సూర్యుడిని ప్రధానంగా అభివర్ణించే కథా వస్తువు కలదిగావున్నది. ఈ శాఖను 'సౌర ఉపపురాణములు' అని వ్యవహరిస్తారు. ఇందులో నాలుగు ఉపపురాణాలను ప్రధానంగా పేర్కొనవచ్చు. అవి

1. సాంబ ఉపపురాణము
2. సౌరధర్మ ఉపపురాణము
3. సూర్య పురాణము
4. సౌర ధర్మోత్తర పురాణము

## ఋషిప్రోక్తములు :

**V** ఒక మహాఋషిపేరిట ప్రవర్తిల్లే ఉప పురాణాలను 'ఋషిప్రోక్త ఉపపురాణాలు' అని వ్యవరిస్తారు. అలాంటివాటిల్లో

1. బృహన్నారదీయ పురాణము
2. దూర్వాస ఉపపురాణము
   లేక ఆశ్చర్య ఉపపురాణము
3. కౌశిక ఉపపురాణము
4. భార్గవ ఉపపురాణము
5. మారీచ ఉపపురాణము
6. పరాశర ఉపపురాణము
7. సనత్కుమారీయ ఉపపురాణము
8. మానవ (లేక) మనుపురాణము

పై అయిదు వర్గాలలోని పురాణాలలోనూ కొన్ని నష్టమైపోయిన లేక 'ఖిల పురాణములు' అని పేర్కొనవచ్చు. మరికొన్ని అచ్చులో దొరకక కేవలం వ్రాతప్రతులరూపంగానే లభిస్తున్నాయి! వీటి ఉనికికి ప్రమాణవాక్యాలు మాత్రం 'వ్రత చూడామణి' వంటి వ్రతగ్రంథాలలో

లభిస్తున్నాయి. ఇప్పుడు ఈ నాలుగురకాల ఉపపురాణాలలోని విషయ పరిచయం చేస్తాను స్థూలంగా!

## సాంబ పురాణం:

"ప్రీత్యా సాంబస్య తత్రార్కో జగతో అనుగ్రహాయచ

స్థితో ద్వాదశ భాగేన మిత్రో మైత్రేణ చక్షుషా"

అన్న 'సాంబ పురాణం'లోని పై శ్లోకంవల్ల, సూర్యుడు 'మిత్ర' అనేపేరుతో తన 12 - రూపాలలోనూ ప్రతిష్టించబడివున్నాడని సూర్యోపాసనను తెలిపే విశేష పురాణం ఈ 'సాంబపురాణం'!!! ఇందులో ద్వాదశాదిత్యుల పేర్లూ, సూర్యోపాసన వల్ల రోగాలు తగ్గే మంత్రశాస్త్ర రహస్యములూ ఉన్నాయి.

ఈ **'సాంబపురాణం'** లో శ్రీకృష్ణుని కుమారుడైన సాంబునికి శ్రీకృష్ణునివల్ల శాపం ఎలావచ్చిందో, దానివల్ల తెల్లకుష్ఠు (బొల్లి) రోగంతో బాధపడి, సూర్యోపాసనద్వారా దాన్ని పోగొట్టుకొని ఆకృతజ్ఞతతో 'కోణార్క'లోని సూర్యదేవాలయాన్ని ఎలానిర్మించాడో ఆచారిత్రక రహస్యాలున్నాయి! దీన్ని వెంకటేశ్వర స్టీమ్ ప్రెస్ బొంబాయి వారు 1899 లో ప్రచురించారు. ఇందులో మొత్తం 84 - అధ్యాయాలున్నాయి. ముందుగా సూర్యుని 'ద్వాదశనామాలు' యివ్వబడినాయి. ఇవి నేటికీ **'సూర్యనమస్కారాలు'** గా ఆరోగ్యంకోసం జపంలో వినియోగించ బడుతున్నాయి!

సూర్యుని శక్తివల్లనే ఈజీవుల సృష్టిజరిగిందనీ, 12 - సంవత్సరాల యజ్ఞంలో సూతుడు ఈపురాణాన్ని వినిపించాడనీ, దీన్ని **"భాస్కర పురాణం"** అన్నపేరుతోనూ "భాస్కరస్య పురాణం" అనీ వర్ణించబడివున్నది!

"క్రియా యాగం," - "సిద్ధియాగం" "మహామండల యాగం" -

సూర్యునివిగ్రహం లేకుండా 'మండలం' ద్వారా ఎలాగ తపస్సుతో పూజించవచ్చో, "కాలచక్రం" అయిన సూర్యుని పరిధిచక్రాన్ని (Ecliptic) ఆకాశంలో 12 - నెలలూ ఎలా ఆరాధించి సూర్యతేజస్సును ఆకర్షించవచ్చోకూడా వర్ణించిందీ పురాణం!!!

ఇంకా సూర్యమంత్రంతో ఎలాగ స్థంబన, మోహన, విద్వేషణ, ఆకర్షణ, ఉచ్చాటనలేకాక, భవిష్యత్తుతెలిపే 'కాలజ్ఞానం' ఎలా వస్తుందో కూడా తెలుపుతోంది. ఇంకా ఛాయా - సూర్యుల చరిత్ర, సూర్యోపాసన, వైవస్వతమనువు కథ, యమున, తపతి చరిత్రవంటి విశేషాలతోపాటూ, భవిష్య పురాణం - బ్రాహ్మపర్వంలోవున్న సూర్యమండల విశేషాలతో ప్రతితీ తిధిలోచేసే కల్పమూ పోలికలు కనబడుతున్నాయి.

ఈ సాంబపురాణం వ్రాతప్రతుల్లోవున్న అనేక అధ్యాయాలు అచ్చు కాబడిన వాటిలో కనబడటంలేదు. ఇందులో ఉదయాచలం, రవిక్షేత్రం అయిన కోణార్క లేక కోణాదిత్యక్షేత్రము, మిత్రవనం, మూలస్థానంవంటి సూర్యక్షేత్రాలు చెప్పబడినాయి. ఇవే క్షేత్రాలూ, సాంబుడు ప్రతిష్ఠించినట్టు చెప్పబడుతున్న సాంబాదిత్యుడు ప్రభాసక్షేత్రంలో సాంబపురం అన్నపేరిట చేసినట్లుగా స్కాందపురాణం (VII - i 100) లోకూడా నిర్ధారణ కాబడినవి.

ఈ సాంబపురాణంలోని సూర్యప్రశంస, ఇతర మహాపురాణాలైన **పద్మపురాణం** (పాతాళఖండం), **కూర్మపురాణం**, వరాహ **పురాణాల లోనూ**, స్కాంద, భవిష్య **పురాణాలలో** కూడా లభిస్తుంది. సౌర, భాస్కర, ఆదిత్య అన్న పేరుగల పురాణాలు మాత్రం లభించటం లేదు.

## సాంబపురాణం - విశేషాలు :

1. ప్రజాపతుల సృష్టిక్రమం వారినుండి అనేక జాతుల జీవరాసులపుట్టుక.
2. బ్రహ్మ పన్నెండుగా విభాగమై ద్వాదశాదిత్యుడుగా - ఇంద్ర, ధాతృ,

పర్జన్య, పూష, త్వష్ట్ర అర్యమ, భగ, వివస్వాను, విష్ణు, అంశుమంత, వరుణ, మిత్రపేర్లతో దేవతాంశలతో జన్మించిన విధానం.

3. వీరినుండి దేవతల సృష్టి

1) ధాతృనుండి - ప్రజాపతి (జీవులపుట్టుక)

2) పర్జన్య - మేఘముల ఉత్పత్తి

3) పూష - పోషించువాడు, ఆహారము, ధాన్యముల ఉత్పత్తి

4) త్వష్ట్ర - చెట్లు, వృక్షములు, ఔషధములు

5) అర్యమ - జీవుల శరీరంలో అవయవములుగా పుట్టినాడు.

6) భగ - భూమియందు దాగినవాడు

7) వివస్వత - నుండి మంటలేక లౌకికాగ్ని. ఆతరువాత కడుపులోని జఠరాగ్ని పుట్టును.

8) విష్ణు - చిత్రభానుడుపుట్టి రాక్షసులు, శతృవులను సంహరించుట

9) అంశుమంతు - నుండి వాయుదేవుడు పుట్టిప్రాణము, సంతోషము జీవులకిచ్చును.

10) వరుణ-సూర్యుని నుండి జలాధిదేవత సముద్రుడు పుట్టుట

11) పన్నెండవ ఆదిత్యుడు మిత్ర నుండి చంద్రభాగానది వద్ద ఆరాధ్యదైవమై విగ్రహరూపం ధరించుట.

12) మార్తాండుడు - అండము లేక బ్రహ్మాండమువిచ్చినవాడు అదితి, కశ్యపులు, సూర్యకిరణముల వివరములు (అధ్యా - 7) వర్ణించబడినవి.

అలానే సూర్యునినుండి వేదాలలోని ఛందస్సుల ఉత్పత్తి (అధ్యా - 8) సూర్యుని ద్వాదశనామములు వాని జపవిధానం చెప్పబడినవి. తొమ్మిదవ అధ్యాయంలో జగత్తుయొక్కసృష్టి వృద్ధి

సాంఖ్యయోగంప్రకారం సృష్టిక్రమమును బ్రహ్మ, విష్ణు మహేశ్వరుల ఉత్పత్తి, సూర్యదేవతనుండి అజ్ఞానం తొలగించు తేజోదేవత సావిత్రి గాయత్రి పుట్టుట, సూర్యాంతరవహి ప్రత్యక్షం! వసు, రుద్ర, ఆదిత్య దేవతలు, అశ్వినులు, దేవతలపుట్టుకలు త్రేతా అగ్నులు, 7X7=49 మరుత్తుల పుట్టుక 9 గ్రహాలు 60 సంవత్సరాల ఉత్పత్తి వాటిఫలితాలు,

వివరాలు గ్రహగోళముల కొలతలు పరిమాణములు వర్ణించబడినాయి.

ఆ తరువాత 18వ అధ్యాయంలో ఈ బ్రహ్మనుండి ఆకాశం స్వర్గలోకం, భువర్లోకముల ఉత్పత్తి, సూర్యునిలోంచి గాయత్రీ దేవత ఎలా సృష్టి అయ్యిందో చెప్పబడినది. 20 వ అధ్యాయంలో వాలఖిల్యదేవ అప్సరస, ఋషి గంధర్వాదులు సూర్యగ్రహం చుట్టూ తిరుగుతూ సూర్యుని ఆరాధించటం!

'సుషుమ్న' - కిరణం: ఇంకా అనేక విశేష రహస్యాలను ఈ పురాణం వర్ణిస్తుంది. సూర్యుడు సుషుమ్న అనే కిరణంద్వారా చంద్రునితో లింకు ఏర్పడి భూమిలోని నీళ్ళను తాగి వర్షంగా వర్షించుట. ఈ సుషుమ్న కిరణంద్వారా గంధర్వదేవతాది గణముల, సూర్యుడు, ఆహారము, ప్రాణశక్తి పంపించుట వర్ణించబడింది! ఇంకా పౌర్ణమి, అమావాస్యలలో దేవతలు చంద్రుని 14 కళలను భక్షించుట అవి, తిరిగి పుట్టుట వర్ణించబడింది!

ఇంకా 22వ అధ్యాయంలో ఈనాడు సైన్సుకే తెలుసనుకునే విషయాలు - రాహువు సూర్యుడిని భక్షించడని, గ్రహణం భూమి నీడలవల్ల ఏర్పడుతున్నదనీ ఈపురాణం వర్ణిస్తోంది. ఇంకా కర్మయోగం క్రియాయోగం సూర్యసిద్ధాంతం లేక ఆదిత్య సిద్ధాంతం త్రయీవిద్య అనబడే సూర్యునిలోని వేదాల ఉపాసనాక్రమం చెప్పబడినది. ఇంకా అనేకమైన ఆశ్చర్య శాస్త్ర రహస్యాలతో ఈ సౌర పురాణంలో లేక ఆదిత్య పురాణంలో, సాంబ పురాణంలోనూ కనిపించే విశేషాలు ఎన్నోవున్నాయి!

## వైష్ణవ ఉపపురాణాలు :

ముఖ్యమైన వైష్ణవ ఉపపురాణాలు నాలుగు చెప్పబడినవి. అవి విష్ణుధర్మ, నరసింహ, విష్ణుధర్మోత్తర ఉపపురాణాలు. ఇవి ప్రధానంగా విష్ణు ప్రధానమైన పురాణాలు. మహాభాగవతంలోని విషయాలతో వీటిలోని

కధావస్తువు పరిపోలివున్నది. ఇందులో 'విష్ణుధర్మోత్తర' 'నారసింహ' పురాణాలు చెప్పబడినవి. వీనిలో విష్ణువుయొక్క అవతారములూ, నాలుగు యుగాలలో ధర్మంలో వచ్చే మార్పులు కలియుగాంత విశేషాలు రానున్న కల్కిఅవతార వివరణ ('నారసింహ పురాణం' 36 నుండి 54) వర్ణించబడినాయి.

బుద్ధావతారం ఇందులో వివరంగా శుద్ధోధనుని కుమారుడుగా చెప్పబడినది. విష్ణుపురాణంలో మాయామోహుడుగా వర్ణించబడినది - అనగా విష్ణుమాయ యొక్క అవతారమూ ఇంకా 28వ అవతారం వర్ణించబడినది!

ఇందులో దశావతారములే కాక వైకుంఠావతారం, నారాయణావ తారం హయగ్రీవ అవతారం 'క్షత్రవిక్రమ అవతారం' కూడా చెప్పబడినవి!

ఈ పురాణాలలో ఇంకా ధర్మశాస్త్ర సంబంధమైన అనేకాంశాలు, దానధర్మాల విధులు, వర్ణాశ్రమ ధర్మములు, పాంచరాత్ర శ్రీవైష్ణవ సిద్ధాంతముకూడా వర్ణించబడినాయి. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహావతారాల గాధలు, శ్రీకృష్ణభక్తి, విష్ణుమూర్తి ఉపాసనావిధానాలు, పర, వ్యూహ, విభవ, అర్చామూర్తులు గురించిన విష్ణురూపాల రహస్యాలూ, వీటిల్లో చెప్పబడ్డాయి.

నారసింహ పురాణంలో పరతత్త్వమైన నారాయణుడిని నారసింహుడుగానూ, బ్రహ్మ విష్ణుశివాత్మకమైన పరబ్రహ్మమూర్తిగానూ వర్ణిస్తుంది. నృశింహతాపనీయ ఉపనిషత్తులో నారసింహ మంత్రాలలో వున్న 32 అక్షరాలకూ అధిదేవతలైన బ్రహ్మ,విష్ణు, సూర్యుడు, రుద్రుడు, మృత్యువు, ఇంద్రుడు మొదలైన 32 దేవతలు వర్ణించబడియున్న విషయమే ఈ నారసింహపురాణములో సిద్ధాంతము చేయబడినది.

ఇంద్రుడు స్త్రీరూపము పొందడం, నారద పుండరీక సంవాదము (అధ్యాయం 64), శ్రీరామప్రాదుర్భావము (41 - 45), సృష్టికర్త

క్రోధమునుండి రుద్రుడుద్భవించడం వర్ణించబడినది. అంతేగాక బ్రహ్మయొక్క మనస్సు నుండి సంకల్ప శక్తి చేత జన్మించిన 10 మంది మహర్షులు - మరీచి, అత్రి, అంగీరసాదుల ఉత్పత్తి వర్ణించబడింది. ఇంకా సూర్యాష్టోత్తర శతనామములు సూర్య చంద్రవంశముల చరిత్రయేకాక భూగోళశాస్త్రముకూడా వర్ణించబడియున్నది. భూమిపై ఖండములు, సముద్రములు, పర్వతములు నదులు, పుణ్యక్షేత్రములు వర్ణించి మాతాపితరులసేవ పుణ్యతీర్థసేవలలో కెల్లా ప్రమాణముగా చెప్పబడినది.

## ఉపాసనా రహస్యాలు :

గణేశమంత్రోపాసనావిధానం, విగ్రహాలను పంచామృతములతో అభిషేకించే విధానము, గరుడ ధ్వజస్థంభ నిర్మాణ విధి, ఆలయప్రాణప్రతిష్టా విధానము వంటి విశేషాలెన్నో వర్ణించబడివున్నాయి.

వశిష్ట అగస్త్యమహర్షుల పుట్టుక, తుంగభద్రాతీర్థ చరిత్ర, నదుల పుట్టుక, మార్కండేయ మహిమ వంటి విషయాలు కూడా ఈ నారసింహ పురాణంలో వర్ణించబడివున్నాయి.

ఇందులోని కొన్ని శ్లోకాలు ప్రస్తుత వరాహ పురాణం లోని శ్లోకాలను పోలివున్నాయి. ఈ చరాచర సృష్టియావత్తూ ఆ నారసింహమూర్తి నుంచే ఉద్భవించేగాథ నారసింహకల్పం ఆధారంగా - ఈ పురాణంలో చెప్పబడివున్నది.

## శాక్తేయ ఉపపురాణాలు :

## దేవీ పురాణం :

ఇప్పుడు లభిస్తున్న దేవి ఉపపురాణం బంగాళి అక్షరాలలో బంగవాసిప్రెస్ కలకత్తావారు బంగాళి అనువాదంతో ప్రచురించారు. ఇది దేవీ భాగవతం కాదు. ఇందులో వర్ణించబడిన శక్తిపేరు వింధ్యావాసిని. వింధ్యపర్వతాలలో సింహవాహినిగా అవతరించిన ఆధ్యపరాశక్తి ( అధ్యా -

720) వర్ణించబడింది. ఇది శివునియొక్క నిద్రాణమైన శక్తి లేక 'యోగనిద్ర' దీనినే సుషుప్తిలో వుంచే యోగనాడి లేక సుషుమ్నగా వర్ణించబడింది. ఇందులో అభ్యుదయ పాదము మొదలుగా ఒక్కొక్క అధ్యాయం పాదములుగా విభజించబడింది. ఈ పురాణం ఎవరితో ఎవరు చెప్పిందో అన్న ప్రస్తావన లేకుండా సరాసరి దేవి చెప్పినట్లు వాక్యాలతో బ్రహ్మనుంచి ఈ పురాణం లభించిన విధంగా వర్ణిస్తుంది ఈ క్రింది శ్లోకం

'' నమస్కృత్య శివందేవిం సర్వభాగవతాం శుభాం

పురాణాం సప్రవక్ష్యామి యథోక్తం బ్రహ్మణాపురా

-దేవి.పు.1:1

# దేవీ పురాణం :

ఇందులోని విషయాలు ముందుగా సృష్టిక్రమము అనేక యుగాలలో దేవి అవతరించిన 60 అవతారాలు వశిష్టుడు వర్ణించినట్లు తెలుపుతుంది. ఇందులో అన్ని పురాణాల విషయాలను సాంభూతంగా చెప్పబడినాయని వర్ణిస్తుంది! అందులో

1. శివునివల్ల విష్ణు, బ్రహ్మలకు చెప్పబడన పురాణవిశేషాలు
2. బ్రహ్మన్ చే బ్రహ్మచేత మాతరిశ్యన్‌కు చెప్పబడిన విశేషాలు.
3. మనువు అత్రి భృగు మహర్షులచే వశిష్ఠునకు చెప్పబడిన విశేషాలు.
4. ఈ విషయాలపై అగస్త్యుడు చెప్పిన ప్రవచనములే భూమిమీద అధిక వ్యాప్తిని పొందుతాయని వర్ణిస్తుంది.

ఇందులో విషయాలు :

1. ప్రథమపాదం – త్రైలోక్యవిజయం, సృష్ట్యారంభంలో దేవీ విజయాలు.
2. రెండవపాదం – త్రైలోక్య అభ్యుదయం - ఇందులో శుక్రుడు దుందుభిని సంహరించటం ఘోరరాక్షసుని జననం విష్ణువునుండి వరంపొందడం,

మారకుని జయించి ప్రపంచాధిపత్యం సంపాదించి చివరకు దేవి వింధ్యపర్వతాలలో అవతరించినపుడు వింధ్యవాసినిచేత సంహరించబడటం. ఈ ఘోరనాముడు మహిషునిగా అవతరించడం మాయాఖ్యనామ రాక్షసుని రుద్రుని పూజించి లోక కంటకులుగా మారితే వారివధ.

3. శుంభ మధనం

4. దేవాసురయుద్ధ పాదం.

5. అంధకాసురుని తారకాసురుని చరిత్ర. బృంగిగా అంధకుని ఉత్తమజననం, కుమారస్వామి జనన, శివకళ్యాణమూ వర్ణించబడివున్నాయి.

ఇంతేకాక కామికావిధ్య లాభము నృపవాహనుడు, అగస్త్యునినుండి పొందటం, చెప్పబడినాయి. కాలవజ్రదండుల దండయాత్ర పాతాళముమీద రసాతలంలోని నాగులపై విజయం, ఉదుంబపురంలో నివశిస్తున్న శుక్రుని అనుగ్రహంచేత మధ్యదేశంలో శాశ్వతంగా వారు నివశించడం వర్ణించబడివున్నాయి.

మిగతా పురాణాలలో కనిపించే క్షీరసముద్రమధన కథ వంటి విశేషాలతోపాటు జైనమునులు (నగ్నులు) విషకన్యల, ప్రసక్తి వీరవ్రతంగురించి వరమాలావివిద్యంతో భార్గవుడు శివునిహృదయంలో ప్రవేశించడంవంటి ఆసక్తికర విశేషాలు ఎన్నో వున్నాయి. అపరాజితా విద్యను, అంగీరస, బృహస్పతి, త్రవ్వర్ష, భరద్వాజ, అంతరిక్ష బహూరుచ శక్తి పరాశర జతూకర్ణులు చెప్పబడ్డారు. ఈ పురాణంలోని విశేషాలు ఇప్పటి దేవి భాగవతానికి అతిప్రాచీనమైన మహర్షుల పరంపరలూ మనకి గోచరింప చేస్తున్నవి!

శక్తి ఉపాసన అగస్త్యునికి, హయగ్రీవునివల్ల వచ్చినట్లు దేవిభాగవతంలో చెప్పినదానితో సరిపోయే ఇతర ఋషుల శక్తి ఉపాసనాపరంపరా మనకు లభ్యమవుతుంది. ఈనాటి పండితులకు

చాలామందికి వీరి ఉనికిగురించి ఆవగింజంతైనా తెలియదంటే ఆశ్చర్యంలేదు.

శ్రీవిద్యోపాసకులమని చెప్పుకొని ఊరికే అనుకునేవారి లలితా సహస్రనామం, చండీసప్తశతి, మాత్రమే అనుకునేవారి భ్రమలను తొలగించే అద్భుతమైన పురాణం దేవిపురాణం. ఇవి ఇంకా వివరంగా ఉపపురాణాల గూర్చి ప్రత్యేక బంధంగా వివరించాలని ఇక్కడ ఇంతటితో విడిచిపెడుతున్నాను. వేదములలోని విశేషములు చెపుతున్న ఈ క్రింది శ్లోకాలు ఈ పురాణ ప్రాచీనత్వం తెలుపుతాయి.

'' అత్రభేదస్తు ఋగ్వేదః దశా చైవ ప్రకీర్తితాః

ఆశ్లేషాః సాంఖ్యాశ్చ చరకస్య యావకాః చరకాస్తథాః

శ్రావణీయాచ క్రమాచ ఉదఃక్రమ వత్రక్రమః

— దేవి.పు.107.13 - 17

దీనిలో ఋగ్వేదంలోని వేదములు వేదాధ్యయన విధానం చెప్పబడివున్నాయి.

## కాళికా ఉపపురాణం :

ప్రస్తుతం లభించే కాళికా పురాణం, కాళీ పురాణమను పేరుతో ధర్మశాస్త్ర గ్రంధాలలో ప్రమాణంగా భావించబడింది. వెంకటేశ్వరప్రెస్ వారు ముద్రించిన ఈపురాణంలో పురుషోత్తముడైన హరికి నమస్కరించి విష్ణుమాయ - కాళీ రూపంలో సతీదేవి అవతారమెత్తి శివుని సంసారమాయలో ఎలాపడేసిందీ వర్ణిస్తుంది. చివరకు మన్మధుని దహించిన శివుడు తన శరీరంలో హరి మాయారూపిణి శక్తికి అర్ధ భాగమిచ్చిన ప్రసక్తి ఆసక్తికరంగా వున్నది. ఇందులో అగ్నిష్వ, బహిష్వలనే పితృదేవతలు తపతి 64- కళలు 49- భావాలు, హోమములు వర్ణించబడినాయి. పితృదేవతల ఉత్పత్తి, సోమప, సుఖాళిక ఆద్సవహ, హవిష్మంత పేర్లతో పితృదేవతలు క్రతు, వశిష్ఠ పులస్త్య. అంగీరసులనుండి ఉద్భవించడం

వర్ణించబడింది.

బ్రహ్మయొక్క స్వేదంనుండి రతీదేవి పుట్టుట ఆమె ముదనునికి భార్యయై 64 కళలు, శృంగార భావములు పుట్టుట వర్ణించబడింది. మన్మధునియొక్క చరిత్ర విస్తారంగా వర్ణించబడింది. దక్షిణాగ్ని గారపత్యాగ్ని, ఆహవనీయాగ్నిల ఉత్పత్తిక్రమం వర్ణించినది.

తరువాత 32వ అధ్యాయంలో అకాల ప్రళయం జరిగిందని దీని తర్వాత కూర్మావతారం భూమిని చదునుచేసి, ఉద్ధరించిందనీ, 35వ అధ్యాయంలో వర్ణిస్తుంది. ఇంకా ఇందులో మహాభైరవ సాంప్రదాయం కాపాలికధర్మం, స్మశానభైరవ విద్య, కాళి, ప్రచండకాళివర్ణన; శవంపై కూర్చుని చేసే శవపూజ, 36వ అధ్యాయంలో వర్ణిస్తుంది. తర్వాత నరకాసురుని కధ, కిరాతక వృత్తాంతమువంటి అనేక విశేషాలు, మేనక హిమవంతుని భార్యయైన విధానం ఆమె 27సంవత్సరాలు తపస్సు చేసి కాళికను కుమార్తెగాపొందిన విధానం వర్ణిస్తుంది. మహిషాసుర మర్దని ఉపాసన, అనేక విశేషాలు వర్ణిస్తుంది, ఈపురాణం.

## దేవీ భాగవతం :

ఇందులో దేవిని గాయత్రిగా ఈక్రింది శ్లోకంలో కీర్తించి

"సర్వచైతన్య రూపాంతాం ఆద్యాం విద్యాంచ ధీమహి
యోధీయానః ప్రచోదయాత్"

అని పురాణంగా సూతుడు శౌనకాదిమునులకు నైమిశారణ్యంలో చెప్పినట్లు వర్ణించబడింది। దీనిలో 18వేలశ్లోకాలు 318 అధ్యాయాలు 12 స్కంధాలు. ఈ పురాణంతో సృష్టిలో సర్గం, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము వర్ణించబడివున్నాయి, ఈసృష్టి మొత్తం మహాశక్తియొక్క విభూతిగా వర్ణిస్తుంది. ఈ పురాణంలో వ్యాసమహర్షి చరిత్ర. ఘృతాచి అనే అప్సరసనుండి వ్యాసునికి శుకయోగి జన్మించడం చెప్పి, ఆ శుకునికి వ్యాసుడు దేవీ భాగవతం ఉపదేశించాడనీ తెలుపుతుంది.

ఇందులో - "సర్వంఖల్విదం ఏవాహం నాన్యదస్తి సనాతనం"
అని దేవి చెప్పినట్లుగా వర్ణించింది। ఇది **ఉపపురాణాలలో** చెప్పబడిన ప్రస్తుత దేవిభాగవతంయొక్క ప్రాచీన తాళపత్ర గ్రంధాలలో లభిస్తున్నది.

## మహాభాగవత పురాణం :

ఇది బమ్మెరపోతరాజు అనువదించిన శ్రీమద్భాగవతంకాదు. ఇది వేరేపురాణం. దేవీ పూజలను ఉపాసనను తెలిపే ఉపపురాణం. దీనిని గురించి బృహద్ధర్మ పురాణంలో ప్రశంస కన్పిస్తున్నది. ఇది శౌనకాదిమునులకు సూతుడు చెప్పినట్లుగా మహేశ్వరునినుండి నారదునికి, అతనినుంచి వ్యాసునికి, జైమినికీ, లభించినట్లుగా చెప్పబడింది.

ఇందులో దేవిపేర్లు కమల కృష్ణ రాధ, బ్రహ్మ, వాణి, సువాణి, గౌరి అన్న పేర్లతో వర్ణిస్తున్నది. ఇందులో కాపాలికుల, శవపూజ, శివునిపై దేవి అధిష్టించి తాండవించుట వర్ణించబడినది. దక్షచరిత్రతోపాటు మాతంగి, తార, షోడశీ, ఛిన్న, భువనేశ్వరి, ధూమావతి వర్ణనను దాంతోపాటు భగవద్గీతా ప్రశస్తి కనపడుతోంది. ఇది శైవ సమాచారమును ప్రచారం చేసే **కాపాలిక సాంప్రదాయ** పురాణం.

## భవిష్యోత్తర పురాణం :

ఈ భవిష్యోత్తర పురాణము అనేక వ్రతముల గురించి తెలిపే వ్రతగ్రంథంగా పేర్కొనబడింది! అసలు నిజమైన భవిష్యోత్తర పురాణము మృగ్యమైవుండవచ్చు! ఎందుకంటే, ఇప్పటి భవిష్యోత్తర పురాణములోని అనేక అధ్యాయాలు వెంకటేశ్వరప్రెస్‌వారు ముద్రించిన " **భవిష్యపురాణం** "లో కనిపిస్తున్నాయి. కొన్ని వ్రాతప్రతులలో భవిష్యపురాణమునకు ఇది, ఉత్తరపర్వంగా (ఉత్తర రామాయణంవలే) చెప్పబడినట్లు దీని ఆశ్వాసాంత మకుటం తెలుపుతున్నది! కాని ప్రస్తుత **భవిష్యపురాణంలో** ఈ ఉత్తరపర్వం కనిపించడం లేదు!

### గ్రంథపాతం

ప్రస్తుత భవిష్యోత్తర పురాణంలోకూడా చాలా అధ్యాయాలు, ఖండములు గల్లంతుపడిపోయి తాటి ఆకుల ప్రతులు ముందువి వెనుకకు,

వెనకవి ముందుకూ కలిసిపోయి ప్రచురించపడ్డట్టుగా వెంకటేశ్వర స్టీమ్ ప్రెస్‌వారి భవిష్యపురాణంచూస్తే తెలుస్తుంది! ముఖ్యంగా మొగలుల చరిత్ర, మహమ్మద్ గోరీ చరిత్ర వర్ణించాక పూర్వపురాజుల చరిత్రమళ్లీ అందుకుంటున్నది. స్పష్టంగా ఈ ఆశ్వానంలో ముందు వెనుకలు గల్లంతుపడి సరిగ్గా పరిష్కరించబడకముందే అచ్చుపడినట్లు స్పష్టంగా తెలుస్తుంది!

పార్గీటర్ (Pargitor) పండితుడు పురాణాలపై చేసిన పరిశోధన ఆధారంగా - ఇప్పటి 18 పురాణాలలో కనిపించే మనదేశ చరిత్ర భవిష్యత్తు **'కలియుగరాజులవృత్తాంతము'**- మొత్తం అంతా ప్రాచీనమైన **"భవిష్య పురాణం"** నుంచే లభిస్తున్నదని తెలుపుతుంది.

కాని, ప్రాచీనమైన **భవిష్యపురాణం** తాళపత్ర ప్రతి ఈస్ట్‌ఇండియా కంపెనీ హైములో మనదేశంనుండి **తస్కరించుకొనిపోయి బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీ,** ఇండియన్ ఆఫీస్ లైబ్రరీల్లో బ్రిటీషహైమ్‌లో నొక్కిపెట్టబడింది! అది ప్రపంచ చరిత్రను తెలిపే గ్రంథం.

**భవిష్యోత్తర పురాణం** అన్న పేరుతో ఇప్పుడు లభించే పురాణం భవిష్యత్తుగురించి ఏమీ విశేషాలను తెలుపదు. వ్రతముల గురించి, పూజలగురించే తెలుపుతున్నది.

## బృహద్ధర్మ పురాణం :

ఇది అనేక పురాణాలలో ఇది ధర్మశాస్త్ర సారములను తెలిపే ఉపపురాణం. 18 ఉపపురాణాల పట్టికలో ఉదహరించబడినది ఈ బృహద్ధర్మపురాణం. అచ్చులో రెండు ప్రచురణలు లభిస్తున్నాయి. ఒకటి దేవనాగరి ఇంకొకటి బెంగాలీ అక్షరములలో ప్రచురించబడినవి! బంగవంశీవారి ప్రచురణలోవున్న గ్రంధానికి రెండవవారి ప్రచురణకు కొంతభేదం కనబడుతుంది.

ఈ పురాణం **పూర్వఖండము,** మధ్యఖండము, ఉత్తరఖండము

లుగా విభజించబడింది. ఉప పురాణములన్నింటిలోనూ సర్వోత్తమమైన దిగా, అనేకచోట్ల 'ధర్మనామక' పురాణం అని 'ధర్మ సౌజ్ఞిత' ఉపపురాణం అని పేర్కొనబడింది! పూర్వఖండంలో గాయత్రీ మంత్ర రహస్యములగూర్చి విష్ణు,గాయత్రి ఉపాసనగురించి తెలుపుతుంది. సూతుడు శౌనకాది మహామునులకు జాబాలి మహర్షి అడిగిన ప్రశ్నకు సమాధానంగా బదరికాశ్రమంలో చెప్పిన ''పుణ్యం పురాణం ధర్మసౌజ్ఞితం'' అనిపేర్కొనబడింది. ఇందులో అనేక ధర్మాలు - వర్ణాశ్రమ ధర్మములు, తల్లితండ్రుల ఎడల ధర్మములు, తీర్థయాత్రల్లో సేవించే ధర్మములు, గురుపూజా, గురుశిష్యుల ధర్మములూ, ఇంకా - 'అష్టాదశ ఉపపురాణాల పట్టిక, గంగా మహత్యం, సూర్యచంద్ర నక్షత్రముల ప్రశంస, సృష్టిక్రమము, పంచభూతముల ఉత్పత్తితోధర్మము సృష్టికే ఆధారభూతమైనవిధానం తెలుపుతుంది! ఈ పురాణంలో మూడు ఖండములు చెప్పబడినవి.

**1. పూర్వఖండము :**

ధర్మస్వరూపము మూడు పాదములు—సత్యము, దయ, శాంతి, అహింస. వీటిని ఆచరించే సూత్రాలు మూడు అధ్యాయాలలో తెలుపుతుంది! జాజలి తులాధారునికథ వర్ణించబడినది. నాలుగవ అధ్యాయంలో గురువునుంచి మంత్రములు గ్రహించే విధానం గురుపరంపరలో గురువు కుమారునికివుండే ప్రత్యేకత, ఇష్టదేవతా ఆరాధన, తాంత్రిక మంత్రగురువులు. శివ, విష్ణు, దుర్గా ఉపాసనలో పాటించవలసిన ధర్మములు, స్త్రీధర్మములు, వితంతువుల ధర్మములు విస్తారంగా వర్ణించబడివున్నాయి.

ఇంకా తీర్థయాత్రాస్థలముల పేర్లు, తులసీమహత్యము, దేవీ పీఠములు, గంగా యమున, సరస్వతీ నదుల సంగమప్రభావము వర్ణించబడివున్నాయి. కార్తీక అమావాస్యనాడు తులసీవృక్షము పుట్టుట, అలానే వైశాఖ శుద్ధ తదియనాడు బిల్వవృక్ష ఉత్పత్తి, ఉసిరిచెట్టు ఉత్పత్తి, మాఘశుద్ధ ఏకాదశినాడు లక్ష్మీదేవి ఆనందభాష్పములనుంచి

ఎలా పుట్టినది. శివ, విష్ణు, లక్ష్మీపూజలలో ఉసిరిచెట్టుయొక్క మహిమ చెప్పబడినది.

కాలము భగవతస్వరూపమని చెప్పి, వైశాఖ, ఆషాఢ, కార్తీక, మాఘమాసములు కాలపురుషుని చక్రమును పుణ్యతీర్థములని వర్ణించబడినది.

''తత్రాషాఢః కార్తీకశ్చ మాఘో వైశాఖఏవచ
తీర్థా ఉద్దాని మాసావై చత్వారో అభీష్టదాయకాః''
— బృహద్ధర్మపురాణం - I - 15.77

పై విశేషాలేకాక బృహద్ధర్మపురాణం 25 వ అధ్యాయం **మహాపురాణములు ఉపపురాణాలుగా** విభజించి వాటి పట్టికను తెలుపుతుంది. ఇతిహాస పురాణ కావ్యలక్షణములూ - విద్యాదేవత సరస్వతి ఉత్పత్తి, ఛందస్సులయొక్క పుట్టుక చెప్పబడినవి!

**II మధ్యఖండము :**

వ్యాసమహర్షి జాబాలికి చెప్పిన వివరాలను శుకుడు జైమినికి చెప్పినట్లు ఇది, వర్ణిస్తోంది! ఇందులో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల ఉత్పత్తి పరబ్రహ్మనుండి ఈ సృష్టి అయినట్లు త్రిగుణములు కలిగిన ప్రకృతినుంచి దేవతల స్థూలశరీరములు ఏర్పడినట్టూ వర్ణించుతున్నది. !

రెండవ అధ్యాయంలో పద్మంనుండి బ్రహ్మ పుట్టినవిధానం, విద్యా అవిద్య పుట్టుక, బ్రహ్మమానస పుత్రుల జననం స్వయంభువ మనువు, మన్మధుల సృష్టి మహా రుద్రుని పుట్టుక వర్ణిస్తున్నదీ అధ్యాయం.

వైశాఖశుద్ధ తదియనాడు హిమవంతునికి గంగ కుమార్తెగా పుట్టడం వర్ణిస్తుంది, ఈ పురాణం.

**రాగ - రాగిణులు :-**

ఈ పురాణంలో విశేషంగా రాగములూ, రాగిణిలు, వారి పరిచారికల పేర్లూ విశదంగా వర్ణించింది. వసంతరాగం, దీపకరాగం

వంటి రాగములెన్నో పేర్కొనబడినవి.

**III ఉత్తర ఖండము :**

దీనిలో సూర్యచంద్రవంశముల వివరములు వర్ణించబడినది. నాలుగు వర్ణాలవారికి ధర్మము, వివరించబడినది. ఇంకొక ఆసక్తికరవిషయం స్త్రీల సాముద్రిక లక్షణములు, ఏవి మాంగల్యము, ఏవి వైధవ్యాన్ని సూచిస్తాయో వర్ణించబడినది. ఈఖండము సూతుడు శౌనకునకు చెప్పినట్లు జాబాలి మహర్షివ్యాసుని నుంచి గ్రహించిన విషయములు, బ్రాహ్మణులయొక్క ధర్మములలో ముఖ్యంగా సంధ్యావందనవిధానం గాయత్రీమహత్యం, ఆదిత్యపురాణం చదివి తెలుసుకోవలెనని వర్ణించబడి ంది ఈ క్రింది శ్లోకంలో.

''గాయత్రీ వర్ణనోపాది ఆదిత్యాఖ్య పురాణాఖ్యే''

— **బృహద్ధర్మపురాణం** - III.31.

ఇందులో నాలుగువర్ణముల సంకరముతో మ్లేచ్ఛుడు ఎలా జన్మించాడో - **ఈ సంకరజాతుల లిస్టు** ఇవ్వబడినది.

**(I)**. ఉత్తమ సంకరులు **II.** మధ్యమసంకరులు **III.** అంత్యసంకరులు అని మూడు వర్గములుగా విభజించి ఉత్తమసంకరులలో రాజపుత్ర, అంబష్ట సూత కుంభకారులను వర్ణించి, మధ్యమవర్గంలో రజకులు, స్వర్ణకారులు, ఆభీరులు, తైలకారులు, జాలక అంత్య సంకరములో చండాల చర్మకార కుడవ - జాతులు చెప్పబడినాయి. — ఇది ఈనాటి సామాజిక చరిత్రకారులకు ఉపయోగపడే అధ్యాయం. వృత్తులు కమ్మర, సాలి, లేఖక, తాంబూలకారులు, స్వర్ణకారులు, దాసులు లేక సేవకులు మాలాకారులు వంటి అనేకవృత్తులు చెప్పబడినవి!

బ్రాహ్మణులలో వైదిక, స్మార్త ఆనమిక శోత్రీయ బ్రాహ్మణులు వర్ణించబడినారు. గాయత్రి చేయని బ్రాహ్మణులు 16 శాఖీయులు, వారిని పతితులుగాను **ద్విజబంధువులుగా**, వర్ణించబడింది.

'అన్యేషాం షోడశాంనాంతు పురోధాః పతితో ద్విజః'' అని తెలిపింది.

అవతారములనుకూడా ఇలాగే బృహద్ధర్మపురాణం వర్గీకరించి ంది! పరబ్రహ్మ భగవంతుడైన విష్ణువేనని లేక నారాయణుడని తెలిపి ఆయననుండే వ్యూహములుగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు రావడం చెప్పింది. శ్రీకృష్ణ అవతారం వాసుదేవ మూర్తి అవతారమనీ, శ్రీరామకృష్ణ అవతారము, సాక్షాత్తూ పరబ్రహ్మ అవతార మనీ, తెలిపింది. శ్రీకృష్ణచరిత్ర అంతా వర్ణించి ''కలియుగాంతం'', గడచిన - కృతయుగంవింతలూ చెప్పింది! శూద్రులు వేద పురాణాలను అధ్యయనం చేస్తారనీ, వారు బ్రాహ్మణులకు అనేక విద్యలు నేర్పగలిగే స్థితిలోకి వస్తారనీ చెప్పబడింది. పాషండధర్మం, విదేశీయులు యవనులతో భారతదేశం వస్తారని, వారు కులములు అబద్ధమని ప్రచారం చేస్తారనీ, దీనితో ప్రజలు సంకరమై కేవలం సెక్సు ***జీవితమే పరమావధిగా బ్రతికే అధములుగా అవుతారనీ*** (భగ - లింగ ఉపజీవినాః) దొంగలే సాధువులవలే నటిస్తారనీ, మంత్రోపదేశంచేస్తారనీ భవిష్యత్తులోజరగబోయే అనేకవిశేషాలను తెలుపుతుంది.

## కల్కి - అవతారం :

ప్రపంచములో మ్లేచ్ఛులు వృద్ధియై ఆర్యధర్మం అడుగున పడినపుడు కల్కిఅవతారం వస్తుందని - పెద్ద జలప్రళయం జరిగి ఆ తరువాత సత్యయుగారంభం అవుతుందనీ చివరకు మహాపురాణాలలో శ్రీమద్భాగవతం ఎంతటి ఉన్నత పురాణమో ఉపపురాణములలో ఈ బృహద్ధర్మపురాణం అంతటి ఉన్నత పురాణమనీ చెప్పబడినది -

''ఇదంహి వైష్ణవోశాస్త్రం శైవం శాక్తం తధైవచ''

అని ఈ పురాణం పక్షపాతంలేకుండా శైవ, వైష్ణవ శాక్తేయ— సాంప్రదాయాలకు సమానంగా ప్రమాణమైన పురాణమని నొక్కి చెప్పబడింది.

## IV నష్టమైన అలభ్య ఉపపురాణాలు :

ఈనాడు అచ్చులో లభించనిపురాణాలు అనేకం వున్నాయి !

అంతేకాక ప్రస్తుతం వ్రాతప్రతుల్లో కూడా లభించని ఉపపురాణములు దాదాపు 25 ముఖ్యమైన వాటిని పరిశోధకులు గుర్తించారు. వీటి గురించి ధర్మ శాస్త్రగ్రంధాలలో ఉదహరించిన శ్లోకాలవల్ల ఈపురాణాలు అసలు వున్నట్లు తెలుస్తుంది. అలాంటి 'అలభ్య ఉపపురాణాలు' ఇవి !

1. ఆదిత్యపురాణం
2. ఔశనస ఉపపురాణం
3. ఔఖేతక ఉపపురాణం
4. బారహస్పత్య ఉపపురాణం
5. భాగవత ఉపపురాణం
6. బ్రహ్మాండ పురాణం
7. బృహత్ – ఔశనస ఉపపురాణం
8. ఏకపాద ఉపపురాణం
9. గారుడ ఉపపురాణం
10. కూర్మ ఉపపురాణం
11. లఘు బ్రహ్మ వైవర్తపురాణం
12. లీలావతీ పురాణం
13. మాధవీ పురాణం
14. మహేశ ఉపపురాణం
15. మృత్యుంజయ ఉపపురాణం
16. నారదీయ పురాణం
17. పుష్కర పురాణం
18. రుద్ర ఉపపురాణం
19. సౌర ఉపపురాణం

20. సోమ ఉపపురాణం
21. త్వష్ట్ర ఉపపురాణం
22. ఊర్ధ్వ ఉపపురాణం
23. ఉత్తర సౌరపురాణం
24. వామన ఉపపురాణం
25. యమ పురాణం
26. వాయవీయ ఉపపురాణం
27. శారదా పురాణం
28. స్కాంద ఉపపురాణం
29. బృహన్నందికేశ్వర ఉపపురాణం
30. నందికేశ్వర పురాణం
31. నందీ పురాణం
32. సౌకీయ ఉపపురాణం

వంటివి 'అలభ్యమైన ఉపపురాణాలు'గా రమేష్‌చంద్ర హాజ్రా పండితుడు, ఇంకా గౌరీనాథశాస్త్రి, రాధాగోవింద భాషకుడు విద్యావాచస్పతి సునీత కుమార ఛటర్జీవంటి పరిశోధకమండలి పేర్కొన్నది. ఇందులోని కొన్ని ఆసక్తికరమైన విషయాలను కొంచెం స్థూలంగా చెపుతుంది.

## 1.ఆదిత్య ఉపపురాణం : -

ఇది చాలా ప్రాచీనమైన ఉపపురాణంగా తెలుస్తున్నది. దేవీభాగవతం వింధ్యా మాహత్మ్యంలోనూ బృహద్ధర్మ పురాణంలోనూ ఇది పేర్కొనబడింది. భాస్కరపురాణం, ఆదిత్యపురాణమూ ఒకటే అని పరిశోధకులు భావిస్తున్నారు. కాని స్కాందపురాణం మాత్రం వేరుగా కనబడుతుంది. పూర్వ ధర్మశాస్త్రకారుడైన నారాయణభట్టు, నరసింహవాజపేయీ, గోపాల్‌భట్టూ, రఘునందనుడూ ఈ సౌరపురాణం నుండి శ్లోకాలు ఉదహరించారు.

## IV నష్టమైన అలభ్య ఉపపురాణాలు :

ఈనాడు అచ్చులో లభించనిపురాణాలు అనేకం వున్నాయి!

అంతేకాక ప్రస్తుతం వ్రాతప్రతుల్లో కూడా లభించని ఉపపురాణములు దాదాపు 25 ముఖ్యమైన వాటిని పరిశోధకులు గుర్తించారు. వీటి గురించి ధర్మ శాస్త్రగ్రంధాలలో ఉదహరించిన శ్లోకాలవల్ల ఈపురాణాలు అసలు వున్నట్లు తెలుస్తుంది. అలాంటి 'అలభ్య ఉపపురాణాలు' ఇవి!

1. ఆదిత్యపురాణం
2. ఔశనస ఉపపురాణం
3. ఔఖేతక ఉపపురాణం
4. బారహస్పత్య ఉపపురాణం
5. భాగవత ఉపపురాణం
6. బ్రహ్మాండ పురాణం
7. బృహత్ - ఔశనస ఉపపురాణం
8. ఏకపాద ఉపపురాణం
9. గారుడ ఉపపురాణం
10. కూర్మ ఉపపురాణం
11. లఘు బ్రహ్మ వైవర్తపురాణం
12. లీలావతీ పురాణం
13. మాధవీ పురాణం
14. మహేశ ఉపపురాణం
15. మృత్యుంజయ ఉపపురాణం
16. నారదీయ పురాణం
17. పుష్కర పురాణం
18. రుద్ర ఉపపురాణం
19. సౌర ఉపపురాణం

20. సోమ ఉపపురాణం
21. త్వష్ట్ర ఉపపురాణం
22. ఊర్వ్య ఉపపురాణం
23. ఉత్తర సౌరపురాణం
24. వామన ఉపపురాణం
25. యమ పురాణం
26. వాయవీయ ఉపపురాణం
27. శారదా పురాణం
28. స్కాంద ఉపపురాణం
29. బృహన్నందికేశ్వర ఉపపురాణం
30. నందికేశ్వర పురాణం
31. నందీ పురాణం
32. సౌకీయ ఉపపురాణం

వంటివి 'అలభ్యమైన ఉపపురాణాలు'గా రమేష్‌చంద్ర హజ్రా పండితుడు, ఇంకా గౌరీనాథశాస్త్రి, రాధాగోవింద భాషకుడు విద్యావాచస్పతి సునీత కుమార ఛటర్జీవంటి పరిశోధకమండలి పేర్కొన్నది. ఇందులోని కొన్ని ఆసక్తికరమైన విషయాలను కొంచెం స్థూలంగా చెపుతుంది.

## 1. ఆదిత్య ఉపపురాణం : -

ఇది చాలా ప్రాచీనమైన ఉపపురాణంగా తెలుస్తున్నది. దేవీభాగవతం వింధ్యా మాహత్మ్యంలోనూ బృహద్ధర్మ పురాణంలోనూ ఇది పేర్కొనబడింది. భాస్కరపురాణం, ఆదిత్యపురాణమూ ఒకటే అని పరిశోధకులు భావిస్తున్నారు. కాని స్కాందపురాణం మాత్రం వేరుగా కనబడుతుంది. పూర్వ ధర్మశాస్త్రకారుడైన నారాయణభట్టు, నరసింహవాజపేయీ, గోపాల్‌భట్టూ, రఘునందనుడూ ఈ సౌరపురాణం నుండి శ్లోకాలు ఉదహరించారు.

ఆల్బెరునీ (Al-Beruni) పండితుడుకూడా **ఆదిత్య పురాణం** గురించి ప్రశంసించారు. స్కాందపురాణం రేవాఖండంలో **భాస్కరపురాణము** గురించిన ప్రశంసవున్నదికాని, ఇది ప్రస్తుత సాంబపురాణం అని తెలుస్తున్నది. కొన్ని వ్రాతప్రతుల్లో ఈ **"సౌరపురాణం మానవీయ సంహిత"**లో భాగమనీ, అవన్నీ ఆదిత్య పురాణంలోనివనీ కూడా తెలుపుతున్నాయి.

## సౌరపురాణం :

ప్రస్తుత సౌరపురాణం అన్నపేరుతో శివమహత్యమును వర్ణించే పురాణముకాక— దీనికన్నా ప్రాచీనమైన సౌరపురాణం ఒకటి ఉండేది!

కాని, అది ప్రస్తుతం అలభ్యమని తెలుస్తుంది. ఇది సోమపురాణం, త్వష్ట్రపురాణంతోసహా నిబంధకారులచేత పేర్కొనబడింది. **(చూ. సూత చంద్రిక)** నిబంధకారులచేత పేర్కొనబడింది. **(చూ. సూతచంద్రిక)**

## యమపురాణం :

ఇది చాలా **ఉపపురాణాల** పట్టికలలో కనిపించడంలేదు. కాని - హేమాద్రి పండితుడు చతుర్వర్గ చింతామణిలోనూ యమపురాణం పేర్కొనబడింది. సూరమిశ్ర పండితులు జగన్నాథ ప్రకాశకలో యమపురాణం గూర్చి ఉదహరించారు. ఇది ముఖ్యంగా శ్రాద్ధము, పిండప్రధాన వ్రతములగూర్చి తెలిపేదిగా తెలుస్తున్నది.

## ఉత్తర సౌరపురాణం :

ఇది ప్రస్తుత సౌరపురాణం, ఉత్తర భాగంగా కొన్ని వ్రాతప్రతులు తెలుపుతున్నాయి. ఇందులో కొన్ని కాలనిర్ణయ విశేషాలు ఈ విధంగా తెలుపబడినాయి.

**"గురోర్మధ్యమ సంక్రాంతి హీనో యశ్చంద్ర వత్సరః**

అధి సంవత్సరః తస్మిన్ కారయన్ న సవత్రయమ్
వర్జనీయా ప్రయత్నేన ప్రతిష్ఠా సర్వానాకినాం
స్ఫుట సంక్రాంతీ హీనశ్చేత్...ఆహుర్ అధిమాసవత్''

- పై శ్లోకంలో నిత్యాచారప్రదీపకలో హరసౌరములోను పాఠభేదంతో ఉదహరించబడినది. 'ఉత్తర సౌరపురాణం' నుండి. కాని ఆ పురాణం ప్రస్తుతం అలభ్యము!



24

# పురాణాలలో గతసృష్టి -- చరిత్ర!

ఈనాడు సంస్కృతవాఙ్మయంలో "పురాణాలు" అన్న పేరుతో మనకి లభ్యమవుతున్న గ్రంథాలు వ్యాసమహర్షి ప్రణీతములుగా తెలుస్తున్నవి. అవి పద్దెనిమిది మహాపురాణములుగా కనబడుతున్నవి.

ఈ పురాణాలన్నీ వేదముకన్న అతిప్రాచీనమైన "పురాణ సంహిత" నుంచి ఉద్భవించినవే! ఇవి ప్రతి ద్వాపరయుగంలోనూ నారాయణ మహర్షిగా అవతరించే వ్యాసమహర్షిచేత తిరిగి బహిర్గతం చేయబడి మళ్ళీ మళ్ళీ ప్రచారంలోకి వస్తాయి. ఇలాగ చాలాసార్లు జరిగింది. అంటే యిప్పుడు జరిగే 'కలియుగం' ఆరంభానికిముందు జీవించియున్న వ్యాసుడుకాక, అంతకుముందు యుగాలలోని ద్వాపరయుగంలో వ్యాసులు ఇలాగే పురాణాలను బహిర్గతంచేశారు. గతంలోని వ్యాసులు, వారి పేర్లు పరాశరమహర్షి

(వ్యాసుని తండ్రి) వ్రాసిన "విష్ణు పురాణము" ఆధారం చేసుకుని ఈకలియుగంలో వ్రాయబడిన "విష్ణుపురాణ సంహిత" లో ఈవిధంగా వ్రాయబడివున్నవి.

## గతించిన 28 గురు వ్యాసులు

1. బ్రహ్మ
   ఆతర్వాత క్రమముగా
2. స్వాయంభువ ప్రజాపతి
3. ఉశన లేక శుక్రుడు
4. బృహస్పతి
5. సూర్యుడు
6. మృత్యువు
7. దేవేంద్రుడు
8. వశిష్టుడు
9. సారస్వతుడు
10. త్రిధాముడు
11. త్రివృషుడు(వృషభుడు)
12. భరద్వాజుడు
13. అంతరిక్షుడు
14. ధర్ముడు
15. త్రయారుణి
16. ధనుంజయుడు
17. కృతంజయుడు
18. సంజయుడు
19. అత్రి
20. గౌతముడు
21. హార్యాత్మకుడు
22. వేణుడు(వాజిశ్రవుడు)
23. సోముడు,
24. తృణబిందుడు
25. భార్గవుడు
26. శక్తి మహర్షి
27. జాతుకర్ణుడు
28. కృష్ణ ద్వైపాయనుడు

ఈనాడు మనవాళ్ళు "విష్ణుపురాణం" అనుకుని చదివేది నిజంగా ప్రాచీన పరాశరకృత విష్ణుపురాణం కాదు. అది ముస్లిముల దండయాత్రలలో లభించకపోగా దాని ఆధారంతో తయారుచేయబడిన **"విష్ణుపురాణ సంహిత" !** ఇదిగాక ఇంకొక ప్రాచీన **తాటియాకు ప్రతి,** గ్రంథాలలో **టిబెట్టులోనూ** నేపాలులోనూ అచ్చుగాకుండా — **ప్రాచీన విష్ణు పురాణం** రహస్యంగా దాచబడి వున్నది. అదివేరు. ఈనాడు మనకు దొరికే **"విష్ణుపురాణం"** వ్యాసమహర్షి తన అంతిమ పురాణరచనగా చేసిన "శ్రీమద్భాగవతం" లో ఈవిషయం గురించి ఇలావ్రాశాడు. **ఏ రోజునైతే విష్ణువుయొక్క సనాతన అంశమయిన శ్రీకృష్ణ పరబ్రహ్మ శరీరంవదిలివేశాడో - సరిగ్గా**

అదేరోజున అధర్మరూపిమైన 'కలి' ఈ భూమిని ఆక్రమించింది. ఎందుకంటే - ఎంతకాలమైతే శ్రీకృష్ణుని పాదాలు ఈ భూమిని తాకుతూవున్నాయో అంతకాలమూ పాపాత్ముడైన కలిపురుషుడు ఈభూమిని అక్రమించుకోలేక పోయాడు.

ఏ రోజున ధర్మం భూమిని వదిలిందో అదేరోజున ధర్మపుత్రుడైన యుధిష్టిరుడుకూడా తన ధర్మరాజ్యాన్ని వదిలి వేశాడు. ధర్మరాజు పరిపాలించే సమయంలో ఆకాశంలో సప్తర్షులు మఘా నక్షత్రంలో ప్రవేశించి వున్నారు.

పరీక్షిత్తు పట్టాభిషేకంనుంచీ మహాపద్మనందుడనే మొదటి శూద్ర చక్రవర్తి సింహాసనంమీద అభిషిక్తుడు అయ్యేదే గుర్తు! అక్కడి నుంచీ కలి త్వరత్వరగా వృద్ధి అయి అధర్మం ప్రపంచంలో పెరిగిపోయి **"కలియుగ"** ప్రభావం అంతటా తాండవిస్తుంది. పరీక్షిత్తునుంచీ మహాపద్మనందునివరకూ పట్టేకాలము - 1500సంవత్సరములు అని వ్యాసుడు స్పష్టంగా భాగవతం ద్వాదశస్కంధంలోని **"జరగబోయే రాజులచరిత్ర"** **"భవిష్యద్రాజేతిహాసం"** లో పైలాగ వ్రాశాడు.

అని ఆ సమయంలో సప్తఋషులు మఘానక్షత్రం వదిలి, పూర్వాషాఢకి చేరుకున్నారు. కాబట్టి ఈ **"కలియుగం"** పురాణాలలోని చరిత్రకు మనకి మధ్య ఒక గడప వంటిది. గడప ఎలాగైతే ఇంటిలోని వసారాకి, ఇంటి గర్భానికి మధ్యన వంతెనగా ఉంటుందో **"కలియుగం"**లోని ఈ మొదటి సంవత్సరంతో ఆరంభమయ్యే 'కలి - 0' వ సంవత్సరంకూడా అలాంటిదే! ఇప్పుడు మనం చరిత్ర (History)గా చదువుకునే రాజులూ యుద్ధాల **"రాజకీయ చరిత్ర"**కూ ప్రాచీన పూరాణగాధలైన అంతకుపూర్వపు ద్వాపర యుగచరిత్రకు వంతెన.

## పరీక్షిత్తు — కలిలోమొదటి చక్రవర్తి :-

శ్రీకృష్ణ నిర్యాణంతో ప్రారంభమైన కలియుగంలోని మొదటి రాజరిక సంఘటన — పరీక్షిత్తుయొక్క పట్టాభిషేకం. ధర్మజుడు,

శ్రీకృష్ణుడంతటి అవతారమూర్తిని బంధువూ, గురువూ, ప్రేమ పాత్రుడూ అయిన పెన్నిధిని కోల్పోయినవెంటనే జీవితంలో విరక్తి కలిగింది. వెంటనే ఆయనకు నారదుడు సలహాయిచ్చినాడు — "మీరు ఐదుగురూ పంచప్రాణాలవంటివారు. మీకు శ్రీకృష్ణుడు ఆత్మవంటివాడు. ఆత్మపోయిన శరీరంలో ఇక పంచప్రాణాలకు పనిలేనివిధంగా మీరు సన్యసించి మోక్షమార్గం అవలంభించేకాలం ఆసన్నమైంది" - అంటే, తన ఐదుగురు తమ్ములతోపాటు రాజ్యప రిత్యాగం చేసి సన్యసించి మనుమడైన "పరీక్షిత్తు"ను భారతదేశానికి సామ్రాట్టుగా హస్తిన(ఢిల్లీ)లో పట్టాభిషేకం చేసినదికూడా - ఈ ప్రమాధినామ 'కలియుగాది' ('ఉగాది') సంవత్సరమే! ఆరోజునుంచీ మనం "హిష్టరీ"(History) పుస్తకాలలో చదువుకునే చరిత్ర మనదేశపు ఆధునిక పురాణాలలోని ఈ కాలం, చరిత్రగా మొదలైంది! మనంరాసే ఈ చరిత్ర వంటిదికాదు అది, విశ్వచరిత్ర - లేక Universal History.

అంటే ఏదేశానికి ఆదేశం సృష్టించుకున్న 'అభిప్రాయాల' 'కలగూరగంప' గాదు. అంటే ఊహాగానాలమీద, ఉజ్జాయింపుల మీద ఆధారపడ్డ ఊహాచిత్రంకాదు. దీనిలోని కాలగమనం క్రీస్తుశకం 'సీజరు' (Caeser)శకం వంటి ఒక కృత్రిమమైన మైలురాయి తేదీనుంచి లెక్కించేది కాదు! అది ఆకాశంలోని గ్రహాలనుంచి ప్రత్యక్షంగాకంటికి కనిపించే విశ్వకాల గణనంమీద ఆధారపడింది.

## చారిత్రకుల — 'కాలం' :-

అందుకనే ఈనాడు ఫ్రెంచి, ఇంగ్లీషు, రష్యన్ 'సైంటిస్టు'లు వెనక్కి లెక్కించితే — సరిగ్గా పురాణాలుతెలిపేకాలం — సరితూగింది! పాశ్చాత్య జ్యోతిష్కులు ఆశ్చర్యపోయారు!! ఐదు వేలనాటి గ్రహస్థితి నిమిషాలు సెకండ్లతో సహా, ఇలా సరిగ్గా సరిపోవడంచూసి!! అందుకనే వేదవ్యాసమహర్షి దర్శించిన ఈపురాణాలలోని ఈ 'సృష్టి చరిత్ర' వెనకాల ఎంతటి నిర్దుష్టమైన కాలగణనం వున్నదో ఇక్కడ కొంచెం గమనిదాం.

ఆకాశంలో తూర్పున సూర్యుడు ఉదయించి మళ్ళీ తిరిగి అక్కడే ఉదయించే మధ్యకాలం ఒక **'రోజు'** లేక **'దినం'!** అలానే ఒక **'అమావాస్య'** నుంచి ఇంకొక అమావాస్యకు ఒక **'నెల'!** సూర్య - చంద్రులిద్దరూ కలిసి తూర్పుగా ఉదయించేరోజే **అమావాస్య !** అలాగ సంవత్సరంలోని మొదటి నెలలోని మొదటి అమావాస్యతోనే మొదటి **"ఉగాది"** (యుగాది) లెక్క! అలానే తిరిగి అన్ని గ్రహాలూ **'మేషరాశి'** లో ఒక్కచోటచేరి ఉదయించే - ప్రారంభదినమే **'సృష్ట్యాది'**

అలానే అన్నిగ్రహాలూ తిరిగి ఆఖరిరాశియైన **"మీన రాశి"** చివర కలిసి అస్తమించే రోజే పద్నాలుగు మన్వంతరాల చివరికి వచ్చే **"బ్రహ్మ ప్రళయం"!** దీనితో సృష్టిలో ఒక అధ్యాయం అంతమైపోతుంది! ఈ **"సృష్టి"** చక్రంలో ఒక నెల, (మాసం) వంటి కాలం - సరిగ్గా పధ్నాలుగు తిధులలాగే - 14 మన్వంతరాలుగా విభాగించారు.

ఇలాగ ఏర్పడ్డ కాలవిభాగంలో చిన్నది **"కలియుగం"**. అది సరిగ్గా మేషరాశిలో గ్రహాలన్నీ ఒక్కరాశిలో (ఒక్క బిందువుకాదు) చేరిన **'అర్ధరాత్రి'** సమయంలో ఆరంభం అయ్యిందని జ్యోతిష గణితంతో లెక్కించి సరిచూడవచ్చు!

ఇలా ఈ కలియుగంలోజరిగే చరిత్రను - అందులో ఏరాజులు ఎన్నెన్ని సంవత్సరాలు పరిపాలిస్తారో వివరంగా లెక్కయిచ్చాడు వ్యాసమహర్షి! జాతకంలో ఎలాగైతే ప్రతి గ్రహందాని దశ ఇన్నిసంవత్సరాలుంటుందని దానిలో ఫలానా సంఘటనలు జరుగుతాయనీ అందులో ఫలానా అంతర్దశ యిన్నాళ్ళు జరుగుతుందని దాని ఫలితాలు ఇలా ఉంటాయని ఎలాగ చెబుతారో అలాగే - ఈ ప్రపంచం జాతకంలోని దశలవంటివే — ఈ కలియుగం అందులోని **విభాగాలుకూడా!** ఇది ఆశ్చర్యంగా లేదూ? ఇందులో ఊహగాని సందేహంకుగాని తావులేని **'గణితం'** మీద ఆధారపడిన చరిత్రే ఈ పురాణాలలోని **"విశ్వచరిత్ర"!**

ఇక ఈనాడు మనకి లభించే 'అష్టాదశ—పురాణము'లలోని విషయం ఏమిటో గమనిద్దాం:-

## 1. పద్మపురాణం :-

ఇది వ్యాసమహర్షి రచించిన పద్దెనిమిది మహాపురాణాల్లోను మొదటిది.

"తత్ర పురాణంతు, ప్రథమంచ ప్రణీతవ్యా"

అని పేర్కొనబడిన ఈ పురాణం 55 - వేల శ్లోకాలతో ప్రస్తుత సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు పద్మములోనుండి పుట్టిన **'కల్పములో'** జరిగిన సృష్టియొక్క చరిత్రనుతెలిపే మహాపురాణము. దీనిలో ప్రధానంగా విష్ణుదేవుని మహిమగురించి ముఖ్యవిషయంగా వర్ణించి ఆయన నాభికమలంనుండి బ్రహ్మయొక్క పుట్టుకను తెలిపి, ఈ **'పద్మకల్పము'** గురించి వర్ణించే సాత్వికపురాణము.

పురాణంలోని ప్రధానవస్తువునుబట్టి విభజించే సందర్భంలో మనుష్యులలో గల త్రిగుణాలైన సత్వరజస్తమో గుణాల విభాగంలో ఈ పురాణాలు కూడా సాత్విక, రాజస, తామసిక పురాణాలుగా విభజింపబడి వున్నాయి. విష్ణు ప్రాధాన్యత కలిగినవి **"సాత్వికములు"**, బ్రహ్మదేవుని గురించి తెలిపే పురాణములు రాజసికము. శివుని గురించి తెలిపేవి **'తామసికములు'** అన్న మూలసూత్రమే ఈవిభజన వెనుక లీనమైయున్నట్లు కనబడుతుంది.

పద్మపురాణంలో ఆరు ఖండములు ఉన్నాయి. అవి, 1) ఆది ఖండము, 2) భూఖండము 3) బ్రహ్మఖండము, 4) పాతాళఖండము 5) సృష్టిఖండము 6) ఉత్తరఖండము అనే పేర్లతో వున్నాయి. వీటిలో పద్మకల్పములో జరిగిన సృష్టి కథ యావత్తు వర్ణింపబడివున్నది. ఇందులో ప్రహ్లాదుని పూర్వజన్మ వృత్తాంతము, విష్ణుసహస్రనామ మహిమ, పాతాళ ఖండములో వర్ణింపబడిన పూర్వకల్పములో జరిగిన రామాయణ చరిత్ర మనకు దొరికే కుతూహలకరమైన విషయాలు.

## 2. బ్రహ్మ పురాణము :-

ఇది ఆ పద్దెనిమిది పురాణముల పట్టికలో రెండవ పేరు. మొదట బ్రహ్మకల్పంలో జరిగిన సృష్టి కథ బ్రహ్మచేత స్వయముగా ఋషులకు ఉపదేశింపబడిన రాజస పురాణం. ఐదు సర్గలు కల్గిన ఈ బ్రహ్మపురాణము పది (10) వేల శ్లోకములతో కృష్ణచరిత్రయూ, సాంఖ్యయోగ వివరణము, ఇంకా అక్షర స్వరూపవివరణతో యుగాంతములో జరిగే విశేషములూ అనేక పుణ్యక్షేత్రముల మహాత్మ్యవర్ణనము, దీనిలోని విశేషములు.

## 3. విష్ణు పురాణం :-

ఇది వ్యాసుని తండ్రియైన **పరాశర మహర్షి** చేత గడిచిన ద్వాపరయుగంలో ఆయన **వ్యాసుడుగా** ఉన్నప్పుడు మైత్రేయమహర్షికి ఉపదేశించిన **మూల** విష్ణుపురాణముకాదు. ఇప్పటిది పరాశరకృతముగాదు. వ్యాసకృతము! ఈవిషయము తెలియక చాలామంది ఇదే పరాశరకృతమైన **'విష్ణుపురాణం'** అనుకుంటారు! ఇది పరాశరకృతమైన ఈ పురాణం వ్యాసునిచే రచింపబడిన **'అష్టాదశపురాణములలో'** ఎందుకు చేర్చబడినదో తెలియక ఆశ్చర్యపడటంకూడా జరుగుతున్నది. ఇది పరాశరకృత 'విష్ణుపురాణము' కాదని తెలిపేందుకొక నిదర్శనముకూడా వున్నది.

అది ప్రతి అశ్వాసాంతములోనూ - **"ఇతి శ్రీ బ్రహ్మాండ పురాణాంతర్గత విష్ణుపురాణ సంహితాయాం"** అని పేర్కొనబడి వుండటంవల్ల ఇది **వ్యాసునిచే** రచింపబడిన **విష్ణుపురాణమే** గానీ, పరాశరకృతమైన విష్ణుపురాణానికి 'సంహిత' లేక సంక్షేపమని తెలుస్తున్నది.

ఇందులో యావత్ సృష్టి విష్ణుదేవుని విరాట్ స్వరూపంలోపల జరిగే ప్రాణచైతన్యంతో సరిపోల్చబడి వర్ణించబడి వున్నది. ఇంకొక విశేషమేమంటే ఇప్పటి శ్వేతవరాహకల్పమునకు పూర్వమైన **'నీల వరాహకల్పం'**లో జరిగిన వరాహావతార వర్ణనమూ, ఆకల్పములోని

ప్రహ్లాదచరిత్ర ఇంకా ఇప్పుడు జరుగుతున్న శ్వేతవరాహకల్పములోని వరాహావతార గాధ శ్రీమద్భాగవతంలోని కథకంటే తేడాగా వర్ణింపబడడం కూడా చాలామంది గమనించరు.

ఇందులో కృతయుగంలో మనుషులు ఎలావుండేవారో ఆ మానవజాతి వర్ణమ నాలుగుయుగాలలో ప్రజలు జీవిత విదానంలోనూ ధర్మంలోను వచ్చేమార్పులూ, పద్దెనిమిది కల్పాలచరిత్రనూ తెలిపే పద్దెనిమిది పారాణాల పేర్లూ వేదవిభాగంచేసిన విధానమూ సూర్య వంశరాజుల చరిత్ర, ఇంకా ఈ కలికాలం అంతలో వచ్చే "కల్కి - అవతారం", వంటి అనేక విషయాలు ఇందులో విశేషాలు.

## 4. వాయుపురాణము:

అతి ప్రాచీనములైన చారిత్రక విషయాలకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ పూర్తి వివరాలతో, ఎక్కువ లోతుగా వర్ణించబడిన చారిత్రకపురాణమే వాయుపురాణం! అందుకని ఈనాటి పండితులు దీనిని తక్కిన పురాణాలకంటే ప్రాచీనమైనదని భావిస్తారు. మహాభారతంలో ప్రాచీన చరిత్రను తెలిపే సందర్భంలో "వాయుపురాణాన్ని ప్రమాణం వాయుప్రోక్తమనస్మృత్య పురాణం ఋషిసమ్మితం" అని వ్రాసారు. ఇది మహాపురాణంలోనిదని, కాదని కొందరు ఉపపురాణాలలోనిదని కుడా భావించటం జరిగింది!

అసలు విషయం మహాపురాణాలలోని 'వాయుపురాణము' అదే పేరుతోవున్న ఉప పురాణంలోనిదైన వేరేగ్రంధమూ ఈరెండూ వేరు! ఇలాగే పేర్లపోలికతో ఉపపురాణాలు, లఘుపురాణాల పేర్లు మొదలైనవి వస్తే ఈ గందరగోళానికి కారణం తేలికగా బోధపడుతుంది.

'వాయుపురాణం'గా ఇరవైనాలుగువేల(24,000) శ్లోకములుగల ఈ తామస పురాణం ఇప్పటికి అచ్చు అయిన పుస్తకంలో పన్నెండువేల శ్లోకములు మాత్రమే వున్నాయి! తక్కిన శ్లోకాలు అముద్రిత తాళపత్రగ్రంధాలలో ఈనాటికీ మూలుగుతూ వున్నాయి ఇవి ఎవరైనా

దాతలు ప్రచురించకపోతే ఈ తాళపత్రగ్రంధాలుకూడా చెదలుతిని నశించిపోయే ప్రమాదమున్నది.

ఇందులో రెండు ఖండములున్నాయి.

1. **పూర్వఖండము**

2. **ఉత్తర ఖండము**

వాయుపురాణములో వుండవలసింది, నాలుగు పాదములు కలిగి యున్నది. వాటిపేర్లు కుడా వ్యాసమహర్షియిచ్చాదు:- 1)ప్రక్రియ, 2)అనుషంగ 3)ఉపోద్ఘాత 4) ఉపసంహార పాదములు. కాని ఈ నాలుగు పాదములూ ఇప్పుడు అచ్చులోలేవు!! ఇందులో ముప్పై మూడు కల్పములు వాటిసృష్టి -- చరిత్ర వర్ణించబడివున్నాయి. ఇప్పుడు జరుగుతూన్న శ్వేతవరాహకల్పం పేరు ఇందులో కనబడడం ఒక విశేషం! ఇంకొక విశేషం ఏమిటంటే కల్పముల పేర్లు, సంగీతస్వరముల పేర్లతో ఇవ్వబడినాయి. షడమం, గాంధారం, ఋషభంవంటి పేర్లుగల 'కల్పములు' వివరించబడివున్నాయి.

ఇందులో మానవచరిత్రకు పనికివచ్చే అంశాలు చాలా వున్నాయి. అందులో పేర్కొనబడిన వాటిలో **'కృతయుగం'లో** వర్ణాశ్రమాలు **లేవు! శీతోష్ణస్థితి కూడా** 'సంవత్సరం' అంతటా ఒకేలా వుండేది! అన్ని ఋతువులలోనూ -- అన్ని పంటలు పండటం జరిగేది.

**"సర్వేషు ఋతుషు రాజేంద్ర!**

**సర్వం సస్యం ప్రరోహితి"**

-- మహాభారతం (అరణ్యపర్వం)

త్రేతాయుగంనుంచే వర్ణాశ్రమాలు ఏర్పడటం, ఋతువులలో మార్పులు వ్యవసాయం వేరువేరు కాలాలలో వేరువేరు పంటలు పండటం ప్రజలలో ధర్మంనశించడం, డబ్బు, ఆస్తి దాచుకునే స్వార్థం ఏర్పడటం వర్ణాశ్రమ విభాగం దాని శిక్షణకు, ధర్మాన్ని ధిక్కరించిన వారిని దండించే రాజు, తరువాత వారి సామ్రాజ్య

విస్తరణ, దండనీతి శాసనము, మొదలైన ప్రాచీన పరిస్థితులను తెలుపుతుంది. అలాగే ద్వాపరయుగంలో 'అధికారం' అధికంకాగా ధర్మం క్షీణించితే 'కలియుగం'లో కలహములెక్కువవ్వటం మొదలైనవిషయాలెన్నో ఈ పురాణంలో చాలా కనిపిస్తాయి.

ఇది ముఖ్యంగా శివమహిమను వర్ణించే పురాణం. అందుకని 'శివపురాణం' అంటారు. ఇందులో ప్రాచీన రాజవంశాల చరిత్ర వివరాలు వ్రాయబడివున్నాయి. జ్యోతిషం, సంగీతం, అలంకార శాస్త్రం, శ్రాద్ధవిధానం, తిథులు, వర్జ్యాలు వంటి జ్యోతిష విష యాలుకూడా ఎక్కువగా వర్ణించబడివున్నాయి.

## 5. శ్రీమద్భాగవతం :-

ఇది రచనాక్రమంలో వ్యాసమహర్షిచేత చిట్టచివరిదిగా వ్రాయబడి నందువల్ల దీంట్లో మోక్షవిషయమమే ప్రధానాంశం. **'భగవంతుని'** పేరుపై **'తద్ధిత'** – భాగవతశబ్దము! ఇది సాత్విక పురాణం, విష్ణుదేవుడు దీనిలో ప్రధాన దేవత!

ఈ భాగవతము వ్యాసమహర్షి 18 పురాణాలు రచించినతరువాత నారదుని ప్రేరణచేత బ్రహ్మజ్ఞానమైన 'బ్రహ్మసూత్రముల'. లోని విషయాలూ భక్తిసూత్రములనుకూడా రచించి జ్ఞానయోగంతో కూడిన భక్తిని ఉపాసించే **'భాగవత ధర్మాన్ని'** వివరించే కడపటి పవిత్రగ్రంథంగా భావించబడుతోంది.

## 6. నారద పురాణం :-

ఇది గడచిపోయిన బృహత్కల్పంలో జరిగిన కథ. బ్రహ్మమానస పుత్రులైన సనక సనందాదులు నారదునికి చెప్పిన సృష్టి చరిత్రను తెలిపే ఇరవైఐదువేల శ్లోకముల గ్రంధము!

మొదట కథానుసారంగా పురుషునియొక్క శుక్లము స్త్రీయొక్క శోణితముతో సంయోగము పొందినప్పుడు గర్భము కలిగే విధానం,

ఆ గర్భస్థ జీవుని పిండోత్పత్తిక్రమం వర్ణించబడినది. ఆతర్వాత శిశువు అవస్థ, ఆశిశువు రోదనమూ మొదలైన విషయాలు ఈనాడు వైద్యగ్రంధాలలోవున్న 'సైన్సు' రహస్యాలెన్నో వర్ణించబడివున్నవి! ఆ తరువాత యోగసాధన అవసరమని చెప్పి 'అష్టాంగ యోగము'తో ప్రారంభించి యోగశాస్త్రము పూర్తిగా నిరూపించబడివుంది.

యోగసాధనతో వచ్చే 'మోక్షము' యొక్క వర్ణన, యోగసద్ధి ప్రశంసా తెలిపే 'భృగు- భరద్వాజ సంవాదము' ఆసక్తిగా నడచినది. ఈ నారదపురాణములోని విశేషము – విశ్వంపుట్టుకకు, జీవుని పిండోత్పత్తితోగల సమానత్వాన్ని నిరూపించే నిగూఢ ఆధ్యాత్మిక రహస్యాలుగల పురాణం! దీనివల్ల బ్రహ్మాండసృష్టికీ లోపలిశరీరంలోని పిండాండ సృష్టికి పోలిక చూపించబడింది.

తరువాత తిరిగి 'సృష్టి–క్రమము' చెప్పబడింది! ఈ పురాణంలోని విశేషం ఏమంటే ఇందులోని సృష్టి కధలో రెండుసార్లు ఆకాశంనుంచి 'నీరు' పుట్టినట్లుగాను, ఒకసారి 'ఆకాశం'నుంచి వాయువుఉద్భవమైనట్లుగానూ చెప్పబడినది. తరువాత ఆకాశగుణ రూపమైన 'శబ్దం' నుంచే 1. 'షడ్జం'2. ఋషభం, 3.గాంధార, 4. మధ్యమ 5. పంచమ, 6. దైవ, 7. విషాదంవంటి సప్తస్వరముల ఉత్పత్తికూడా తెలుపబడినది. కారణం -- నారదుడు సంగీతవేత్త! నారదునికి సృష్టి యావత్తు సామగానంద్వారా ఉపదేశించడమే 'నారద పురాణం' ఉద్దేశ్యం!

ఇలా వ్యాసమహర్షి సంగీతస్వరాల సామ్యంతో సృష్టిని వర్ణించడంలో ఉద్దేశ్యం నిగూఢమైన సామవేదసారమైన సంగీతంలోని ఏడుస్వరాలతో బ్రహ్మరూపమైన గాయత్రిలోని ఏడువ్యాహృతులలోని "శబ్దబ్రహ్మ" ద్వారా ఏడు లోకాలు, ఏడుగ్రహమండలాలు, ఆమండలాలను పరిపాలించే ఏడుగురు సప్తఋషులనూ తెలిపి, సమస్త సృష్టినీ ఏడుస్వరాలతో నడిచే ఆనందగీతంగా గానంచేయబడే 'గాయత్రి'గా ఈ నారదపురాణంద్వారా సూచించటమే.

## 7. మార్కండేయ పురాణం :-

మహా పురాణాలలో "మార్కండేయ పురాణం" ఏడవది. ఇది "మాధురీ కల్పం"లో జరిగిన సృష్టిచరిత్రను తెలిపే రాజసిక పురాణము! ఇది ఎనిమిదివేల శ్లోకములు కలిగిన మహాపురాణము!

మార్కండేయుడు తన జపతపాలు అనుష్ఠానంచేసుకునే సమయంలో వ్యాసమహర్షి శిష్యుడైన 'జైమిని' ఆయనను కొన్ని దేవరహస్యాలను అడిగాడు. దీనికి ఆయన 'నాకు ఇప్పుడు అనుష్ఠానసమయమయినది. అందుకు నీవుపోయి వింధ్యపర్వతముపై నివసిస్తున్న' **'పింగాక్షుడూ' 'విబోధుడూ' 'సుపుత్రుడూ' 'సుముఖుడు'** అన్న పేర్లుకలిగిన కొన్ని పక్షులు నీధర్మసందేహాలను తీర్చుతాయి. అందుకనే వాటిని **"ధర్మ పక్షులని"** తెలియగలవు! అనిచెప్పి జైమినిని పంపివేసెను. ఆ ధర్మపక్షులనుంచి జైమినిమహర్షి వినిన అనేక విషయములనే ఈ మార్కండేయపురాణము వివరిస్తుంది.

ఇందులో మనిషి తను చేసుకున్న **'చెడుకర్మని'** తిరిగి తానే ఏ విధంగా అనుభవిస్తాడో వర్ణించి జీవుడు గర్భంలో ప్రవేశించి పూర్వంచేసిన కర్మప్రకారం తిరిగి ఎలాజన్మించటం జరుగుతుందో చెప్పి మళ్ళీ తాను పుట్టినతరువాత ఆ చెడుకర్మను జీవితంలో అనుభవించే విధానమూ, ఇంకా జీవుడు తానుచేసిన పాపఫలములను ఏవిధంగా నరకంలో అనుభవిస్తాడో అంతాకూడా వివరంగా తెలుపబడివుంది. ఇది పూర్వం మార్కండేయుడు "క్రోష్ఠు" అనే ఋషికి ఉపదేశించినదే గనుక **మార్కండేయ పురాణము** అన్న పేరు నిలిచిపోయింది.

మార్కండేయమహర్షి జాతక రీత్యా 16 ఏళ్ళుమాత్రమే ఆయుర్దాయం కలవాడైనా మృత్యుంజయుడైన రుద్రుని అనుగ్రహంవల్ల చిరంజీవియై **'పరమగురు యోగమండలి'** లోఋషిగా ప్రసిద్ధికెక్కినాడు. ఆయన చూచిన ప్రపంచ ప్రళయమూ దానిలో **వటపత్రశాయిగా** వున్న **నారాయణుని** అనుగ్రహంపొంది దర్శించిన సృష్టికథా

క్రోష్టుకు ఉపదేశించగా దానినే జైమిని ధర్మపక్షులద్వారా వినిన మహాపురాణమే ఈ **మార్కండేయ పురాణము.**

ఇందులో జ్యోతిషము, వేదము, నిరుక్తము, వ్యాకరణము వివరింపబడినది. ఆతరువాత శుకమహర్షి చరిత్ర, అంజనేయుని చరిత్రలతో పూర్వభాగము ముగుస్తుంది. ఉత్తరభాగమున ఏకాదశి మహాత్మ్యము, రాధాకృష్ణులతత్వము వర్ణింపబడియున్నది.

ఇవేకాక దత్తాత్రేయమహిమా, ఆయనయొక్క మహాత్మ్యము, అలర్కుడికి శ్రీదత్తాత్రేయుడుచేసిన యోగాశాస్త్ర ఉపదేశం, యోగ రహస్యములు, ఇంకా యోగవిఘ్నములు ఎలా కలుగుతాయో; వాటి నివారణా, బ్రహ్మసాక్షాత్కారము కలిగేవిధానం అంతా కూడా వర్ణించబడివుంది.

పధ్నాలుగవ (14) మన్వంతరంలో జరిగే గాధలు ఇంకా రానున్నవీ అన్నీ పూర్తిగా వర్ణించటమేగాక ఇంకా దేవీచరిత్ర, దేవీసప్తశతి, దేవీస్తోత్రమువంటి అనేక మంత్రశాస్త్రవిషయములను తెలిపే ఈ **మార్కండేయ పురాణం** ఎక్కువభాగం ఉపాసనా విషయాలతో నిండివున్నది.

## 8. అగ్నిపురాణము :-

ఈశాన కల్పంలో జరిగినసృష్టి చరిత్రను అగ్నిహోత్రుడు వశిష్ఠునికి ఉపదేశించినది. ఈ పురాణంలో 15 వేల 400శ్లోకములు చెప్పబడి వున్నాయి.

ఈనాడు మనకి లభించే పురాణాలన్నింటిలోను ఈ అగ్ని పురాణం ఒక్కటే తన శాస్త్రీయస్వరూపంతో మిగిలివున్నది. ఇందులో చాలా ప్రాచీన శాస్త్రములు **"విజ్ఞాన - సర్వస్వం"** లాగ వివరించబడి వున్నాయి. తక్కిన పురాణాలు చాలాభాగం కధలతోనూ, వ్రతాలతోనూ నింపివేయబడి ప్రక్షిప్తాలనేకం చేర్చబడి వ్యాసుడు రచించిన స్వతః- వున్న నిజస్వరూపంలోలేవు. అందుకనే

ఇందులో కథల భాగం చాలా తక్కువుగానూ, ఎక్కువభాగము ఆధ్యాత్మిక విషయాలు కలిగివున్న శాస్త్రవిషయికమైన మహాపు రాణం ఇది. ఇందులో విశేషంగా చాలామంత్రములూ, అనేక ఉపాసనా విధానాలూ చెప్పబడివున్నాయి.

ఈ అగ్నిపురాణం, ప్రారరంభమే వశిష్ఠుని ప్రశ్న గావేయబడింది. **"కంటికి కనబడనిదీ, మనస్సుకు గోచరముకానిదీ అయిన బ్రహ్మ సాక్షాత్కారము పొందేవిధానం ఏది?"**- అని వశిష్ఠుని ప్రశ్న! దీనికి సమాధానంగా అగ్నిహోత్రుడు అస్త్రవిద్యనూ, మంత్ర, దేవతా, ఉపాసనా వివరాలనూ, ఇంకా పూజావిధానమూ, ఆలయ దేవతా ప్రతిష్ఠ, వాస్తు విషయాలు, సాలగ్రామపూజవిధానము రాజులు యజ్ఞములు చేయవలసిన విధానము, స్త్రీలకూ పురుషులకూ చూచే శరీర సాముద్రిక లక్షణాలూ, ఇంకా ఏనుగులకూ గుఱ్ఱాలకు వైద్యంచేసే విధానం, ధనుర్వేదం, ఆయుర్వేదం, ఛంధస్సు, కావ్య లక్షణాలూ మొదలైన అనేక విశేషాలను వివరించి సాహిత్యంలో 'అభిద' అన్న లక్షణము ప్రధానంగా గలిగినదే కావ్యమని

**"శాస్త్రే శబ్దప్రధానత్వం**

**ఇతిహాసేషు నిష్ఠతా"**

**అభిదాయాః ప్రధానత్వాత్**

**కావ్యం తాభ్యాం విభిద్యతే"**

— అని నిర్వచనంచేసినది అగ్నిపురాణమే! ఇవికాక ఇంకా గీతాసారమూ, యమ నచికేతు సంవాదము, మనువుల చరిత్ర సూర్య, చంద్రవంశ రాజులచరిత్ర, మొదలైన అనేక శాస్త్రవియాలు తెలిపే తామసిక పురాణమే ఈ **అగ్నిపురాణం.**

## 9. భవిష్య పురాణం :-

ఇది **'అఘోరకల్పం'** లో జరిగిన సృష్టిని ఆధారంగా చేసుకొని కలియుగంలో జరిగే భవిష్యత్తును వివరించే పురాణము. ఈ

గ్రంథంలో కొంతభాగం శిధిలమైపోయింది పోగా, ఇప్పుడు 14 - వేల 500శ్లోకాలు మాత్రమే ప్రచారంలోవున్నాయి. ఈ పురాణంలోవున్న సంఖ్య 31--వేలు. ఇది జనమేజయుని పుత్రుడైన **'శతానీకునికి'** ఉపదేశించబడినది. శతానీకుడు వ్యాసమహర్షిని ధ్యానించి ఆయన ప్రత్యక్షం కాగా తనకు భవిష్యత్తునుతెలిపే పురాణమును ఉపదేశింపగోరినాడు. వ్యాసుడు తన శిష్యుడైన సుమంతుని ఈపనికి నియోగించి తాను అదృశ్యమయినాడు. ఇందులో సూర్యుని మహిమగురించి విశేషంగా తెలుపబడినది. ముఖ్యంగా మన **'దేశ భవిష్యత్ చరిత్ర'** ను తెలిపే ఈ పురాణంలోని విశేషాలు తర్వాత వేరేఅధ్యాయంలో పరిశీలించబడినాయి.

## 10. బ్రహ్మవైవర్త పురాణం :-

ఇది **'రధంతర'** కల్పంలో జరిగిన చరిత్రను తెలిపే రాజస పురాణం. ఇందులో 18- వేల శ్లోకములు కలిగిన ఈ బ్రహ్మవైవర్త పురాణం అన్న పేరుతో, గోలోకవాసియగు శ్రీకృష్ణునిసృష్టి అంతా వివరించబడివున్నది.

గోలోకం అంటే ఆవులు,ళి ఎద్దూలూ అని మాత్రమే కాదు దీనిఅర్ధం! వేదంలో **'గో'** అనగా **'కాంతికిరణ'**మని అర్ధం, **'గోలోక'**మనగా **'తేజోలోకం'** లేక **'మహర్లోకం'** అని రహస్యార్ధం. **'విందుడు'** అనగా **'తెలిసినవాడు.'** గో+విందః =గోవిందః **'బ్రహ్మని తెలిసినవాడు'** అన్న ఈ అర్ధంతో గోలోక అర్ధాలను వివరించే ఈ పురాణంలో శ్రీకృష్ణమహిమా, గోపికలయొక్క చరిత్ర, బ్రహ్మసృష్టి నారదుని జన్మవృత్తాంతమువంటి అనేక ఆశ్చర్యకరమైన విశేషాలున్నాయి. 'చెడుకర్మ'వల్ల అనేక రోగములు మొదలైనవి రావటం, నరకమునకుపోయే జీవుని లక్షణము, గణేశ మహిమవంటివి ఇంకాఎన్నో ఇందులో వ్రాయబడివున్నాయి.

## 11. లింగ పురాణము :-

'ఏకాదశ రుద్రులు' దేవగణములలోవున్నవారు కనుక ఇదికూడా

11వ పురాణముగా వున్నది! దీనిలో శివుని మహిమలు తెలిపే కథలు ఎన్నో వ్యాసమహర్షి వర్ణించారు.

ఇది "ఈశానకల్పము" లోనూ తరువాత 'అగ్ని కల్పము' లోనూ జరిగిన విశేషములతోకలిసి వర్ణించబడివున్నది.

ఇందులో శివలింగముయొక్క స్వరూపమూ, ద్వాదశ జ్యోతిర్లింగముల విశేషముల వర్ణనంవున్నవి. ఆతర్వాత ఈ కల్పములోని 'సృష్టి ప్రారంభములో ఆదీ, అంతములేని ఒక మహత్తరమైన 'లింగాకారంగా' జ్యోతి ఉద్భవించటంతో కల్పాదిని వర్ణిస్తున్నది.

శిలాదుడనే ఋషి చరిత్ర, నందీశ్వరుని చరిత్ర, అందులో శివుని చరిత్రలో అతడు నందీశ్వరుని కుమారునిగా రూపొందటమూ, ధృవుని చరిత్ర అన్నీ ఎంతో చక్కగా వర్ణించబడివున్నాయి. 'ఈశాన కల్పం'లో జరిగిన ఈ కథలలోని కథనం కొంచెం తేడాగా వర్ణించబడివున్నది.

## 12. వరాహ పురాణము :-

తిథులలో 'ద్వాదశి' విష్ణుతిథి కదా! అదేవిధంగా విష్ణుమహిమను తెలిపేదీ, సాత్వికమైన ఈ పురాణం "పన్నెండవదిగా" ఏర్పడి ఈ మానవ కల్పంలో జరిగిన సృష్టికథ అంతా, 25 వేల శ్లోకాలలో వర్ణింపబడి వున్నది.

శ్రీమహావిష్ణువు రెండుసార్లు వరాహావతారమెత్తినట్లు తెలుస్తోంది! అందులో మొదటిది "నీల వరాహావతారము"! దానిని ధరించిన కారణంగా ఆ కల్పానికి "నీల వరాహకల్పం" అని పేరు వచ్చినది. ఆతరువాత జరిగిన కల్పంలో తెల్లనివర్ణం గలిగిన మహారూపంలో ఆయన అవతరించిన విధానమే "శ్వేతావరాహ కల్పం కథ"! ఈ శ్వేతావరహాకల్పంకథే వరాహపురాణంలో దీనినే సాత్విక పురాణంగా వర్ణించబడినది. ఇప్పుడు మనం వున్నది ఈ శ్వేతవరాహ కల్పంలోనే! అందుకే సంధ్యావందనం సంకల్పంలో "శ్వేతవరాహకల్పే" అంటారు!

ఇందులో భూదేవి వరాహమూర్తిని ప్రశ్నిస్తుంది – "నారాయణుడనగా ఎవరు"? అని ప్రశ్నించగా, ఆయన నారాయణునియొక్క అన్ని అవతారములూ వర్ణించి చెప్పినారు, ఇందులో ఇంకా నారదునివల్ల ఉపదేశింపబడిన భక్తియోగంయొక్క విశేషములన్నీ ఇందు వర్ణించబడివున్నాయి.

నారాయణునకు సృష్టి సంకల్పం కలిగినప్పుడు మొదటగా **"సత్తు"** (సత్) జనించెననీ ఆతర్వాత అందులోంచి క్రమంగా వాయువు; అగ్ని నీరూ, పృధివీ, ఆకాశమూ ఉద్భవించినాయని చెప్పి, ఇంకా వినాయకుడు, కుమారస్వాములయొక్క జన్మ ఈశ్వర సంకల్పంచేత మాత్రమే కలిగినట్లు చెప్పబడినది. ధర్మువు, దిశలు, కుమార గణపతులు గౌరీదేవియొక్క కధలు, ఇంకా తిధుల మహిమా ఇందులోని విశేషాంశాలుగా పేర్కొనవచ్చు.

ఇందులోని దుర్గాదేవి జననము దేవీభాగవతంలోకంటే వేరుగా వున్నది. అగస్త్యునిచే భద్రపాలునికి చెప్పబడిన దేవ్యుపాఖ్యానము ఇందులో చాలా మనోహరంగా వున్నది. ఇంకా కపిలగోవు మహిమ, దాన విధానము; మానవుడు చేయకూడదని నిషేధింపబడిన పరాన్నభోజనము వంటి ముప్పైరెండు (32) మహాదోషములు గూడా ఇందులో వర్ణించబడివున్నాయి.

## 13. స్కాందపురాణము :-

ఈ పేరుతో రెండు పురాణాలున్నవి. మొదటిది మహాపురాణములలోనిది, రెండవది ఉపపురాణాలలోనిది. ఇది శివదేవతా ప్రాధాన్యత కల్గిన రాజస పురాణం.

**"తత్పురుష కల్పంలో"** జరిగిన వృత్తాంతమును స్కందుడుగా కుమారస్వామి ఉపదేశించినదికాబట్టి స్కంద పురాణమని దీనికి పేరువచ్చింది. ఇది భృగుమహర్షికి ఉపదేశింపబడి గురుపరంపరగా ఆయననుండి చ్యవనుడూ, ఋచీకుడు, మొదలైన ఋషులనుంచి వ్యాసుడు శతకోటి శ్లోకసంఖ్య కలిగిన ఈ పురాణాన్ని సంపాదించి

దాన్ని కలిలోని ఈ మానవులు గ్రహించలేరని తెలిసి సంక్షేపముగా రచించిన 13 వ పురాణము.

దీనిలో ఏడు ఖండములున్నాయి. 1) మహేశ్వర ఖండము 2)వైశ్య ఖండము 3)బ్రాహ్మణ ఖండము 4)కాశీ ఖండము 5) అవంతీ ఖండము 6)నాగ ఖండము 7)ప్రభాస ఖండము – ఇందులో వివరించబడిన విశేషములలో ముఖ్యమైనవి. **'అరుణాచల క్షేత్ర మహోత్మ్యం'** 13) -అధ్యాయం **'వేంకటాచల మహోత్యం'** **'బదరికాశ్రమహోత్మ్యం'** **'జగన్నాథ క్షేత్రమహోత్మ్యమూ,'** మొదలైనవి. ఇప్పుడు మనం యాత్రగా దర్శించే తిరుపతి, బదరీ, పూరీ, క్షేత్రములయొక్క ప్రాచీన చరిత్ర, స్థలమహోత్మ్యము గురించి ఇందులో బాగా తెలుస్తుంది! ద్వారకయొక్క మహిమ, **'అర్బుదక్షేత్రము'** (Mount Abu) ఆబూలయొక్క మహోత్మ్యము, ముఖ్యమైనవి. ఈ స్కాందపురాణములో ఎక్కువగా క్షేత్రముల మహోత్మ్యములే వివరించబడి వున్నాయి.

ఇక, ఈపురాణములోని విషయం విమర్శనతో పరిశీలించగా, తేలినదేమంటే, వ్యాసమహర్షికృతమైన ప్రాచీన **'స్కాందపురాణం'** మహమ్మదీయుల దండ. యాత్రల కాలంలో కొంతభాగం నాశనం చేయబడినట్లు, ఆతరువాతకాలంలో ఇతరులచేత తక్కినది ఇలాగ పూరించబడినట్లుగా తెలియవచ్చింది. ఆకారణంచేతనే దీనిలో ప్రాచీన శాస్త్రవిషయములకంటే ఈ స్థలపురాణముల కథలే ఎక్కువగా వున్నాయి. దీనికి తార్కాణంకూడా వ్యాసుడు రచించిన **మహోపురాణమైన** ప్రాచీన స్కాందపురాణ విషయాలు, ప్రస్తుతంలో మనకి లభించే **ఉపపురాణమైన** స్కాందపురాణంలోనే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఈ స్కాందపురాణ సంహితలో ముఖ్యమైనది **'సనత్కుమారసంహిత'!** దీనిలో 36- వేల శ్లోకాలలో అనేక అపూర్వ రహస్యాలు తెలుపబడి వున్నాయి. **'బ్రహ్మసంహిత,'** **'సౌరసంహిత'** **'వైష్ణవసంహిత'** **'శాంకర సంహిత,'** **'ద్యూత సంహితలు'** కల ఈ ఆరుఖండములుగల స్కాందపురాణము, కుమారస్వామియయొక్క

ఆరుఖండములుగల స్కాందపురాణము, కుమారస్వామియొక్క ఆరు ముఖములలోని ఆరు తత్త్వములను, వాటియొక్క ఆరు పేర్లు -- 1. శివశక్తి, 2. విష్ణుశక్తి, 3. బ్రహ్మశక్తి, 4. సూర్యశక్తి (సౌరశక్తి) 5. గణపతి శక్తి, 6. జగద్వ్యాపకమైన **'నారాయణ శక్తి.'** ఈశక్తి సంబంధమైన దేవతల మహిమలు, ఈ పురాణంలో కనబడుతున్నాయి. అందుకే ఇది శివ, విష్ణు దేవతల **భేధములను తీసివేసి** అన్నింటినీ సమన్వయంచేసే కథావస్తువు కలిగినదే ఈ స్కాంద పురాణము.

## 14. వామన పురాణము :-

ఇది **'కూర్మకల్పం'** లో జరిగిన చరిత్రను ఆధారంగా చేసికొని పులస్త్యమహర్షిచే తెలుపబడి నారదునివల్ల క్రింద మానవలోకానికి తేబడింది. ఇది పదివేల శ్లోకములుగల్గిన రాజసికపురాణం. ఇందులో మేషాది ద్వాదశ రాసులు, అశ్వని మొదలుగాగల 27-నక్షత్రములు ఇవన్నీ కలిసి **'ఈశ్వరుని కాలస్వరూప'** మని వర్ణించబడింది. ప్రహ్లాదుని జననము, కుమారస్వామి, గణపతుల కథావిషయములు, ఇందులో తేడాగా చెప్పబడినవి.

వామనమూర్తి బలిచక్రవర్తిని అణచినట్లే **'దుందుకాసురు'**నికూడా పాతాళలోకి అణచిన కథకూడా ఇందులో వర్ణించబడియున్నది. ఇది చాలామందికి తెలియదు!

## 15. కూర్మ పురాణము :-

ఇది **'ఆదికూర్మము'** రూపంలోవున్న విష్ణుమూర్తిచేత ఉపదేశింపబడిన 17-వేల శ్లోకములు కలిగిన **'తామస పురాణం'.**

పూర్వకాలంలో దేవాసురులు కలిసి క్షీరసముద్రాన్ని చిలికిన కల్ప సమయంలో జరిగిన చరిత్రను తెలిపేది కనుక దీనిలో **"క్షీరకల్పము లోని చరిత్ర"** అని ఈపురాణంలోనే తెలుపబడి యున్నది.

దీనిలో నాలుగు సంహితలు కనబడుతున్నాయి. అవి 1. బ్రహ్మసంహిత 2. భాగవతసంహిత 3. శైవసంహిత 4. వైష్ణవ సంహిత, అని. అవతారముల చరిత్ర, సూర్యహృదయ స్తోత్రము, దుర్గామహాత్మ్యము, ఇందులోని ఆసక్తికరమైన అంశములు. నాలుగు వర్ణములవారి విధులు, అవి పాటించకపోవటంవల్ల వచ్చే నరకములు ఇందులో స్పష్టంగా వివరించబడివున్నాయి.

## 16. మత్స్యపురాణము :-

ఇది 'చాక్షుసమన్వంతరం' లో జరిగిన జలప్రళయ గాథ ఆధారంగా చేసుకొని చెప్పబడినది. ఇది 14-వేల శ్లోకములు కలిగిన తామసిక పురాణము.

ఇది గత మన్వంతరం చివరలో జరిగిన "జలప్రళయ' సమయంలో రక్షింపబడిన వైవస్వతమనువు మహాత్మ్యంగా ఉపదేశింపబడిన పురాణం. ఇది 'సత్యకల్పం' లోని చాక్షుషమన్వంతరం కల్పంలోని గాథగా తెలుస్తోంది!

వైవస్వతమనువు మలయాద్రిలో తపస్సుచేసి ప్రళయం వస్తే నశించిపోయే జీవులను, ఔషధులను, చెట్లను తిరిగి పునఃసృష్టి చేయటానికి, కొన్ని మిగిల్చి రక్షింపగల వరము సంపాదించాడు. అతను ఒకనాడు పితృతర్పణం చేస్తుండగా, శ్రీమహావిష్ణువు, ఒక చిన్న చేపపిల్ల రూపంలో ఆయన దోసిలిలోపడి, అతనిచే కమండలంలో రక్షింపబడి క్రమంగా పెరిగి, పెద్దదైనాడు! చివరికి ఆయన సముద్రంలో కూడా పట్టనంత పెద్దచేపగా అయినప్పుడు వైవస్వత 'మనువు'తో తాను మహావిష్ణువునని జగత్తునకు ప్రళయ సమయము, ఆసన్నమైందనీ తెలిపి, ఆప్రళయ సమయములో ఒక 'నావ'ను యేర్పాటు చేసుకోమని, వైవస్వతమనువు ప్రళయం సమీపించినప్పుడు అందులో అన్ని జీవములనూ ఎక్కించి తాను కూడా యెక్కి, ఆ నావను చేపకొమ్ముకు కట్టినట్టయితే తాను ఈ భూతముల రక్షణ చేయగలనని చెప్పి, విష్ణుమూర్తి

అదృశ్యమయ్యాడు.

**వైవస్వతమనువు** అలానే చేసి, ఆ ప్రళయ సంక్షోభంలోకూడా ప్రశాంతుడైవున్న ఆ మత్స్యమూర్తిని విష్ణుమూర్తి యొక్క అవతారంగా గుర్తించి, ప్రార్థించి, ఆయననుంచి సృష్టిక్రమాన్నీ, అన్ని జీవుల ఉత్పత్తినీ, జరిగిన ఆనాటి చరిత్రను ఆ శ్రీహరి అవతారమైన **"మహామత్స్యము"**ను ఉపదేశించమని కోరినాడు. ఆ ప్రళయం తరువాత **వైవస్వత** మన్వంతరం మొదలయిసృష్టి ప్రారంభమైంది! శ్రీమన్నారాయణుడే స్వాయంభువు మనువుగా అవతరించి సృష్టిచేయ సంకల్పించాడు. ఆతర్వాత ఇరవైయారు తత్త్వములతో కూడిన **'భూత - సృష్టి'** జరిగింది. ఆతరువాత చెప్పబడిన దక్ష ప్రజాపతి **'ప్రజాసర్గము'**లో భూమి వైశాల్యమును పరికించి మరీ సృష్టించమని నారదుడు చెప్పటమూ కూడా మత్స్యపురాణంలో వర్ణించబడివున్నది!

ఇందులో జ్యోతిష గణితమూ, నక్షత్రములూ, గ్రహణములూ, రాశిచక్రముయొక్క ప్రమాణమువంటి వివరాలు బ్రహ్మాండపురాణములో వర్ణించబడిన గ్రహముల కొలతలకన్నా చాలా బేధముతో కన్పిస్తూవున్నాయి. దీనిబట్టిచూడగా వేరువేరు కల్పాలలోని సృష్టి వేరుగాను, గ్రహస్థితి వేరుగానూ, ఈ **జ్యోతిశ్చక్రములో** గల **నక్షత్రముల** స్థితికూడా ప్రతికల్పములోను మారుతూవుంటుందని తెలుస్తున్నది.

ఇందులో ఇంకోవిశేషముకూడా కన్పిస్తూన్నది. సప్తఋషుల వంశములు, పరశురాముని వంశముల వర్ణన ఇందులో చాలా ముఖ్యమైనవి. ఆధ్యాత్మిక విషయములలో వేరువేరు మన్వంతరాలలోని విష్ణుమూర్తి అవతారాల వర్ణన విచిత్రమూ, మరియు అద్భుతమైనది. అలాగే ఈశ్వరుడు ఋషులకు ఉపదేశించిన **'ఈశ్వరగీత'**, **'వ్యాసగీత'**, **'సంధ్యావందన విధి'**, **'పూజావిధానం'**, సూర్యప్రాదయములో సాధకులకు ఎక్కువగా ఉపయోగించేవిగా వున్నాయి.

## 17. గరుడ పురాణము :-

ఇది విష్ణుమూర్తి గరుత్మంతుడికి ఉపదేశించిన 19-వేల శ్లోకములు కలిగిన పురాణము. ఇది సామాన్యముగా ఎవరైనా మరణించినప్పుడు చేసే **'పితృమేధము'**లలో పఠించటం ప్రాచీనంగావచ్చే ఆచారము.

ఇందులో, జీవుడు మరణించినతర్వాత శరీరము విడిచి బైటికి పోయి ఏవిధంగా ప్రయాణంచేస్తాడో అంతా వివరంగా వర్ణించబడి వున్నది.

మానవుడు స్థూలశరీరం నాశనమమైన తర్వాత ఆ లోపలి జీవుడు ప్రయాణించే పదార్థమయంకాని, ఈ **'శరీరానికి' 'యాతనా మయ - శరీరము'** అని పేరు. **'యాత'** అనగా ప్రయాణము చేయునట్టి. **'శరీరము'** అని అర్థం. సామాన్యంగా మనిషి తాను ఇంట్లో వున్నప్పుడు తాను వాడుకునే వస్తువులు అమర్చే పద్ధతి వేరుగాను అవే తాను ప్రయాణానికి సర్దుకున్నప్పుడు ఆసామానుల సర్దుబడి వేరుగానూ వుంటుంది. అదే ఈప్రయాణానికి సర్దిన సామాన్ల వంటిదే జీవుడు ప్రయాణించే **'యాతనా దేహం'!** ఆ జీవుని ప్రయాణం పూర్తియైన తర్వాత ఇంకో శరీరంలోకి దిగిన ప్పుడు ప్రయాణికుడు సామాన్లతిరిగి విప్పి సర్దినట్లుగా ఈ యాతన శరీరములోని అవయవాలలోని నాడులవంటి అనేక సూక్ష్మభాగాలు మళ్ళీ తిరిగి వాటివాటి **యథాస్థానాలలో** అమర్చబడతాయి.

అతడే తల్లికడుపులో ప్రవేశించి పెరిగి, తిరిగి జన్మిస్తాడు! ఈ **'గరుడపురాణము'**లో యాతనామయ శరీరంలో ప్రయాణించే జీవునికి కనిపించే స్వర్గ, నరక లోకాలు, వైతరణీనది, జీవుడు ప్రయాణించే నరకలోక వర్ణనమూ, పాపియైన జీవుడు అనుభవించే నరకలోక వర్ణన అంతా అతి భయంకరంగా వర్ణించబడియున్నది. చనిపోతే కర్మచేసే ఆ పదిరోజులలోనే దీన్ని పఠిస్తారు.

కాని పూర్వకాలంలో మరణించబోయే మనిషికి ఈ **పురాణం మరణించక ముందే** చదివి వినిపించడంవల్ల అతడు తాను మర

ణించిన తర్వాత ఆలోకాలలో తాను గమనించవలసిన విషయాలతో **అతనికి ఉపయోగపడతాయి!** అతనికి గ్రంథం చివర '**ప్రేత**' విషయమైన ఈ కథ చదవటంవల్ల కలిగిన అశుభములకు శాంతి చేసే నిమిత్తం '**మోక్షధర్మ నిరూపణమూ**' సుకృతమైన జన్మ కలగటానికి మనిషి ఆచరించవలసిన విధానములుకూడా వర్ణించబడియున్నాయి. దీనివల్ల దోషాలు శాంతిస్తాయి.

## 18. బ్రహ్మాండపురాణము :-

ఈ పురాణం నైమిశారణ్యంలో వాయుదేవుడు మహర్షులకుపదేశించినది.

ఇది కాలమానంలో యుగములసంఖ్య, మహాయుగములు, మన్వంతరములూ, బ్రహ్మకల్పం ఆతరువాత వచ్చే ప్రళయమూ ఆ బ్రహ్మకు రాత్రియై తరువాత తిరిగి ప్రారంభమయ్యే సృష్టికూడా వివరాలతో సహా వర్ణింపబడియున్నది.

నాలుగు యుగాలు కలిసి ఒక మహాయుగము, లేక దీనినే '**చతుర్యుగము**' అని అంటారు. ఇలాంటివి వెయ్యి చతుర్యుగాలు కలిస్తే బ్రహ్మకు ఒక '**పగలు**' అవుతుంది! అలానే ప్రళయకాలం బ్రహ్మకు రాత్రియై ఆ ప్రళయకాలంలోకూడా అంతేసేపూ, వుంటుంది. ఈ బ్రహ్మయొక్క రెండు అహోరాత్రులను కలిసి, ఒక '**బ్రహ్మకల్పము**' అని అంటారు. ఇటువంటి 26-వేల కల్పములు కలిసి ఒక్క మహాకల్పం అవుతుందని భవిష్య పురాణము తెలుపుతుంది!

ఈ గణితమంతా వర్ణించినతరువాత ఈ బ్రహ్మాండపురాణము ప్రతియుగంలోను నడిచే యుగధర్మాలు ఆయా యుగాల్లో మనిషి ప్రవర్తనలోవచ్చే మార్పులూ, అలాగే ఇప్పుడు నడిచే కలియుగంలోని యుగ లక్షణాలుకూడా చెప్పబడియున్నాయి! ఈ కలియుగపాపం మనిషి మనస్సును బంధించకుండా ఉండాలంటే **గాయత్రీమంత్రానుష్ఠానము, సంధ్యావందనము,** '**ప్రాణాయామ**' విధానము తప్ప, వేరు మార్గం లేదని ఈ పురాణము తెలిపే ముఖ్యవిషయము.

## పద్దెనిమిది కల్పాల చరిత్ర :-

ఇలాగ 18 కల్పములలో జరిగే బ్రహ్మాండ సృష్టియొక్క విశేషాలను విడివిడిగా వ్యాసమహర్షి 18 పురాణాలుగా రచించారు. ఒక్కొకల్పము బ్రహ్మకు సృష్టికాలము. దానినే బ్రహ్మకు దినమని చెబుతారు. ప్రతీసృష్టికల్పము. అంతమయిన తరువాత బ్రహ్మదేవుడికి రాత్రికల్పము జరుగుతుంది. మామూలుగా మనిషి పగలు శ్రమించి పనిచేసి ఆ తరువాత రాత్రిసమయంలో విశ్రాంతి తీసుకుంటాడు. అలాగే బ్రహ్మదేవుడుకూడా తనకు పగలైన సృష్టికల్పంలో సృష్టికర్మను నిర్వహించి తనకు రాత్రియైన ప్రళయకాలంలో సృష్టి ఆపివేసి నిద్రలో లీనమవుతాడని పురాణాలు చెబుతున్నాయి.

మనుష్యులకులాగ బ్రహ్మదేవుడికికూడా నిద్ర ఏమిటని చాలా మందికి వింతగా తోచవచ్చు. కాని ఈ విషయంలో జీవశాస్త్ర - ప్రకృతిసూత్రమయిన ఒకానొక రహస్యం యిమిడివున్నది. ఈ 'బ్రహ్మదేవుని - పగలు', 'రాత్రి' అనే చక్కని ఉపమానంతో మనకు అందించాడు వ్యాసమహర్షి! అదేమిటంటే ఈ సృష్టి నిర్వహించే 'బ్రహ్మ' ప్రతిజీవుడిలోను ప్రాణచైతన్యంగా నిలచి ఉన్నాడు. ఆ 'చైతన్యం' ప్రతి మనిషిలోనూ జంతువులోనూ క్రిమికీటకాదులలోనూ కూడా నిద్రాణమైవున్నది. ఈ 'జీవశక్తి' లేక ప్రాణచైతన్యం పనిచేసే ప్రకృతి అంతటా రెండు దశలలో పనిచేస్తున్నది. అందులో ఒక్కటి 'నిద్రావస్థ' రెండవది 'మేలుకున్న' చైతన్యావస్థ!

దీనికి నిదర్శనం ప్రకృతిలో ఎక్కడ చూసినా కనబడుతున్నది. గొంగళిపురుగు జీవిత చరిత్రలోని ఈ నిద్రావస్థ చూస్తే, అది, 'నిద్రావస్థ' అయిన తరువాత తన గూడును పగులగొట్టుకొని, బయటికి సీతాకోకచిలుకగా వస్తున్నది. ఇది 'చైతన్యావస్థ'ను సూచిస్తున్నది. అలాగే కడుపులోని పిండం 'నిద్రావస్థ', బయట జన్మించిన మనిషి 'చైతన్యావస్థ'! గ్రుడ్డులోని కోడిపిల్లది 'నిద్రావస్థ' గుడ్డు పగిలి పుట్టిన కోడిపిల్లది 'చైతన్యావస్థ'! అలాగే చెట్టులోని

గింజలోని మొలక చెట్టుయొక్క 'నిద్రావస్థ'! అది నాటినప్పుడు మొలిచేచెట్టు దాని 'చైతన్యావస్థ'!! అలాగే దుంపలూ, పిలకలూ, కందమూలాలూ తమలో ఆహారం దాచుకుని శీతాకాలంలో నిద్ర లోవుండి, తిరిగి వెచ్చని ఎండకు చిగిర్చి మొలకెత్తుతున్నాయి కదా! ఈ రెండుదశలే అన్నిటిలోనూ కనపడే ప్రకృతి రహస్యం!

అంతేకాదు యావత్ ప్రకృతికూడా శీతాకాలంలో, శిశిరఋతువులో ఆకులురాల్చిన మ్రోడులతో తన 'నిద్రావస్థ' లో వుంటే, అదే వసంతఋతువులో చిగిర్చి పుష్పించి 'చైతన్యావస్థ' లో కనబడుతున్నది ప్రకృతి అంతటా. అలాగే చంద్రుడు కృష్ణపక్షంలో క్షీణావస్థలోనూ (ప్రళయం) శుక్లపక్షంలో 'చైతన్యావస్థ'లో ఉండటం చూస్తున్నాం!

అలాగే అన్నిజీవులూ సూర్యుడస్తమించి రాత్రి అయినప్పుడు నిద్రలోకి పోయి ప్రాణచైతన్యమంతా అంతర్ముఖమై 'నిద్రావస్థ' ను పొందుతున్నది! అదే సూర్యోదయంతో అన్ని ప్రాణులు తమలోని ప్రాణశక్తి మేలుకొనగా తిరిగి 'చైతన్యావస్థ' పొంది మెలకువతో సంచరిస్తున్నది. ఇదే సూత్రం సృష్టి అంతటా వర్తిస్తుంది. అన్ని ప్రాణులలో ఉండిన ప్రాణచైతన్యమే కదా బ్రహ్మ అంటే! అందుకని ప్రాణులు జన్మించి మేలుకొనేదే 'సృష్టికల్పం'. బ్రహ్మకు పగలు - అంటే ప్రాణశక్తికి ప్రకృతిలో 'చైతన్యావస్థ'. అలాగే ప్రళయసమయంలో అన్ని జీవులలోని ప్రాణము మరణమువైపుకు ఉపసంహరింపబడినప్పుడు అదే బ్రహ్మకు లేక ప్రకృతిలోని ప్రాణశక్తికి రాత్రివంటి 'ప్రళయ' కల్పం నడుస్తున్నది!

మనలోని 'ప్రాణం' (శ్వాస) లోపలికి పీల్చుకున్నప్పుడూ, అదే ఊపిరి, మళ్ళీ అదే శ్వాస బయటకు విడిచినప్పుడూ జరిగే రెండుదశల వంటివే విశ్వప్రాణమైన 'బ్రహ్మ దేవుని రాత్రింబవళ్ళు'.

అవే విష్ణుదేవుని ఉఛ్వాసనిశ్వాశాలు అనిచెప్పిన పురాణ రహస్యంలోని అంతరార్థం ఇదే.

ఇలా 18- పురాణాలలో - పురుషుని 18- తత్వాలుగా 'సాంఖ్య - విద్య' రహస్యంగా 18- కల్పాలలో వర్ణించాడు వ్యాసమహర్షి వేదార్థ రహస్యాన్ని అందిస్తూ!





# పురాణాలలో ప్రాచీన విజ్ఞానం

చాలామంది "పురాణం పంచలక్షణం" అనిమాత్రం అంటారేకాని పురాణంలో ఇవ్వబడిన 'సైన్సు' విజ్ఞానం, అందులోని భౌగోళిక, ఖగోళ (ఆకాశ) సంబంధమైన ఇతర శాస్త్రీయ విషయాలను గమనించరు. అందులోని కథలను మాత్రం పట్టుకుని---అది కూడా వీటిలోని అంతరార్థాలనూ, శాస్త్రీయ రహస్యాలనూ, యోగ రహస్యాలనూ, నిగూఢంగావున్న అంతస్సందేశాన్నీ విడిచిపెట్టి --- వాటిని కేవలం కాశీమజిలీ కథల్లాగనో లేక, పేదరాశి పెద్దమ్మ కథల్లాగనో చదువుకోవడంవల్ల, ఆ పురాణాలకే మహాపచారం చేయటం జరుగుతోంది.

ఈ 'అపచారం' ఏమిటంటే ఈ పురాణాలు, కట్టులు కట్టలుగా, కేవలం వినోదంకోసమో, లేక ఊసుపోక చదివే కథలుగానో

వ్యాసమహర్షి రచించాడనే అపోహ జనసామాన్యంలో -- ఆ మాటకొస్తే పండితుల్లోకూడా -- ఏర్పడివున్నది. కాని, అది నిజంకాదు. ఎంతో పారిభాషిక(Technical) శాస్త్రీయ(Scientific) ఆధ్యాత్మిక, యోగ సాధనా రహస్యాలను తెలిపే విజ్ఞానం, సాంకేతిక (Symbolism) పరిభాషతో నిర్మించబడివున్నది, ఈపురాణాలలో కధావస్తువు! పురాణాలు "వైజ్ఞానిక సర్వస్వాలు"(Encyclopaedia of All Sciences) అంటే అనేక శాస్త్రాలలోని విజ్ఞానం కలిగిన గ్రంధాలు! అంతేకాదు, పురాణాలంటే ఒక సర్వశాస్త్ర సముచ్చయాన్ని సమస్త విజ్ఞాన సమస్వయాన్ని కలిపి, వైజ్ఞానిక సూత్రాలరూపంలో అన్ని శాస్త్రాల వెనకాలవున్న "ఏకసూత్ర" మైన ఒక మహాసత్యాన్ని తెలిపే "సైన్సు"! ఇక్కడ మనకి అందులోని కధాభాగం ముఖ్యంకాదు! అందులో వివరించిన వైజ్ఞానిక విషయాలేమిటో స్థూలంగా ఇక్కడ పరిశీలిద్దాము.

(i) బ్రహ్మాండ స్వరూపం:- పురాణంలోని అనేక విషయాల్లో ముఖ్యమైనది, బ్రహ్మాండసృష్టి స్వరూపంలోవున్న విజ్ఞానాన్ని మనకి తెలియజేయడమే. ఇందులో భూగోళం, సూర్యాది గ్రహాలు, వాటి నడకలు, కాలచక్రవిభాగం, దిన, పక్ష, మాస, ఋతు, సంవత్సరములూ, రాశచక్రంలో వాటి లెక్కలూ, వాని పరిణామాలు, నవగ్రహాల స్వభావాలు, ద్వాదశరాసులూ,27 - నక్షత్రములూ, ఇంకా మానవులు, దేవతలు, ఋషులు అన్నికాలాల్లో చేయవలసిన కర్మలూ, యజ్ఞయాగాలు అన్నీ వివరించబడ్డాయి.

ఇంకో రహస్యమేమంటే ఈ 'బ్రహ్మాండ నిర్మాణంతో' "గాయత్రీమంత్రం" లోని మూలసూత్రం ఏవిధంగా ముడిపడివుందో వర్ణించబడినది. అంటే బ్రహ్మాండంలోని సప్తలోకాలూ గాయత్రిలోని సప్తవ్యాహృతులూ, మన శరీరంలోని సప్త-యోగచక్రాలూ, వారాధిపతులైన ఏడు గ్రహాలూ యుగాలలో "సప్తఋషుల" చలనం, సూర్యరశ్మిలోని ఏడు రంగులూ, ఓంకారములోని ఏడువ్యాహృతులు, మొదలైన అతి గహనమైన విషయాలెన్నో -- అన్నీ ఇక్కడ

చర్చించలేము. ఇవన్నీ వేరే గ్రంధములో* విశదీకరించాము.

(ii)భూమి - గ్రహగోళాలు:- అంటే ఈ ఘనపదార్ధమైన సృష్టి అంతా 'భూలోకం'! అంటే పంచభూతాల్లో 'భూ' అనే తత్వంతో నిర్మాణమైనదంతా భూలోకం.

(iii) ఏడులోకాలు:- ఈ భూలోకవర్ణనే కాకుండా పురాణాలు ఇంతకు పైనున్న ఊర్ధ్వలోకాలగురించి కూడా తెలుపుతున్నాయి. అంటే కంటికి కనిపించేది 'భూలోకానికి మనస్సుకు మాత్రమే అందేది భువర్లోకము'. యోగదృష్టికి మాత్రమే అందేది 'సువర్లోకము' ఋషుల దివ్యదృష్టికి అందేది 'మహర్లోకం'. సిద్ధపురుషులు, నిత్యముక్తులూ, ఇంకా పైనవుండే సృష్టికర్త - ఆయనలోకం, మొదలైనవన్నీకూడా వర్ణంచబడినాయి.

అలాఅంటే మనకి ఆశ్చర్యం వేయవచ్చు! కంటికి కనిపించే ఈ సృష్టివెనక కంటికి కనిపించని "ఈ ఆరులోకాల్ని" ఎందుకు వర్ణించారా అని, అందుకే చెప్పాను. ఇవి సైన్సు, లేక విజ్ఞానవిషయిక గ్రంధాలని. ఇది ఎలా అంటే: ఒక్క ఉదాహరణ చాలు! మనకంటికి కనిపించే మంచుగడ్డ, చేతికందే ఘనపదార్ధంగా గోచరమవుతున్నది. ఇదే రూపాంతరంలో లేక పై "లోకం"లో ద్రవరూపంగా ఉన్నది. ఈ "నీళ్ళే" తిరిగి, ఆవిరిగా చేసినపుడు అదే కేవలం "వాయు" రూపంతో ఇంకా పైలోకంలో వున్నది. అదే "నీటి ఆవిరి" ఇంకా కొంచెం పైకిపోతే, అది కేవలం ప్రాణవాయువుగా (Oxygen) ఉదజనితో (Hydrogen) ఉండి విద్యుత్‌చే కలుపబడి నీటి ఆవిరిగా "సృష్టి" అవుతున్నది! ఇలాగ ఒకటే వస్తువు -- అనగా "నీరు", అనేక రూపాలలో వుండి. కంటికి గోచరించని స్థితిలో తానువున్న పైలోకాల నుంచి కిందికి దిగుతూ, ఘనపరిణామాన్ని పొందుతూ అలా మెట్లుమెట్లుగా దిగి క్రింద స్థూలరూపం అవుతున్నది. ఇదే గంగ - దిగిరావటం లేక "గంగావతరణం"లోని రహస్యం ఇది ఒక నీళ్ళవిషయమేకాదు సర్వసృష్టి ఈ దృష్టితో పరిశీలించితే

మనకి తెలిసే ఈ రహస్యాన్ని మనకుపదేశించటమే ఈపురాణాల ద్వారా వ్యాసమహర్షి మనకిచ్చిన సందేశం. ఇలాంటివి వ్యాసుడనే సముద్రంలోని ముత్యాలు!!!ఇవి అందులో కొన్నిమాత్రమే!

ఇలా చెప్పకుంటూపోతే ఇది ఒక మహాసముద్రం. అందుకని సంక్షేపించి క్లుప్తంగా పురాణంలోని ఇతర ముఖ్యవిషయాల్నిమాత్రం ఇక్కడ వివరిస్తాను!

1."సృష్టి" -- అంటే పంచభూతాలూ, కాలమూ బ్రహ్మాండ నిర్మాణమూ అంతాకూడా, ఇదే స్వర్గము" అంటారు.

2. **బ్రహ్మాండనిర్మాణం :-** ఈ బ్రహ్మాండనిర్మాణం జరిగాక, అందులోని ఒక సౌరకుటుంబం ( Solar system) అంటే మన సూర్యుడూ అతని గ్రహాలూ, నిర్మాణం అవటం, అందులో భూగోళమూ, సముద్రాలనుంచి నేల ఏర్పడటం: వృక్షాలూ, జంతువులూ, చివరికి మానవుడి సృష్టి! ఈ వేదాలకు మూలమైన పురాణసంహితలో, దీన్ని "ప్రతిసర్గం" అంటారు.

3 **పురాణాలలోని మానవచరిత్ర:-** యీ మానవజాతి కథ, దానికి మూలపురుషుడైన "మనువు" చరిత్ర, అంతకుముందు జరిగిన సృష్టులలో గతించపోయిన 'మనువు' లూ, వాని మానవజాతుల కథ అంతా! అంటే "మన్వంతరం" గాథ అన్నమాట!

4 **వంశం:-** ఈ మానవసమాజం వచ్చిన తర్వాత ఈభూమినేలిన రాజులూ వారివారి వంశాలు లక్షలాది సంవత్సరాలుగా నడచిన యీ చరిత్రలోని అనేక జలప్రళయాలూ అందులో మధ్యమధ్యన -- అంచే ·యుగయుగానికి వచ్చే అవతారాలూ- అన్నీకూడా పురాణం తెలుపుతుంది.

5 **వంశాను చరిత:-** ఈ గడచిపోయిన రాజవంశాలే గాకుండా రానున్న భవిష్యత్తులో చరిత్ర అంతా కూడా యివ్వబడినది. ఇది అనువంశచరిత్ర --- అంటే రాజవంశాలను అనుసరించి జరిగే

చరిత్ర, లేక "హిస్టరీ"(History)!

ఈ భవిష్యత్ చరిత్రను వ్రాయడం "నాడీగ్రంథాల"లోని జ్యోతిషంలో ఎలాగైతే ఋషులు ఒకనిజీవితం, వాడిపేరూ, ఊరూ, నక్షత్రం, వాడి భవిష్యత్తూ వ్రాసిపెట్టారో అవి ఈనాటికీ మనకు తాటియాకుల గ్రంథాల్లో నిదర్శనంగా ఎలా దొరుకుతున్నాయో సరిగ్గా అలాగే, మన దేశచరిత్ర అంతాకూడా వ్రాశారు. అదంతా ఇక్కడ వివరిస్తే ఇదే ఒక చరిత్ర గ్రంథం అవుతుంది.

అవుతుందేవిటి? అయింది! అది వేరే పుస్తకంగా "1999 -- కలియుగాంతం" అన్నదాంట్లో వివరించాను. అందులో పురాణాలలోని భవిష్యత్తును వ్యాసమహర్షి ఏ విధంగా వ్రాసింది (శ్లోకాలతో సహా) -- అవి ఈనాడు మళ్లీ నిజంగా ఎలా జరిగిందోకూడా, చరిత్ర సాక్ష్యాలతో సహా యివ్వబడినది. ఇదంతాకూడా పురాణంలోని మహోదధి తరంగాలలో ఒక చినుకు! సముద్రంలో కాకిరెట్ట! అవును ఇదంతా వ్యాసుని జ్ఞానసముద్రం అందులోని నీళ్ళను ఈ కాస్త పురిపెడు చూసి అగస్తుడిలాగ ఆ ఉదధినంతనీ మనం పుడికిటపట్టించుకోవడం లాంటి ప్రయత్నమే!

ఈ ప్రయత్నం మరింతగా నిరూపించేది ఒక్కటే! అది ఆ సముద్రంయొక్క అగాధత్వమే! "వ్యాసుని జ్ఞానసముద్రం" నిజంగా అగాధమే! ఆయన మహిమ అనిర్వచనీయము!



26

# 1999 రానున్న కలియుగాంతమున శంబళగ్రామంలో కల్కిభగవానునితో వ్యాసమహర్షి!

ఈ విధంగా కలియుగంలో పరిపాలించే రాజులపేర్లతో సహా వేదవ్యాసమహర్షి కలియుగభవిష్యత్తు పూర్తిగా వర్ణించాడు ! అంటే మొదటిరాజైన పరీక్షిత్తు పట్టాభిషేకం నుంచి (యావత్ పరీక్షితో జన్మ ...") వచ్చే కల్క్యావతారం పాపులను సంహరించి సత్యయుగాన్ని స్థాపించేవరకూ 5099 సం||లు వెరసి అన్ని రాజుల వంశాల పరిపాలనాకాలం చెల్లుతున్నది! ఇదే విషయం శ్రీమద్భాగవతం 12వ స్కందంలో శుకయోగి కలియుగాంతాన్ని వర్ణించి కల్క్యావతార సమయము 'యుగసంధి' కాలము సూచిస్తూ 'అన్ని గ్రహాలు ఒక్కరాశిలో

సమకూడినపుడే ' (5099 సం॥ల తరువాత వచ్చే) గ్రహస్థితిని ఇలా వర్ణించాడు!

యథా చంద్రశ్చ సూర్యశ్చ తథాతిష్య బృహస్పతిః
ఏకరాశౌ సమేష్యంతి, ప్రవర్స్యతి కృతం యుగం"

(భాగ. స్క. 12)

అనగా -- "ఎప్పుడైతే సూర్యచంద్ర గ్రహాలన్నీ ఏకరాశిగతమౌతాయో అంటే పై రాజుల పరిపాలన పూర్తికావచ్చే సమయంలో అన్నమాట. అప్పుడు అన్ని గ్రహములు ఏకరాశిగతమైన సమయంలో కృతయుగం ప్రారంభిస్తుంది' -- అని. దీన్ని బమ్మెర పోతనామాత్యుడు తెలుగు భాగవతంలో అనువాదం చేస్తూ --

'చంద్ర భాస్కర శుక్ర గురువు
లేకరాశి గతులైనం గృతయుగంచైతోస్మి'

-- భాగ. ద్వాదశ స్కందం.

అనగా -- "1999 తరువాత వచ్చే మేషసంక్రాంతిలో అన్ని గ్రహాలు మేషరాశిలో 2000 AD సంవత్సరంలో మే నెల -- 4 వ తేదీన కలుసుకుంటున్నాయి. అప్పటితో పురాణాలలో వ్యాసమహర్షి వర్ణించిన కలియుగభవిష్యత్తు పూర్తి అవుతుంది! అప్పటికి కలియుగాంతం జరిగి కల్క్యావతారం భూమిమీద అందరికీ దర్శనమిస్తుంది! ఆసమయంలో విష్ణుమూర్తి తన పదవఅవతారమైన కల్కిమూర్తిగా అవతరిస్తాడని చెప్పి పోతన భాగవతంలో--

"సకల దేవతాబృందంబు వీక్షింప ముకుందుడు దృష్టనిగ్రహ శిష్టపరిపాలనార్థమై శంబల గ్రామంబున విష్ణుయశుండను విప్రునకు జన్మించు! "

"ఆ సమయంబున నిఖిలజనులు ధన్యులయ్యేదరు! "

ప్రజలందరూ కలియుగంలోని తమ విదేశీఅలవాట్లు అనగా మ్లేచ్ఛాచారాలు వదిలిపెట్టి తిరిగి కృతయుగంలోలాగే సత్యము, ధర్మము, తపస్సు, దైవచింతన, దానము, భగవధ్యానము శ్రీకల్కిమూర్తి

ఉపదేశంవల్ల నేర్చి ధర్మమార్గవర్తనులు అవుతారు!

అప్పుడు కల్కిభగవానుడు సూర్యవంశపురాజైన మరువు చక్రవర్తిని హిమాలయ పర్వతాలలో సిద్ధపురుషుడుగా శంబలవద్ద తపస్సు చేసుకుంటున్నవారిని పిలిపించి అతనికి సామ్రాజ్యమిప్పించి కృతయుగ రాజుల పరిపాలన ప్రారంభించును!

## 'శంబల' -- గ్రామం :-

విష్ణుమూర్తి దశావతారాలలో ఎనిమిదవది "శ్రీకృష్ణావతారం" తొమ్మిదవది "బుద్ధావతారం." దీనినే వ్యాసమహర్షి "భవిష్యపురాణం"

"మాయామోహ స్వరూపో అసో
శుద్ధోదన సుతో అభవత్"

అని 'శుద్ధోదముని'కి 'మాయాదేవి'కి కుమారుడిగా వచ్చిన 9వ అవతారం గురించి వర్ణించాడు. ఈ రెండూ గడిచిపోయినాయి. ఆ తరువాత వచ్చే ఆఖరు అవతారం 'కల్క్యావతారం.'

## కల్కిభగవానుని -- జననం :-

ఈ కల్క్యావతారంలో భగవంతుడు కలియుగంలోని అధర్మాలనూ పాపాలను నిర్మూలించి ఒక నూతన రాజ్యాంగ వ్యవస్థను ఏర్పాటుచేసి కలియుగంలో జరిగే పాపాలను అంతమొందిస్తాడు.

ఈ 'కల్కిభగవానుడు' హిమాలయపర్వత ప్రాంతంలో "శంబల" అనేగ్రామంలో జన్మిస్తాడు! "శ్రీవిష్ణుయశస్సు" అనే తపస్సంపన్నుడైన వేదపండితుడైన బ్రాహ్మణుని కడుపున అవతరిస్తాడు! ఈయన అవతరిస్తూండగానే పురిటింట్లో బ్రహ్మ, ఇంద్రాది సర్వదేవతలూ ప్రత్యక్షమై గర్భస్తుడైన భగవంతుని స్తోత్రంచేస్తారు! అంతేగాక నాలుగు వేదములు, 18 పురాణాలు సర్వశాస్త్రాలు, సాంగోపాంగముగా మూర్తికట్టి తమ దేవతాస్వరూపంలోకి భగవానుని వద్ద ప్రత్యక్షమై

ఆయనను స్తోత్రం చేస్తాయి!

## పద్దెనిమిది — సిద్ధపురుషుల ఆగమనం :-

తమ దివ్యదృష్టితో తపస్సువల్ల భగవానుడు అవతరిస్తున్న ఆ సమయాన్ని తెలుసుకుని 18మంది చిరంజీవులు మహర్షులూ, కలియుగం అంతా జీవసమాధులలో తపస్సు చేస్తున్న సిద్ధపురుషులు తమ దివ్యశరీరాలతో వెళ్ళి ఆ నారాయణావతారమును దర్శించి సేవించుతారు. యమధర్మరాజు కూడా ' సిద్ధశరీరం'తో ప్రత్యక్షమై కలిలో అనుభవించే పాపులతో తన నరకము క్రిక్కిరిసి పోయిందనీ, ఆదుష్టుల పాపమును తను భరించలేకుండా వున్నాననీ కాబట్టి త్వరలో కలియుగాన్ని అంతమొందించి ధర్మస్థాపన మొనరించి తనకా పాపములపీడను నివృత్తి చేయవలసిందిగా ప్రార్థిస్తాడు!

కల్కిభగవానుడు ఎనిమిది (8) సంవత్సరాల ప్రాయముగల బాలుడైవుండగా చిరంజీవుడైన పరశురాముడు తన 'సిద్ధశరీరం' తో తాను రామాయణకాలంనుంచీ తపస్సు చేస్తున్న 'మహేంద్రగిరి' ని విడిచి, కల్కిభగవానునికి గురుత్వం వహించి అనేక దివ్యశస్త్రాస్త్రములను ఆయనకు ప్రసాదిస్తాడు.

ఇంకా మార్కండేయుడూ, వ్యాసమహర్షీ, అగస్త్యులవారూ, 'మైత్రేయమహర్షి' వంటి పరమగురువులు శ్రీరామునికి వశిష్ట విశ్వామిత్రులవలెనే "ధర్మసంస్థాపన" నిమిత్తమై అన్నివిధాలా దోహదం చేస్తారు. ఇలా పెరిగి శ్రీకల్కిభగవానుడు తన బుద్ధిబలంతోనూ అపారమైన "బుద్ధి పరాక్రమం"తో భారతదేశంలోనూ, ఇతరత్రానూ, రాజులరూపంలో ప్రజలను దోపిడిచేస్తున్న 'దొంగల'ను కోట్లకొలది సంఖ్యలో సంహరిస్తాడు.

"హవిష్యతి కోటిశః"

కల్కి విష్ణుయశానమద్విజః కాలప్రచోదితః

ఉత్పత్స్యతి మహావీర్యో, మహాబుద్ధి పరాక్రమః
అవి భారతం,

రాజ్ఞాశ్చోర రూపిణః

## కల్కిదిగ్విజయం :-

ఇలాగ అపారమైన సైన్యం వెంటరాగా కల్కిభగవానుడు ధర్మ దిగ్విజయం నిమిత్తమై దండయాత్రలనుచేసి అన్ని రాష్ట్రాలనూ జయించి, చివరకు భారతదేశాన్ని ఏకఛత్రాధిపతిగా పరిపాలిస్తాడు. అప్పుడు విధివశాత్తుగా రాజసూయ మహాయజ్ఞాన్ని మహర్షులచేత సమంత్రకంగా చేసి, కలియుగంలో జరిగిన అనేక పాపాల ప్రక్షాళనకై, ప్రపంచ శాంతికీ, ధర్మస్థాపనకూ అశ్వమేధయాగాన్ని పూర్తిచేస్తాడు. అనేక దేశాలరాజులు కల్కిభగవానుని సామ్రాట్టుగా అంగీకరించి కప్పములూ సమర్పించుతారు.

## గ్రహగతులు - మారును :-

ఆ సమయంలో సూర్య, చంద్ర, శుక్ర, బృహస్పతి, బుధ, శనులు ఒకేసారి మేషప్రవేశం చేయగా -- యుగసంధి పుట్టి కలియుగం అంతంకావడం ప్రారంభిస్తుంది!

అప్పుడు అనేక ప్రళయాలు జరుగును. భూమి కంపించటం, అగ్నిపర్వతాల ప్రేలుడు, సముద్రాలు ఉప్పొంగటం, ఆకాశంలో ఒక భయంకరమైన తోకచుక్క, ఉల్కాపాతం (ఉల్కాలు రాలిపడటంవంటి) ప్రళయాల ఫలితంగా భూగోళంలో అనేకకోట్లమంది పాపాత్ములు నశిస్తారు! అప్పుడు కల్కిభగవానుడు పుట్టిన యోగాగ్ని అనేకమంది దుర్మార్గులను ఎక్కడివారినక్కడే కూర్చున్నవారు కూర్చున్నట్లే, నిలుచున్నవారు నిలుచున్నట్లే, నశింపచేస్తుంది. తరువాత భూమియొక్క పరిభ్రమణం, ఆకాశంలోని గ్రహగతులూ మారి - కలియుగంలో తిరుగుతూన్నట్టి తమ వక్రగతిని విడిచి - ఋజుమార్గంలో

పరిభ్రమిస్తాయి!

"ప్రదక్షిణా గ్రహాశ్చాపి
భవిష్యంత్యనులోమగాః
క్షేమం సుభిక్ష మారోగ్యం
భవిష్యతి నిరామయమ్"

అని, ఈ ప్రకారంగా 'కాలస్వరూపం' మారి తిరిగి "కృతయుగధర్మం" స్థాపించబడుతుంది.

## కృతయుగాంభం :-

ఈ 'కృతయుగం' కార్తీకమాసంలో శుక్లపక్షములో నవమినాడు మిట్టమధ్యాహ్నం 'అభిజిత్' లగ్నంలో ప్రారంభమవుతుంది! ఈ పవిత్ర పుణ్యతిథి అనగా కార్తీక శుద్ధనవమి అని అక్షయ -- నవమిగా యుగాదిగా, పర్వదినమై నిలుస్తుంది!

"అక్షయా నవమీనామ, యుగాది నవమీహి సా
లోకమంగళ దాత్రీచ సర్వకిల్బిష నాశనీ"
-- భవిష్యపురాణం.

ఈ విధంగా ధర్మసంస్థాపన చేసిన భగవానుడు అయోధ్యను ముఖ్యపట్టణంగా చేసి, పూర్వపు చంద్రవంశపురాజైన 'దేవాపి' అనే రాజర్షి అనేకవేల సంవత్సరాలుగా హిమాలయ పర్వతాలలో తపస్సుచేస్తున్నట్లు తెలుసుకొని పట్టాభిషిక్తుని చేస్తాడు! అలాగే శ్రీరాముని వంశస్థుడైన 'మరువు' తో తిరిగి సూర్యవంశపురాజుల పాలన ఆరంభిస్తాడు!! కైలాసపర్వతంవద్ద ఆయన తపస్సుచేసుకుంటున్న సంగతిని దివ్యదృష్టితో కల్కిభగవానుడు గ్రహించి, ఆయనను రప్పించి రాజగురువుగా ఋషిగా పురోహితునిగా 'మరు చక్రవర్తివద్ద నిలిపి, ధర్మస్థాపన పూర్తిచేస్తాడు.

## కల్కిమూర్తి :-

ఇలాగ తాను అవతరించిన ధర్మసంస్థాపనాకార్యం పూర్తిచేసిన కల్కిభగవానుడు పూర్ణాయుష్కుడై జీవించి మధువనంవద్ద యోగములో యోగసమాధిలో ప్రవేశించి స్వచ్ఛందమరణంవల్ల శరీరాన్ని పరిత్యజించి తిరిగి తన వైకుంఠధామాన్ని చేరుకుంటాడు.

ఇలా శ్రీకల్కిభగవానుడు తన పరమపదాన్ని చేరుకునేసమయంలో మహర్షులూ, సిద్ధులూ, జ్ఞానులూ తమ దివ్యనేత్రాలతో ఎనిమిది బాహువులూ కలిగి, కర్పూర, శ్వేతవర్ణముతో, సత్యజ్ఞానస్వరూపుడై శంఖము, చక్రము, గద, శార్ఞము, ముసలము, చర్మము, ఖడ్గమూ, అష్టాయుధములు ధరించిన శ్రీమన్నారాయణమూర్తిగా కల్కిభగవానుని దర్శించి తరిస్తారు!

ఇదంతా జరిగేముందు కలియుగానికి ముఖ్యఅధిపతి అయిన పాపపురుషుడైన "కలి " పురుషుడు - పది కోట్లమంది "మ్లేచ్ఛ" సేనలతో కల్కిభగవానుని ఎదిర్చి, ఆయనతో భయంకరమైన యుద్ధంచేస్తాడు. ఇది 1999-2010A.Dసంవత్సరాల మధ్యన కొన్ని సంవత్సరాలుగా నడచి భయంకరమైన మారణకాండతో మహాభారతయుద్ధం కన్నా - భయంకరమైన జననాశంతో ముగుస్తుంది!

దీనితో కల్కి భగవానుడు పాపపురుషుడైన 'కలి'ని సంహరిస్తాడు! అప్పుడు ఈకలి పాపపురుషుడు తనమాయలతో ఏర్పాటుచేసిన "ఆరుమతాలు" - నశించిపోయి ఒక్కటే అయిన "సనాతనధర్మం" లో కలిసిపోతాయి! "ఆరుమతాలు ఒక్కటౌను"!

## ప్రపంచమంతా ఒకేమతం :-

కృతయుగంలో ఒక్కటేమతం! భగవంతుడు ఒక్కడే! అప్పుడు అందరు మానవులూ ఒకే బ్రాహ్మణధర్మాన్ని బుద్ధిపూర్వకంగా అవలంబిస్తారు. మాంసభక్షణం, కల్లుత్రాగుట, జూదమూ, మోసము,

హింస, వ్యభిచారము అనే కలియుగలక్షణాలను విడిచిపెట్టి - మానవుడు పూర్వవేదకాలంలోలాగానే, సత్యాన్ని ధర్మాన్నీ తపస్సునూ అవలంబించటవల్ల ఈ ప్రారంభమయ్యే యుగానికి "సత్యయుగం" అనేపేరు నిజంగా అన్నివిధాలా చెల్లుతుంది!

ఈ విధంగా వ్యాసమహర్షి భవిష్యపురాణంలో ఈ కలియుగం 18-2-3102 A.Dనుంచి ప్రారంభించి, 4-5-2000A.D 6.A.M వరకూ జరుగగల కలియుగ భవిష్యత్తును యధాతధంగా రాజులపేర్లతో సహ వర్ణించాడు. ఇందులో ఇచ్చిన రాజుల పరిపాలనాకాలం ప్రకారం మన భారతదేశ చరిత్రను మనం చక్కగా సరిచేసుకొని - ఇంగ్లాషువాళ్ళు చేర్చిన మార్పులు చేర్పులు తీసివేసి ఖగోళగణితం సహాయంతో సైన్సుపరంగా (Astronomical dating) ప్రకారం నిర్ధారణ చేసుకుని చరిత్రను పరిష్కరించుకోవాలి! ఇందులో జాతీయచరిత్ర ప్రణాళిక అన్న నా ప్రయత్నం వేదవిద్యాలయంలో ఏర్పరిచి అనేకుల సహకారంతో పుర్తి చేయవలసివున్నది! వ్యాసమహర్షి మనకు అందించిన అపూర్వ జ్ఞానసంపద ఈ పురాణాలు. ఈ పురాణాలను భవిష్యత్తు సమగ్రరూపం చేప్పేటి భవిష్యపురాణమ్. ఈ భవిష్యపురాణంద్వారా వ్యాసమహర్షి మనకిచ్చే సందేశంప్రకారం నిజమైన మన భారతదేశ చరిత్రను మనపిల్లలకు బోధించుకుందాం ఎప్పటికైనా!



27

# మహామునుల -- యోగమండలి

ఎటుచూసినా తెల్లని మంచుకొండలు నీరెండకి తళతళా కాల్చిన వెండిలా మెరిసిపోతున్నాయి. కళ్ళు జిగేలుమనేలా, సూర్యుడి కిరణాలు కళ్ళల్లోకి పొడిచేలాగ ప్రతిఫలిస్తూ మంచురాళ్ళు అక్కడక్కడ స్ఫటికాల్లాగ మెరుస్తున్నాయి. తెల్లని ఈ మంచు మైదానం వెనకాతల ఆకాశం ముదురునీలంరంగుతో కొట్టవచ్చినట్లు ఒక నీలిసిల్కు తెరలా —— కనిపిస్తోంది, దుమ్ములేని హిమాలయపర్వతాలలోని నిర్మల వాతావరణంలో! ఎంత దూరానుండి చూచినా శిఖరాలూ, లోయలూ స్పష్టంగా కనుచూపుకు అందుతున్నాయి. ఎండలో తెల్లగా మెరిసే ఆ నిర్జన మంచుమైదానంలో వెండిపళ్ళెంలో పొదిగిన నీలం కెంపులాగ నిర్మలం అయిన నీళ్ళతో వున్న 'మానవసరస్సు' దూరానికే మెరుస్తోంది నీలంగా, నీలి నీడలున్న సరస్సులోంచి

అమాయకుడి మనస్సులాగ అడుగు అంతా కనబడుతోంది.

అది సిద్ధుల తపోభూమి. వాతావరణం అంతా ఎటుచూసినా ఒక స్వచ్ఛతా, నిర్మలతా, నిశ్శబ్దతా, ప్రశాంతి గూడుకట్టుకొని రాజ్యంచేస్తున్నది. చుట్టూ కనుచూపు మేరవరకూ ఎక్కడా మనుష్యసంచారం అనేది కనబడని మంచు ఎడారి. ప్రకృతి అంతా నిర్మలమై — ఒక అగాధమైన నిశ్శబ్దంలో మునిగి యోగ నిద్రలో జోగుతున్న యోగి మనస్సులాగ కాలం ఆగినట్టుగావున్న నిశ్చలదృశ్యం. ఆగి ఆగి హోరుగా వీచే ఆ చలిగాలిలో దూది మూటల్లాగ కొట్టుకు పోతున్న మంచుపింజలు, ఆ మంచు గాలులు వాటి మార్గంలోవున్న, చుట్టూ మెలచిన చెట్ల కొమ్మలను తెల్లని మంచుతో కప్పేసి ఆకొమ్మలను అనేక రకాల ఆకారాలతో చిత్రమైన మంచు శిల్పాల్లాగ తొలిచేస్తున్నాయి. ఆ తెల్లటి మంచు లోయమీదికి చూస్తూ ఒక కొండగుహ అంతా లోపలాబయటా మంచుతో పూయబడివుంది. ఆ గుహలోంచి నీలాకాశంలోకి చేసిన సొరంగంలాగ "కోలగా" ఒక మంచు పర్వతం మధ్యలోంచి తొలిచిన ద్వారం ఆ ద్వారంగుండా కనబడుతున్న బయటి నీలాకాశం త్రవ్విన నీలి సొరంగంలో కనబడుతోంది. గుహపైన నీటిబొట్లు చుక్కలు చుక్కలుగా రాలుతూ — మధ్యలోనే అవి మంచుగా అయిపోయి — పైన చాందినీలకు కట్టిన ముత్యాలులాగ, మణులలాగ మెరుస్తు న్నాయి. గుహపైనుండి వ్రేలాడుతున్న నీటి బిందువులే వజ్రాలలాగ తళుక్కు మంటున్నాయి కంటిచూపుకే.

అచ్చటి సరస్సులుకూడ చలికి పెరుగు తోడుకుపోయినట్టు గడ్డకట్టుకుపోయి ఘనీభవించినాయి. జలపాతాలు పైనుంచి పడు తున్నవి అలానే గడ్డగట్టుకుపోయి హిమవంతుని తెల్లని గెడ్డంలాగ మంచుగా స్థంభించి నిశ్చలంగా నిలిచి — చూచేవారికి విచిత్రంగా కనిపిస్తున్నాయి! ఏ కదలికా లేకుండా బొమ్మ జలపాతాలులాగ, అక్కడక్కడ కొన్ని గుహలు — వాటి మధ్య ఆశ్రమ కుటీరాలు, కుటీరాలకు మధ్యగా నిలిచిన గోపురంపై గాలికి రెపరెపలాడే నారిం

జరంగు జండాలు, బయటమంచుపైనే కూర్చుని ధ్యానిస్తూవున్న ఆజానుబాహువులైన మునులు, వారు నిరంతర ధ్యానసమాధిలో మునిగి ఊపిరిపీల్చటంకూడా ఏనాడో మరచిపోయి, గాఢతపస్సులో వున్నారు. వారిలో కొందరు జడలుకట్టి కనుబొమ్మలుకూడా తెల్లగా నెరిసిన మునులు వేల సంవత్సరాల నుంచీ అలా తపస్సు చేస్తూనే వున్నారు. అందులో కొందరు అయిదారువేల సంవత్సరాల వాళ్ళున్నారు. వారిలో కొందరికి వెయ్యి, రెండువేల ఏండ్లు, మరికొందరికి – ఎన్నేండ్లో ఎవరికీ తెలియదు. అలా నిరంతర తపస్సులో ఎన్నియుగాలనుంచో ఉన్నారు!!!

ఇది సిద్ధుల తపోభూమి అయిన –"శ్వేతద్వీపము". అది ఎల్లకాలం తెల్లటి మంచుతో కప్పబడివుండటం వల్ల దీనికి ఈ 'శ్వేతద్వీపం' అనే పేరు వచ్చిందని కొందరు భావిస్తున్నారు. కొందరు అచట "శుభ్రమార్గానికి" చెందిన బ్రహ్మఋషులు ఏకోశాన స్వార్థమూ, ఐహిక ఆలోచనలూ తగలని పరిశుద్ధ హృదయంతో, నిరంతరం సత్యాన్ని ఆరాధిస్తూన్న తెల్లని మనస్సులు కలిగిన, తొలి వెలుగుల సిద్ధమునుల జ్ఞానవాటిక గనుక – దానికి శ్వేతద్వీపం అనే పేరొచ్చిందని కొందరంటారు. ఒక్కటి మాత్రం నిజం – ఇది ఈ భూమిమీద కంతటికీ పవిత్రప్రదేశం! మానవ జాతికే పరిశుద్ధమైన ఆత్మవంటి స్థానం. ప్రపంచంలో జరిగే సంఘటనలన్నింటినీ ఇక్కడనుంచే దివ్యదృష్టితో దర్శిస్తూ, వారి తీవ్రతపస్సుతో పదును పెట్టబడిన మనస్సులతో జరుగుతున్న సంఘటనలనే తీర్చిదిద్దుతూ మానవ పరిణామాన్ని నడిపిస్తూ ప్రేమతో ప్రపంచాన్ని పరిపాలించే 'అంతరంగ పరిపాలన'కే కేంద్రం. ఇదే ప్రపంచానికంతటికీ ఆధ్యాత్మిక కేంద్రం.

వీరి పరిపాలన మన ప్రభుత్వాలలాగ బైటనుంచి పరిపాలించేది కాదు. మనస్సు ఇంద్రియాలను పాలిస్తూన్నట్టు - లోపలనుంచే మనస్సు, మనస్సుద్వారా మనచేతలను, సంకల్పాలను లాగుతూ పరిపాలించినట్టే బైట ప్రపంచంలో జరిగే వాటిని పరిపాలించే

విధానం. అందుకే ఇది సృష్ట్యాది నుంచీ భూమ్మీద "లోకగురువుల" నివాసభూమి. జగత్తుకే ఆధ్యాత్మిక కేంద్రం.

ఇలా లోపల నుంచే మానవజాతిని పరిపాలించే పరమగురువుల ఆధ్యాత్మిక పరిపాలనా కేంద్రము. లోకపాలకులైన పరమఋషి మండలి యొక్క నివాసభూమి. "శ్వేతద్వీపం".

ప్రపంచంలో ధర్మరక్షణా ఆధ్యాత్మిక శక్తి ఎక్కడ అవసరం వచ్చినా ఆ దేశాలలో జన్మించే జగద్గురువులు అవతారమూర్తులు ప్రవక్త'లూ ఇక్కడినుంచే పంపబడతారు. వారుపోయి ఆయాదేశాన్ని బట్టి వేరువేరు భాషలలో వేరుపేర్లతో జన్మించడం జరుగుతుంది. వాళ్ళు ఈ సనాతన ధర్మంయొక్క శాశ్వత సత్యాన్ని ప్రజలలో భోధించి తిరిగి మళ్ళీ అక్కడ ధర్మాన్ని స్థాపించటం 'ధర్మపరిపాలన అంటే ఇదే' జరుగుతున్నది. అది జరిపేది ఇక్కడనుంచే.

అంతేగాదు ఈ భూమిమీదవున్న రహస్య ఆధ్యాత్మిక కేంద్రం మనిషికి మెదడు ఎలాంటిదో అలాంటి మానవజాతికి ఆత్మవంటి 'బ్రహ్మఋషి మండలి' ఇదే. వీరు ఇతర లోకాలలోను, గ్రహ మండలాలమీదా ఉన్న 'సిద్ధగురుమండలి'తో దివ్య దృష్టితో ఆలోచనలు రేడియోలాగ నిత్యం ప్రసారం చేసే దివ్య కేంద్రంకూడా ఈ 'శ్వేతద్వీపమే', ఆదికాలంలో ఈ భూమి మీద మానవుడిని తెచ్చి నెలకొల్పినప్పుడు అతడికి కావలసినవి సమకూర్చి, మొదటి మానవ కుటుంబంగా ఏర్పాటుచేసి, వారు క్రమక్రమంగా జంతు దశనుంచి పొందే మానవ పరిణామంలో వారికి అవసరమైనంత విజ్ఞానం ఆధ్యాత్మిక శిక్షణా ఇస్తూ ఈనాడు ఈ స్థితికి మనష్యుడుని తెచ్చినది ఆదిగురువులే! మానవజాతి వీరికి శిష్యులుగా ఇంత వరకూ పెంపొందించబడ్డారు. అందుకే ప్రపంచంలోని అన్ని మతాల స్థాపకులూ ఇక్కనుండేవెళ్ళి జన్మించి ఒకే ధర్మాన్ని ఆయాదేశంలోని కట్టూబొట్టూ భాషావంటి బైటి మార్పులకు తగినట్టుగా మలచి ఇలా ప్రతివెయ్యి ఏళ్ళలోనూ ఒకక్రొత్త ఆధ్యాత్మిక

'తరంగాన్ని' (Wave a Consciousness) ప్రపంచంలో సృష్టిస్తారు. ఆ పని నిర్వహించేది ఈ పరమగురువులే. అలాంటి సత్యకాలపు ఋషుల తెల్లని సిద్ధవాటిక ఆ "శంబల" గ్రామం.

ఇప్పుడు 'కలియుగం' అంతమై రానున్న "సత్యయుగం" మొదలు పెట్టె మధ్యకాలంలో – అవతారంగా ప్రపంచానికి దర్శనమిచ్చే "కల్కిమూర్తి" కూడా ఈ 'శంబల' గ్రామంలోనే! అలా అన్ని పురాణాలలో స్పష్టంగా వర్ణించినదీ సిద్ధభూమియే. ఆసిద్ధుల నివాసభూమి ఇదే.

ఆ సిద్ధాశ్రమం చూట్టూరా ఎత్తైన పెద్ద పెద్ద పర్వత పంక్తులు పైకి లేచి అన్నివైపులా గోడలాగ చుట్టుకొని చూడడానికి వీలులేని లోయమధ్యగా ఉన్నది. పైనుంచి చూస్తే ఆ చుట్టూరా వున్న కొండలు ఎలా కనబడతాయంటే అవి ఒక తెల్లని తామరపూవు రేకుల మధ్యన బొడ్డు చూట్టూరా వ్యాపించి ఉన్నట్లే చూట్టూ చక్రాకారంగా ఉంటాయి. అలావుండటంవల్ల పురాతన కాలంనుంచీ దీనికి మణిద్వీపమని కూడా పేరువుంది. బ్రహ్మపద్మంలావుండేదీ దివ్యతపోభూమి.

ఇక్కడ ప్రతి ఏటా ఒకానొక ప్రత్యేక పూర్ణిమ నాడు ప్రపంచంలోని అనేకమంది పరమగురువులూ ఇక్కడ సమావేశమౌతారు. అప్పుడు చంద్రోదయ సమయంలో వారంతా గుద్రంగా మండలాకారంగా నుంచుని ధ్యానిస్తారు. వీరికి మధ్యగా లోపల ఒక నక్షత్రాకారంలో నిలబడి, రెండవ మండలాకారంగా ప్రార్ధనలు చేస్తున్నవారే 'లోకపాలకవర్గం.' అందులో నిలుచున్నవారిలో నల్లని గెడ్డం మీసాలతో రాజఠీవితో నిలుచున్న ఆజానుబాహుడైన వ్యక్తి వైవస్వత మనువు. ఆయనచేతిలో ఒక స్ఫటికంతో చేసిన దండం (రాజదండం వంటిది) ఆయన లోకపాలకుడి అధికారానికి సూచనగా ఉన్నది. ఆ పొట్టి దండంలోనిసిద్ధి అద్భుతశక్తి ఊహించడం కష్టం. ఆయన తలమీద వెంట్రుకలు నల్లగా తళతళ మెరుస్తూ ఉన్నాయి. వెడల్పాటినుదురు, పొడుగాటి కోటేరుముక్కు రాజసం ఉట్టిపడే

విశాలమైన గంభీర నేత్రాలు ఆయన ఈ ఏడవ మానవజాతికి ఆదిపురుషుడని చెప్పకచెబుతున్నాయి.

ఆయన ప్రక్కగా కొంచెం మధ్యగా నిలబడిన వారు, మైత్రేయ మహర్షి. వారే ఈ కలియుగం అంతం అయ్యేలోగా మానవజాతికి ఆధ్యాత్మిక శిక్షణ భారం వహించిన పరమగురువు. ఈయనే గౌత మబుద్ధుని తర్వాత భూమికి అవతరించే లోకగురువు -- "మైత్రేయ **బుద్ధుడు**"గా బౌద్ధులు రానున్న కాలంలో ఎదురుచూచే అవతా రమూర్తి. వారివెనుక స్ఫటికం లాగ ఇటునుంచి అటుకనబడేలా శుభ్రమైన శరీరంగల సన్నటి పొడుగాటి వ్యక్తి-తెల్లని జుట్టుముడీ తెల్లని మంచులాటి నెరసిన కనుబొమ్మలూ, సన్నగా జ్వాలవలే పొడుగ్గావున్న గడ్డంతో -- ఆయనే నారదమహర్షి! దేవతలకు కూడా ఋషివారు. నుదుట నాజూకుగా దిద్దిన నిలువుబొట్టు, మెడలో స్ఫటికాలూ, ముత్యాలూ తాపినమాలతో వీణధరించి తనలోతానే తేలిపోతున్నట్లున్న సంపెంగ రేకులవంటి కనురెప్పలతో మహాభక్తిని స్రవించే ఆ కన్నులూ, నారదులని చెప్పకనే చెబుతున్నాయి. వారి వెనుక వాల్మీకి, ప్రక్కగా పరాశరులవారూ, ఆ వెనుక పొడుగాటి గడ్డాలు మీసాలతో నల్లని శరీరంతో నిల్చున్నది అగస్త్యులవారు, ఇంకా అక్కడ ఎందరో సిద్ధ గురువులు మండలాకారంగ నిల్చుని వున్నారు. ఈనాడు జరగబోయే అద్భుత ఆధ్యాత్మిక గురుమండలి సమాగమంలో పాల్గొనటానికి వచ్చిన మహామునుల యోగమండలం -- అది.

అందరూ ఒకరొకరే వారివారి నిర్ణీత స్థానాలలో నిల్చొన్నారు. ఆరంభమయింది యోగమిత్రమండలి సదస్సు. అందరూ కలిసి సామూహిక ధ్యానం చేయడానికి సూచనగా, ఓంకారం అతి నెమ్మదిగా సన్నగా వినిపించింది. నెమ్మదిగా ఆ నాదం పెరిగి ఝుంకారంలాగ ఏర్పడి స్పష్టంగా అందరిలోంచీ ఒకే నాదంగా వస్తోంది. అది వారి మనస్సులోంచే వస్తోందో, కంఠం లోంచే వస్తోందో, చెప్పటానికి వీల్లేకుండా వుంది. వారందరూ అలా

కళ్ళు మూసుకుని -- ధ్యానంలో తమనుతాము మరచిపోయి అలా ఆనంద పారవశ్యంలో మునిగి వున్నారు. అందరిలోంచీ ఒక 'ఓం' కారనాదమే వినవస్తోంది.

అలాచూస్తుండగానే అందరు వ్యక్తులూ ఒక్కటిగా కలసిపోయి లయమై సమాధిస్థితిలో మునిగిపోయారు. అలా నిల్చునివుండే ధ్యానించారు అందరు గురువులూ -- ఒకే శరీరంలోని అవయవా లలాగ! అలాతీవ్రంగా ధ్యానంలో మునిగిన ఋషిమండలి మధ్యన ఒక విచిత్రం జరుగనారంభించింది. వాళ్ళముందర చిన్న వేదిక మీద ఖాళీప్రదేశంమీద వారి ఏకాగ్రత ప్రసరించసాగింది కిరణాలలాగ. ప్రతిమహర్షి తేజస్సూ ఆ మధ్యనున్న కేంద్రంలో గురికాసాగి అన్నీ సూర్యుడి కిరణాలవలె ఆ మధ్యనున్న ఖాళీప్రదేశంపై కేంద్రీకరిం చాయి. అందరి శరీరాలను కలిపివుంచే ఆ యోగశక్తి అనేక తీగల వలలను కలిపే కరెంటు ముద్దగా వారి లోనించి ప్రసరించే శక్తిని ఒకటిగా ఏకంచేసింది.

అక్కడ ఎదురుగా వారిముందు విచిత్రమైన లేతనీలంరంగుతో పొగలాటి నీలితేజస్సు వలయంగా ఏర్పడింది. అది క్రమంగా పూలు బంతిలాగ తేజోరాశిగా పెరిగి పొగమంచుగోళంలాగ పెద్దదయింది. అందరి మనసులోనుంచి వచ్చే, ఆవిజ్ఞాన కిరణాలు – ఒక గుఱ్ఱానికి తగిలించిన అనేక కళ్ళాలలాగ ఆ తేజస్సుతో కలిసివున్నాయి! అందరి మనస్సులోంచి వచ్చిన కిరణాలతో అభివృద్ధి పొందిన తేజం ఒకపనసకాయంత ఆకారంగా పెరిగింది.

అలాగే సన్నగా ఓంకారం ధ్యానం నడుస్తూనే వున్నాయి. స్వరం నెమ్మదిగా లేస్తూపడుతూ వేదంలాగ ఉదాత్తంగానూ వస్తోంది.

అందులో ఎవరిలోంచి ఈ స్వరం వస్తోందో తెలియడంలేదు. అందరూ ఒకటేఅయి అన్ని శరీరాలతో వున్న ఏకవ్యక్తి లయించిపోయి ఒళ్ళు తెలియని సామూహిక ధ్యానంలో అలా తన్మయత్వంలో మునిగివున్నారు పరమగురు మండలి అంతా.

ఇంతలో అకస్మాత్తుగా ఆమధ్యనున్న 'వేదిక' (చిన్న అరుగు) మీదుగా ఆజ్యోతి, నిలువెత్తు పెరిగి గుండ్రంగా కోలగా వున్న ఒక తేజశ్చక్రంగా అయి, చూస్తువుండగానే -- ఒక మానవాకారం ధరించింది. క్రమక్రమంగా మేఘమే ఒక ఆకారం ధరించినట్లుగా, ఆ మూర్తి అస్పష్టమైన రూపురేఖలతో దూదిపింజవలే అయి, అందులోనుంచి తెల్లని గడ్డం, జడలూ, తెల్లని పంచా, కమండలము, ఆ చేతిలో ఒక జపమాల -- స్ఫటికంలాగ శరీరమూ, తెల్లని జుట్టూ, అంతా ఒకేరంగుతో ఒక కర్పూరం బొమ్మలా స్ఫటికంలాగ అయి నిలిచిందావిగ్రహం.

"లోకగురువులు" -- అన్నమాటలు అందరి హృదయాలలోనూ విరిసి ఒక్కటే ఆనందం -- అందరిలోనూ ఒకే ఆలోచన. అక్కడ ఆనాడు గుమికూడిన పరమగురు మండలిలోని సిద్ధగురువులందరి గుండెలలోనూ స్పష్టంగా తెల్లటి పూర్ణిమ చంద్రుడు వెలగటం, స్పష్టంగా ధ్యానంలో ఎవరి గుండెలలో వాళ్ళుదర్శించారు. వానిని హృదయంతో దర్శించటమే కాదు. ఆ చల్లని తియ్యని, తేనెకలిపిన పాలవంటి అమృతపు రుచి, వారికి గుండెలలోనే తగిలింది. అందరి శరీరాలు పులకించినాయి ఆ అకృతస్పర్శకు.

అందరి మనస్సులూ ఒక్కసారిగా వెలిగాయి! ఆనాటి ఆ అద్భుతమైన ఆ 'ఆత్మపూర్ణిమ'లో గురువును పూర్ణంగా హృదయంలో అనుభవించిన ఆనాటి పూర్ణిమయే గురుపూర్ణిమ. లోక-గురువే పూర్ణచంద్రునిగా ఆత్మలో దర్శనమిచ్చాడు.

అంతేకాదు కాలంలో రానున్న సంవత్సరంలోనూ -- రానున్న పన్నెండు సంవత్సరాల తరుణంలోనూ జరుగనున్న ప్రపంచ పరిస్థితులూ ఇంకా భూమిమీద జరిగే మార్పులూ, పరిణామాలూ అన్నీ వారికి వివరించబడినాయి -- మాటలు లేకుండానే -- చిత్రంతోనే, వారి మనస్సులు మాట్లాడుకున్నాయి! మాటలు అవసరం లేకుండా మనస్సులు మనస్సులు ఆలోచనలను అందించు

కున్నాయి. నోరుమెదపని అద్భుతసదస్సు అది. గురువు మౌనమే సంభాషణకాగా ఆత్మలోంచి అనుభూతిని అందించటమే ఉపదేశం అయింది. అందరూ కన్నులార దర్శించారు ఆ లోక గురువు రూపాన్ని.

ఆ తర్వాత క్రమంగా వారిమధ్యన ప్రత్యక్షమైన ఆ మూర్తి శరీరంలోంచి అణువులు ఒక్కటొక్కటే ఎగిరిపోసాగాయి అలా చూస్తూండగానే శరీరంలోని అణువులు, ఒక సుడిగాలిలాంటి వాయుగుండంలో ధూళిరేణువుల్లాగ ఎగిరిపోయి, ఆ రూపం కరిగి పోయి, పదార్థం విడిపోయి, మళ్లీ అక్కడ స్థలం ఎప్పటిలా ఖాళీగా అయింది. పరమగురువు! ఎలాగ సంకల్పించి, గాలిలోని అణువులను రప్పించుకొని అలా దాంతో శరీరం కట్టుకుని దర్శనం యిచ్చి, మళ్లీ అలానే అణువులన్నీ విడిపోగా అనంతాకాశంలోకి అదృశ్యం అయ్యారు.

ఇదే సిద్ధగురువులు "నిర్మాణకాయం"తో సంకల్పమే శరీరంగా చేసుకొని ఎక్కడ కావాలంటే అక్కడ సాక్షాత్కరించే -- **ఆధ్యాత్మిక ప్రక్రియ.** అణువులకలయికతో ఏర్పడిన **యోగమయ** శరీరం అలానే కరిగిపోతుంది. అందుకే చావులేదు ఆ అణుశరీరానికి! అందుకేవారు చిరంజీవులు. ప్రళయంలోకూడా ఇలానే అణువులచేరికతోవారు ఎక్కడ కావాలంటే అక్కడ – తాము ఏర్పడతారు -- సంకల్పంతోనే! పదార్థాన్ని జయించిన మనస్సువారిది. అణువులను ఆజ్ఞాపించగలరు అందుకే.

ఇదే నిత్యం సృష్టిలోవుండి ప్రళయాలు వచ్చినా నశించని అణు శరీరాలు కలిగిన మహాత్ములూ, చిరంజీవులూ గత యుగాలలోని అవతార మూర్తులు చలనం లేకుండా నిలచి వుండటంలోని రహస్య ప్రక్రియ! పరమాణువులతో ఏర్పడినదే ఈ పదార్థంతో తయారైన ప్రపంచం అంతా. నీటి ఆవిరిలో ఆకాశం తేలి సంచరించే నీటి అణువులే – ఆనీళ్ళు గడ్డకట్టి 'మంచు' ముక్కగా అయినప్పుడు

వాటికొక గట్టిరూపం ఏర్పడినట్టే అణువుల కలయికవల్ల ఏర్పడిన శరీరాలుకూడా ఎక్కడ కావలిస్తే అక్కడ ఘనీభవించి 'ఆకారం' ధరిస్తాయి.

ఇది ఎలా వుంటుందంటే గాలిలాగ కంటికి కనిపించని నీటి ఆవిరి గాలి ఒక్కసారిగా చల్లబడగానే అకస్మాత్తుగా గడ్డకట్టి 'వడగండ్లు'గా అయి ఆకాశంలోంచి పడినట్టే అదృశ్యమైవున్న సర్వవ్యాపకమైన సిద్ధగురువులఆత్మకూడా సంకల్పబలంతో ఒక తీవ్రమైన ఆకర్షణ చక్రంతో సుడిగుండం ఏర్పరచుకుని అందులోకి గాలిలో తిరిగే అణువులన్ని సుడిగాలిలో చిక్కుకున్న ధూళిరేణువులలాగే కనబడతాయి. అలా ఏర్పడే శరీరం యోగపరిభాషలో **"నిర్మాణకాయం"** అంటారు. ఇది **అయోనిజ సంభవులకుండే శరీరం. తల్లి ప్రమేయం లేనిజన్మ కనక అయోనిజం.**

శరీరం ఉంటేనేగదా చావుపుట్టుకలు? అందుకని 'చావు' దేనికి వస్తుంది? శరీరంలోని అణువులన్నీ గాలిలోకి తప్పుకుంటే, శరీరంలేని సిద్ధులకు మరణంలేదు యిందుకే. అంతేకాదు శరీరం వుంటే దానికి బోలెడు బెడద ఒకచోటనుంచి ఇంకోచోటుకి యోగి వెళ్ళాలంటే దాన్నికూడా మోసుకుంటూ వెళ్లాలి. ఒక సామానో బెడ్డింగో తీసికెళ్లినట్టు! ఆ శరీరమే లేనివాడు ఎక్కడికి వెళ్ళాలన్నా టికెట్టు లేకుండా వెళ్ళ గలడు. ఆ శరీరంవుంటే దాని పోషణా దానికి తిండీ పైనబట్టలూ వాటికోసం ఉద్యోగాదులూ... ఇలాటి శరీరంలేని వారికేవీలేవుగదా? శరీరంలోవున్న 'తాను' మనస్సుగా ఎక్కడికి వెళ్లాలని అనుకుని ఆ ప్రదేశాన్ని ఆలోచించగానే ఆలోచనతోనే వెళ్లి అక్కడ వుంటుంది. మనస్సేగదా శరీరం ఇప్పుడు! దీనినే **'మనోమయశరీరం'** అంటారు. అలాంటి అనేకరకాల 'కరెంటు' శరీరాలతో సంచారంచేసే వారినే 'చిరంజీవులు' అని అంటారు. వారి శరీరాలన్నీ ఒకే మాదిరివికావు.

అలాంటి చిరంజీవులలోని వారే మార్కండేయుల వారూ, ఆంజనేయుడూ, వాల్మీకి, వశిష్ఠుడూను. ఇలాగ అనేకులు మృత్యు

వును జయించి, శరీరాలు లేకుండా ఆత్మలుగా తిరుగుతూ వుంటారు అవసరం వచ్చినపుడు దర్శనం యిస్తా.

ఆ పూర్ణిమనాడు అలాగ సామూహిక ధ్యానంలో పాల్గొన్నవారిలో వాల్మీకి, నారద, తుంబురులు, బృహస్పతి, శుక్రుడు (వీరు గ్రహత్వాన్ని పొందారు).

అగస్త్యుడు, చ్యవనుడూ, గాలవుడూ, వ్యాసుడూ, శంఖుడూ, లిఖితుడూ, మొదలైన పరమగురువులు అంతా ఎందరో వున్నారు! మహాభారతంలో వీరంతా మళ్ళీ భీష్ముని నిర్యాణసమయంలో కురుక్షేత్రంలో, ఆ యుద్ధభూమిలో ఒక్కసారిగా సాక్షాత్కారం అయి అందరికీ దర్శనం 'ఇచ్చినట్లు' స్పష్టంగా శాంతి పర్వంలో యుంది!

అలాగే ఈ సామూహిక ధ్యానంలో చేరిన "ఈ పరమగురువుమండలి" లోనూ అనేకులు ప్రాచీన యుగాలనాటి ఋషులూ, సిద్ధులూ, చిరంజీవులూ వున్నారు. అలా నిరంతర ధ్యానంలో అందరూ యోగమండలిగా నడుస్తూంటే ఆ మధ్యన అణువుల ఏర్పాటుతో "నిర్మాణకాయం" – నిర్మించుకుని వారి మధ్యలో ప్రత్యక్షమయినవారు – "నారాయణఋషి" ఆయనే లోక గురువులు, ఆదికాలంలోని సత్యయుగంలోవారు బదరికాశ్రమంలో తపస్సుచేసి సిద్ధిపొంది సిద్ధత్వం, చిరంజీవత్వంలోని అన్ని అంతస్తులుకూడా దాటి, తర్వాత వచ్చిన మన్వంతరాలలోని ద్వాపరయుగం వచ్చినప్పుడు **నారాయణ ఋషివ్యాసుడు అయినాడు! అందుకే "వ్యాసోనారాయణోహరిః"** అని విష్ణుపురాణంలోని గడచిన ద్వాపరయుగాలలోని వ్యాసుల పేర్లతో అనేక మన్వంతరాలు గడచిన నారాయణ ఋషి పేరూ వస్తుంది!

## భగవద్గీత – మంత్రమూర్తి :-

ఇంతవరకూ మనిషికి జీవితరంగంలో కురుక్షేత్రమైన "ఈ శరీరంలో" జరిగే కురుపాండవ సంగ్రామం గురించీ, దానిలో

నరనారాయణ సంవాదం యొక్క అంతరార్థం గురించి తెలుసుకున్నాం.

ఇప్పుడే గీతను గురించిన మరికొన్ని 'దేవ రహస్యాల'ను గుర్తించి — అర్థం చేసుకుందాం! గీతకు పద్దెనిమిది (18) అధ్యాయాలు వున్నాయి. ఈ సంఖ్య కేవలం అనుకోకుండా ఏర్పడినదా కాదా అని చాలమంది అసలు యోచించనే యోచించరు — "పద్దెనిమిది ఐతేనేమి? పందొమ్మిది ఐతేనేమి?" అనుకోవచ్చు. కాని ఈ సంఖ్య వెనుక నిగూఢమైన ఆధ్యాత్మికరహస్యం ఒకటి దాచబడి వుందని తెలుస్తుంది.

ఎందుకంటే ఈ భగవద్గీత ఏ మహాభారత గ్రంథంలో మధ్యలో వస్తుందో — ఆ భారతంలో కూడా, పద్దెనిమిది (18) పర్వాలే వున్నాయి, ఇది ఆశ్యర్చం కదూ!

అవును. ఇంతేకాదు — భారత యుద్ధంకూడా సరిగ్గా 18 (పద్దెనిమిది!)రోజులలోనే జరిగింది. ఇది చాలకపోతే ఆ యుద్ధంలో పాల్గొన్న సైన్యాల సంఖ్యకూడా ఆశ్చర్యకరమైన సంఖ్య పద్దెనిమి దియే. అదెలాగంటే

కౌరవుల వైపు పోరాడిన సేన — 11 అక్షౌహిణులు, పాండవుల వైపు పోరాడిన సేన — 7 అక్షౌహిణులు, వెరశి 18.

ఈ సంఖ్య విచిత్రం ఇంతటితో ఆగదు. వ్యాసమహాముని రచించిన "మహా పురాణాలు" కూడా సరిగ్గా పద్దెనిమిదే (18) వున్నాయి. అలానే ఆయన రచించిన ఉప పురాణాల సంఖ్యకూడా పద్దెనిమిదియే! ఇందులో ఒక నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యం యిమిడివున్నదని చెప్పటానికి ఇది చాలకపోతే ఇంకా — వ్యాస మహర్షి వ్రాసిన "అతి పురాణాలు" — 18 వున్నాయి! అలాగే లఘుపురాణాల సంఖ్యకూడా సరిగ్గా పద్దెనిమిదియే! ఆశ్చర్యం కదూ! అవును, నిజమే! కాని దీని వెనుక దాగివున్న అంతరార్థం ఏమిటో — అని ఆలోచిస్తే, ఒక ప్రమాణ శ్లోకం కనిపిస్తున్నది. అది, యీ విధంగా వున్నది.

**"దృశ్యం దేహంచ వాగాది శ్రోత్రాదీంద్రియ పంచకం**
**ప్రాణాది పంచకంచైవ తదా అంతఃకరణమేవ్యచ!!**
**ముక్తి సాధనం సోపానాః అష్టాదశ ఇతీరితాః" —**

అంటే అర్థం "జీవుడు ముక్తి పొందాలంటే అతడు ఎక్కి పోవలసిన మెట్లు సరిగ్గా పద్దెనిమిది — అవి యేవనగా పంచప్రాణములు — ఐదు (5) అలానే జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియాలు - 5 దేహము - 1 దృశ్యము - 1 కలిపితే ఏర్పడే 18 మెట్లే మోక్షమనే సౌధానికి మెట్లు అవి. అందుకే ఈ సంఖ్యకు ఇంత ప్రాముఖ్యత - మోక్షశాస్త్రమైన గీతకుకూడా 18 మెట్లుండటములో ఆశ్చర్యమేముంది. ఇందులో ఇంకొక విచిత్రముకూడా వున్నది.

వ్యాసమహర్షి 'మహాభారతం' వ్రాస్తూ ప్రతి పర్వం మొదట్లోను ఒకటే ప్రార్థనాశ్లోకం పెట్టాడు. అదేమిటంటే:

**"నారాయణం నమస్కృత్య! నరంచైవ నరోత్తమమ్**
**దేవీం సరస్వతీం వ్యాసం! తతో "జయ" ముదీరయేత్."**

ఈ శ్లోకానికి అంతరార్థం తెలియనివాళ్లు ఇది కేవలం నారాయణ ఋషికీ, నరుడనే ఋషికీ, వ్యాసునికీ, సరస్వతికీ నమస్కరించి "జయ" మనే భారతాన్ని రచిస్తున్నానన్న అర్థమే తీసుకుంటారు. ఇక్కడ పై శ్లోకంలో "జయ" మనే మాటకు కేవలం కౌరవులపై పాండవులకు కలిగిన జయమే ఇది అనుకుంటారు. కాదు; అది 'విజయం' అని వ్రాయాలి. జయమని ఎందుకన్నారు వ్యాసులవారు అని ఆలోచిస్తే సంస్కృతంలో 'జ' అనే అక్షరానికీ 'య' అనే అక్షరానికీ "బీజ నిఘంటువు" ప్రకారం సంఖ్యలుకూడా 1, 8, రెండూ వస్తాయి! కాబట్టి జయమంటే అర్థం 18 అని. **"తతో జయముదీరయేత్"** అంటే ఆవిధముగా 18 రూపమైన జయము (18) పద్దెనిమిది పర్వాలు గలిగిన నరనారాయణగాథయైన భారతం ఉద్భవించింది అని అర్థం.

యుద్ధంలోని సేన సంఖ్య కూడా 18 అక్షౌహిణులేనని చెప్పాను. అంతేకాదు ఒక్క అక్షౌహిణిని తీసుకుంటే అందులోని ఏనుగులు, రథాలు, గుర్రాలు, కాల్బలం (బంట్లు) కూడా కూడితే, సరిగ్గా యిదే సంఖ్య వస్తున్నాయి అదెలాగంటే: ఒక అక్షౌహిణి=

21870 ఏనుగులు 2+1+8+7+0 =18

21870 రథములు 2+1+8+7+0 =18

65610 గుర్రాలు 6+5+6+1+0 =18

109350 కాల్బలం 1+0+9+3+5 =18

కనుక ఒక్క అక్షౌహిణిలోని నాలుగు అంగాలూ (చతురంగబలాలు) కలిపి ఒక్కొక్కటీ పద్దెనిమిదే అవుతూండటంతో పై ప్రమాణం మరింత దృఢపడుతూవున్నది. వ్యాసమహర్షి రచనా వైచిత్రికిది నిదర్శనం. ఆయన గీతనొక మహామంత్రంగా "అష్టాదశాక్షరి"గా రచించాడని చెప్పవచ్చు! శ్రీకృష్ణ మహామంత్రములు సరిగా - 18 అక్షరములే గదా యున్నది. గీత సిద్ధించుటకూ, గీతలోని నిగూఢ రహస్యార్థము విపులముగా భాసించుటకూ ఈ 18 అక్షరముల మంత్రమును జపించి తద్వారా **'గీతా వాహన'** న్యాసం జపముచేసి గీతను ఒక మహామంత్రముగా, జపించి తరించవలెనని ఈ 18 అక్షరముల వెనుక నిబిడీకృతమైవున్న — దేవరహస్యము.





# "పంచమవేదం" నాలుగువేదాల సారం మహాభారత రహస్యము

లోకహితార్థమై హిమవత్పర్వత గుహలో చేసిన అఖండ తపోదీక్షలో వ్యాసమహర్షి దర్శించిన విశ్వసృష్టిరహస్యం ఎటువంటిదో మొదటి అధ్యాయంలో తెలుసుకున్నాము! వేదాలకు అర్థము అలా తపస్సుద్వారా దివ్యదృష్టితో గ్రహించిన వ్యాసమహర్షికి త్వరలో రానున్న కలియుగం గురించి, మానవజాతికి స్వార్థము అహంకారము, అంతర్యుద్ధాలతో, మహాపాపాలతో నిండివున్న నేటి కలియుగం గోచరించింది!

ఈ కలియుగ మానవాళి అల్పాయుష్కులు, భక్తిరహితులు పుణ్యహీనులై, స్వార్థంతోచేసిన అనేక చెడుకర్మల ఫలితాలను జన్మజన్మలకే అనుభవిస్తూన్న ఈకలియుగం మానవులైన మనగురించి ఆయనకు ఎంతోదయకలిగింది! వేదార్థాన్ని అవగతంచేసుకోలేని కలియుగమానవాళికి వేదంయొక్క సందేశాన్ని అందించటం ఎలా? పిల్లలకు తల్లి బోధించినట్టు ధర్మాన్ని, నీతినీ, త్యాగాన్ని, పుణ్యపాప ఫలితాలను కథలద్వారా అందిస్తే బాగుంటుందని సంకల్పించి ఇతిహాసమైన

మహాభారతాన్ని రచించాడు. నాలుగువేదాల సారమైన మహాభారతాన్ని పంచమవేదంగా ఋషులందరూ కీర్తించి శిరోధార్యంగా - ఒక పారాయణగ్రంథంగా నేటికీ పూజించి పఠిస్తున్నారు.

ఈ మహాభారతంలోనే భగవద్గీతనూ, విష్ణుసహస్రనామాలనూ ఇంకా అనేక స్తోత్రాలను, మంత్రాలను, జపాలను, అనేక ధర్మాలను మనిషిగా జన్మనెత్తినవాడు తెలుసుకోవలసిన సర్వవిషయాలను వ్యాసమహర్షి కథల రూపంలో అందించాడు నేటి కలియుగ మానవాళికి! చివరకు ఈ కలియుగం ఎప్పుడు అంతమవుతుందో కూడా తెలియచేసి రానున్న కల్క్యావతారంచరిత్ర కూడా ఎంతో విశదంగా వర్ణించాడు వ్యాసమహర్షి అరణ్యపర్వంలో! ఈ మహాభారతాన్ని కేవలం కథలుగాకాకుండా, ఒక శాస్త్రగ్రంథంగా పరిశోధనాదృష్టితో అధ్యయనం చేస్తే అందులో మనకు కనిపించే అనేక శాస్త్ర రహస్యాలేమిటో ఈ అధ్యాయంలో తెలుసుకుందాం! ముందుగా మహాభారతం 'ఇతిహాసము' అనగా చారిత్రక గ్రంథము అని ఎందుకు వర్ణించారో? తెలుసుకుందాం!

## మన చరిత్ర:

మన దేశచరిత్రంతా విదేశీయులు వ్రాసిందే! ఇంగ్లీషువారు మనల్ని పరిపాలించిన కాలంలో మనల్ని మానసికంగా, సాంస్కృతికంగా మార్చివేయటానికి చాలా పథకాలువేశారు. అందులో దాదాపు అన్నింటి వెనకా ఒకటే ఉద్దేశంతో మనల్ని స్వాతంత్ర్యం కోరకుండా మన - జాతీయ భావాలుమనకి అంకురించి వాళ్ళసామ్రాజ్యానికి ప్రమాదం తీసుకురాకుండా వుండేలాగ చూడటమే. అలా చెయ్యడంవల్ల మన జీవితవిధానాలూ, అలవాట్లు, కట్టూబొట్టూ, మన ఆలోచనలూ అన్నీ విదేశీయులను మనం అనుకరించేలాగ చెయ్యటం! ఇదే వాళ్ళ సంకల్పం! సంకల్పమేమిటి చివరికి

జరిగిందిగూడా అంతే!

ఇలా మనల్ని మార్చి వేయటానికి తెల్లదొరలు పన్నిన తంత్రాలలో ముఖ్యమైనది విద్యావిధానం! అంటే వాళ్ళు మనకు తలకెక్కించదల చినదంతా మనపిల్లలకు, విద్యార్థులకూ ఉగ్గుపాలతో నూరిపోశారు. ఇలా చెయ్యటానికి కావలసిన పుస్తకాలు రచించారు. అలా వ్రాయ టంలో మనదేశ చరిత్రని వాళ్ళే తిరగరాసేశారు. అనేక అపప్రధలు కల్పిస్తూ భారతీయులగురించి భారతీయ చరిత్రలోని మహామహులు, రాజులు, వీరులు, జాతీయపురుషులూ అయిన వాళ్ళగురించి - వీలయినంత తగ్గించి వ్రాయటం జరిగింది. ఇది ఈనాడు ఇప్పుడిప్పుడే మనవాళ్ళు తెలుసుకుంటున్నారు. ఈ విద్యావిధానం మార్చటంలో వాళ్ళకి మన దేశచరిత్ర ముఖ్యంగా ఒక పనిముట్టుగా వినియోగించింది.

విదేశీయులు మనదేశంగురించి చేసిన మోసాలు ముఖ్యంగా నాలుగు. అవేమిటంటే?

1. మనదేశచరిత్ర అతి ప్రాచీనమైనది అని తెలియచేసేఆధారాలన్నీ నాశనంచెయ్యటం.

2. మన పురాణాలు, వేదాలు, అవతార పురుషులూ ఇవన్నీ నిన్న మొన్ననే కల్పించబడిన అబద్ధాల కట్టుకథలని, మనపిల్లల తలకెక్కించటం.

3. మనకి "చరిత్ర" అంటూ ఒకటి లేదని నిరూపించటం. (ఇంగ్లీ షువాడు రాసిందే మనకు భిక్ష అని!)

4. మనదేశానికి అసలు విజ్ఞానమూ, సంస్కృతి - గొప్పతనం ఇలాంటివి ఏవివచ్చినా అవి మనమీద దండయాత్రలుచేసిన విదే శీయులు పెట్టిన భిక్షేగాని అసలు మనకి స్వంతనాగరికతే లేదన్న

భావం పాతుకుపోయేలాగ చరిత్రద్వారా ప్రచారంచెయ్యటం, భారత సంస్కృతిని నాశనంచెయ్యప్రూనటం. ఈవిషయం చాలా అన్యాయమని ఘోషించిన పెద్దమనుష్షులూ, ఆనాడు ఇంగ్లీషు వాళ్ళలోనూ వున్నారు.

'సర్ జాన్ వుడ్రఫ్'' Sir John Woodroff రాసిన గ్రంథం - "ఇండియా నాగరిత దేశ మేనా"? [Is India Civilized?"] అన్న దాంట్లో, మనదేశానికి ఇంగ్లీషువాళ్ళు స్వార్ధంతో చేస్తున్న ద్రోహం చాలా అన్యాయమని, పాపమని ఈయన గోలపెట్టాడు. అయితే ఏంలాభం? ఎవరు పట్టించుకుంటారు? దానికితోడు మన దేశీయులే విదేశీయ సంస్కృతిని కౌగలించుకొని, మాకంటే మీరే అధికులనే మానసపుత్రులు తోడయ్యారు. హిందూమతం, భారతీయ సంస్కృతి మొదలంటా నాశనం అయిపోతేనే కాని, ఈ దేశం బాగుపడదని మన మూఢవిశ్వాసాలు (అంటే మనమతం, సంస్కృతీ అన్నమాట!) పూర్వీకులు ఇచ్చిన భావాలు, తుడిచివేస్తేగాని, దేశం ముందుకురాదని ఇంగ్లీషువాళ్ళ కన్నా ఎక్కువప్రచారం చేసిన ప్రబుద్ధులూ వున్నారు. (ఇప్పుడూ వున్నారు. ఈజాతి జాగ్రత్తగాచూస్తే నేటిసమాజంలోనూ కనిపిస్తారు!) ఇలాంటి ఘోరప్రమాదం మనదేశపు విజ్ఞానానికి సంస్కృతికి చాలదగ్గరలోనే ముందుకు వస్తుందని గుర్తించినది - విదేశీయులలో కొందరు నిస్వార్ధులైన మహామహులు.

సర్ విలియం జోన్సు [Sir William Jones,] మనదేశపు న్యాయశాస్త్రం నాశనంకాకుండా "మనువు" వ్రాసిన 'మను స్మృతి' మొదలైన సంస్కృత గ్రంథాలన్నీ అర్థంతోకూడా ముద్రింపించారు. [Manu's Laws] అన్న శీర్షిక క్రింద. అదేవిధంగా పరాశర ముని వ్రాసిన "విష్ణుపురాణం" ఇంగ్లీషులోకి విల్సన్ [Wilson] అనేవాడు, అనువాదంచేశాడు.

ఇలాగే "మాక్సుముల్లరు" [Max Mueller] అనే జర్మను పండితుడు విదేశాలలో భారతదేశానికి మన సంస్కృతికి మనజాతికీ జరుగుతున్న అన్యాయం గురించి ఆందోళనచేసి, హిందూదేశంపట్ల మన పరిపాలకులకి గౌరవంకలిగించాలనే ఆదుర్దాతో "ఆక్సుఫర్డ్" (Oxford) విశ్వవిద్యాలయంలో తరిఫీదు (Training) అవుతున్న I.C.S. ఆఫీసర్లకు ఇచ్చిన ఉపన్యాసాలే "India - What It can Teach Us?" (భారతదేశం మనకేం నేర్పగలదు?) అన్నగ్రంథం. ఇది భారతీయుడనుకొనే మనలో ప్రతివాడూ చదివితీరాలి.

ఇంతేకాకుండా ఈ "మాక్సు ముల్లరు" సంస్కృతం నేర్చుకుని శ్లోకాలు వ్రాసాడు. తనూ తనభార్యా భారతీయ ఋషులలాగ ఓఆశ్రమం తయారుచేసుకొని చివరికాలంలో "ఆక్సుఫర్డ్" దగ్గిర "మోక్షమూలరు భట్టు" అని పేరుమార్చుకొని జీవించాడు. ఆయన అనేకమంది పండితుల సహాయంతో ఇంగ్లీషులో అనువాదంచేసి (Secred Books of the East) (ప్రాచ్యదేశపు పవిత్ర గ్రంధమాల) అన్నపేరుతో అనువదించినవి, ఇవి : (1) **వేదాలు** (2) **బ్రాహ్మణాలు** (శతపథ బ్రాహ్మణం, గోపథ బ్రాహ్మణం వగైరా) (3) పురాణాలు (4) ఉపనిషత్తులు. ధర్మశాస్త్రాలు ఇంకాఎన్నో ఇలా అచ్చువేయించకపోతే యీపాటికి మనకివి మచ్చుకికూడా మిగిలేవికావు.

ఇంతకీ చెప్పవచ్చేదేమిటంటే, మనకి, మనచరిత్రకీ, తీరని అన్యాయం జరుగుతుంటే మనకే జరుగుతోందని తెలియని దుస్థితిలో వుండి యీనాటికీ అవే వల్లెవేస్తున్నారు- మన టీచర్లూ, ప్రొఫెసర్లు, మన కాలేజీలలో లెక్చరర్లు, యూనివర్శిటీల వైస్‌ఛాన్సలర్లుకూడా. ఇంక మనటీచర్లకీ కొత్త విషయాలెవరు చెబుతారు? ఇంక టీచర్లూ లెక్చరర్లగతే అలావుంటే పిల్లలకి సరైనచరిత్ర

తెలియటం ఎలాగ? ఇదంతా గమనించకుండా "మన విద్యా ప్రమాణాలు పడిపోతున్నాయి", మన విద్యార్థులలో క్రమశిక్షణ పోయింది" అని గోలపెట్టే నాయకులు ఊరికినే పరిస్థితిని తిట్టుకునే స్థితిలో వున్నారు. సరైన చరిత్రలో మనదేశంగురించి మరుగుపడిన గొప్ప విషయాలు బైటికి తీసివ్రాయడం ఎలా?

## భారతీయులకి చరిత్రలేదా:-

భారతీయులకి చరిత్ర అంటేనే తెలియదా! చరిత్ర అనేది నిర్దుష్టంగా వ్రాయటమనేది మనకి, గ్రీకులూ, ఇతర పశ్చిమజాతులూ భారతదేశానికి వచ్చిపెట్టిన భిక్ష! అంతవరకూ పురాణాలు కథలూ తప్ప, అసలు చరిత్ర అనిచెప్పకోతగ్గది లేదు అని మెకాలే, స్మిత్, జోన్సు, హాల్డేన్‌లాంటి మొట్టమొదటి పాశ్చాత్య చరిత్రకారులు, నిశ్చయమైన నిర్ధారణతోనే మన చరిత్ర రాయటం ప్రారంభించారు. అవేమాటలు పుస్తకాల్లోకి ఎక్కి పాఠ్యగ్రంథాలలోకి ఎక్కి, ఈనాటికీ, మంత్రాలలాగా మన హిస్టరీ టీచర్లకి యూనివర్శిటీలోని "చరిత్ర" డిపార్టుమెంటులోని ప్రజలకి గంజాయిలా తలకెక్కికూర్చున్నది పై వాదం! అసలు ఈ తెల్లదొరల అపవాదు ఎంతవరకూ నిజం? అని చెప్పి మన ప్రాచీనగ్రంథాలలో చరిత్రగురించి ఏమివున్నదో చూద్దామనికూడా మన ప్రొఫెసర్లకీ, లెక్చరర్లకీ (ఏ ఒకరో ఇద్దరో వుంటే వుండవచ్చు) ఆసక్తి శూన్యం!! వున్నా సంస్కృతం రాదు చాలామందికి. మన సంస్కృత పండితులకందామా- కాళిదాసు పద్యాలూ, పంచ కావ్యాలూ వల్లెవేయించినవే - నెమరువేస్తూ, గ్రామఫోను రికార్డుల్లాగ అవేఅవే విషయాలు ఉపన్యాసాలలో ఏకరువు పెడదామనేగాని కొత్త గ్రంథాలు చూద్దామని చారిత్రక పరిశోధన చేద్దామనీ ఈ సుఖవంతులకి కుతూహలంకూడా లేదు.

అయితే అసలు నిజంగా మన దేశ చరిత్రని యథాతథంగా

అంటే తెల్లదొరల కల్పనలూ, స్వంతపైత్యాలు లేకుండా మన పూర్వశాస్త్రాలలో పురాణాలలోనూ భారతవర్ష చరిత్ర అంటూ వ్రాయడానికేమన్నా వుందా? అని మీరడగవచ్చు! నిశ్చయంగా వున్నది.

## ప్రాచీన భారతీయ చారిత్రక గ్రంధాలు:-

ప్రాచీన భారతీయ విద్యలలో వేదాలు పురాణాలు, అరవై నాలుగు కళలతోబాటు "ఇతిహాసం" (History) అన్న శాస్త్రం స్పష్టంగా పేర్కొనబడింది. "ముండకోపనిషత్తు"లోనూ ఇతర ప్రాచీన సంస్కృత గ్రంధాలలోనుకూడ! దీన్నిబట్టి విదేశీయుల దండయాత్రలలో అనేక గ్రంథాలు తగులపెట్టి, కొన్ని ఎత్తుకుపోకముందు, "ఇతిహాసం" అన్న "సబ్జక్టు" ఈనాటి "హిస్టరీ" డిపార్టుమెంటు లాంటిదే ఒకటివున్నట్లు తెలుస్తుంది. భారతాన్ని "ఒక ఇతిహాసం" అని అందులోనే వేదవ్యాసమహర్షి వర్ణించాడు.

అయితే ఈభారతం, చరిత్ర రాసేందుకెలాగ ఉపయోగపడుతుంది?" అని మీరడగవచ్చు. సూక్ష్మంగా మనకి భారతం మూలంనుంచి ఈక్రింది విషయాలు తెలుసుకోవచ్చు. అవి ఏవంటే:-

1. మహాభారతయుద్ధం అనేది ఒక '**ప్రపంచ యుద్ధం**'
2. అందులో క్రిందటి ప్రపంచయుద్ధం (World War) లో లాగే భయంకరమైన జననష్టం కలిగింది.
3. ఈ మహాయుద్ధంలో శ్రీకృష్ణుడు శాంతిదూ[illegible] తన [illegible] బారం విఫలంకాగా, తటస్థ విధానాన్ని అవలంబించి ఆయుధాలు విసర్జించి నిష్పక్షపాతంగా తనసేనలొకపక్షాన తానింకో వంకా (యుద్ధం చేయకుండా) వుండిపోయాడు.

4. ఆ భయంకర సంగ్రామం జరిగిన కాలానికే వున్న ఖగోళ విషయాలు గ్రహగతులూ, నక్షత్రస్థితి, వివరంగా మహాభారతంలో ఇవ్వబడ్డాయి.

5. శ్రీకృష్ణుడు రాయబారం తీసుకువెళ్ళిననాటి తిథి, వార, నక్షత్రాలు గణితంలో సరిపోతాయి!

6. శ్రీకృష్ణుడి జన్మ, నిర్యాణం, పరీక్షిత్తు పట్టాభిషేకం ఇలాటి విషయాలు గ్రహ, నక్షత్ర విషయికమైన ఖగోళ వైజ్ఞానానికి సత్యాలు (Scientific facts) మనకి దొరుకుతాయి.

7. మనదేశపు చరిత్ర మహాభారతకాలంలో ప్రారంభమవుతుందని చెప్పవచ్చు. ఎందువల్లనంటే "చారిత్రక యుగం" లేక చరిత్ర వర్ణించే కాలం మహాభారతంనుంచే మనకు ప్రారంభమవుతుందని చెప్పవచ్చు!

ఫిబ్రవరి 18 - 3102 B.C. - రోజున సరిగ్గా ఈచారిత్రక కాలం ప్రారంభమయింది. ఆరోజునే మనదేశ చరిత్రలో అతిముఖ్యమైన సంఘటనలు జరిగినట్లుగా మన మహాభారతం వల్ల తెలుస్తోంది. అందులో మొదటిది శ్రీకృష్ణుని అస్తమయం! భారతదేశచరిత్రను ఒక నూతనమార్గాన నడిపించిన ఆదర్శమూర్తి శ్రీకృష్ణుడు!

మనదేశం మొట్టమొదటిసారిగా ఏకీకరణం చేయబడి ఒక 'భారతదేశం'గా ప్రసిద్ధికెక్కినది కూడా శ్రీకృష్ణుని కృషి ఫలితంగానే!

మనకొక కొత్త రాజ్యాంగ విధానం యుధిష్ఠిరుని పాలనలో ప్రారంభమై, దేశంలో పద్దెనిమిది రాష్ట్రాలు ఈనాడు సర్దార్ పటేల్ నాయకత్వాన ఎలాగ సంఘటితం చేయబడ్డాయో అలాగే సరిగ్గా అదేవిధంగా ఆనాడు శ్రీకృష్ణుని రాజకీయ ప్రతిభవల్ల సంఘటితంచేయబడి మనం ఒకదేశంగా, జాతిగా రూపొందించిన

"యుగపురుషు"డైన శ్రీకృష్ణుడు మరణించిన తేదీయే "కలియుగం" పైనచెప్పిన చారిత్రకకాల ప్రారంభసమయం!

మహాభారతయుద్ధం తరువాత మనదేశ చరిత్రలో 'చీకటియుగం' అని చెప్పదగిన 'కలియుగం' ప్రారంభమైంది. ఈ కలియుగకాలంలోనే మనదేశానికీ, మన సంస్కృతికీ అడుగడుగునా కడగండ్లూ పరాజయం తీరని అన్యాయమే అన్నింటా జరుగుతూవచ్చింది. అంతేగాకుండా మనదేశం ఈ యుగంలోనే విదేశీయుల దండయాత్రలకి లెక్కలేనన్నిసార్లు గురియై, స్వరాజ్యాన్ని కోల్పోయి బానిసత్వంకూడా అనుభవించింది. గ్రీకులు, ముసల్మానులు, మొగలాయీ చక్రవర్తులు, పారసీకులు ఆఫ్ఘనులువంటి అనాగరిక క్రూరజాతుల చేతుల్లో మన జాతి చాలాసార్లు ఓడిపోయి కలకాలం వారి కాళ్ళక్రింద మ్రగ్గుతూ బానిసగా పరిపాలించబడి చివరికి ఘోరమైన స్వాంతంత్ర్యాన్ని చేరు కోగలిగింది. ఇటువంటి ఘోరమైన పరిణామాలతో కూడుకున్న మన చారిత్రక కాలానికి మహాభారత యుద్ధంతోనే ప్రారంభమని చెప్పడానికి ఇదేకారణం!

## 'కలియుగ - ఆరంభ శకం'

ఈ మహాభారత శకానికి ఇంకొక ప్రాముఖ్యతకూడా వున్నది. పూర్వరాజుల శాసనాలు శిల్పాలమీద, దేవాలయాలపైన చెక్కబడిన శిలాశాసనాలు, వాటివల్ల మన దేశాన్ని పరిపాలించిన రాజుల కాలం, మహాభారత కాలంనుంచీ ఈనాటి వరకూ ఈ కలిశకాన్ని ఆధారం చేసుకొనే కాలగణితంచేస్తూ వచ్చారని పైన తెలుసుకున్నాం! ఈ కాలగణితంవల్ల, మనకో గొప్ప సౌకర్యంవున్నది. అదేమిటంటే ఈ 'కలియుగ' శకమే గనుక ఈ శాసనాల్లో ఉదహరించకపోయివున్నట్లయితే మనదేశ చరిత్రలోని తేదీలను ఇంగ్లీషువారు ఇష్టంవచ్చినట్టు తారుమారుజేసిన గందరగోళాన్ని సరిదిద్దుకోడానికి

ఈనాటికి వీలయ్యేదికాదు! అంతేకాదు అసలు మనదేశపురాజుల కాలాన్ని ఇంగ్లీషు చరిత్రకారులు తలక్రిందులుచేసిన సంగతికూడా మనకసలు తెలిసేదేకాదు!! అందువల్ల ఈకలియుగ ప్రారంభకాలమైన (18-2-3102 B.C.) శ్రీకృష్ణునినిర్యాణ కాలము మనమందరమూ బాగా గుర్తుంచుకోవలసిన మైలురాయివంటి తేదీ.

1) 18-2-3102 B.C. అర్ధరాత్రి సుమారు 12-గంటల కాలంలో ప్రపంచమంతా గాఢనిద్రలో మునిగి ఉన్నప్పుడు – ఈ "కలియుగం" అవతరించింది. ఇది ప్రమాదినామ సంవత్సర చైత్రశుద్ధ పాడ్యమి శుక్రవారంనాడు జరిగినట్టుగా: ఆనాటి గ్రహాల నడకలనుబట్టి "సైన్సు (Science) ఆధారంగా విదేశీ చరిత్రకారులైన Bentley, Mons, Bailey, H. P. Blavatsky మొదలైన పాశ్చాత్యులుకూడా అంగీకరించారు. (కలియుగ ప్రారంభకాలంనాటి గ్రహస్థితి యింతకుముందు రాశిచక్రంలో ఇచ్చివున్నాను.) అలాగే శ్రీకృష్ణుని జననకాలంకూడా గుణించాను.

2) ఇదే సంవత్సరం, హస్తినాపురం (ఢిల్లీ)లో ధర్మరాజు రాజ్య పరిత్యాగం చేసి తమ్ములతోసహా "మహాప్రస్థానం" గా హిమాలయాలకు ప్రయాణమై వెళ్ళింది.

3) ఇదే సంవత్సరంలో, ధర్మరాజు మనుమడైన పరీక్షిత్తు హస్తినాపురంలో సింహాసనం అధిష్ఠించాడు! ఇతడు చక్కగా రాజ్య పరిపాలన చేసినట్టు కలియుగంలోని అధర్మం, పాపాలు పైకి రాకుండా నిగ్రహించి ధర్మపరిపాలన చేసినట్టుగా భాగవత, విష్ణుపురాణాలు మనకి తెలుపుతున్నాయి.

4) ఈ పరీక్షిత్తు పాము కరిచి మరణించగా అతని కుమారుడు "జనమేజయుడు" హస్తినాపుర సింహాసనాన్ని అధిష్ఠించాడు.

ఈయన చేసిన "సర్పయాగం" సమయంలో అనేక దాన ధర్మాలు బ్రాహ్మణుల కిచ్చినట్టు భారత, భాగవతాలు తెలుపుతున్నాయి. మైసూరులో దొరికిన దానశాసనాలు కూడా ఈవిషయాన్ని ధృవపరుస్తున్నవి.

5) ఈవిధంగా పురాణాలు తెలుపుతున్న అంశాలను ధృవపరచే శాసనాలూ, మన ప్రాచీనచరిత్ర ధృవపరుస్తూ మనకీనాటికీ సాక్ష్యంగా ఉన్నాయి. కాని ఇవేవి ఎరగనట్టు యిటువంటి శాసనాలేలేనట్టు విదేశీయులేకాకుండా మనదేశంలోని History ప్రొఫెసర్లుకూడా నటించడంచూస్తే ఆశ్చర్యం, విచారమూ వేస్తుంది.

6) కలియుగం ప్రారంభమైన సంవత్సరంలోనే అంతర్యుద్ధంతో యాదవుల రాజ్యం నాశనమైంది. అదే సమయంలో ఒక భూకంపం, జలప్రళయమూ సంభవించింది. ద్వారకా నగరం సముద్రపు ఉప్పెనలో మునిగిపోయింది.

7) ఇదే విదేశీ గ్రంథాల్లో "జలప్రళయం" లేక "Deluge" అన్న పేరుతో వ్యవహరించబడుతున్నది. ఈ జలప్రళయం జరిగినవిషయం బైబిలులో వివరంగా ఉన్నది.

8) "ఆల్ బెరూని" అనే మహమ్మదీయ చరిత్రకారుడు ఈ "జలప్రళయం" జరిగినతేదీని సరిగ్గా లెక్కకట్టి మన కలియుగ ప్రారంభకాలమైన శ్రీకృష్ణుడి నిర్యాణకాలంగా ఋజువుచేశాడు. ఆ తేదీ 17 ఫిబ్రవరి 3102 B.C. గురువారం అని తేలింది.

9) "ఇండియన్ ఏంటిక్వరీ" (Indian Antiquary 1901) అనే గ్రంథంలో "బర్గెస్" పండితుడు (Burgess) పైవిషయాలను తెలిపే తన సిద్ధాంతవ్యాసంలో ఈవిధంగా వ్రాశాడు. "జలప్రళయం జరిగిన శకం" – గురువారం 17 వతేదీ ఫిబ్రవరి

3102 క్రీ.పూ. ఐడీలరు పండితుడు ఈజిప్షియన్ సంవత్సరంలో ఈశకం భారతీయుల "కలియుగం" ఆరంభ శక కాలంలో అంటే శుక్రవారం అర్ధరాత్రి 17-18 తేదీలనడుమ- ఫిబ్రవరి 3102 క్రీ.పూ. లేక చంద్రుని లెక్క ప్రకారం 588465వ రోజు, గురువారం-లగాయితు లెక్కిస్తారు. సౌరది నాలు సూర్యుని గతితోలెక్కించే లెక్కమాత్రం శుక్రవారంతోనే, ప్రారంభం అవుతుంది.

10) అదే సంవత్సరం కురుపాండవ వినాశమూ, ఘోరమైన "మహా భారత" ప్రపంచ యుద్ధమూ ఆ తర్వాత జరిగిన యాదవుల అంతర్యుద్ధం రెండూచూచి వ్యాసమహర్షి మనస్సు క్షోభించి మానవజాతికి శాంతి, ధర్మం, సత్యం గాఢంగా ప్రజల్లో నాటుకొనేలాగ సందేశమిచ్చే "మహాభారత" చరిత్ర వ్రాయడం ప్రారంభించాడు.

11) "జయ" మనే పేరుతో వ్యాసమహర్షి కేవలచరిత్ర విషయాలను సంక్షేపిస్తూ ఈకలియుగం మొదటి సంవత్సరంలో రచించారు. తర్వాత ఇదేగ్రంధాన్ని "మహాభారతంగా" పెద్దదిచేసి, అనేక ధర్మాలూ, నీతికధలూ, యోగశాస్త్రవిషయాలూ, హిందువులకు ప్రాణమైన భగవద్గీతా విష్ణుసహస్ర నామం మొదలైన మోక్ష ధర్మ ప్రతిపాదకాలైన విషయాలతో నిండివున్న మహాభారతంగా రచించాడు. ఇది "పంచమవేదం"గా – అంటే వేదాలలోవున్న సారం అంతా – స్త్రీలకూ, పాటకజనానికీకూడా తెలిసేలాగ సరళమైనభాషలో వ్యాసమహర్షి రచించారు.

> "స్త్రీ, శూద్ర ద్విజ బంధూనాం త్ర యీ
> న శృతిగోచరా. ఇతి భారత మాఖ్యాతం"
> అంటూ.

ఇదే యీనాడు మనకులభించే చరిత్ర! మన ఆధునిక చరిత్ర లోనే ఇది మొదటి అధ్యాయం. మహాభారత యుద్ధం మన కలియుగ ప్రారంభమూ కలిసిఉన్నాయి యీ చరిత్ర ప్రారంభంతోనే! ఇది నవీన యుగానికి "కలియుగానికి" మైలురాయి.

## మహాభారతంలోని చారిత్రకఅంశాలు:

మహాభారతంలోనిది నిజంగా జరిగిన చరిత్రేనా? అని యీనాడు మనకి అనుమానంరావచ్చు. ఇంగ్లీషు విద్యావిధానంలో తయారైన మన మనస్సులకి అలా అనిపించడం సహజమే! కాని సంస్కృత మహాభారతం చదివితే అందులోని విషయాలన్నీ యధార్ధంగా జరిగినవేనని, అందులోని పాత్రలు నిజంగా జీవించిన వ్యక్తులేనని తెలిపే విషయాలు అనేకం మనకీనాటికీ దొరుకుతాయి. దీనికై అనేకమంది పరిశోధన చెయ్యాలి.

ఇలాగ నేను పరిశోధనచేసి శ్రీకృష్ణుని జీవితంలో నిత్యదినచర్య మొదలు ఆయన పుట్టినతేదీ, మరణించిన సమయం ఆయన **జాతకం,** భగవద్గీత ఉపదేశించినప్పుడు శ్రీకృష్ణుని వయస్సూ మొదలైన అనేక విషయాలు సంస్కృత మహాభారతంలోంచి సేకరించగలిగాను. అవన్నీ **"యుగపురుషుడు"** అనే గ్రంథంలో ప్రచురింపబడినవి. అంతేగాక పాండవుల జననం, వారు ఎప్పుడు పుట్టినదీ, టైము, తేదీలతోసహా, లెక్కించుకోడానికి కావలిసిన అంశాలుకూడా ఎన్నో మహాభారతంలో ఉన్నాయి అంటే చాలామందికి ఆశ్చర్యం కలగవచ్చు. అందులో కొన్ని అంశాలు మాత్రం మచ్చుకి ఈక్రింద ఉదహరిస్తాను. ఏనాటికైనా సంస్కృత భారతం చదవాలనే కుతూహలం, ఈ విషయాలు తెలుసుకున్న ప్రతి హిందువుడి హృదయంలోనూ పుట్టగలదని ఆశతో ఈ క్రింది వివరాలు వ్రాస్తున్నాను:-

*అర్జునుడు తీర్థయాత్రలతో 12 మాసాలు గడిపి ద్వారక చేరుకుని సుభద్రను వివాహంచేసుకునే సమయంలో ఒక అపూర్వమైన గ్రహ స్థితి జరిగినట్లూ-శ్రీకృష్ణుడు ఆ గ్రహాల శాంతికై పూజలూ, జపాలూ, శాంతులూ జరిపేనిమిత్తమై యాదవులను ఆజ్ఞాపించినట్లు తెలుస్తున్నది. ఆ సంవత్సరం శని, గురు, కుజులు మూడు గ్రహాల అపూర్వ సంయోగంలో, ఆ గ్రహాలు వక్రించడం, ఇది చారిత్రకంగా జరిగిందని, మన పంచాంగాలవల్లా, ఆనాటి గ్రహస్థితులు లెక్కించడంవల్లా ఋజువవుతున్నది.

అర్జునుడు గాంధర్వవిధిలో సుభద్రను వివాహం చేసుకు తీసుకొనిపోయిన రోజు వైశాఖ శుద్ధతదియా, మకర లగ్నంలో జరిగినట్లు గానూ, తర్వాత అభిమన్యుడు మాఘమాసంలో జన్మించినట్లూ కూడా తెలుస్తున్నది (మరుసటి సంవత్సరం). ఇతడు 16 సంవత్సరాలు జీవించి, భారత యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన మహావీరుడు.

## భీష్మ నిర్యాణం:-

* భీష్ముడు మాఘశుద్ధ అష్టమీ రోహిణీ నక్షత్రం మధ్యాహ్నం సుమారు 12 గంటలకు మరణించినట్టు మహాభారతం తెలుపుతున్నది.

(శాంతి పర్వం-46 అధ్యాయం, అనుశసినిక-అద్యా. 272, 274.)

భారతయుద్ధం జ్యేష్ఠానక్షత్రం, అమావాస్య కలిసినరోజున ప్రారంభమైనట్టు శ్రీకృష్ణుడు కర్ణునితోచేసిన సంభాషణవలన తెలుస్తున్నది. (ఉద్యోగపర్వము - 142వ అధ్యాయము.)

## పాండవుల జననము:-

**ధర్మరాజు:-** జ్యేష్ఠశుద్ధ పంచమి తిథినాడు. జ్యేష్ఠా నక్షత్రం మధ్యాహ్నం 12 గంటలకు అభిజిన్ముహూర్తంలో జననం (ఆది పర్వం-7వ అధ్యాయం-సంభవపర్వం-129వఅధ్యాయం 21 వశ్లోకం)

**భీమసేనుడు:-** త్రయోదశీ కృష్ణపక్షం, మఘా నక్షత్రం "రోహిణీ" ముహూర్తంలో (– 9వ మూహూర్తంలో) జననం.

**అర్జునుడు:-** మాధవమాసంలో పూర్వ-ఉత్తర ఫల్గుణీ నక్షత్రాలో అర్జునుని జననం. శ్రీకృష్ణుడు అర్జునుడు ఒకే వయస్సులోని వారు దాదాపు. కొద్దిరోజుల తేడాతో జన్మించారు.

పాండవులందరూ సంవత్సరంతేడాతో అయిదుగూరూ అయిదు సంవత్సరాల యుగంలాగ జన్మించారు. (అధ్యాయం-133-శ్లో-124)

**బలరాముడు:-** శ్రీకృష్ణుని అగ్రజుడైన బలరాముడు కృష్ణునికన్న 3 సంవత్సరాలు పెద్దవాడు. (అధ్యాయం-134-శ్లో-9).

ఇన్నివిధాలుగా మహాభారతంలోని ప్రముఖ పాత్రల కాలంకూడా స్పష్టంగా ఈనాటికి మనకి తెలిసే విధంగా అనేక ఆధారాలు ఇన్ని లభిస్తుండగా "మహాభారతంలోని పాత్రలు నిజంగా జీవించారా?" అని అనుమానించడం కేవలం మూర్ఖత్వమే అవుతుంది. ఆవ్యక్తులు చారిత్రవ్యక్తులని తెలియడానికి వాళ్ళ జననకాలమే ఆధారం.

**కాలమానం:-**

ఇంతే కాకుండా, ఏరోజున యుద్ధం ప్రారంభమైందీ, ఎన్ని గంటలకు ప్రారంభమైందీ, ఏయే రోజున ఎవరెవరు హతులయ్యారో: అప్పటి తిథి వారనక్షత్రాలు, ఏరోజున శ్రీకృష్ణుడు రాయభారం

బయలుదేరి వెళ్లాడో, ఆమాసం, ఆనాటి నక్షత్రం, ముహూర్తం, ఒక్కటీ బీరిపోకుండా ప్రతి చిన్న విషయాలుకూడా వ్యాసమహర్షి చరిత్ర గ్రంథమైన మహాభారతంలో శాశ్వతంగా వ్రాసిపెట్టాడు. ప్రపంచంలో ఏ యితర చరిత్రకారుడూ (ఈనాటి ఆధునిక చరిత్రకారులతో సహా) వ్రాయని విధంగా అతిసూక్ష్మమైన వివరాలలో ఆనాటి సంఘటనలూ, వ్యక్తులూ, వాళ్లకాలం, నిర్ణయించేసి గణితంచేయడానికికూడా అనుకూలమైనవిధంగా మహత్తరమైన చారిత్రిక గ్రంథంగా ఆనాడు వ్యాసమహర్షి రచించాడు ఇవన్నీ చదువుతుంటే ఆయావ్యక్తులూ, ఆ సంఘటనలూ, కళ్లకు కట్టినట్టు కనబడతాయి! అదంతా చదువుతూంటే అవి జరుగుతుండగా చూచిన ఒక వ్యక్తి ఆనాటి సమకాలికుడైనవాడు కళ్లతోచూసి వ్రాసిన ఇతిహాసమే ఇది! అని, నిశ్చయంగా దృఢపడుతున్నది.

అంతేకాక కావ్యంలో సామాన్యంగా కవులు చేసినట్టు తను పాత్రల లోని లోటుపాట్లును కప్పిపుచ్చి సంఘటనలను సరిదిద్ది మెరుగులు పెట్టడంలాంటివి చేయకుండా, జరిగిన విషయాన్ని జరిగినట్లు, యథాతథంగా లిఖించాడు వ్యాసమహర్షి అందుకే మహాభారతంలో ఎవరెవరు ఏయే తప్పులుచేశారోకూడా, ఏఅక్రమాలూ, అన్యాయాలూ, పశుప్రవర్తనా, అధర్మాలూ ఇత్యాది సంఘటనలు ఆ పాత్రలలో ఎవరుచేసినాసరే, వాటిని మరుగుపరచకుండా, తానొక మహత్తర చరిత్రకారుడిలాగ, అన్నివిషయాలూ జరిగినవి జరిగినట్టు తెలుపుతోంది, సంస్కృత మహాభారతంలోని వ్యాసరచన. ఇలాంటి అంశాలే అభిమన్యుడి వధ. సభలో ద్రౌపది వస్త్రాపహరణం, భీముడు దుర్యోధనుని అక్రమ యుద్ధంలో తొడలు విరగగొట్టడం, ద్రోణవధ, కర్ణభీష్ములవంటి మహావీరుల హత్య, అంభారులవల్ల అర్జున పరాభవం. యాదవ వినాశం, కృష్ణభార్యల అపహరణ (అష్టభార్యలు కాదు): ఇత్యాది అనేక చారిత్రక విషయాలను, కథలో ఏమీ

మార్పుచేయకుండా వ్యాసమహర్షి ఇలా యథాతథంగా వ్రాసిన చరిత్రే మహాభారతమని స్పష్టంగా తెలుపుతున్నాయి. ద్రౌపదిని అయిదుగురు భర్తలు వివాహంచేసుకోవడం, యాదవులకు దుర్వాసుని శాపం, శ్రీకృష్ణునికి గాంధారీశాపంకూడా ఇటువంటివే.

మహాభారతము నిజంగా జరిగిన చరిత్రేననీ చెప్పడానికీ, అందులోని వ్యక్తులు సంఘటనలూ ఊహలు కావని తెలపడానికింతకంటె ఏం నిదర్శనం కావాలి?

* * *

29

# మన జాతిపిత - వ్యాసమహర్షి!

తెలుగుభాషలో వేదవ్యాసమహర్షి జీవిత చరిత్ర పరిశోధనాదృష్టితో రాసింది, ఇంతవరకూ వెలువడకపోవడం హిందూమతం దురదృష్టం! ఇలాఅనడానికి కారణం ఏమిటో వ్యాసమహర్షి జీవితాన్ని అన్ని కోణాలనుంచీ సమగ్రంగా సరిపోల్చిచూసి అంచనావేసిన మీదట కనిపించే నిజం!

ఎందుకంటే, వ్యాసమహర్షి అంటే జీవించే హిందూమతమే! ఈనాడు 'హిందూమతం' గా చలామణి అవుతున్న అతి పురాతనమైన శాస్త్రం ఈ కలియుగంలో ఇప్పుడు మనకు ఏరూపంలో అందుతున్నదో -- ఆరూపాన్ని, ఈవేదమతానికి ఇచ్చిన ఋషి బ్రహ్మ వ్యాసమహర్షియే!

ఈనాడు వేదాలున్నాయంటే -- వాటిని నాలుగుగా విభాగించి ఇచ్చినవాడు వేదమూర్తియైన వేదవ్యాసుడే! అలాగే ఈనాడు భగవద్గీత, పారాయణాగ్రంథంగా హిందువులందరికీ అందుతోందంటే -- దీన్ని ఈ రూపంలో అందచేసినవాడు కూడా వ్యాసమహర్షియే!

అలానే ప్రతీవారూ చదువుకునే 'విష్ణు సహస్రనామం' హిందువు లందరికీ మహాభారతంద్వారా గ్రంథస్థంచేసి అందించిన వ్యాసమహర్షియే మనకు దాన్ని అనుగ్రహించాడు! కలియుగంలో వేదాలు అర్థంచేసుకో లేని మందమతులూ, అల్పజీవులూ, స్వార్థపరులూ, అల్పాయుష్కులూ, ఇంకా అనేక రోగాలతోనూ చెడు కర్మలతోనూ పీడింపబడేవారైన మనకి వేదాలఅర్థం గోచరించదని తెలిసి, మనపై కరుణతో వేదార్థాన్ని మనకందరికీ తెలిసే రూపంలో పద్దెనిమిది (18)- పురాణాలద్వారా భారతేతిహాసంద్వారానూ అందించినవాడు తిరిగి వ్యాసమహర్షియే!

మళ్ళీ ఉపనిషత్తులసారాంశాన్ని, బ్రహ్మసాక్షాత్కారం అనుభవంగా ఎలా పొందాలో -- యోగశాస్త్రంద్వారా అనుభూతినిచ్చే వేదాత్మను, బ్రహ్మసూత్రాలద్వారా మనకి అందించినది కూడా వ్యాసమహర్షియే! ఇవన్నీ మనకి సమృద్ధిగా పండించి ఇచ్చి -- వీటన్నిటిసారాన్నీ మానవ జీవితానికి లక్ష్యభూతమైన గమ్యమును తెలుసుకోవడానికి జగత్తుయొక్క రహస్యాన్ని మనల్ని సృష్టించిన ఈ భగవతత్త్వాన్ని దర్శించాలంటే, దానికి కేవలం జ్ఞానము, మంత్రజపమూ, కేవల శుష్కకర్మకాండా చాలవని భగవంతునియందు అత్యంతమైన ప్రేమ తోకూడిన అహంకార -- త్యాగం అనుష్టానంగా భాగవతధర్మంగా చేశాడు! ధర్మంగా ఇది అనుసరిస్తేనే అది సాధ్యపడుతుందని తెలిపే, భగవంతుని గురించి తెలిపేశాస్త్రం -- కేవలం అది తెలిపేశాస్త్రం ఒక్కటే కాదు -- ప్రత్యక్షంగా భగవదనుభూతిని ఇచ్చేదిగా, శ్రీభాగవత పురాణగ్రంథం యిచ్చాడు! భగవంతునిపై భక్తిని పెంపొందించే పారాయణగ్రంథమే -- "భాగవతము"! ఈ విధంగా ఇన్ని రూపాల్లో హిందూమతాన్నే ఈ కలియుగంలో నశించిపోకుండా

మనముందు నిలబెట్టిన నారాయణావతారుడే వ్యాసమహర్షి! అందుకే వ్యాసమహర్షి అంటే -- 'మూర్తీభవించిన హిందూమతమే'!

ఇతర మహర్షులజీవితాలలో చూస్తే వారుచేసే తపస్సు, జపధ్యానాలతో పాటు వారిబాల్యం, యువ్వనం, నడివయస్సులో గృహస్థ, బ్రహ్మచర్యజీవితాలూ, మనకి కనిపిస్తాయి! కాని వ్యాసమహర్షికి మాత్రం, అసలు వ్యక్తిగత జీవితమేలేదు! ఆయనకి భార్య ఎవరో? ఆమె ఎక్కడ జన్మించిందో, వ్యాసమహర్షి ఆమెతో గృహస్థజీవితాన్ని ఎక్కడ ఎంతవరకూ నిర్వహించాడో మనకీనాటికీ అంతుపట్టలేదు! శుకయోగి అనే పుట్టుబ్రహ్మజ్ఞానికి తండ్రి అని ప్రమాణంగా మనకీనాడు తెలిసే విషయం! అయితే ఆశుకయోగిని జనకునివద్దకు గురుశుశ్రూషకై పంపి, పరిపూర్ణబ్రహ్మజ్ఞానిగాచేసి వివాహం, సంతానము కలిగించాడన్నవిషయమే ఈనాడు మనలో చాలమందికి తెలియదు (పండితులమాట) !

ఈ కారణంగా వ్యాసమహర్షి జీవితంగురించి అక్కడక్కడ లభించే ఉపాఖ్యానాలు తప్ప నిర్ధారణమైన విషయ వివరాలుదొరకవు! వ్యాసమహర్షి జీవితంలో అనేక ఘట్టాలను మహాభారతం వర్ణిస్తుంది -- కాని, ఒక పాత్రగానే! సమగ్రమైన ఆయన జీవితం అంతా ఒకచోట, ఇవ్వబడలేదు! అలానే దేవీభాగవతం, కూర్మపురాణం, ఇంకా ఇతర పురాణాల్లో అనేకచోట్ల వ్యాసమహర్షి జీవితవిశేషాలు చెదురుమదురుగా లభిస్తాయి! కొన్ని పరస్పరవిరుద్ధాలు కూడా కనిపిస్తాయి! దానివల్ల మనకి తేలేదేమంటే వ్యాసమహర్షికి వ్యక్తిగత జీవితచరిత్రంటూ లేదు!

తపస్సే ఆయన వృత్తి! వేదాల సాక్షాత్కారమే ఆయన నిరంతర పరిశ్రమ! ఇతిహాస, పురాణ బ్రహ్మసూత్రరచనయే ఆయన జీవితచరిత్ర! ఆయన జన్మించిన విధానంకూడా అనేక గూడార్థాలతో దేవ రహస్యాలతోనిండి నిగూఢంగా ఇవ్వబడింది!

కాబట్టి ఈనాడు వ్యాసమహర్షిని తీసేస్తే ఇక మిగిలే హిందూ మతమే లేదు! వేదాలే లేవు! ఇక, వేదవిభాగం అసలేవుండదు! భగవద్గీత, బ్రహ్మసూత్రాలు మహాభారతం, విష్ణుసహస్రనామం మొదలే వుండవు! అష్టాదశ (18) పురాణాలూ లభించేవికావు! ఇంతెందుకు ఒక్కమాటలో

"వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం"

అనగా ఈప్రపంచంలో ప్రతీదీ పరిశోధిస్తూపోతే చివరకు వ్యాస మహర్షియే, దాని మూలంలోనూ, సాక్షాత్కరిస్తాడు!

అలానే వ్యాసమహర్షి రచించిన మహాభారతం పంచమవేదం! అనగా నాలుగువేదాల్లోని సారమంతా తేలికమాటల్లో సంవాద రూపంలో చాలమటుకు భీష్ములవారు ధర్మరాజుకు ఉపదేశించిన సంభాషణల్లోనే మోక్షధర్మ, రాజధర్మ, వర్ణాశ్రమధర్మాల, సనాతనధర్మము యొక్క స్వరూపం వుంది.

ఇలాంటి వ్యాసమహర్షి జీవితచరిత్రపై ఒక గ్రంధాన్ని కొంతవరకైనా పరిశోధించి అనేక కొత్తవిషయాలను పాఠకులకు ఇలా నేను అందించగలగటంకూడా వ్యాసమహర్షియొక్క అనుగ్రహమే! అలానే వ్యాసమహర్షిపేరు కోరకుండా నాకు నామధేయంగా లభించడంకూడా భగవదనుగ్రహమే! ఈరెండూ "అన్వర్ధ -- నామధేయములైన" నామ ధేయంగా శ్రీజగద్గురువులు కంచి కామకోటి శంకరాచార్యులవారైన చంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వాములు 1966 లో వర్ణించినట్లుగా, కేవలం సమకూడటం దైవలీల! ఇందులో ఇంకా అనేక ఘనమైన విషయాలపై ఎంతోపరిశోధన జరగవలసివున్నది!

ఇంకా ఎన్నోవిషయాలమీద నేనుచేసిన పరిశోధన అంతాకూడా ఈగ్రంధంలో పూర్తిగా ఇవ్వడానికి వీలుపడలేదు! 'నాడీగ్రంధము'ల లోని మహర్షుల దివ్యదృష్టి నాడీగ్రంధ రచనావిధానం రానున్న కలియుగాంతంలో జరిగే అనేక వింతలూ, ఇంకా కలియుగాంతం

వరకూ వ్యాసమహర్షి ఏరూపంలో ఎక్కడ తిరుగాడుతూ వుంటారో చరిత్రలో ఎవరెవరికి వ్యాసమహర్షి దర్శనమిచ్చాడో అవన్నీ ఈఒక్క గ్రంథంలో పూర్తిగా రాయడం సాధ్యపడలేదు. అందుకని సూచనగా సందర్భానుసారంగా తెలియచేశాను! ఇంతేకాక పరమగురు మండలి ఋషిమండలి వ్యాసమహర్షిని జగద్గురువుగా ఎందుకు ఎన్నుకున్నదో అని యోచిస్తే, తేలేది -- (1) వ్యాసమహర్షి సర్వజ్ఞపీఠానికి ఎంపిక అన్నివిధాలా పరిపూర్ణుడైన కారణంగానే! విజ్ఞానరాశిగా శరీరంకట్టిన వేదవిజ్ఞానమే వేదవ్యాసమహర్షి ! ఋషిమండలికి 'గురుస్థానం' అంగీకరించిన సర్వజ్ఞపీఠాధిపతి -- నిజంగా వేదవ్యాస మహర్షియే! అందుకే -- "వ్యాసపూర్ణిమ" యే ప్రపంచం అంతటికీ "గురుపూర్ణిమ"!

వ్యాసమహర్షి అనుగ్రహిస్తేనే శంకరాచార్యుల ఆయుష్షు వృద్ధియై బ్రహ్మసూత్రాలపై పరిపూర్ణజ్ఞానము, బ్రహ్మానుభూతిలో ఇంకా పరి పూర్ణతా లభించినది! అలాంటి వ్యాసమహర్షి జీవితచరిత్ర గురించి ఎంతరాసినా అంతంలేని ఇసుకపాతర అవుతుందిగాని దానికి అంతంలేదు!

ఈ అన్ని అంశాలూ ఒకఎత్తు! భారతదేశానికి వ్యాసమహర్షి తలమానికి వంటి కిరీటమవడం ఇంకో ఎత్తు!! శ్రీకృష్ణసాక్షాత్కారాన్ని జైలులో చూసిన మహాయోగి శ్రీఅరవిందులు, వ్యాసమహర్షియే మన 'జాతీయ కవి' (National Poet) అన్నారు! ఎందుకంటే, భారతదేశం ఒక్కదేశంగా ఏర్పాటు కాబడిన చరిత్రయే మహాభారతం! ఆ భారతదేశ గాధయే -- మహాభారతగాధ కాబట్టి, మహాభారతాన్ని జాతీయకావ్యం (National Poem)గా అభివర్ణించాడు శ్రీఅరవిందుడు! ఆయనది యదార్థ వాక్కు! అట్టి శ్రీఅరవిందయోగి జన్మించిన ఆగష్టునెలలోనే భారతదేశానికి స్వాతంత్ర్యం రావడం, అదేమాసంలో అదేనెలలోనే నా జననం అన్నీ కాకతాళీయంగా రావటంకూడా కేవలం భగవత్ సంకల్పమే!

అంతేగాక 'భారతాత్మ' అనబడే జాతీయ ఋషిగా వ్యాసమహర్షి దివ్యలీలలను, వ్యాస -- సాహిత్య సమీక్షతో రంగరించి పురాణాలు, చరిత్ర, స్థలవిశేషాలతో జ్యోతిషపరిశోధనతో కాలనిర్ణయమూ, ఒక్కడు చెయ్యగల పనికాదు -- మహాకార్యము! ఇన్ని కలబోసి ఒక గ్రంథంగా వ్రాయటం కేవలం ఒకమానవుడివల్ల అయ్యే పనికాదు! దీనికి దైవికమైన సహాయంకూడా కావాలి!

అందులో మొదటిది పరిశుద్ధమైన వంశంలో సాంప్రదాయమైన కుటుంబంలో జననం! అది మనచేతిలోలేని విషయం! ఇక రెండవది వేదవేదాంగ పురాణాలో గాఢమైన విజ్ఞానం! బాల్యంలోనే విద్యాభ్యాసంగా లభించడం గురుకులపద్ధతిలో విద్యాభ్యాసం చేయడంతో ఈనాటి విద్యావిధానం స్కూల్లో, కాలేజీల్లో ప్రభోధించే మురికినీటి చదువు తలకెక్కకుండా ముందుగానే యోగశాస్త్రం, జపధ్యానములూ నాకు శిక్షణగా విద్యాభ్యాసంలో అందటం మరొక వరం! ఇదంతా కేవలం ఛాందస పాండిత్యంగా కాక ఈనాటి ఆధునిక సైన్సులైన జీవశాస్త్రం, ఖగోళం, గణితం, ఫిజిక్సు వంటి విజ్ఞానంతో డిగ్రీని పొందడం నా వేదాభ్యాసానికి అవసరమైన వైజ్ఞానిక క్రమశిక్షణ (Scientific Desciplinc)కు, పెట్టని కోట!! ఇన్నిటి సహాయంతో అనేక అమూల్యవిషయాలపై సైన్సుదృష్టితో పరిశోధించి రాసే అవకాశం ఆసక్తి కలగటం కూడా, మరొక దైవానుగ్రహం ...!

... ఇన్ని కలిసివస్తేకాని, వ్యాసమహర్షివంటి భగవదవతారమూర్తి జీవితాన్ని పరిశోధించి వ్రాయడం అసాధ్యప్రక్రియ! అందుకే ఈగ్రంథం నిర్మాణం ఎత్తుకోవడం కేవలం మానవప్రయత్నంతో నేనొక్కడినే చేసిన పనికాదు!

"పలికెడిది భాగవతమట!
పలికించెడివాడు రామభద్రుడట!
అది నేపలికిన భవహరమగునట
పలికెద వేరొండుగాథ పలుకగనేలా!"

# ధర్మప్రచారం !!!

దేశమాతకు పూజాపుష్పాలు!! పూజ్యగురుదేవులు డా. వేదవ్యాస Ph.D.

అద్భుత గ్రంథాలు! ఇంటింటా ఆధ్యాత్మిక గ్రంథాలు!

దేశంలో - అవినీతినీ, అధర్మాన్నీ, ఎదుర్కోండి!

| | | |
|---|---|---|
| 1. | 1999 కలియుగాంతం కాలజ్ఞానం | 40-00 |
| 2. | హిందూమతంపై సైన్సుపరిశోధన | 25-00 |
| 3. | మీ జీవితంలో అదృష్టగడియలు | 9-00 |
| 4. | మీ ఇంటినిబట్టి మీ అదృష్టం (వాస్తుశాస్త్ర రహస్యాలు) | 9-00 |
| 5. | మీ జన్మతేదీలో మీ అదృష్టం | 9-00 |
| 6. | నవగ్రహశాంతి విధానం | 12-00 |
| 7. | మనదేశమూ - మనసంస్కృతీ | 19-00 |
| 8. | నిత్యపూజకు చదువవలసిన స్తోత్రాలు | 12-00 |
| 9. | కదిలేబ్రహ్మం - నడిచేదైవం (శ్రీ వేదవ్యాస గురుదేవుల ఆధ్యాత్మిక అనుభవాలు నాలుగు సంపుటాలు) ఒక్కొక్క సంపుటం | 36-00 |
| 10. | శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము | 20-00 |
| 11. | జ్యోతిషం సైన్సా? మూఢవిశ్వాసమా? | 27-00 |
| 12. | శ్రీ వేదవ్యాస మహర్షి దివ్య చరిత్ర | 36-00 |
| 13. | సాధనా రహస్యాలు | 19-00 |
| 14. | శ్రీ సాయి నాథచరిత్ర | 36-00 |

కాపీలకు :

సెక్రెటరీ, యుస్కోఫీ,

షాపు నెం. 58, చందనా క్లాత్ కాంప్లెక్స్

తాడితోట, రాజమండ్రి - 533 103